# ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర -1

## కంభంపాటి సత్యనారాయణ

సంక్షిప్తానువాదం : మహీధర రామమోహనరావు



హైదరాబాద్ బుక్ ట్రస్ట్

వెల : రూ.50/-

అంగ్లమూలం :

A Study of the History and Culture of the Andhras
by Kambhampati Satyanarayana, People's Publishing House, New Delhi

మొదటి ముద్రణ : 1981 జూలై

పునర్ముద్రణ : 1984, 1993, 1998, 2007

వివరాలకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ప్లాట్ నెం.85,
బాలాజినగర్, గుడిమల్కాపూర్,
హైదరాబాద్ - 500 067.
ఫోన్ : 23521849/23517401

ముద్రణ : కెజిఎన్ ప్రింటర్స్, హైదరాబాద్.

# పాఠకులతో

మనకింతకు పూర్వం రచించిన ఆంధ్రదేశ చరిత్రలున్నాయి. అవి సాధారణంగా రాజవంశాలనో, ప్రముఖ వ్యక్తులనో కీర్తిస్తూ సామ్రాజ్య విస్తీర్ణతను ప్రశంసించేవిగా ఉన్నాయి. శాతవాహనులు తెలుగువారేనా? విజయనగర సామ్రాజ్యం తెలుగువారిదేనా? కాకతీయుల వర్ణమేది? ఇలాంటి ప్రశ్నలకు ఆ చరిత్ర గ్రంథాల్లో ప్రాధాన్యమెక్కువ. ప్రజల సాంస్కృతిక చరిత్రను సాహిత్యం ద్వారా పునర్నిర్మించటానికి సురవరం ప్రతాపరెడ్డి (1896-1953)గారు కృషి చేసి "ఆంధ్రుల సాంఘిక చరిత్ర"ను ప్రకటించారు. ఆ తరువాత ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందు శేకరంగార్లు ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి అనే గ్రంథం రచించారు. ఇందులో సాంస్కృతికాంశ పూర్వపు చరిత్రలకన్నా కొంత ఎక్కువున్న మాట నిజమే. అయినా ఈ రెండు పుస్తకాలు సమాజ ఆర్థిక వ్యవస్థను గురించి పట్టించుకొన్నవి కావు.

కంభంపాటి సత్యనారాయణగారు స్వాతంత్ర్యోద్యమ కాలం నుంచి వివిధ ప్రజోద్యమాల్లో పాల్గొన్నారు. బహు గ్రంథ రచయితలు. మార్క్సిస్టు మూలసూత్రాలు చూపిన వెలుగులో ఆంధ్ర దేశ ప్రజల ఆర్థిక సాంస్కృతిక చరిత్రను ఇంగ్లీషులో రచించారు. సత్యనారాయణ (సీనియర్) గారు పరిణత వయస్సులో బహు ప్రయాసల కోర్చి, ఎన్నో గ్రంథాలు పరిశీలించి స్వతంత్ర పరిశోధన చేసి ఈ గ్రంథాన్ని రచించారు. యూరపులో ఫ్యూడలిజానికి, మన దేశంలో చిరకాలం వర్ధిల్లిన స్వయంపూర్ణ గ్రామీణ వ్యవస్థకూ భేదాల్ని చాలా స్వతంత్రంగా ప్రతిపాదించారు. ఈ పద్ధతిలో ఆంధ్రదేశానికి చరిత్ర కూర్చటం ఇదే ప్రథమం. తరవాత రాబోయే విపుల చరిత్రలకిది మార్గదర్శక మవుతుందని మా నమ్మకం. ఈ పుస్తకంలో చేసిన ప్రతిపాదనలు తుది నిర్ణయాలనే భ్రమ రచయితకూ లేదు. ప్రకాశకులకు లేదు.

ప్రజల ఆర్థిక, సామాజిక, రాజకీయ జీవితం ఆధారంగా నవలలు రచించిన సుప్రసిద్ధ రచయిత మహీధర రామమోహనరావుగారు ఈ గ్రంథాన్ని తెలుగు చేసి పెట్టారు. రామమోహనరావు గారు కూడా బహు గ్రంథ రచయితలేగాక, ప్రజోద్యమాల్లో జీవితాన్ని పండించుకున్నవారు. వారి సరళమైన అనువాదం ఈ పుస్తకాన్ని ఆకర్షణీయంగా తయారు చేసిందని మా నమ్మకం.

ఈ మా ప్రయత్నాన్ని ఇంతకు ముందులాగే పాఠకలోకం హర్షిస్తుందనీ, ఈ పుస్తకాన్ని సాదరంగా స్వీకరిస్తుందనీ గట్టిగా నమ్ముతున్నాం.

హైదరాబాద్
1981 జూలై

చేకూరి రామారావు

# పీఠిక

"అతి పురాతనమైన పరికరాలు అవసరాలకు మించి అత్యల్పంగానే ఉత్పత్తి చేసేవి. అందుకనుగుణంగానే వుండేది, అతి ప్రాచీన సామాజిక వ్యవస్థ. అది చాలా కొద్దిమందిని మాత్రమే విజ్ఞానం, విరామం అనుభవించగలిగేలా పోషించగలదు. అత్యంత దీనావస్థలో వున్న అత్యధిక ప్రజలకంటే తాము అధికులమన్న భావంతోనే వారు దానిని అనుభవిస్తారు. చరిత్ర అనేది అనేక గజిబిజి ఘటనల పరంపర కాదనీ, మానవులే తమ నిత్యావసరాలను తీర్చుకొనేందుకు చరిత్రను రూపొందిస్తున్నారనీ తెలుసుకొనేందుకు దీన్ని గ్రహించడం అవసరం. చరిత్ర మరింత ఆకర్షవంతంగా ఉండాలంటే, మానవుడు తోటి మానవులందరి సహకారంతో తన అవసరాలను తీర్చుకొంటూ ఎలా పురోగమిస్తూ వచ్చాడో చూపాలి. అంతేగాని, కొద్దిమందిగా ఉన్నవారు అధిక సంఖ్యాకుల్ని అణచి వుంచి తాము సాధిస్తూ వచ్చిన విజయాలను చూపడం మాత్రమే కాదు, అది చేయవలసింది....

ఏ మహంతో, రాజాధిరాజో, మహాయోధుడో, సంపన్నుడో, నోరున్నవాడోగాక, బడుగుస్థితిలో వున్న అమాయక ప్రజానీకమే ఎల్లప్పుడూ చరిత్రను నిర్మిస్తూ వచ్చారనీ, యిక మీదట కూడా వారేనని యిప్పటికంటే చక్కగా దాన్ని రూపొందించవలసింది వారేనని చెప్పడం పైకి బూతాఖానీలా కనిపించవచ్చుగాని, అది నిజం. వర్గసమాజంలో చరిత్రను పరిశీలించడమంటే అర్థం ఉన్నత వర్గాల ప్రయోజనాలకూ, మిగతా వర్గాల ప్రయోజనాలకూ గల వైరుధ్యాల్ని విశ్లేషించడమన్నమాట! అధికారంలోకి వచ్చే ఒక వర్గం ఏ మేరకు కొత్తదనాన్ని ఈయగలిగిందో, తన వర్గ ప్రయోజనాల్ని రక్షించుకొనేందుకది ఏ దశలో అభివృద్ధిని ఆటంక పరచిందో, లేక ఆటంక పరుస్తుందో చూపడమన్న మాట.

"మనిషి జీవితానికి కావలసింది తిండి మాత్రమే కాదనీ, శాశ్వతమైన తన ఆత్మను మానవుడు అదుపులో పెట్టుకోగల్గడం మీదనే సమాజం ఆధారపడి వుంటుందనీ, భౌతిక వాదం మానవ విలువలన్నిటినీ ధ్వంసం చేస్తుందనీ కొందరు వాదిస్తారు. కాని, దురదృష్టవశాత్తు, మనిషి జీవించి ఉండాలంటే, అన్నమో, అటువంటిదే మరొకటో ఉండి తీరాలి. తన శరీరంలోని ఆత్మను పోషించడానికైనా (అసలు నిలుపుకోగల్గితే) అది అవసరం. మానవుల మధ్య ఏదో ఒక విధమైన సంబంధం ఏర్పడినప్పుడే మానవ సముదాయం సమాజంగా రూపు ధరిస్తుంది. అది రక్త సంబంధం కాక, అంతకంటే విస్తృతమైనదై యుండాలి; సరకుల ఉత్పత్తి మార్పిడుల ద్వారా ఆ సంబంధం వృద్ధి చెందాలి. ఒకానొక సమాజం తనకేది అవసరమనుకొంటుందో దాన్నిబట్టి అది రూపొందుతుంది; వస్తువుల్ని సేకరించేది, లేక ఉత్పత్తి చేసేది ఎవరు? ఎలాంటి పరికరాలతో? ఇతరులు ఉత్పత్తిచేసిన దాన్నెవరు అనుభవిస్తున్నారు? వారిదెలాంటి హక్కు? దైవదత్తమైనదా? న్యాయసమ్మతమైనదా? ఉత్పత్తి పరికరాలపైన భూమిపైన, ఒక్కొక్కప్పుడ ఉత్పత్తిదారు శరీరంపైన, ఆత్మపైన యాజమాన్యం ఎవరికున్నది? సమాజాన్ని ఉత్పత్తి



సంబంధాలు పట్టి వుంచుతున్నాయి. భౌతికవాదం మానవ విలువలను నిర్మూలించదు. కాని సమకాలీన సామాజిక పరిస్థితులకూ వాటికిగల సంబంధాన్ని తెలియజేస్తుంది; విలువలను గురించిన భావనకూ ఆ విలువలకూ గల సంబంధాన్ని వివరిస్తుంది."

ఇవి శ్రీ దామోదర ధర్మానంద కొశాంబి వాక్యాలు. తన "ఇంట్రడక్షన్ టు ది స్టడీ ఆఫ్ ఇండియన్ హిస్టరీ" పీఠికలో, నేటి వరకు గడచిన మానవ చరిత్రను గురించి సంగ్రహంగా వ్రాసిన వాక్యాలివి. కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్‌లు రూపొందించిన చారిత్రక భౌతికవాద దృక్పథం యిది. మానవ సమాజం ఆదిమ కమ్యూనిజం నుంచి ప్రాచ్య (ఏషియాటిక్), ప్రాచీన ఫ్యూడల్, బూర్జువా ఉత్పత్తి విధానాల ద్వారా క్రమాభివృద్ధి చెందిందని స్థూలంగా చెప్పవచ్చునన్నారు మార్క్స్ తన "క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి"లో (1859).

మానవజాతి పుట్టినది లగాయతు నిరంతరాయంగా పలువిధాలైన కార్యకలాపాలు సాగిస్తోంది. అవే దాని పరిస్థితుల్ని మెరుగు పరుస్తున్నాయి. ఉత్పత్తిని కూడా పెంచుతున్నాయి. మానవులందరిలోనూ యిది కనిపిస్తుంది. చారిత్రక భౌగోళిక పరిస్థితుల మూలంగా వారి వారి అవకాశాలూ, కృషి ఫలితాలూ భిన్నంగా ఉండవచ్చు. ప్రజలందరిలోను, ముఖ్యంగా శ్రామిక ప్రజల్లో, సృజనాత్మకత వుంది. ఒక్కొక్కప్పుడు దానికి ఆటంకాలేర్పడవచ్చు. తాత్కాలిక ప్రతిష్టంభన లేర్పడవచ్చు. కాని, సమయం వచ్చినప్పుడది వికసిస్తుంది; వృద్ధి చెందుతుంది. మానవుల్లో పరాజితులనీ, విజేతలనీ శాశ్వత విభజన లేదు. బడుగుజనం, అలగా జనము అనుకున్నవారే సమయం వచ్చినప్పుడు తమ బడుగుస్థితిని విదిలించుకొని ముందుకొస్తారు.

ఆదిమ కమ్యూనిస్టు దశను ఏంగెల్స్ తన "కుటుంబం, సొంత ఆస్తి, రాజ్యాంగ యంత్రాల పుట్టుక"లో చాలా చక్కగా వర్ణించారు. తరువాతది ప్రాచ్యదశ (ఏషియాటిక్ సొసైటీ), మధ్యయుగాలది ఫ్యూడల్ దశ, ఆధునిక బూర్జువాదశ వర్గ సమాజంలో చిట్టచివరిది.

ఈ దశలను ప్రస్తావించేటప్పుడు మార్క్స్ మానవజాతినంతనూ ఒకే మొత్తంగా తీసుకొన్నారు. కొన్ని ప్రాంతాల్లో పరిణామం ఆగిపోవచ్చు (కొన్ని ఆఫ్రికా దేశాల్లోలాగ), మరొకచోట అభివృద్ధి వెనక పట్టవచ్చు (కొన్ని ఆగ్నేయాసియా దేశాల్లోలాగ), ఇంకోచోట వివిధ దశలు కలిసిపోవచ్చు (భారతదేశంలో లాగ), కాని మనుష్యజాతి పురోగతి మాత్రం ఆగిపోదు.

రెండవదైన ప్రాచ్య దశను (ఏషియాటిక్ సొసైటీ) మొట్టమొదటిసారిగా 1853లో, న్యూయార్క్ నుంచి వెలువడే "డెయిలీ ట్రిబ్యూన్" పత్రికలో, "భారత దేశంలో బ్రిటిష్ పాలన" అనే వ్యాసము, "బ్రిటిష్ పాలన యొక్క భవిష్యత్ ఫలితాలు" అనే వ్యాసంలోనూ ప్రస్తావించారు. భారతదేశంలో బ్రిటిష్ పాలనవల్ల కలిగిన ఫలితాల విశ్లేషణ వాటిలో అద్భుతంగా ఉంది. నాటి నుంచీ భారతదేశంలో బ్రిటిష సామ్రాజ్యవాద చరిత్రను ఆ క్రమానుగతంగా అంచనా వేయడానికి విశ్లేషణ ప్రాతిపదికగా ఉంది. వ్యాసాల్లో మార్క్స్ ప్రాచ్య సమాజాన్ని

(ఏషియాటిక్ సొసైటీ) స్వయంపోషక గ్రామీణ వ్యవస్థతో సమానమైనదిగా పరిగణించారు. పండీ పండని పిడికెడు నేలను అంటిపెట్టుకొని వుండి మహారాజ్యాల వినాశాన్ని అది పట్టించుకోదు. ఒకవైపు బీభత్స మారణకాండ జరిగిపోతూంటే, పెద్ద పెద్ద పట్టణాల జనాభా భయంకరమైన హింసాకాండకు లోనవుతుంటే అది ఉలకదు, పలకదు. ఏదో ప్రకృతి విపత్తు జరుగుతున్నట్లు అది భావిస్తుంది. ఏ దురాక్రమణదారు మీద పడ్డా గమనించదు. ఈ స్వయంపోషక గ్రామీణ వ్యవస్థ మానవమేధను అత్యంత సంకుచితమైన చట్రంలో బిగించి వుంచింది. అతి నికృష్టమైన, హేయమైన మూఢాచారాలను కిమ్మనకుండా అనుసరించేటట్లు చేసింది. సాంప్రదాయిక నిబంధనలకు బానిసను చేసింది. తనకు ఏ ఔన్నత్యమూ, చారిత్రక ఉత్తేజమూ లేకుండా చేసింది. కేంద్ర ప్రభుత్వం యొక్క ప్రధాన కర్తవ్యం నీటి వనరులను కాపాడ్డం, వృద్ధి చేయడమూను. ఎందుకోసం? పన్నుల రూపంలో ప్రజల్ని కొల్లగొట్టుకోడానికీ, యుద్ధంలో విజయాలను సాధించడానికీను.

ఇదీ, మార్క్సు వర్ణించిన ప్రాచ్య సమాజం. భారతదేశంలో ఇది అనేక శతాబ్దాలు అమల్లో వుందనీ, బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ తన దోపిడీని సుస్థిరం చేసుకొనేందుకు దీన్ని ఛిన్నాభిన్నం చేసిందనీ ఆయన తెలియజేశారు. ఈస్టిండియా కంపెనీ ప్రవేశపెట్టిన విధానాలు మన ప్రజల్ని పిల్చి పిప్పి చేశాయని ఎంత నిశితంగా ఖండించారో, అవి చారిత్రక పురోగతికి తోడ్పడ్డాయని ఆయన ప్రతిభావంతంగా చూపారు.

ఆ వ్యాసాలు వ్రాసిన ఆరేళ్ళ తరువాత మార్క్సు జర్మన్ భాషలో కొన్ని నోట్స్ వ్రాసుకున్నారు. వాటి ఇంగ్లీషు అనువాదం ఈ మధ్యనే 1964లో, "ప్రి కాపిటలిస్ట్ ఎకనామిక్ ఫార్మేషన్స్" (పెట్టుబడిదారి విధానానికి పూర్వం ఉన్న ఆర్థిక వ్యవస్థలు) అనే శీర్షికతో వెలువడింది. ఆ నోట్స్‌లో మార్క్సు ప్రాచ్య సమాజం యొక్క పరిణామాన్ని చాలా వివరంగా వర్ణించారు. అది వర్గరహిత ఆదిమ సమజాం నుంచి పుట్టింది. మార్కెట్టు కోసం కాక, వినిమయం కోసం సరుకుల ఉత్పత్తి చేయబడేవి. ద్రవ్యం ఉండేదిగాని, అత్యల్పం. అందుచేత అది సహజోత్పత్తి దశ. అవసరాలకు మించి సరుకులు ఎంతో కొంతమేరకు ఉత్పత్తి చేయబడేవి. అందుచేత, అదనపు ఉత్పత్తిలో కొంత భాగం స్వాయత్తం చేసుకొనే వర్గం అభివృద్ధి చెందింది. మిగతా భాగం పన్నుల రూపంలో ప్రభుత్వానికి చేరేది. భారతదేశంవంటి దేశాల్లో వృద్ధిచెందిన ఈ ప్రాచ్య సమాజానికీ, ఈజిప్టు, గ్రీసు, రోమ్ మొదలైన దేశాల్లో వర్ధిల్లిన బానిస సమాజానికీ తేడా వుందని మార్క్సు నిరూపించారు. అలాగే, జర్మనీలో అర్ధబానిస విధానానికి దారితీసిన సామాజిక వ్యవస్థతో యిది భేదిస్తుందని తెలియజేశారు. ఈ మూడింటిలో ప్రాచ్య సమాజం అత్యంత స్తబ్దమైందీ, దీర్ఘమైందీ, దృఢమైందీను. వర్గ సమాజాలన్నిటిలోనూ యిది అత్యంత ప్రాథమికమైనది.

మార్క్సిస్టు చరిత్రకారుల్లో కొందరు అభిప్రాయపడుతున్నట్లు, మార్క్సు తన ప్రాచ్య



సమాజ భావాన్ని మొదట్లో ప్రతిపాదించి తర్వాత విసర్జించలేదు. తాను జీవించి వున్నంతకాలం దీనిని ప్రతిపాదిస్తూనే వచ్చారు. "కాపిటల్" మొదటి భాగంలో యిది ఉంది. ఎంగెల్స్ తన "ఆంటే డూరింగ్"లో (1877) దీన్ని వివరించడమే కాక, సుసంపన్నం చేశారు. అయితే, "కుటుంబం సొంత ఆస్తి, రాజ్యాంగ యంత్రాల పుట్టుక"లో (1884) యిది కనిపించదు. "కాపిటల్" రెండో భాగంలోను (1885), మూడో భాగంలోను (1894) ఇది యథాతథంగా ఉంచబడింది.

ఈ సందర్భంలో, ఆసక్తిదాయకమైన ఒక విషయాన్ని మనం గమనించాలి. కోవలెవ్స్కీ అను రష్యన్ పరిశోధకుడు 1879లో "సాముహిక భూస్వామ్యం" అనే గ్రంథం రచించారు. అది భారతీయ స్వయంపోషక గ్రామాలలోని గజిబిజి లక్షణాల్ని బయటపెట్టింది. వాటిలోకి సొంత ఆస్తి ఎలా చొచ్చుకుపోయిందో ఆ గ్రంథం చూపెట్టింది. మార్క్సు ఆ రచనను చదివారు. దానిలోని కొత్త విషయాన్ని గుర్తించి ఆమోదించారు. అంటే, భారతదేశంలోని గ్రామీణ వ్యవస్థ స్వయంపోషకమైనదిగానే వుంటూ, సొంత ఆస్తియొక్క తాకిడికి గురి అవుతూ వచ్చిందన్న వాస్తవాన్ని ఆయన అంగీకరించారన్నమాట.

మార్క్సు ప్రతిపాదించిన మూల సూత్రాలను వివరిస్తూ వ్రాసిన వ్యాసంలో లెనిన్ పై నాలుగు సామాజిక వ్యవస్థలను (ప్రాచ్య, ప్రాచీన, ఫ్యూడల్, బూర్జువా) యథాతథంగా ఉటంకించారు. స్టాలిన్, తన "డయలెక్టికల్ అండ్ హిస్టారికల్ మెటీరియలిజం"లో ప్రాచ్య సమాజాన్ని విసర్జించారు. ఆయన తరువాతి కాలంలో ప్రచురింపబడిన, ప్రచురింపబడుతున్న ప్రమాణ గ్రంథాలలో ప్రాచ్య సమాజాన్ని గురించిన ప్రస్తావన ఉండడమే లేదు. మాస్కోలోని లుముంబా విశ్వవిద్యాలయంలో పాఠ్య గ్రంథంగా నిర్ణయింపబడ్డ "ఏన్ ఔట్‌లైన్ ఆఫ్ సోషల్ డెవలప్‌మెంట్" మొదటి భాగంలోనూ, అంతకుముందు 1965లో 5వ ఫారం విద్యార్థుల కోసం రచింపబడ్డ "ఏన్షియంట్ హిస్టరీ"లోను ప్రాచీన భారతంలో ప్రాచ్యదశ ఒకటుందని గుర్తించకపోగా, బానిస వ్యవస్థ ప్రబలంగా ఉండేదని నిర్ధారణ చేశారు.

శ్రీపాద్ అమృత్‌డాంగే రచించిన "భారతదేశం : ఆదిమ కమ్యూనిజం నుంచి బానిస విధానం వరకు" చాల భాషల్లోకి అనువదింపబడింది. అందులో ఆయన, అతి ప్రాచీన కాలంలో ఆర్యులు చేసే యజ్ఞాలు-సమిష్టి ఉత్పత్తిని తెలియజేసే కర్మకాండ అనీ, బ్రహ్మన్ అనగా ఆర్యుల కమ్యూన్ అనీ, ఋగ్వేదం కమ్యూన్ల జీవిత విధానాన్ని వర్ణిస్తుందనీ సూత్రీకరించారు. రక్త సంబంధీకులకు మాత్రమే పరిమితమై వున్న చిన్న చిన్న కమ్యూన్లలో ఆర్యులు నివసించేవారు. సొంత ఆస్తి వారికి లేదు. శ్రమ విభజన గాని, వర్గాలుగాని, వర్గదోపిడీగాని లేవు. వ్యక్తుల్ని బలప్రయోగం ద్వారా అణచివుంచే సంస్థలు లేవు. ఉత్పత్తి సాధనాలు అతి ప్రాథమికమైనవి. అంచేత, ఉత్పత్తి అత్యల్పం. అవసరాలకు మించి ఉత్పత్తి చేయడం అసంభవం గనుక దోచుకునేవారూ లేరు, దోచుకోబడేవారూ లేరు. వివాహాలు సైతం గుంపు వివాహాలుగానే

ఉండేవి. క్రమంగా జనాభా పెరుగుదల, శ్రమ విభజన, బానిసల్ని బానిస యజమానులు పీడించడం, తెగల మధ్య యుద్ధాలు, రాజ్యాంగ యంత్రం పుట్టుక, పెరుగుదల, మహాభారత యుద్ధం, దానితో బానిస విధాన పతనం- యిలా సమాజం మారుతూ వచ్చిందని డాంగేగారు తన గ్రంథంలో వివరించపూనుకున్నారు. మార్క్సు తన వ్యాసాల్లోనూ, యితర రచనల్లోనూ వర్ణించిన ప్రాచ్య సమాజాన్ని గురించి డాంగే గారు మాటవరుసకైనా ప్రస్తావించలేదు.

బాధ్యతగల ఏ చరిత్రకారుడైనా ఆదిమ సమాజాన్ని గురించి చెప్పేటప్పుడు పురావస్తు పరిశోధనల్ని ప్రస్తావించకుండా ఉండలేడు. ఆర్యులు భారతదేశానికి రాకముందు వివిధ ప్రాంతాల్లో ఆటవికులు రాతిపనిముట్లను ఉపయోగించేవారనీ, తరవాత లోహాలతో చేసిన పనిముట్లు వచ్చాయనీ, ఇనుప పనిముట్లు మానవ జీవితంలో ఒక విప్లవాన్నే తీసుకొచ్చాయనీ, వ్యవసాయం అప్పటినుంచే వృద్ధి చెందిందనీ రుజువు చేసేందుకు బోలెడు ఆధారాలున్నాయి. కాని, వాటివైపు డాంగేగారు తన దృష్టిని సారించలేదు. వేదాల్నీ, వేదాంగాల్నీ ఉదహరించవచ్చు. కావ్యాల్నీ, మహాకావ్యాల్నీ కూడా పేర్కొనవచ్చు. ఐతే, వాటిలోని వాక్యార్థాలను పురావస్తు పరిశోధనలు నిరూపించేవై ఉండాలి. కాని, డాంగేగారికి వీటి అవసరం కనిపించలేదు. మొన్న మొన్నటి వరకు కొన్ని ప్రాంతాల్లో నివసించే కొండజాతుల జీవిత విధానాన్ని పరిశీలించినా ఆదిమ సమాజం ఎలా ఉండేదో బోధపడుతుంది. కాని, అది కూడా ఆయనకవసరం లేకపోయింది. 'బ్రహ్మన్' అంటే ఆర్యుల కమ్యూన్ అనీ, 'యజ్ఞం' అంటే ఆర్యుల సమష్టిఉత్పత్తి విధానమనీ అర్థంచెప్పిన డాంగేగారికి శ్రీ కొశాంబి యిలా జవాబు చెప్పారు : "ఇదే చాలా అర్ధరహితమూ అసంభవమూ. ఇదే నిజం అనుకొన్న వ్యక్తి పరమ హాస్యాస్పదుడవుతాడు. రుగ్వేదంలో 'బ్రహ్మన్' అనే మాట వాడబడిన సందర్భాలన్నిటిలోను 'ప్రార్థన' లేదా 'పురోహితులు' అనే అర్థంలో వాడబడి యుండాలి. కొన్ని సందర్భాలలో తప్ప మిగతా అన్ని సందర్భాల్లో ఆ అర్థంలోనే రూఢిగా అది వాడబడింది. ఇక 'యజ్ఞం' అనే మాటకు అర్థం 'అగ్ని సంస్కారం'. ఏ కర్మకాండా ఉత్పత్తి విధానం అవదు కదా. య+జ+న కలిపి 'యజ్ఞం' అవుతుందనీ, 'యజ్ఞ' మనగా కలిసి సమావేశమై కలిసి కనడం అనీ 47వ పుటలో శబ్దార్థం చెప్పబడింది. ఇది వ్యాఖ్యానమే అవసరం లేనంత సిల్లీగా ఉంది. ఇందులో బయటపడుతున్న శాసనాధికార ధోరణి మాత్రం ప్రమాదకరమైనట్టిది. కాని అది వేరే విషయం."

రుగ్వేదపుటార్యులు ఆదిమవాసులైతే, వారి మధ్య అంతర్యుద్ధాలెందుకు జరగాలి? అనార్యుల్ని ఓడించిన ఆర్యులు అనార్య సంప్రదాయాలనెందుకు చేపట్టవలసి వచ్చింది? ఆర్య, దస్య శబ్దాలు ప్రాథమిక రూపంలో వర్గ విభజనను సూచించవా- మొదలైన ప్రశ్నలకు డాంగేగారి పుస్తకంలో సమాధానాలు దొరకవు. ఆర్యులు అనేక మంది అనార్యుల్ని-దస్యుల్ని-శూద్రులుగా తీసుకున్నారు. అంచేత భారతదేశంలో బానిస వ్యవస్థ చోటు చేసుకోలేదు. కాని డాంగేగారి దృష్టిలో శూద్రులంతా బానిసలే! శూద్రులు బానిసలనే వాదాన్ని డయకోవ్, ఒసిపోవ్ అనే



సోవియట్ ఇండాలజిస్టులు కూడా అంగీకరించలేదు. (చూ "ఇండియా టుడే", అల్లాబాద్, ఆగస్టు 1951). ఇక్కడ బానిసలంటే ఉత్పత్తి క్రమంలో పాల్గొనే బానిసలని అర్థం. ధనవంతుల యిళ్ళలో చాకిరీ చేసే బానిసలు లక్షల సంఖ్యలో ఉండవచ్చు. వారు వ్యవసాయంలో గాని, పరిశ్రమల్లోగాని శ్రమించరు. మొన్న మొన్నటివరకు నిజాం సంస్థానంలో బానిసలుండేవారు. కాని, అక్కడ ఉన్నది బానిస వ్యవస్థ కాదు.

ప్రాచ్య సమాజాన్ని గురించి వ్రాసిన మార్క్సు భారతదేశ పరిస్థితుల్ని వివరించేటప్పుడు బ్రిటిష్ పార్లమెంటరీ నివేదికల్ని ఆధారం చేసుకున్నారు. అప్పటికి భారతదేశంలో పురావస్తు పరిశోధన శాఖ ఏర్పడలేదు. శిలా శాసనాలపైన, తామ్ర శాసనాలపైన, సాంవత్సరిక నివేదికలు వెలువడేవి కావు. వాటిపై నిపుణుల వ్యాఖ్యానాలు ప్రచురింపబడ్డం ప్రారంభం కాలేదు. భారతీయ భాషల్లో రాజుల, చక్రవర్తుల ఫర్మానాలుగాని, రివెన్యూ రికార్డులుగాని, గ్రామ కైఫియత్‌లుగాని ఆయన కందుబాటులో లేవు. అందుచేత, స్వయంపోషక గ్రామీణ వ్యవస్థలో సొంత ఆస్తి ఎలా ప్రవేశించి వృద్ధి చెందిందో, ప్రైవేట్ వ్యాపారం ఎలా విస్తరించిందో, శ్రామిక జన సమీకరణ కూడా ఎలా ప్రారంభమయిందో తెలుసుకోడానికి అవకాశం లేకపోయింది.

ఈనాడు మనకీ అవకాశాలున్నాయి. వాటిని ఉపయోగించుకొని చూస్తే మార్క్సు వర్ణించిన ప్రాచ్య సమాజం మూసలో పోసిన అచ్చులాగాక, భౌగోళిక నైసర్గిక పరిస్థితుల్ని బట్టి వేర్వేరు రంగుల్లో మనకు కనిపిస్తుంది. దాని ప్రధాన లక్షణాలు స్వయంపోషకత్వం. మతమౌఢ్యం, కులభేదాలు, నిరంకుశపాలన వీటన్నిటితోపాటు పాతరాతియుగం లగాయతు యంత్ర యుగం వరకు అనేక ఆచారాలు, కట్టుబాట్లు, నీతులు ఒకదానితో ఒకటి కలిసిపోయి, నడక మందంగా సాగడం కనిపిస్తుంది. వీటిలో మతమౌఢ్యం అన్నిటికంటె ఎక్కువగా ప్రగతిని అడ్డుకొంటూ వచ్చింది. ఆ విధంగా మనదేశంలో ప్రాచ్య సమాజం అనేకవందల సంవత్సరాలు వర్ధిల్లింది. వివిధ దశల్లో అది వృద్ధి చెందింది. అనేక రంగులు ధరించింది. అనేక రూపాలు మార్చింది. చివరకు ఈస్టిండియా కంపెనీ ప్రవేశపెట్టిన ఆవిరి యంత్రం, రైల్వేలు, టెలిగ్రాఫు, విద్యా విధానం ప్రాచ్య సమాజాన్ని తుత్తునియలు చేసింది.

ఈ పుస్తకాన్ని రచించడంలో శ్రీ కొశాంబి గ్రంథం "ఏన్ ఇంట్రడక్షన్ టు ది స్టడీ ఆఫ్ ఇండియన్ హిస్టరీ" నాకెంతో తోడ్పడింది. మార్క్సిస్టు విద్వాంసులలో ఆయన ఉన్నత శ్రేణికి చెందినవాడు. స్వయంగా పలుగు, పార పట్టుకొని భూమి నుంచి చారిత్రక వాస్తవాలను పెల్లగించినవాడు. మార్క్సిజాన్ని పడికట్టు సిద్ధాంతంగా కాక నిత్యం కొత్త వెలుగులను వెదజల్లే విజ్ఞానశాస్త్రంగా ఆకళింపు చేసుకొన్నవాడు. చారిత్రక ఆధారం లేకుండా ఏ కొత్త సిద్ధాంతాన్నీ ఆయన ప్రతిపాదించలేదు. భారతదేశంలో ప్రాచ్య సమాజం ఏయే దశలు గడిచిందో చివరకు ఎలా విచ్ఛిన్నమయిందో తన రచనల్లో తెలియజేశారు. ఆ విధంగా మార్క్సు ప్రతిపాదించిన ప్రాచ్య సమాజ భావాన్ని సుసంపన్నమొనర్చారు.

మనదేశంలో అన్ని ప్రాంతాలూ ఏకకాలంలో అభివృద్ధి చెందలేదు. వివిధ ప్రాంతాలు వివిధ కాలాల్లో వివిధ దశలకు చేరుకొన్నాయి. వింధ్యకు ఉత్తరాన వచ్చినలాంటి పరిణామాలు దక్షిణాపథాన్ని ఎన్నో శతాబ్దాలవరకు ప్రభావితం చేయలేదు. ఆర్యులు వింధ్యనుదాటి దక్షిణానికి వచ్చేనాటికి యిక్కడ ఆర్థికస్థితీ, సంస్కృతీ స్వతంత్రంగా ఎంతో ఉచ్చదశలో వున్నాయి. నౌకాయానంలో పై చేయి దక్షిణాత్యులది. ఔత్తరాహ, దాక్షిణాత్య సంస్కృతుల సమ్మేళనకు ఎన్నో శతాబ్దాలు పట్టింది. ఇప్పటికీ అది పూర్తి కాలేదు.

ఈరోజున ఆంధ్రప్రదేశ్ అని పిలువబడుతున్న కోస్తా, తెలంగాణా, రాయలసీమ జిల్లాలకు నా పరిశీలన పరిమితం అయితే, ఈ జిల్లాల సరిహద్దులు మొదటి నుంచీ ఒకేలాగా లేవు; మారుతూ వచ్చాయి. నాగరికత వికసించిన రోజుల్లో కూడా, భాషలకు సంబంధించిన మండల సరిహద్దులు ఖచ్చితంగా గీత గీసినట్లు లేవు. అందువల్ల నేను యిప్పటి ఆంధ్రప్రదేశ్‌కి వెలుపలనున్న ప్రాంతాల చరిత్రను కూడా తగుమాత్రంగా పరిశీలించాను. ఇప్పటి ఆంధ్రప్రదేశ్‌కి అవి ఆనుకొని ఉన్నందున నా పరిశీలన పరిపుష్టమవుతుంది. అయితే, మూడవ అధ్యాయంలో నేనీ హద్దుల్ని మించి వెళ్ళాను. ఇందుకు కారణం చెప్పుకోవాలి. తమ సామ్రాజ్యాన్ని పూర్వ-పశ్చిమ సముద్రాలకంటా వ్యాపింపజేసిన శాతవాహనులు తెలుగువారు. భాషల మధ్య విభేదాలు ఆ రోజుల్లో తీవ్రమైనవి కావు. ఎందుచేతంటే బౌద్ధమతం ఒకే భాషద్వారా (ప్రాకృతం) వివిధ ప్రాంతాల ప్రజల్ని సమైక్యం చేసేది. ప్రాకృతంలో మాండలికాలు ఉండవచ్చు. కాని, భాష మాత్రం ఒకటే. ఆనాటి ప్రజల జీవిత విధానాన్ని తెలుసుకొనేందుకు ప్రధానమైన ఆధారాలు పురావస్తు సామగ్రి. ఆ సామగ్రి అన్ని ప్రాంతాల్లోనూ విస్తారంగా లభించదు. అయితే, చరిత్ర పరిశోధకుడు వాటి మీద ఆధారపడి తీరాలి. తన సమాచారం సరియైనదో కాదో తెలుసుకొనేందుకది అవసరం.

మొదటి ప్రకరణంలో పాతరాతి యుగం, కొత్తరాతియుగం, ఇనుపయుగం అధిగమించి నాగరిక యుగంలో ఎలా అడుగు పెట్టాడో చూపాను. ఆదిమానవులు వివిధ పరికరాలను మెరుగు పరచుకోవడంలో తమ నైపుణ్యాన్నెలా పెంచుకున్నారో, ఆ విధంగా, బాహ్య ప్రపంచాన్ని ప్రభావితం చేయడం ద్వారా తామెలా మార్పు చెందారో తెలియజేశాను.

రెండో ప్రకరణం మొదటి ప్రకరణానికి అనుబంధమని చెప్పవచ్చు. తెలుగుగడ్డ మీద యిప్పటికే సజీవులై యున్న ఆటవిక తెగల జీవిత విధానాన్ని వర్ణించి ఒక్కొక్క తెగ ఏ అభివృద్ధి దశలో వుందో సూచించాను. వేటలో నైపుణ్యాన్నీ, శ్రమలో పట్టుదలనూ, నాట్యంలో నేర్పునూ, యుద్ధాల్లో కట్టుబాట్లనూ, నిర్ణయాల్లో ఏకత్వాన్నీ చిత్రించి, ప్రతి తెగ తన ఆచారాల్నీ కట్టుబాట్లనూ నిలబెట్టుకోవడానికెంత పట్టుదల చూపేదో వివరించాను.

మూడో ప్రకరణంలో శాతవాహన సామ్రాజ్యమెలా ఆవిర్భవించి వృద్ధి చెందిందో చెప్పి, నాల్గవ ప్రకరణంలో వ్యవసాయం ఒక గొప్ప సామాజిక విప్లవాన్నెలా తీసుకొచ్చిందో



వివరించాను. ప్రభుత్వం వ్యవసాయాన్నీ, పరిశ్రమల్నీ, వ్యాపారాన్నీ ప్రోత్సహించింది. ఆ నాలుగున్నర శతాబ్దాలూ విదేశాలతో మన వ్యాపారం అత్యుచ్చ స్థాయికి చేరుకొంది. బౌద్ధం ఈ మహా విప్లవానికి ఊతమిచ్చింది. కులవ్యవస్థ ఉత్పత్తిని పెంచడానికొక సాధనంగా ఉపయోగపడి నప్పటికీ, వర్గదోపిడీకి అదో రూపం; బానిస వ్యవస్థ అవసరం లేకుండా అది చేసింది. రాచరిక వ్యవస్థ మరీ క్రూరంగా లేదు. రాజులు, సామంతులు ప్రజల మతాల్నీ, భాషల్నీ, సాహిత్యాన్నీ పోషించేవారు. కళలు కూడా ఉచ్చస్థాయి నందుకున్నాయి. రాచరికం పట్ల ప్రజలలో అసంతృప్తి ఉన్నా, సామూహిక తిరుగుబాట్లు జరిగినట్లు దాఖలాలు లేవు. గ్రామాలు స్వయంపోషక గ్రామాలుకావు. వృత్తులు వేర్వేరు గ్రామాల్లో వృద్ధి చెందడం చూస్తాం. ఒక్కొక్క వృత్తికి ఒక్కొక్క శ్రేణి ఉండేది. వర్తకులు కూడా శ్రేణుల్లో సభ్యులుగా ఉండేవారు. రాజులు, సామంతులు వాటిని అనుమతించడమేగాక, ప్రోత్సహించేవారు. భూమిపై సొంత ఆస్తి ఉన్నట్లు శిలా శాసనాలు తెలుపుతున్నాయి. యుద్ధాలు, అంతర్యుద్ధాలు ప్రజా జీవితాన్ని ఛిన్నాభిన్నం చేసేవి. ఆనాటి వ్యవస్థ బానిస వ్యవస్థ కాదు. ఫ్యూడలిజం కాదు. ప్రాచ్య సమాజం కూడా కాదు; దానికి భిన్నమైనట్టిది.

నాల్గవ ప్రకరణంలో, శాతవాహనుల తరవాత పరిపాలించిన రాజవంశాల్ని గురించీ, యుద్ధాలు-అంతర్యుద్ధాన్ని గురించీ, పరిపాలనా విధానాల్ని గురించీ చెప్పాను. ఐదవ ప్రకరణంలో, యీ నాలుగు శతాబ్దాలు (3వ శతాబ్దం మొదలు ఏడవ శతాబ్దం వరకు) ప్రాచ్య సమాజం యొక్క ప్రారంభదశ అని చెప్పవచ్చు. ఈ దశలో ఉత్పత్తి మందగించింది. స్వయంపోషక గ్రామాలు తలెత్తాయి. పరిశ్రమలు మూతపడ్డాయి. వ్యాపారం మందగించింది. శ్రేణులు మాయమయ్యాయి. బౌద్ధం విలసిల్లినా, బ్రాహ్మణులకు అగ్రహారాలూ, దేవుళ్ళకు భూములూ పెచ్చు పెరిగాయి. ఫలితంగా, రాజుకీ ప్రజలకూ మధ్య సరికొత్త వర్గమొకటి (అగ్రహారీకులు, దేవస్థానాలు) అధికారంలో భాగస్వామి అయింది. ఈ వర్గం అధికారంలో వున్న ప్రదేశాల్లో సైన్యాలు ప్రవేశించకూడదు. రాజోద్యోగులు ప్రవేశించకూడదు. రాజశాసనాలు అమలు జరగకూడదు. ప్రజల్ని రాజులు బలప్రయోగం ద్వారా అణచి వుంచితే, వీరు ధర్మబోధల ద్వారా అణచివుంచేవారు. మతమౌఢ్యం, మూఢ నమ్మకాలు ప్రజల్ని కూపస్థ మండూకాల్లా ఉంచేవి. భూమిపై వ్యక్తులకు ఆస్తి హక్కు లేదు. గ్రామాల్లోని అగ్రకులస్తులు పంట భూముల్ని వంతుల ప్రకారం మార్చిమార్చి యిచ్చేవారు.

ప్రాచ్య సమాజ పరిధిలోనే ఫ్యూడలిజం పునాదులు పడ్డ దశయిది. అయితే, యిది యూరోపియన్ ఫ్యూడలిజాన్ని పోలినది కాదు. ఎందుచేతంటే, ఉత్పత్తి సాధనాల్లో ప్రధానమైన భూమి ఫ్యూడల్ ప్రభువుల సొంత ఆస్తి కాదు.

ఏడవ ప్రకరణం, రాజవంశాల మధ్య యుద్ధాలు, అంతర్యుద్ధాలతోపాటు, వివిధ అంతరువుల సామంత ప్రభువుల్ని, వారి అధికారాలనూ, పరిపాలనా విధానాన్నీ వర్ణిస్తుంది.

రాజులు భూముల్ని బ్రాహ్మణులకు, దేవాలయాలకు మాత్రమే కాక, యుద్ధ ప్రభువులకు కూడా పంచిపెట్టడం అధికమవుతుంది. వారంతా ఆ భూములకు హక్కుదారులవుతారు. సొంత భూముల్ని కొనుక్కునే హక్కు, అమ్ముకొనే హక్కు దాన శాసనాల్లో చూస్తాం. అయితే, భూముల క్రయవిక్రయాలు పుణ్యంకోసమో, దైవకార్యాలకో మాత్రమే. భౌతిక అవసరాలకోసం భూముల్ని కొనడం, అమ్మడం జరిగినట్లు ఆధారాల్లేవు. ఈ దశలో బౌద్ధం క్షీణించింది. దాని స్థానాన్ని బ్రాహ్మణ మతం ఆక్రమించింది. కుల కట్టుబాట్లు మరింత బిగిశాయి. మతమౌఢ్యం మరింత పెరిగింది. మూఢనమ్మకాలు మరింత వెర్రితలలు వేశాయి.

ప్రాచ్య సమాజ పరిధిలో ఫ్యూడలిజం ఆవిర్భావం, అభివృద్ధిని తెలియజేసేదిగా నేనీ దశను పేర్కొన్నాను.

ఈ గ్రంథం అనేకమంది విద్వాంసుల కృషిఫలితం. వారంతా నేలదున్ని, విత్తులు నాటి, నీరుపెట్టి, పంట పండిస్తే, నేనా పంట కోసుకున్నాను. నాకు సరియైనవని తోచిన సూత్రీకరణలను జోడించాను. వారందరికీ నేను రుణపడి ఉన్నాను.

ఆంగ్లంలో నేను రచించిన వ్రాతప్రతిని అత్యంత శ్రద్ధతో చదివి, పొరబాట్లను సవరించి, భాషను మెరుగు పరచిన శ్రీ జి.జె. రామారావు గారికి నేనెంతైనా కృతజ్ఞుణ్ణి.

ఆంగ్లం నుంచి తెలుగులోకి సంక్షిప్తానువాదం చేసిన శ్రీ మహీధర రామమోహనరావు గారికి నా హృదయ పూర్వక ధన్యవాదాలు.

"ప్రజలలో చైతన్యం, ఉత్తేజం పురిగొల్పి, సమాజంలోని వాస్తవ సమస్యలు వైరుధ్యాల నుండి శాస్త్రీయ విలువలు పెంపొందించి, ప్రజాతంత్ర ఉద్యమ వికాసానికి తోడ్పడే మంచి పుస్తకాలను తక్కువ వెలకు అందజేయడం" తమ ఆశయంగా పెట్టుకున్న హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ వారు వ్రాతప్రతిని చదివీ చదవగానే ప్రచురించడానికంగీకరించి, ముద్రణకు సన్నాహాలు ప్రారంభించి, శీఘ్రకాలంలో అచ్చుగ్రంథాన్ని విడుదల చేసినందుకు వారికి నా అభినందనలు తెలుపుతున్నాను.

తెలుగు అనువాదాన్ని సరిచూచి మెరుగు పరచడానికి సర్వవిధాలా కృషి చేసిన చేకూరి రామారావుగారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

గుణదల, విజయవాడ-5
5-6-1981 **కంభంపాటి సత్యనారాయణ**

# నా మాట

మిత్రులు శ్రీ కంభంపాటి సత్యనారాయణగారు వ్రాసిన ఈ పుస్తకం చదివినప్పుడిది తెలుగులోకి వస్తే బాగుంటుందనుకున్నాను. మన సామాజిక నిర్మాణ సమస్యలలో కొన్నిటికి సమాధానం ఇందులో దొరికిందనిపించింది. తెలుగువాళ్ళు ముఖ్యంగా అభ్యుదయోద్యమాలలో పనిచేస్తున్న వాళ్ళకి ఆ సామాజిక విజ్ఞానం అత్యవసరం.

భారతదేశంలో బానిస విధానం వుండేదా? ఏ రూపంలో వుండేది? వంటి సమస్యలు పరిశోధకులవి. సాధారణుడైన తెలుగువాడి నిత్యజీవిత పరిజ్ఞానంలో వాని పాత్ర బహుదూరం. కాని మన నిత్య జీవితాన్ని ఆవరించుకొని, ముందుకు అడుగు వేయకుండా నిరోధిస్తున్న సమస్యలున్నాయి. వానిలో కులం ఒకటి.

మానవులంతా ఒక్కటే, వారిలో హెచ్చుతగ్గులు లేవు, వుండకూడదు అనేవాళ్ళు కూడా కులం పేరు చెప్పేసరికి బిగిసిపోతున్నారు. ఆ కులం అనేదీ "వర్ణం" అనేదీ సమానార్థకంగా చెప్పవచ్చునా? అయితే వర్ణాలు నాలుగే అన్నప్పుడు తెలుగు దేశంలో ఇన్ని కులాలు ఎలా పుట్టుకొచ్చేయి? వర్ణవ్యవస్థను బలపరిచేవారు వాటిని సమాజంలో వచ్చిన శ్రమవిభజన మూలకాలుగా చెప్తారు. కాని, ఒకే వృత్తిపని చేసేవారు ఎన్నో కులాలుగా పరిగణించబడుతున్నారు. ఒకే కులంవాళ్ళు భిన్న వృత్తులలో వున్నారు. ఏ పనీ చెయ్యకుండా 'ముష్టి ఎత్తుకోడం' ఒక కులవృత్తిగా గౌరవం పొందుతూంది. వర్ణ విభజనకీ, దీనికీ సంబంధమే లేదా?

ఈ కులాలు అంతర్వివాహనిబద్ధాలు మళ్ళీ ఒకే కులానికి చెందిన భిన్న శాఖలుంటున్నాయి. వానిలో వానికీ బహిర్వివాహం నిషిద్ధమే. కాని ఆ శాఖలు మళ్ళీ గోత్రాలుగా విభజన. ఈ గోత్రాలలో అంతర్వివాహాలు నిషిద్ధం. ఆర్యులు తెచ్చిన వర్ణాల మధ్యా, వర్ణాలలోనూ కూడా వివాహాలు నిరభ్యంతరంగా సాగుతుండిన నిదర్శనలుంటే మనకీ, మన కులాలకే ఈ విధి నిషేధాలెందుకు వచ్చేయి? వీటిని ఎలా అర్థం చేసుకోవాలి?

ఈ ప్రశ్నలకి సమగ్ర సమాధానం వుందనను, కాని వీనిని అర్థం చేసుకొనేందుకూ, సమాధానం వూహించుకొనేందుకూ కావలసిన సమాచారం నాకు కనబడింది. అందుకే అందరికీ అందుబాట్లో తెలుగులోకి రావాలనుకున్నది. నాకు మంచిదిగా కనిపించిన ప్రతి పుస్తకమూ తెలుగువాళ్ళకి అందుబాటులో వుండాలనేదే నాకున్న యావ.

ఓమారు శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ప్రసంగవశంలో వెలనాటి శాఖవాళ్ళు మధ్యప్రదేశ్ నుంచి వచ్చిన బ్రాహ్మణులు కాని తెలుగుదేశం వాళ్ళు కారన్నారు. అలాగే మరో మిత్రుడు బి. రామచంద్రరావు, నియోగులు కాశీ ప్రాంతం నుంచి వచ్చినట్లు చెప్పుకుంటారన్నారు. ఇల్లాంటి సందర్భాలను నమ్మేవాళ్ళూ వున్నారు. మేము ఆర్య సంతతులం అని చెప్పుకోడానికి పడే ఆతురతలో భాగంగా భావించి ఆధారాల గురించి తర్కించని వారూ వున్నారు. నవ్వుకుని వూరుకుంటారు. కాని కాకతీయుల కాలంలో ఉత్తర భారతం నుంచి బ్రాహ్మణ కుటుంబాలను

వేల సంఖ్యలో తెచ్చి తెలుగుదేశంలో దింపేరని చదివినప్పుడు? ఆ బ్రాహ్మణ కుటుంబాల్ని తెచ్చినది వారి విద్వత్తు కోసం గాక, వారి వ్యవసాయ నైపుణ్యం కోసమేనని చదివినప్పుడు? ఈ కులాలూ, కులవృత్తులూ గురించి మనం చెప్పుకునేది వట్టి భ్రమేననిపించదూ?

కొన్ని చరిత్రలు అసత్యాలతో ప్రాణం ఉసూరుమనిపిస్తాయి. కొన్ని అభూత కల్పనలతో వెర్రి భ్రమలు కలిగిస్తాయి. శ్రీ సచ్చిదానందమూర్తి గారు అన్నట్లు ఏ సిద్ధాంతమూ జరిగిన వాటినన్నింటినీ ఏది ఎందుకు ఎలా జరిగిందో చెప్పలేదు. నిజమే. అయితే వారే చెప్పినట్లు మార్క్సిస్టు కొశాంబీ విధానం ఈ రంగంలో వున్న ఇతర సిద్ధాంతాల కన్న ఎంతో మేలు. సత్యనారాయణగారు తమ రచనకు ఆ పంథాను తీసుకున్నారు. మతం, తత్వశాస్త్రం గురించిన అంశాలను ఆయన సరిగ్గా చిత్రించలేదనో; శాతవాహనులు, చాళుక్యుల అభివృద్ధి పతనాల విషయాలు సరిగ్గా రాలేదనో; బానిసత్వం, బానిస వ్యవస్థ గురించిన సమస్యల నిర్వచనం సరిగ్గా లేదనో విమర్శలున్నాయి. ఉండనీండి. వానిని తాము సరి అనుకున్న పద్ధతిలో వ్రాసే సమర్థులుండి వుంటారు. వారిని రంగంలోకి దిగమందాం. ఇవన్నీ ఒక వ్యక్తి, ఒక రోజున, ఒక్క పుస్తకంలో తేల్చగల విషయాలు కాదు. మార్క్సిస్టు పంథాలో వ్రాసేవాళ్ళే అంతా అయినా "ముఖే ముఖే సరస్వతీ" అటువంటి ఉద్గ్రంథం ఏదో వచ్చేవరకూ ఏమీ చదవద్దనీ, అంత గొప్పగా వ్రాసేయగలిగేవరకూ కలం పట్టవద్దనీ అనను. పాత్రను బట్టి నీళ్లు తీసుకోగలమనీ, మన అవసరాన్ని బట్టి తాగగలమనీ, నమ్మేవాళ్ళలో ఒకడిని. అందుచేతనే ఈ గ్రంథం తెలుగులోకి వచ్చే ప్రయత్నం అవసరమని పదేపదే అనిపించింది. చివరికి ఆ బాధ్యతను రచయితా, ప్రచురణ కర్తలూ కూడా నా మీదనే పెట్టినప్పుడు ఎంతో సంతోషమూ కలిగింది.

ఇది శ్రీ సత్యనారాయణగారి మూల పరిశోధన గ్రంథానికి ప్రత్యక్షరానువాదం కాదు. వారు తమ నిర్ణయాలను బలపరిచేందుకు ప్రతి అంశం మీదనూ ఎన్నో వుదాహరణలివ్వవలసి వచ్చింది. కొన్ని కొన్ని విషయాలూ, వుదాహరణలూ పునరావృతం అయాయి. కొన్ని కొన్ని చోట్ల పూర్వ గ్రంథాల నుంచి ఎత్తి వ్రాసిన భాగాలు గ్రంథ విస్తారానికి కారణం అయాయి. పుస్తకాన్ని యథాతథంగా అనువదించడం విద్వద్గోష్ఠులకు వుపయోగం కాని సామాన్య తెలుగు పాఠకుని కొనుగోలు శక్తినీ, పఠనాసక్తినీ దృష్టిలో పెట్టుకొని మూల గ్రంథానికి అనుసరణ అనువాదం చేసేను. శ్రీ సచ్చిదానందమూర్తిగారి ముందుమాట, శ్రీ సత్యనారాయణగారి పీఠికలతో సహా పుస్తకం పేరు, ప్రకరణాల సంఖ్యలోనే ఆ మార్పు కనిపిస్తుంది. వాటిని చూసి ఇది మరో పుస్తకం అనుకోవద్దు. అంతే నా మాట.

20-8-80
హైదరాబాదు — అనువాదకుడు

ఒకటో ప్రకరణం

# చరిత్ర పూర్వయుగం

## మానవుని జీవితయాత్ర

మానవుడు భూమిమీద తిరుగాడడం మొదలుపెట్టి రమారమి అయిదు లక్షల సంవత్సరాలయింది. అప్పటి, ఇప్పటి మానవుల మధ్య పోలికలే లేవు. ఆనాడతడు చెట్లమీదనో గుహలలోనో నివసించేవాడు. ప్రకృతిలో లభించిన కాయాకసరూ, వేరూ దుంపా తినేవాడు. లేదా వేటాడి తెచ్చుకొని మాంసం తినేవాడు. అతనికి తలదాచుకుందుకు ఇల్లూ, కట్టుకుందుకు బట్టా లేవు. వ్యవసాయం తెలియదు. చేతి పనులేనా ఎరగడు. కోపం వచ్చినా, సంతోషం వచ్చినా, దుఃఖం కలిగినా ఏవో అరుపులు తప్ప పక్కవాడికి చెప్పుకోనేందుకు మాట ఎరగడు. ఆపద వస్తూందని పక్కవాళ్ళకి కబురందించవలసినా, వాళ్ళ సహాయం కోరవలసి వచ్చినా అతనికి ఆ అరుపులే గతి.

నాటి నుంచి నేటివరకు గడచిన ఇన్ని లక్షల సంవత్సరాలలో అతడు ఎన్నో ఆపదలు గడిచేడు. ప్రకృతి వైపరీత్యాలను ఎదుర్కొన్నాడు. దావానలాలు, వరదలు, కరువులు, రోగాలు ఎందరినో పొట్టబెట్టుకున్నాయి. క్రూర జంతువులు వెన్నాడుతూనే వుండేవి. రాయీ, రప్పా మలిచి చేసుకున్న ఆయుధాలు తీసుకుని, పదిమందితో కలిసి వాటిని నిగ్రహించేవాడు, తరానికి 30 ఏళ్ళు లెక్కవేస్తే ఇప్పటికి 16 వేలు పైగా తరాలు గడిచేయి. ఇందులో అత్యధిక భాగం తిండి వెతుక్కుంటూ తిరగడంలోనే గడిచింది. ప్రాణాలు చేతబట్టుకుని బతికేడు.

క్రమంగా పనిముట్లు మెరుగు పరచుకొని, బతుకుతెరువు బాగుచేసుకుంటూ వచ్చేడు. ప్రకృతి వైపరీత్యాలను తట్టుకొనడం నేర్చుకున్నాడు. జంతువుల్ని మచ్చిక చేసుకున్నాడు. వ్యవసాయం, చేతిపనులు పెంచుకున్నాడు. వస్తువుల తయ్యారీలో కొత్తకొత్త మార్గాలు కనిపెట్టేడు. తనకు పోను మిగిలింది ఇతరులకు ఇచ్చిపుచ్చుకోడం ప్రారంభించేడు. రాయడం, చదవడం నేర్చుకున్నాడు. జ్ఞానం పెంచుకున్నాడు. కళలు, శాస్త్రాలు వృద్ధి పొందించేడు.

మానవజాతి పరిణామక్రమాన్ని ఒకగంట సినిమాగా తీస్తే, అందులో 59 నిమిషాలు ఆదిమ దశ నుంచి పైకి పెరగడానికే సరిపడుతుంది. నాగరిక మానవ జీవితం యావత్తూ ఒక్క నిమిషంలో గడిచి పోతుంది. యంత్రయుగం నుంచి ఈనాటి వరకు వచ్చిన అభివృద్ధి

ఒకటిన్నర సెకండ్లకన్న వుండదన్నాడు హైమైన్ లేవీ తన "సోషల్ థింకింగ్" అనే పుస్తకంలో.

ఈ దశలు క్రమోత్తరంగా అల్పాల్ప కాలంలోనే మారిపోతూండడం గమనించాలి. ప్రతిదశ అంతక్రితం దానికన్న ప్రత్యేకత, విశిష్టత కలిగి వుంటుంది. విజ్ఞానాభివృద్ధి, దానిని క్రియారూపంలోకి తేవడమూ అంతకంత కధికవేగంతో సాగుతాయి.

ఈ దశలో అతి దీర్ఘమయిన మొదటిదశ స్వభావం ఈనాడు ఆంధ్రప్రదేశ్‌గా గుర్తించే మండలంలో ఏ రీతిగా వుండిందో ముందు పరిశీలిద్దాం.

## పాత శిలాయుగం

లక్షల సంవత్సరాల క్రితం మనుష్యుడు ఎట్లా బతికేడో తెలుసుకోడానికి రెండు మార్గాలున్నాయి. ఇప్పటికీ కొన్ని ప్రాంతాలలో ఆదిమానవుని దగ్గరి వారసులనదగిన వారున్నారు. మనం వారిని కొండజాతులంటాం. వారి ఆచారాలూ అలవాట్లూ పరిశీలించడం మొదటి విధం. "గతాన్ని తవ్వితీసే" పద్ధతి రెండోది. ఇందులో రెండోదాన్ని ఈ ప్రకరణంలో పరిశీలించి, మొదటిదాన్ని రెండో ప్రకరణానికి వాయిదా వేద్దాం.

మన పూర్వీకులైన ఆదిమకాలపు ప్రజ వ్రాత పూర్వకంగా ఏమీ మిగిల్చి పోకపోయినా, తమకాలపు పనిముట్లు, ఆయుధాలు, ఎముకలు, ఆభరణాలు, బొమ్మలు, నిత్య జీవితంలో వాడినవీ, కర్మకాండలకుపయోగించినవీ అనేక రకాల వస్తువులు వదిలిపోయారు. కర్రతో చేసినవైతే మన్నయిపోయాయి. మన్నుతో చేసినవి పగిలిపోయినా కనిపించేయి. ఇంక రాతితో చేసినవీ, అక్కడక్కడ లోహపు వస్తువులూ దొరికేయి. భూమి పొరలను జాగ్రత్తగా తవ్వి శాస్త్రవేత్తలు ఆ వస్తువులను పైకి తీశారు. వాటినిబట్టి ఆనాటి ప్రజలు ఏ విధంగా జీవించేవారో, ఏ పనులు చేసుకొనేవారో వారి ఆచారాలూ, అలవాట్లు ఏమిటో, వాళ్ళ విశ్వాసాలెటువంటివో చెప్పేరు. ఒక దశలో వాడిన పరికరాలను తరువాతి దశలోనివాటితో పోలిస్తే వారి జీవిత పద్ధతులలో వచ్చిన మార్పుల్ని తెలుసుకోవచ్చు. ఇటువంటి వస్తువుల ఆధారంగా ప్రజా జీవితాన్ని పరిశోధించే విజ్ఞానాన్ని పురావస్తు శాస్త్రం–ఆర్కియాలజీ– అంటారు.

మనుష్యులు లిపిని కనిపెట్టి, రాయడం చదవడం నేర్చాక, తమతమ కాలపు ఘటనలను తమతమ భాషలలో వర్ణిస్తూ వచ్చారు. ఈ మాదిరిగా వ్రాసిన సమాచారాన్నిబట్టి చరిత్రలు కూర్చేరు. ఇక్కడి నుంచే మనం చరిత్రయుగం అంటున్నాం. అంతకు పూర్వపుది చరిత్ర పూర్వయుగం అయింది.

భారతదేశంలో ఈ పురావస్తు శాస్త్రం 19వ శతాబ్దపు చతుర్థపాదంలో ప్రారంభమయింది. ఎందరో ప్రముఖులైన బ్రిటిషు, భారతీయ పురాతత్వవేత్తలు ఈ విజ్ఞానం అభివృద్ధి పొందడానికి ఎంతో తోడ్పడ్డారు. వారిలో పెక్కుమంది దక్షిణ భారతదేశపు చరిత్ర పూర్వయుగాన్ని మూడు అంతరువులుగా విభజించేరు: పాతశిలాయుగం (పాలియోలిథిక్), కొత్త శిలాయుగం (నియోలిథిక్), ఇనుము యుగం. ఉత్తరభారత దేశంలోనూ, ఇంకా అనేక దేశాలలోనూ కొత్తశిలాయుగానికీ, ఇనుము యుగానికీ మధ్య కంచుయుగం ఒకటుంది. కాని, అది దక్షిణ భారతంలో కనబడదు. అయితే పురావస్తు శాస్త్రం అభివృద్ధిచెంది, కొత్తకొత్తవస్తువులు దొరికినకొద్దీ చరిత్ర పూర్వయుగాన్ని వేర్వేరు శాస్త్రవేత్తలు వేర్వేరు విధాలుగా విభజిస్తూ వచ్చేరు. ఉదాహరణకి, రాబర్ట్ బ్రూస్ పుట్ అనే సువిఖ్యాత శాస్త్రవేత్త దక్షిణ భారతదేశములో చరిత్ర పూర్వయుగాన్ని పాత శిలాయుగం,



కొత్త శిలాయుగం, ఇనుము శిలాయుగపు పూర్వ ఉత్తరయుగాలు అంటూ నాలుగు విభాగాలు చేశాడు. హెచ్.డి. సంకాలియా, బి. సుబ్బారావు, తదితర ప్రముఖులు రెండు శిలాయుగాల్ని నాలుగుగా విభజించేరు. ఆద్యశిలాయుగం, మధ్యమ శిలాయుగం, ఉత్తర శిలాయుగం, నూతన శిలాయుగం అన్నారు. పనిముట్లు, ఆయుధాలు చేసుకోవడంలో వుపయోగించిన వస్తువుల్ని బట్టి ఈ విభజనలు జరిగాయి. నేను మాత్రం – పాత, కొత్త శిలాయుగాల్ను, ఇనుము యుగం– మూడుగా చేసిన విభజననే అనుసరించదలిచాను. ఏమంటే, మానవుని ఆలోచనలు, జీవిత పద్ధతులలో ఈ యుగాలు విప్లవాత్మకములైన గుణాత్మక పరివర్తనలను తేవడం చూస్తాం.

మన పురాతత్వవేత్తలు అంతకంతకు లోతుగా తవ్వుకుంటూపోయి, కొత్త కొత్త వస్తువుల్ని వెలికి తీయడమే కాదు. అవి యెంత పూర్వకాలపువో కూడా నిర్ధారణ చేస్తున్నారు. ఉదాహరణకు, సంకాలియా దక్షిణభారత దేశంలో ఆద్యశిలాయుగం క్రీస్తుపూర్వం 1,50,000 సంవత్సరాల నాటిదనీ, మధ్యశిలాయుగం క్రీస్తు పూర్వం 25,000 ఏళ్ళనాటిదనీ అన్నారు. కర్నూలుజిల్లా ప్రాంతాలలో ఉత్తర శిలాయుగం క్రీస్తుపూర్వం 5000 ఏళ్ళనాడు వుందన్నారు. ఆంధ్ర, కర్నాటక ప్రాంతాలలో కొత్త శిలాయుగం క్రీస్తుపూర్వం 2500 ఏళ్ళనాడు ఆరంభమయిందన్నారు.

పురాతత్వ విజ్ఞానపు సాక్ష్యాధారాల్నీ, ఆంధ్రప్రాంతంలోని కొన్ని కొండజాతుల వారిలో మిగిలివున్న కొన్ని సంప్రదాయాల్నీ ఆధారం చేసుకొని పాతశిలాయుగంనాడు మన పూర్వుల జీవితం ఎలా ఉండేదో స్థూలంగా వివరిస్తాను.

మానవుడు ప్రధానంగా పరికరాలు నిర్మించుకొనే స్వభావంగల జీవి. ఇతర జీవులకన్న అతనికిగల ప్రత్యేకత ఇదే. కోతులు ఏ కాయనేనా పగలకొట్టవలసి వస్తే రాళ్ళనుపయోగిస్తాయి. దూరానవున్న వస్తువును దగ్గరకు లాగుకొనడానికి కర్రనుపయోగిస్తాయి. అంతవరకే. కొత్తవి సృష్టించలేవు. కాని మానవుడు రాయి, ఎముక, కర్రతో పరికరాలను కల్పించుకోగలడు. బండరాయికన్న మలచినరాయి ఎక్కువ వుపయోగంగా వుంటుందని కనిపెట్టేక, అతడు తనకు కావలసిన రూపంలోకీ, ప్రమాణంలోకీ రాతిని చెక్కడం ప్రారంభించేడు. అతని పనికి ప్రకృతి కూడా సాయం చేసింది. దక్కను పీఠభూమి రాతియుగపు మానవునికి అత్యనుకూల ప్రదేశం అనవచ్చునంటారు సంకాలియా. ఇక్కడ నేల హిమాలయాలకన్నా పూర్వపుది. ఇక్కడి రాతిపొరలు కొన్ని అత్యంత ప్రాచీనాలు. ఇక్కడి వాతావరణం ఈనాడున్న దానికన్న చాల వేడిగా వుండేది. విపరీతమైన వర్షాలు కురిసేవి. నదులూ వాగులూ ఎంతెంతో మేర నాక్రమించి పారేవి. అధిక వర్షాలు, ఎండలు ఒకదానివెంట వొకటి వుండడం వలన లాటెరైట్ అనేరకం రాయి ఏర్పడి, పోగుపడడానికి కారణం అయింది. ఈ రాయి పరికరాలూ, ఆయుధాలూ చెయ్యడానికెంతో వుపయోగకరం.

పాతశిలాయుగపు పరికరాలలో హెచ్చుభాగం స్ఫటికశిల (క్వార్ట్‌జైట్) తో చేసినవే. దక్షిణభారతదేశంలో అతి ప్రాచుర్యంగా దొరికే రాయి అది. పాలార్ నదికి ఉత్తరానా, పాలార్ నదికి దక్షిణానా ఇది అంతగా దొరకదు. బళ్ళారి జిల్లాలో అసలే దొరకదు. ఈ మండలాలలో దొరికిన పాతశిలాయుగపు పనిముట్లు షింగిల్, హెమటైట్, లేకుంటే సిలికాన్, లైమ్‌స్టోన్‌తో చేసినవే. క్వార్ట్‌జైట్ తరువాత ఈ శిలలే శ్రేష్ఠం.

పాతశిలాయుగంలో ఒకే పనిముట్టును అనేక పనుల కుపయోగించేవారు. ఒక్కొక్కపని

కొకరకం పనిముట్టు ఆనాటికి తయారు కాలేదు. పెద్ద బరువైన రాళ్ళని కందా బందాగా మలచేవారు. పెద్దపులిని చంపాలన్నా అదే; చెట్టు కొట్టాలన్నా అదే; నేల తవ్వాలన్నా అదే. ఒక రాయిని తీసుకొని, మరొకదానితో పెచ్చులూడగొట్టి మోటుగా వుండే చేతిగొడ్డళ్ళూ, చీల్చే సాధనాలూ తయారు చేసుకొనేవారు. వాటిని గులకరాతి పనిముట్లు లేక ఫ్లేక్‌టూల్స్ అంటారు. అవి క్వార్‌ట్జైట్ కన్న మేలురకం రాతితో చేసినవి. అంతేకాదు, ఇవి వెనకటి కన్న చాలా చిన్నవేమో, సులభంగా ఎక్కడికేనా పట్టుకుపోవచ్చు. అదేవిధంగా మధ్య రాతియుగంలో గొడ్డళ్ళు, చాకులు, మొదలైన అనేక రకాల పనిముట్లు చేయడం బాగా విస్తరించింది. ఎంతో శ్రద్ధా, పనితనం కనిపిస్తుంది ఆ పనిముట్లు చాలావాటిలో.

బ్రూస్‌ఫుట్ దక్షిణదేశంలో అటువంటి పదిరకాల పనిముట్లను కనుగొన్నాడు. గొడ్డళ్ళు, (కోడిగుడ్డు ఆకారానివి, అదే ఆకృతిలో కొనదేరినవి, పరుపు అంచువి, కొనలు పైకి తిరిగినవి), బల్లేలు (సన్నవ పొడుగైనవి, అడుగు వెడల్పువి), తవ్వుకోలలు, చుట్టూ అంచుతేరిన గుండ్రని పనిముట్లు (విసరడానికి అనుకూలంగా), నరుకుడు పనిముట్లు (కొనదేరిన, గుడ్డు ఆకారంలో పదునైన అంచు గలవి), కత్తులు (సన్నగా పొడుగ్గా వున్న రాతిపెచ్చులు) ఇవన్నీ తలోపనికి వుపయోగపడేటట్లు తీర్చి దిద్దారు.

ఈ పనిముట్లు చుట్టూ పదునైన అంచులుండడం చేత, వీటిని పట్టి చేత్తో వుపయోగించలేరనీ, పిడులలో బిగగొట్టి, గట్టిగా కట్టి, వుపయోగించి వుంటారనీ ఫుట్ భావిస్తున్నారు. అయితే ఆ పిడులుగాని, వానిని కట్టిన వారులుగాని ఎక్కడా కనబడలేదు.

ఈ పనిముట్లు చూస్తే, ఎవరికైనా మన వడ్రంగులుపయోగించే ఉక్కు ఉలులు గుర్తు వస్తాయి. అయితే రాతి పనిముట్లు ఎంతో మెరుగుపడినా, ఆనాటికి కూడా మానవుడు తిండి వెతుక్కునే దశలోనే వున్నాడు. ఇది బహుశా క్రీస్తు పూర్వం 25,000 ఏళ్ళనాటి ఘట్టం.

ఇక్కడి నుంచి మానవుడు తన నైపుణ్యాన్ని బాగా పెంచుకుంటూ వస్తాడు. అతడు చిన్న చిన్న రాతిపనిముట్లు (మైక్రోలిథ్స్) చేయడం ప్రారంభించేడు. అవి చిన్నవేగాని, ఈనాడు మనం లోహాలతో చేసుకొనే పనిముట్లకి తొలిరూపాలు అనుకోవచ్చు. వీనిని పళ్ళు మాదిరిగా కర్రలోనో, ఎముకలోనో బిగించి వుంటారు. వీటిని అనేక పనులకుపయోగించేవారు. బాణం ములుకులుగా వేటకి, బల్లెం ములుకులుగా చేపలవేటకి, పళ్ళ కొడవలిగా కోతకి ఇల్లాగే అనేక పనులలో వుపయోగించేవారు. ఇది పాతశిలాయుగం ఉత్తరదశ. రమారమి క్రీస్తుపూర్వం 5000 సంవత్సరాల మాట.

ఈ మూడు దశలకు చెందిన పాతశిలాయుగపు పనిముట్లు ఇంచుమించు ఆంధ్రప్రదేశ్ జిల్లాలన్నింటిలోనూ, వానిని ఆనుకునివున్న మండలాలలోనూ దొరికాయి. కర్నూలు జిల్లాలో నదులు, వాగులవెంబడి పాతశిలాయుగపు పనిముట్లు ఎన్నో పైపైననే దొరికేయి. గిద్దలూరు వద్ద పదకొండురకాల పనిముట్లు కనిపించేయి. కంబం సమీపంలోని రెండు మూడు నదీలోయలలో స్ఫటికంతో చేసిన, మంచి పనితనం గల పనిముట్లు దొరికాయి.

అనేకచోట్ల ఈ పనిముట్లు వేరు వేరు యుగాలకు చెందిన దిబ్బలలో కలిసిపోయి దొరికేయి. బిలాసర్‌గామ్ గుహలలో పాతశిలాయుగపు ఉత్తరదశకు సంబంధించిన జనావాసాలు దొరికేయి. ఇక్కడ జంతువుల ఎముకలేగాక మెళ్ళో వేసుకొనే దంతహారాలు, కొన్ని వంపుటెముకలు దొరికేయి. కడపజిల్లా రాయచోటి తాలూకాలో సరస్వతి పల్లె, ముక్రావుల



పల్లెలలో, ఇతర తాలూకాలకు చెందిన కనమలపల్లె, చిత్వేల్ కెలసపాడులలో, అనంతపురం జిల్లా గుంతకల్లు స్టేషనుకు నైరూత్యంగా వున్న దిబ్బలో, విదెపనకల్లు కోటలో, వేల్పుమడుగు గుట్టల్లో, లత్తవరం, కరుకుముక్కల, కొత్తకోటకు పడమరగా వున్న మిట్టమీద, ఉరవకొండ గుట్టమీద పాతశిలాయుగపు పనిముట్లు దొరికేయి. నెల్లూరుజిల్లా మానేరు నదీలోయలో వేర్వేరు రకాల స్ఫటిక శిలాపరికరాలు 28 వరకూ ఫుట్‌కు దొరికేయి. ఆయన తరువాత అమెరికన్ బాప్టిస్ట్ మిషన్ తాలూకు ఫ్రాంక్ పి. మాన్లే పెన్నా నదీ పరీవాహ ప్రాంతంలో అనేక పాతశిలాయుగపు పనిముట్లు తీసేడు. ఇక్కడ పాతశిలాయుగపు ప్రథమ ద్వితీయదశల పనిముట్లు ఒకేచోట వేరు వేరు పొరలలో కనిపించేయి, వీనిలో పాతశిలాయుగం మొదటిదశ పనిముట్లు చాలా కొద్ది. తరువాత వచ్చిన చేతిగొడ్డళ్ళు అధిక సంఖ్యలో వున్నాయి. పశ్చిమ ప్రాంతాలలోని కొత్తశిలాయుగం మనుష్యులకు నెల్లూరు దగ్గరలో వుండడం చేత,ం ఇతరత్రాకన్న ఇక్కడ ఆదిమకాలపు పనిముట్లు రమారమి ఉచ్చస్థాయికి వచ్చినవి కనబడుతున్నాయి అన్నారు మాన్‌లే. పాతశిలాయుగం నుంచి చారిత్రక కాలం వరకూ అన్ని దశల పనిముట్లూ వరసగా గుంటూరు జిల్లా నాగార్జున కొండవద్ద దొరకడం ఆశ్చర్యం కలిగిస్తుంది. ఇక్కడ నాలుగు చదరపు మైళ్ళ ఆవరణలో ఆరుచోట్ల పనిముట్లు కనిపించాయి. కారెంపూడి వద్ద అటువంటివి అయిదు దొరికేయి. ఖమ్మం జిల్లాలో భద్రాచలానికి 40 మైళ్ళ దూరంలో 35 రకాల పనిముట్లు అంతా 50 గజాల మేరలో దొరికేయి. ఇక్కడ పాతశిలాయుగపు పనిముట్లు తయారు చేస్తూండి వుంటారంటారు, కాగ్గిస్ బౌన్. ఆదిలాబాదు జిల్లాలో ప్రొఫెసర్ హైమన్‌డార్ఫ్ వాదరలూ, కోరాలూ ఎన్నో పోగుచేశారు. కృష్ణాజిల్లాలో పాతశిలాయుగపు పనిముట్లు ఎన్నో దొరకలేదు. నందిగామకు పడమరగా 10 మైళ్ళలో వున్న ఊస్తపల్లిలో గోధుమరంగు స్ఫటిక శిలతో చేసిన వెడల్పయిన పనిముట్టు ఒకటి కనిపించింది. బళ్ళారి జిల్లా సంగనకల్ వద్ద మధ్య శిలాయుగపు పనిముట్లున్న నేలపొరకూ, పశువుల పెంపకం, వ్యవసాయం ప్రారంభమైన కొత్తశిలాయుగపు పొరకూ మధ్య మైక్రోలిథ్స్ దొరికేయి.

పాతశిలాయుగపు మనిషి తయారుచేసిన వేరు వేరు రకాల పనిముట్లు పరిశీలిస్తే, తన పనిముట్లు మెరుగు పరచుకోడానికి ఆద్యకాలపు మానవునికి వేలూ, లక్షలూ ఏళ్ళు పట్టిందని అర్థం అవుతుంది. "పాతశిలాయుగపు పనిముట్ల అంచుల పదును చూస్తే వారు మంచి హస్త నైపుణ్యం సంపాదించారనే తోస్తుంది. ఒక్క దెబ్బతో పెచ్చు ఊడగొడితే తప్ప అంత వాడి అంచుకి రాదు" అంటారు పి.టి. శ్రీనివాస అయ్యంగారు. ("భారతదేశంలో రాతియుగం")

మన ఆద్య పితరుల జీవితం గురించి – పర్వత ప్రాంతాలలో గాని, కీకారణ్యాలలోగాని పాతశిలాయుగపు జనావాసాలు మచ్చుకి కూడా దొరకలేదు. అందుచేత వారు అటువంటి ప్రదేశాలకు పోకుండా అనుకూలమైన రాళ్ళు దొరికే నదీ తీరాలలోనూ వాగుల వొడ్డునా నివసిస్తూండి వుండాలి. ఎక్కడా ఇళ్ళలాంటివీ, వూళ్ళ వంటివీ, దొరకలేదు. దొరికిన రాతి పనిముట్లనుబట్టి వారు రాళ్ళతోనే మదుగులు ఏర్పరచుకొని వుంటారనుకోవాలి. రాతి పనిముట్లకు తోడు వారు కర్రపనిముట్లు కూడా వాడి వుండాలి. రాతి పనిముట్లే తప్ప వేరు లేకపోతే అడవి జంతువుల నుంచి రక్షణ దుర్ఘటమే అవుతుంది. మన ప్రాంతపు చిట్టడవుల్లో చాలా గట్టిరకం కర్ర దొరుకుతుంది. దానితో మంచి ఆయుధాలే తయారు చేసుకొని వుంటారు. కొనదేలిన బల్లేలు, మంచి దుడ్డు కర్రలు తయారు చేసుకుని వుంటారు.

ఆయుధాలుగా ఎముకల్ని కూడా విస్తారంగానే వుపయోగించి ఉంటారు. కాయలు, దుంపలు, జంతుమాంసం వారి ప్రధానాహారం. వృక్షోత్పత్తులు అన్ని కాలాల్లోనూ లభించవు. కనక వేటాడడం అవసరమే అవుతుంది. మంచి పదునైన వాదరలు చాలా చోట్ల దొరికేయి. వాటిని మాంసం నరికేందుకే వుపయోగించి వుంటారు. చెట్లనారలు, జంతు చర్మాలు దుస్తులకుపయోగ పడ్డాయి. ఈనాటికి కూడా కొన్ని కుటుంబాలలో నారబట్టలూ, పులి, లేడి చర్మాలూ పవిత్రంగా భావించబడుతున్నాయి. మనది ఉష్ణదేశం గనక మన పూర్వులు చలికీ, వానకీ రక్షణగా అప్పుడప్పుడు ఉపయోగించేందుకు తప్ప విశేషంగా దుస్తులు వాడడం జరిగి వుండదు.

పాతశిలాయుగపు మానవునికి కుండలు చేయడం తెలియదు. పశుపాలనా, వ్యవసాయం నేర్చుకొన్నాక కొత్తశిలాయుగపు దశలో మనిషికి మట్టిపాత్రలు అవసరమయ్యాయి. ఆ దశలో, అంత్యక్రియల సందర్భంగా కూడా మనిషిమట్టిపాత్రలు ఎక్కువగా వాడేడు. ఈ రెండు ఘటనలతో మనిషి ఒక్కొక్క ప్రదేశానికి అంటి పెట్టుకొని వుండడం కూడా వచ్చింది. పాతరాతియుగపు మనిషి చనిపోయిన వారి శరీరాలను వదిలేసిపోయి వుంటాడు. తరవాత ఎన్నో శతాబ్దాలవరకు ఇదే ఆచారంగా కొనసాగింది. పరోత్పసులు (మృతకళేబరాలను వదిలేసేవారు), ఉద్దితులు(కళేబరాలను ఎత్తయిన చోట్ల దాచేవారు) అంటూ వైదిక సాహిత్యంలో మాటలు కనిపిస్తాయి. 7వ శతాబ్దంలో మనదేశం వచ్చిన చైనా యాత్రికుడు హ్యుయెన్‌త్సాంగ్ మధ్యదేశంలో మరో మూడో పద్ధతి కూడా "అడవిలో పాతిపెట్టడం" – వుందని వ్రాసేడు.

మన పూర్వీకులకు నిప్పు చేయడం తెలిసి వుంటుంది. అయితే ఒక్క కర్నూలు జిల్లాలోని బిల్లసర్గం గుహలలో తప్ప దీనికి సాక్ష్యాధారం దొరకడం లేదు. పాతశిలాయుగపు గుహలను సరిగ్గా ఇంతవరకు అన్వేషించకపోవడమే ఈ రుజువులు దొరక్కపోవడానికి కారణం.

పాతశిలాయుగపు మనిషి అడవి జంతువులకి భయపడ్డట్టే చాలాకాలం నిప్పుకూ భయపడి వుంటాడు. అడవుల్లో ఎప్పుడేనా మంట పుట్టిందా ప్రాణభయంతో పరుగెత్తవలసిందే. శీతాకాలంలో నిప్పు వెచ్చదనం కలిగిస్తుందనీ, మంటకు అడవి జంతువులు భయపడతాయనీ, చీకట్లో మంటలు వెలుతురునిస్తాయనీ క్రమంగా గ్రహించి వుంటారు. ముఖ్యంగా నిప్పుల్లో కాల్చిన మాంసమూ, దుంపలూ సులభంగా జీర్ణం అవుతాయి. ఇది గ్రహించాక అడివి మంట నుంచి ఏ పొలకర్రనో కాగడాలుగా వెలిగించి వుపయోగించి వుంటారు. తరవాత తామే నిప్పు చేయడం దానిని దాచడం, నేర్చుకుని వుంటారు. నిప్పును అదుపులోకి తెచ్చుకోవడం అంటే ఒక ప్రకృతి శక్తిని అదుపులో పెట్టుకోవడమే. క్రమంగా రెండు కర్రలను రాపాడించి నిప్పు చేయడం తెలుసుకొన్నారు. అందుకు ప్రత్యేకించి పనిముట్లు చేసుకొన్నారు. దీనికి సంస్కృతం పేరు ఆరణి. ఆ విధంగా రాపిడికి నిప్పు పుట్టించడం ప్రాచీన మానవుడికి శూన్యంలోంచి ఒక మహాశక్తిని ఉద్భవింప చేసినట్లుగా మహోత్సాహం కలిగించి వుంటుంది. క్రమంగా అగ్నిని భయభక్తులతో కొలవడం, దానిని దైవమిచ్చిన వరంగా భావించడం ప్రారంభమయింది.

కర్రలు రాపాడించి నిప్పు చేయడమనే ఈ ప్రాచీన పద్ధతిని ఇప్పటికీ కొన్ని ఛాందస బ్రాహ్మణ కుటుంబాలు యజ్ఞకర్మలలోనూ, అంత్యక్రియలలోనూ ఆచరిస్తుంటారు. మా మామగారు యజ్ఞం చేసినప్పుడు ఈ విధంగానే నిప్పు చేశారు. ఆయన చనిపోయినపుడు దహనక్రియకు నిప్పును ఈ పద్ధతిలోనే సృష్టించేరు. ఆయన పితృవ్యుడు మరణించినప్పుడు ఈ పద్ధతిలో నిప్పు త్వరగా పడలేదు. ఫలితంగా ఆయన శరీరాన్ని దహనం చేయకుండా 24



గంటలు ఉంచవలసి వచ్చింది. అప్పటికి శరీరం వాసన కూడా పట్టింది. ఆర్థిక వ్యవస్థ మారినా అలవాట్లు ఓ పట్టాన మారవనడానికి ఇదొక వుదాహరణ.

పాతశిలాయుగపు ఉత్తరదశలో మానవులు తమ భుజశక్తికి సహాయంగా విల్లు–అంబులు కనుగొన్నారు. "మనుష్యుడు కనుక్కున్న మొదటి యంత్రం విల్లేనేమో" అంటాడు వి గార్డన్ చైల్డ్ తన "మేన్ మేక్స్ హింసెల్ఫ్"లో.

ప్రత్యక్షసాక్ష్యం అంటూ దొరక్కపోయినా, వివిధ పనిముట్ల తయారీలో కనబడుతున్న నేర్పరితనాన్ని బట్టీ, అతడు నివసించిన ప్రదేశాలలో గట్టి కలప దండిగా దొరుకుతుండడాన్ని బట్టీ పాతశిలాయుగపు ఉత్తరదశలో మనిషివిల్లంబులను విశేషంగానే వుపయోగించాడనుకోవచ్చు.

నిప్పు వేయడం విల్లంబుల నుపయోగించడం నేర్చినా ఈ దశలోని మానవుడు ఆహారాన్ని సేకరించుకొనేవాడుగానే చెప్పాలి. అతడాహారాన్ని ఉత్పత్తి చేసుకొనేవాడనలేము, ప్రధానంగా ప్రకృతిలో లభ్యమవుతున్నదానిమీదనే అతడు ఆధారపడ్డాడు.

పెద్ద అడవి జంతువుల వేటకోసం సహజ కుటుంబానికి మించిన పెద్దకూటం సహకరించుకోవలసిన అవసరం ఏర్పడింది. ఆ రోజుల్లో రక్త సంబంధం ఆధారంగా ఆదిమ సామాజిక నిర్మాణం ఏర్పడి వుండాలి. ప్రతి జట్టూ, కుదురూ స్వయంపూర్ణంగా వుండేది. ఆనాటి ఆహారం నిలువ చేయడానికి అనువైనది కాదు. తినెయ్యవలసిందే. అదనంగా ఏమన్నా ఆహారం వుంటే, అవసరం వున్నవాళ్ళు ఉపయోగించేసేవారు. ఆశపోతుతనంతో ఇతరులను కాదని దాచుకొనేందుకు అవకాశమే లేదు. అందరూ కలిసి, అందరికోసమూ పనిచెయ్యాలన్నది ఆనాటి నియమం. ఉత్పత్తి సాధనాల మీద వ్యక్తి యాజమాన్యం తలెత్తే అవకాశం లేదు. అన్నీ అందరివీ. ఉమ్మడిగా వుపయోగించుకొనేవీలు, వర్గాలు లేవు. వర్గదోపిడి లేదు. ఏదో వర్గాన్నో వర్గాలనో తొక్కిపట్టి వుంచేందుకు ప్రభుత్వ యంత్రాంగమూ లేదు. దీనినే ఆదిమ కమ్యూనిజం అంటారు. అతి ప్రాథమిక దశలో వున్న వుత్పత్తి సాధనాలకు సరిపడే సామాజిక వ్యవస్థ ఇది. దీనిని ఉత్తమ సామాజిక వ్యవస్థగా భావించలేము. ఆహార సేకరణతో జీవించే గుంపులలో సభ్యుల సంఖ్య పరిసరాలనుబట్టి పరిమితమై వుంటుంది.

అటువంటి పరిస్థితులలో ప్రతి కుదురూ ఒకే తరహా ఆహారం మీద – ఒక జంతువో, పక్షో, చేపో, దుంపో వగైరా ఆధారపడి జీవిస్తుంది. భిన్నాహార పదార్థాలను వుపయోగించే జట్లు వారికి రక్త బంధువులు కారు. మొదటి రోజుల్లో అటువంటి వారిని మానవులుగానే చూసేవారు కాదు. ఆ విధంగా జట్టు తన ఆహారంగా వుపయోగించే పదార్థం ఆ జట్టు వారి దేవత – టోటెమ్. దాని నాశ్రయించి కొన్ని నమ్మకాలు, కర్మకాండలు, ఆ కర్మకాండ నడిపితే తమకు తిండి బాగా దొరుకుతుందనీ, చిరజీవనం వుంటుందనీ, యుద్ధాలలో విజయం తథ్యమనీ కొన్ని నమ్మకాలుండేవి. ఆ కర్మకాండలో కుదురు యావత్తూ పాల్గొనేది. అది భద్రతా భావాన్ని పెంచేది. బాధల భయాన్ని తగ్గించేది. ఆహార సమృద్ధికోసం మొదట మనుష్య బలులూ, తర్వాత జంతుబలులూ వచ్చేయి.

ఇదంతా ఇల్లా వుండేదనడానికి మనకి ప్రత్యక్ష సాక్ష్యం ఏమీ లేదు. ఈవేళటి కొండజాతులవారి జీవితాల నుంచి వూహించవచ్చు. అలాగే తమ పూర్వుల ఆచారాలను అనుసరించిన ఆర్యుల మత ఆచారాలను బట్టి కూడా వూహించగలుగుతాం. వైదిక సాహిత్యంలో నరమేధం, అశ్వమేధం మొదలైన మనుష్యబలులూ, జంతుబలుల వర్ణనలు వివరంగా కనిపిస్తాయి.

ఋగ్వేదంలో మహిషబలుల ప్రసక్తి కూడా వుంది. పాతరాతియుగ దశలో వివాహ వ్యవస్థ లేదనుకోవచ్చు. స్త్రీ పురుష సంబంధాలు అనియతంగా వుండేవి. వేరు వేరు కుదురుల వారి మధ్య వివాహాలు తర్వాత తర్వాత వచ్చినవే.

వేర్వేరు కుదురుల జనాన్ని సన్నిహిత పరిచినది ప్రధానంగా ఉత్పత్తి సంబంధాలు. అదనంగా లభించిన ఆహారాన్ని ఇతర కుదురుల వారికి బహుమతిగా ఇచ్చేవారు. ఈ ఇచ్చిపుచ్చుకోడాలు క్రమంగా స్త్రీ పురుషులను ఇచ్చి పుచ్చుకొనేటందుకు దారి తీసింది. ఆ మాదిరిగా ఒక రకం వివాహ పద్ధతి ఆచరణలోనికి వచ్చింది. ఈ మాదిరి వేర్వేరు కుదురులవారి మధ్య జరిగిన వివాహాల సంతానం దృఢతరంగా వుంటారు. మంచి ఆహారం, వేర్వేరు రకాల ఆహారాలు, పని పద్ధతులు మెరుగు పడడం క్రమక్రమంగా వచ్చేయి.

ప్రాథమిక దశలో భాష అస్పష్ట భావప్రకటన సాధనంగానే వచ్చినా, క్రమంగా ఇతరేతరులతోడి సంపర్కంతో సంపన్నం అవుతూ వచ్చింది.

ఈ పరస్పర సంబంధాల పర్యవసానంగా కుదురులోనివారు తమ కులదేవత అయిన జీవాన్ని చంపడం, తినడం వంటివానికి నిషేధాలు వచ్చేయి. అవి క్రమంగా కుదురులోనివారి దాంపత్య సంబంధాలకి కూడా వర్తింపజేసేరు. ఈనాడు కూడా సగోత్ర వివాహ నిషేధం అన్ని కులాలవారిలోనూ వుంది.

ఇల్లాంటి కుదురులు చాలా కలిసి తెగగా ఏర్పడతాయి. ప్రతి తెగకీ ఒక పెద్ద, ఆచారాలూ, సంప్రదాయాలూ ప్రతి తెగగకూ ప్రత్యేకం; తెగతెగకూ వేర్వేరు భాషలు కూడా రూపొందేయి.

భాష అనేది మనుష్యుని ప్రత్యేక లక్షణం, సమాజ సంభూతమున్నూ. సామాజికోత్పత్తి గతిక్రమంలో అది పుడుతుంది. మనుష్యులు తమ కార్యకలాపాలను సమన్వయ పరచుకొనేందుకది ఒక సాధనం. అది వారి పరిజ్ఞానాన్ని పెంచుతుంది. మనిషికి చైతన్యం ఏర్పడడంలో భాష ప్రధానపాత్రను నిర్వహించింది. ప్రాచీన కాలంలో ప్రజలు పనిచేసుకొనేటప్పుడు ఎన్నో గుర్తు పెట్టుకోవలసి వుంటుంది. ఎంతో ఆలోచించవలసి వుంటుంది. సమాన సమస్యల నొకరితో ఒకరు ఎంతో చర్చించుకోవలసి వుంటుంది, ఒకరొకరి అభిప్రాయాలను తెలుసుకొనేందుకు భాష తప్పక అవసరమే. అయితే అతి ప్రాథమిక దశలో భాష ఎట్లా ఉండేదో తెలుసుకోటానికి తగిన సాధనాలు లేవు. భాషకు జంతువుల శరీరాలకు లాగా శిలాముద్రలు దొరకవు. ఈనాటి ఆటవిక సమాజాలను బట్టి కూడా ఊహించడం కష్టం. ఎందుకంటే నాగరికత విషయంలో ఎంత వెనకబడి వున్నా, భాష విషయంలో 'వెనకబడ్డ' సమాజాలు లేవు. అంతేగాక, ఒకోసారి కొన్ని 'ఆటవిక' భాషల్లో 'నాగరిక భాష'ల కన్నా క్లిష్టమైన వ్యాకరణాంశాలను పరిశోధకులు గమనించారు.

భాష పుట్టుక గురించి పరిశోధకుల్లో చాలా అభిప్రాయాలున్నై. భాష ధ్వన్యనుకరణ శబ్దాల నుంచి పుట్టిందని పూర్వం నమ్మేవారు. కాని ప్రతిభాషలోను ఇట్లాంటి శబ్దాలు చాలా కొద్ది. భాష అంటే కేవలం మాటలు కాదు. మాటల అన్వయం – దాన్నే వ్యాకరణం అంటారు – ముఖ్యం. మానవ పరిణామ క్రమంలో మెదడు పరిమాణంలోనూ, నిర్మాణంలోనూ పెరగటం వల్ల భాష ఏర్పడి ఉంటుందని అందరూ ఒప్పుకొంటారు. ఆ ఏర్పడే పద్ధతిని బట్టి హఠాత్సంభవ వాదులూ, క్రమ పరిణామ వాదులూ అని రెండు రకాలవాళ్ళున్నారు. వీటి సత్యాసత్యాలను నిర్ణయించడం కష్టం.



జంతువుల అరుపుల్లాంటివి కొంత అధిక సంఖ్యలో జంతు–మానవసంధి దశలో ఉండి ఉండవచ్చు. ఆ అరుపుల్లో సామ్య, భేదాలను గుర్తించే శక్తి ఏర్పడ్డ తర్వాత వాటి భాగాల కూర్పుల చేర్పుల ద్వారా కొత్త మాటలు ఏర్పడి ఉండవచ్చు. మానవదశ నాటికి మాటల అన్వయం, వాక్యభేదాలు ఏర్పడి ఉంటాయి. ఇవన్నీ క్రమంగా ఏర్పడటానికి కొన్ని శతాబ్దాలు పట్టి ఉంటుంది.

చిన్నపిల్లలు భాష నేర్చుకొనే పద్ధతి మానవజాతి శతాబ్దుల తరబడి సాధించిన భాషా సంపాదనకు సంక్షిప్త రూపంగా భాషా పరిశోధకులు భావిస్తారు. భాషను మధ్యలో పోగొట్టుకొన్నవారి మీద చేసిన పరిశోధనలవల్ల, మెదడులో భాషాంగాన్ని కూడా గుర్తించగలిగారు. ప్రాచీనకాలపు మనుష్యుల పుర్రెలు పరిశీలించినవారు మెదడులోని భాషాస్థానాల ఉబ్బుదలను చూసేరు.

ఇప్పుడు ప్రత్యక్షసాక్ష్యం దొరక్కపోయినా పాతశిలాయుగం మనుష్యుల జీవితపద్ధతులనుబట్టి వారు భూమిని తల్లిదేవతగా కొలిచేవారని వూహించగలం. ఆ కొలుపులకు ఎంతో కర్మకాండ పెరిగింది. బలులు ఇచ్చేవారు. వైదికమతం పాతుకొని వుండని ప్రాంతాల ప్రజలు ఈనాడు కొలుస్తున్న కాళీమాత పాతశిలాయుగపు ప్రజలు కొలుస్తూ వచ్చిన అసంఖ్యాక దేవతల మూర్తిమంతంగా శ్రీనివాస అయ్యంగారు భావిస్తున్నారు. అనియత స్త్రీ పురుష సంబంధాలూ, గుంపు దాంపత్యాలూ ఆనాడు విధి. ఆ పరిస్థితులలో మాతృస్వామికమే వుంటుంది. మానవ పరిణామ ప్రథమ దశలో తల్లినే గుర్తించగలం. ఆ పరిస్థితులలో మాతృస్వామికం ఏర్పడడమే సహజం. నేటికీ కొన్ని తెగలలో తల్లిహక్కు చెల్లుతుండడాన్నే చూస్తాం. పేచీలూ అవీ వచ్చి గుంపు దాంపత్య పద్ధతి నికృష్టమనే భావం ఏర్పడేవరకూ చిరకాలం మాతృస్వామికమే పరిపాటిగా వుండి వుండాలి. "అయితే ఈ మార్పు తరువాతిదీ, ఆర్థిక అభివృద్ధి ఫలితమూను. వ్యవసాయం నేర్చిన తెగలలో ఏకపతి – పత్నీ పద్ధతి బలపడుతుంది" – అంటారు రామచంద్ర దీక్షితులు తమ "ప్రి హిస్టారిక్ సౌత్ ఇండియా"లో.

వారి కళలను గురించి చెప్తూ ఫుట్ కర్నూలు జిల్లాలోని బిల్లాసర్గమ్ గుహల్లోనే గాక, చెక్కడపు పనులూ, చిత్రలేఖనలూ ఇంకా చాలాచోట్లనే వుండి వుంటాయి అంటున్నారు. ధార్వారు కొండల పశ్చిమపు కొసనా, బళ్ళారిజిల్లాలోని రాయదుర్గం కొండమీదా అనేక ఛాయలలో ఎరుపు, ఆకుపచ్చ, నలుపురాళ్ళు దొరుకుతుండడాన్ని బట్టి ఆయన ఈ విధంగా వూహిస్తున్నారు. ఈనాటి కొండ ప్రజలలోలాగా వారూ చెక్కడపు పనులు చేసి వుంటారు. చిత్రలేఖనం చేసి వుంటారు. గుంపు నాట్యాలు ప్రాచుర్యంలో వుండి వుంటాయి. అవన్నీ కర్మకాండకు సంబంధించినవీ, వేటపద్ధతులను చూపించేవీ కూడ అయివుంటాయి.

పాతశిలాయుగపు అవశేషాలు ఈనాటికీ సమాజంలో కనిపిస్తుంటాయి. ఆంధ్రదేశపు గ్రామాలలో అమ్మవారి కొలుపులు ఈనాటికీ చూస్తుంటాం. ఏటా జాతరలు, బలులు ఇవ్వడం జరుగుతున్నాయి. వివాహ కాలంలో నేటికీ అగ్నిపూజ మన కుటుంబాలలో చాలా పరిపాటి. ఛాందస బ్రాహ్మణులు ఈనాటికీ కఱ్ఱపుల్లకు రాతిబిళ్ళను అమర్చి దానితోనే దంజాలు వాడుకుతారు. వారు లోహపు బిళ్ళలూ, ఇనుప పూసలూ వుపయోగించరు. వృక్షపూజ, కొన్ని ఆహారాల నిషేధం, కొన్ని వస్తువుల వుపయోగానికభ్యంతరం నేటికీ వుంది. మారుమూల ప్రాంతాలలో కొన్ని వుత్సవాల్లో పండుగలలో స్త్రీ పురుష సంబంధాలలో స్వేచ్ఛాచారం నేటికీ కనబడుతుంది.

జనాభా పెరుగుదలకు సంచార జీవనం అనుకూలం కాదు. సంచార జాతులలో పసిపిల్లలో చావులెక్కువ. సహజ ప్రమాదాలు ఎక్కువ, అంటురోగాలెక్కువ. వీని మూలంగా జనాభా పెరగదు. అదీగాక పరికరాలూ, సాధనాలూ చేసుకొనేందుకు పనికివచ్చే శిలలు ప్రతిచోటా దొరకవు. అవి లభ్యం కానిచోట్ల మానవుడు వృద్ధి పొందలేడు. అవి దొరికే ప్రదేశాలు చాలా పరిమితం.

## నూతన శిలాయుగం

దక్షిణభారతంలో పాతశిలాయుగం వెనువెంటనే నూతన శిలాయుగం (నియోలిథిన్) వచ్చేసింది. పాతశిలాయుగపు జనావాసాలు నూతన శిలాయుగంలోకి మారిపోయాయి. పాతశిలాయుగం, నూతన శిలాయుగం, ఇనుము యుగం అనేవి ఒక దానితో ఒకటి సంబంధంలేని ప్రత్యేక కాలాలుగా భావించకూడదు. ఏ దేవతలో బాకావూది సంజ్ఞ చేసే సరికి, చైనా నుంచి పెరూ వరకూ వేటగాళ్ళు ఒక్కమాటుగా తమ వేట పనిముట్లు ఆవలపారేసి పంటలు పండించడం, పశువుల్ని పెంచడం ప్రారంభించేరనుకోకూడదు – అన్నాడు గార్డెన్ చైల్డ్ తన "మేన్ మేక్స్ హిమ్‌సెల్ఫ్" పుస్తకంలో

పాతశిలాయుగకాలంతో పోలిస్తే నూతన శిలాయుగకాలం చాలా స్వల్పం. దాని పరివ్యాప్తి అంతా క్రీస్తుపూర్వం 2500 సం.లా, 900 సం.లా, మధ్యనున్న రమారమి 1500 ఏళ్ళు మాత్రమే. ఈ స్వల్పవ్యవధిలోనే మనుష్యుని జీవితంలో ఎంతో మార్పు వచ్చింది. తిండి వెతుక్కోవడం పోయి, తిండిని ఉత్పత్తి చేయగల వాడయ్యాడు. పశువుల పెంపకం, వ్యవసాయం నేర్చి కొంతవరకు నిలకడ జీవితం ఏర్పడింది. విసరడం, నూనె తియ్యడం, పనిముట్లకు పదును పెట్టడం నేర్చేడు. సరుకుల నిలవలకూ, మతకర్మలకోసం మట్టిపాత్రలు చెయ్యడం ప్రారంభించేడు.

నల్లరాతికొండలున్న ప్రదేశాలలోనే ఈ నాగరికతాంకురాలు తల ఎత్తడం గమనార్హం. కొండ పైనెత్తలలో పెద్దపెద్ద బోళ్ళమధ్య కాస్త చదునుగా వున్న ప్రదేశాలలో మానవుడు తన ఆవాసాలు నిర్మించుకున్నాడు. రమారమి 4–5 వేల సంవత్సరా క్రితం మాట ఇది. రాయచూర్, బళ్ళారి, ఉత్తర ఆర్కాటు, చిత్రదుర్గం మొదలైన జిల్లాలో ఈ మాదిరి ప్రాచీనకాలపు జనావాసాలు కనిపించేయి.

పెద్ద పెద్ద గుట్టలపైన విశాలమైన నివాసస్థలాలు దొరికేవి. కొద్దిపాటి సాలుపులున్నచోట రాళ్ళు పేర్చి, సమచదరపు వేదికలు తయారు చేసుకొని ఇళ్ళు కట్టుకొనేవారు. వారు నిట్రాళ్ళమీద గుండ్రని గుడిసెలు వేసేవారు. చుట్టూ వెదురు పేళ్ళదడులు కట్టి, వానికి పేడా మన్నూ కలిపి మెత్తి గోడలలాగ తయారు చేసేవారు. నేలను రాళ్ళు పరచి అడుసుతో అలికేవారు. ఒక్కొక్క గుడిసెలో 5–6గురు నివసించేవారు. నేటికీ బోయలు అలాగే జీవిస్తున్నారు. ఒక్కొక్క కొండనెత్తంలో సాధారణంగా పది, పదిహేను గుడిసెలుంటాయి. అంటే ఒక్కో జనావాసంలో రమారమి నూరుమంది వరకూ వుంటారనాలి. తెక్కలకోట కొండ మీద వేర్వేరు ఎత్తులలో 20 వరకూ జనావాసాలు కనిపించేయి. అంటే అక్కడ రమారమి 2వేల మంది వరకూ నివసించేరనుకోవచ్చు. మహబూబ్‌నగర్ జిల్లా నుంచి ఉత్తరార్కాటు, సేలం జిల్లాల వరకూనూ, అనంతపురం జిల్లా, కడపలో కొంతవరకూనూ జనావాసాలున్న ఇటువంటి



కొండలు చాలా కనిపిస్తాయి.

నీటి సరఫరాని బట్టీ, కొండదొరువుల్లో పట్టగల వాననీటి పరిమితినిబట్టీ ఈ జనావాసాల సైజు ఆధారపడి వుంటుంది. కొన్ని కొన్ని చోట్ల వేసవిలో కూడ ఎండిపోని జలలు గల దొరువులుంటాయి. సామాన్యంగా శత్రువుల బాణాలకు అందుబాటులో వుండని వీలైనచోట్లనే ఈ దొరువులూ, చెరువులూ తవ్వుకొంటారు.

నూతన శిలాయుగపు ప్రజ అనేకానేక తరహాల పనిముట్లు తయారుచేసుకున్నారు. అవి బాగా పదునుతేరి చాలా అందంగా వుంటాయి. వానిని తయారుచేయడంలో వుపయోగించే రాయి స్వభావం కూడా మారింది. ఇప్పుడు వాడేది స్ఫటికశిల కాదు. అంత గట్టిగానూ వుండే ఒకరకం నాపరాయి నుపయోగించేరు. అది విస్తృతంగా దొరుకుతుంది. సులువుగా పేడు తీయొచ్చు. ఇవిగాక అనేక చిన్న చిన్న వుపయోగాల కోసం విశేషంగా పదును పెట్టడం గాని, అంచు తియ్యటం గాని అవసరం లేని ఎన్నో రకాల పనిముట్లు–అనేక రకాల గొడ్డళ్ళు, గండ్రగొడ్డళ్ళు, ఉలులు సన్నికల్లులు, పాత్రాలు, రోళ్ళు, తిరగళ్ళు, అనేక రంగు రంగుల రాతిపూసలు, పతకాలు, ఆటవస్తువులు, రాతి లింగాలు, తాయెత్తులు, బాణం ములుకులు, చాకులు, రంపాలు, ఇంకా ఎన్నెన్నో ఈ కాలానికి చెందిన పనిముట్లు దొరికేయి.

ఇవిగాక ప్రత్యేకతరహా పనిముట్లు చేయడానికై కొన్ని కొన్ని ప్రత్యేక తరహా రాళ్ళను ఎంతెంత దూరంనుంచో తెచ్చుకొనేవారు. చెకుముకి, సూర్యకాంతపురాయి, పుష్యరాగం మొదలైనవి తిరగలిరాళ్ళకి, సుత్తి దిమ్మలకి వుపయోగించేవారు.

కర్రతో చేసిన ఆనాటి పనిముట్లేవీ దొరకలేదు. అవి ఏనాడో మన్నులో కలిసిపోయి వుంటాయి. గుంతకల్లు రైలుస్టేషను సమీపంలో పుట్‌దొర స్నేహితులొకరికి ఒక కర్రపన్నె దొరికింది. చెదలు దరిచేరడానికి భయపడే వెలుబూడిద పొరతో కప్పడిపోవడంచేత అది మిగిలింది.

ఈ నూతన శిలాయుగపు ప్రజ పశుపోషణ నేర్చుకున్నారన్నాను కదా. ఎడ్లు, ఆవులు, గేదెలు వంటి కొమ్ముజాతి పశువులకి మంచి పచ్చిక వుండాలి. నదీజలాలు ప్రవహించి గడ్డి బాగాపట్టే బీళ్ళలోనూ, చెట్లు దట్టంగాలేని అడవుల్లోనూ అవి బాగా పెరుగుతాయి. గొర్రెలూ, మేకలు వున్నాయంటే అవి తేమలేనిచోట గుట్టలు, కొండల్లో కూడా బాగా వృద్ధి అవుతాయి. గడ్డితినే ఈ జంతువులన్నీ తిండికోసం, నీటికోసం వాగులూ, ఏర్లపక్కనే చేరుతాయి. ఆ జలాశయాలకోసమే వచ్చే క్రూరజంతువులకి అవి ఆహారం. అప్పుడప్పుడు వానలు కడబట్టినప్పుడు మనుష్యుడూ ఆ నీటివనరుల్ని వెతుక్కుంటూ వస్తాడు. ఆ విధంగా నీటి ఎద్దడి వేటగాడినీ, జంతువుల్నీ కూడా ఓ చోటుకి చేరుస్తుంది. ఆ వేటగాడు వ్యవసాయదారుకూడా అయితే, అతడు వాటికి మేత కూడా చూపగలడు. గింజలు కోసుకున్నాక మిగిలిన దుబ్బుల్ని తినడానికి జంతువులు వస్తుంటాయి. మనిషి వాటికి – తన అవసరం కోసమే అయితేనేం – క్రూరమృగాల నుంచి రక్షణ యిస్తాడు. రెండోవేపున ఆ జంతువులు కూడా ఆ రక్షణకు అలవాటుపడి, మనిషికి మాలిమి అవుతాయి.

ఈ "మాంసపుగాదెల్ని" వాడుకోవడంలో మనిషికూడా కొంత నిగ్రహమూ, ఔచిత్యమూ నేర్చుకొంటాడు. పోట్లగొడ్లని వదల్చుకొని సాధువుల్ని అభిమానిస్తూ ఎంపిక చేస్తాడు. వాని సంతానోత్పత్తి కాలాల్ని గమనిస్తాడు. నీరు, తిండి అవసరాలు కనిపెట్టి వుంటాడు. తాను పైరు

వేసినపుడు వాటిని ఎటో తరిమెయ్యడంగాక, గడ్డీ, నీరూ దొరికే భూములకేసి తోలుతాడు. వాటిని క్రూరజంతువుల బారి నుంచి కాపాడేపని చేపడతాడు. ఆ విధంగా గొర్రెల మందలూ, ఆవుల మందలూ మచ్చిక కావడమే కాదు, మనిషి మీద పూర్తిగా ఆధారపడే దశ వచ్చింది.

మొదట ఈ మందలు మాంసానికే వుపయోగపడతాయి. అయితే అవి తిరుగుతూ, మేసిన చోట పంట బాగా వున్నట్లు కనిపెడతాడు. వాని పేడ, పెంట ఎరువుగా వుపయోగించడం నేరుస్తాడు. తరువాత చాలా కాలానికి మనిషికి బాగా తీరుబడిచిక్కి, దూడలు పాలుతాగే అలవాట్లు గమనించినాక గాని పాల వుపయోగం గ్రహించి ఉండడు. ఆ రహస్యం తెలిసినాకే పాలు అతని ముఖ్యాహారాలలో ఒకటయింది. పెట్టుబడి బొర్రి పెట్టకుండా, అంటే జంతువుని చంపకుండా, ఈ ఆహారం లభ్యమవుతుంది. గొర్రెల వున్నితో బట్టలు తయారు చేయడం ఇంకా ఆలస్యంగా నేర్చుకున్న విద్య. పశువుల్ని అరకలకూ, బళ్ళకూ కట్టడం ఇంకా ఆలస్యంగా నేర్చుకున్నది. ఆఖరుగా, మనిషి వాటిని చెలామణీ ద్రవ్యంగా కూడా వుపయోగించేడు.

పశుపోషణలో మనిషిస్థిరావాసం ఏర్పరచుకోలేడు. వానికి మేత, నీరు దొరకడం కోసం అతడు మకాములు మార్చవలసి వుంటుంది. ఇండో – ఆర్యను తెగల సంచార జీవితమే ఇందుకు ఉదాహరణ.

పశుపోషణతో పాటే మనిషి వ్యవసాయమూ నేర్చేడు. అయితే అది ప్రారంభంలో పోడు వ్యవసాయంగానే వుండేది. అడవిలో కొంతమేర చెట్లుకొట్టి, అక్కడ వాటిని తగల పెట్టడం, ఆ విధంగా తెరిపి అయిన మేరలో కర్రతోనో, పంటికర్రతోనో నేలను గుద్దలించి (తవ్వి) విత్తనాలు చల్లడం, వర్షాలు వెనకబట్టేక కోసుకోవడం సాధారణంగా రెండు మూడు పంటలతో ఆ నేల నిస్సారం అవుతుంది. అప్పుడు మరో చోట పోడుకొట్టడం దగ్గరలో వున్న భూమి ఆ మాదిరిగా నిస్సారం అయాక మకాం ఎత్తేసి కొత్తచోట్లు వెతుక్కుంటూ పోతాడు. ఆ విధంగా పశుపాలకుడుగానే కాదు, పోడు వ్యవసాయదారుగా కూడ మానవుడు సంచార జీవితమే గడిపేడు. అయితేనేం ఈ ఆహారోత్పాదక జీవిత వ్యవస్థ ఇంచుమించు సుస్థిర నివాస జీవితానికే దారి తీస్తుంది. వేటగానికి బతుకు విధించిన పరిమితులు విచ్ఛిన్నమవుతాయి. జనాభా త్వరగా పెరుగుతుంది. దానితోపాటే ఆహారోత్పత్తీను. తినేవాళ్ళున్నప్పుడు చేసేవాళ్ళూ వుంటారు.

నూతన శిలాయుగ మానవుని బతుకు పద్ధతుల్ని తెలుసుకోవాలంటే, పశుపాలనను, వ్యవసాయాన్ని కలిపే చూడవలసి వుంటుంది. మంద చిన్నదిగానే వున్నప్పుడు మనిషి పెద్దగా కదలనక్కర్లేదు. అయితే మంద ఒక పరిమితిని మించి పెరిగితే, గడ్డిబీళ్ళు పెంచడానికి అడవిని ఖాళీ చేయవలసి వస్తుంది. పశుగ్రాసం కోసం ప్రత్యేక తరహా పంటలు వేయవలసి వస్తుంది. ఈ ప్రయత్నంలో అంతవరకూ అడవులకి దూరంగా వుంటున్న మనిషి పనికట్టుకుని అడవుల్ని తెరిపి చెయ్యవలసి వచ్చింది. ఇంక జనాభా పెరుగుదలతో తెగలో కొందరు పశుపాలన, కొందరు వ్యవసాయం చేబట్టి వానిమీద కేంద్రీకరించి పనిచేస్తారు. ఆ విధంగా గుంపులమధ్యా, తెగలమధ్యా వస్తుమార్పిడి తప్పనిసరి అవుతుంది.

ఆహారోత్పత్తి పద్ధతి వచ్చి ఒక్కమారుగా ఆహార సేకరణ పద్ధతి అంతమై పోయిందనుకోకూడదు. వేటమీదనే బతికే తెగలు మొదట ఒక సహాయక వృత్తిగానే పశువుల్ని పెంచడం, వ్యవసాయం చేశారు. తరువాత పశుపాలన, వ్యవసాయం బాగా విస్తరించి వేట ఒక ఉపాంగం, వినోదం అయింది. ఈ మార్పుని అందుకోకుండా పాత అలవాట్లనే అంటిపెట్టుకొని



వున్నవాళ్ళు, మిగిలిన వాళ్ళకి దూరంగా వేటతో జీవిస్తూ వుండిపోయారు.

అతి ప్రాథమిక దశలో కూడ ఆహారోత్పత్తి విధానం నిలవల్ని సృష్టిస్తుంది. అంతకు పూర్వం ఆ అవకాశం లేదు. ప్రతి ఏటా పండిన దాంట్లో కొంత జాగ్రత్త పెట్టగలుగుతారు. పంటలు చెడినా అతివృష్టి, అనావృష్టులు వచ్చినా ఆ మిగులు నిలువలు ఉపయోగపడతాయి. అవి పెరుగుతున్న జనం అవసరాలు తీరుస్తాయి. మళ్ళీ పంటకు విత్తనాలను అందిస్తాయి. క్రమంగా దానితో వ్యాపారానికి పునాది ఏర్పడుతుంది. అది మరో విప్లవం. మిగులు ఉత్పత్తి వచ్చిందంటే ప్రత్యేక వృత్తిపనులూ ఏర్పడతాయి. వడ్రంగులు, కుమ్మరులు, రాతిపనివాళ్ళు, మేదరులు వస్తారు. వీరికి వ్యవసాయంతో ప్రసక్తి వుండదు. గుంపే, గ్రామమే వారిని పోషిస్తుంది. ప్రతి గ్రామమూ స్వయం సంపూర్ణతను కాపాడుకుంటూ అంతకంతకు సామర్థ్యాన్ని పెంచుకుంటుంది. దాని ఉత్పత్తి పెరుగుతుంది. రెండోవేపున స్వయంపూర్ణత ఏకాకిత్వం అనుకోకూడదు. దానివలన ఏకాకితనం భగ్నం అవుతుంది. ప్రతి తెగా తన దగ్గరున్న అదనపు వస్తువుల్ని పక్కవాళ్ళకు ఇచ్చి పుచ్చుకొనే పద్ధతి – మార్పిడి ప్రారంభమవుతుంది.

వేర్వేరు ఉత్పత్తి శాఖల్ని నిర్వహించడానికి ఒక తెగ – అంతకన్న చిన్నదైన ఒక కుదురు కూడా – మరీ పెద్దదై పోతుంది. ఇందుకు అనేక సమిష్టి కుటుంబాలతో ఏర్పడే స్వయం సంపూర్ణ గ్రామవ్యవస్థ అవసరం అయింది. పశుపాలన, వ్యవసాయమూ మగవానికి ఆర్థిక వ్యవస్థలో ప్రాధాన్యం హెచ్చు చేశాయి. కుటుంబ వ్యవహారాలు నిభాయించడానికి మగవాడు ఇంటిపెద్ద అయ్యాడు. అంతక్రితం ఉన్న మాతృస్వామికం క్షీణించింది. దాని స్థానంలో పితృస్వామికం విస్తరించింది. పాతశిలాయుగంలో ప్రారంభమయి, లాభకరమని రుజువు తేలిన బిన్న గోత్రీకుల (కుదురులు) మధ్య వివాహం ఏర్పాటు ఇప్పుడు సార్వజనికం అయింది. (నేటికీ ఈ పద్ధతి తెలుగుదేశంలో పరిపాటిగా సాగుతూనే వుంది).

ప్రతి తెగకి ఒక పెద్ద. తెగలోని కుటుంబాల సభ్యులందరూ ఆయన చెప్పుచేతలలో వుంటారు. ఆయన మందలూ ఎక్కువే. సాగుభూములూ ఇతరులకన్న ఎక్కువే. పదిమందినీ కూడగట్టగల శక్తి, నేర్పూ ఆయనను తెగకు గౌరవనీయుణ్ణి, రాజునూ చేశాయి. భారతదేశంలో రాజరికం అల్లాగ ఏర్పడ్డదే. తెగపెద్ద ప్రజాపీడకుడైన నిరంకుశాధికారి కాలేడు. ప్రతి తెగా ప్రజాతంత్ర పద్ధతిలోనే వ్యవహరిస్తుంది. ముఖ్య విషయాలలో తెగ సమితి అభిప్రాయమే చెల్లుతుంది. ప్రజలందరి సహకారంతోనే తెగ పెద్ద తెగ యొక్క ఆర్థిక వ్యవస్థను నిర్వహించాలి. తెగ యుద్ధాలను నడపాలి. తెగ తాలూకు మత సంప్రదాయాల్ని కాపాడాలి.

నూతన శిలాయుగపు ప్రజల మరో లక్షణం మృణ్మయపాత్రల తయారీ. వస్తువులు నిలవచేయడానికే కాక, కర్మకాండలకు, ముఖ్యంగా శవ ఖననాలకు మృణ్మయ పాత్రలు ఎంతో ముఖ్యం. ఆ పాత్రల తయారీకి ఎంతో నేర్పూ, పరిజ్ఞానం అవసరం. కుమ్మరి మట్టిముద్ద తడిగా వున్నప్పుడు ఎల్లా మలిస్తే అల్లా మలుగుతుంది. దానిని నీటిలో పడేస్తే కరిగిపోతుంది. ఎండపెడితే పిండి అయిపోతుంది. కాని, దానిని 600 డిగ్రీల వేడిలో కాల్చి, దానిలోని నీటిని ఇగరబెడితే మట్టిలో రసాయనికమైన మార్పు వస్తుంది. ముద్దగా వున్న అప్పటి మెత్తదనం పూర్తిగా పోతుంది. గట్టిపడుతుంది. కాల్చేముందు ఏ రూపం వుంటే ఆ రూపంతోనే మిగిలిపోతుంది, పనిగట్టుకుని పగలగొడితే తప్ప. ఆ మట్టిముద్దకు కావలసిన రూపం ఇవ్వడం, మంటలలో కాల్చి ఆ రూపాన్ని స్థిరపరచడంలోనే కుమ్మరి పని నైపుణ్యం.

దానికి పనికివచ్చే మట్టిని ఎన్నుకోవడం, తగుమాత్రంగా తడిపి ముద్ద చేయడం, దానికి కావలసిన ఆకారం ఇవ్వడం, ఎండబెట్టడం, తగినంత వేడిలో కాల్చడం – మట్టిలో రసాయనిక మార్పును వుపయోగించుకోవడం లోనే కుమ్మరి పరిజ్ఞానమూ, నేర్పూ వుంది. మట్టిలోని గుణాల్నిబట్టీ, కాల్చే విధానాన్ని బట్టీ మట్టిపాత్ర ఎర్రగానో, నల్లగానో, బూడిదరంగులోనో తయారవుతుంది. ప్రత్యేక తరహా మట్టితో చేసిన పాత్రల మీద కుమ్మరి కుంచెరంగులతో, వివిధ చిత్రాలను కూడా తీసుకురాగలడు.

ఆంధ్రప్రాంతంలో ఆదికాలపు నూతన శిలాయుగ ప్రజలకు ఆవములు పెట్టడం తెలీదు. మంటలమీదనే కాల్చేవారు. అందుచేత ఆనాటి మట్టిపాత్రలు పైన నల్లగా వుండి కిందికి పోయినకొద్దీ, ఎర్రగా వుండేవి. ఎరుపు బాగా కాలిన గుర్తు. నలుపు భాగం సరిగ్గా కాలనిదానికి గుర్తు. అంతేకాదు, ఆనాటికి వారికి కుమ్మరిసారె (చక్రం) చెయ్యడం కూడా తెలియదు. ఆనాటి పాత్రల మీద చేతిగుర్తులు కూడా కనిపిస్తాయి.

క్రమంగా వారు అనేక తరహాల పాత్రలు చేసేరు – మెరుగుపెట్టనివి, మెరుగు పెట్టినవి, అలంకారాలు, వన్నెచిన్నెలు పెట్టినవి. వేడి హెచ్చుతగ్గుల్ని బట్టి కుండలకి అనేక రంగులూ, ఛాయలూ తెచ్చేరు. పాత్రలకు ఎరుపు, పసుపు, బూడిద ఇటిక రంగులతో అలంకారాలు వేసేరు. మట్టిని అచ్చుల్లో నొక్కి గుడిసెల మాదిరిగా వుండే అస్థిపాత్రలు తయారు చేసేరు.

పాత్రలు చెయ్యడమేగాక నూతన శిలాయుగ ప్రజలకి వడుకు, నేత కూడ తెలిసి వుండాలి. వారు నివసించిన ప్రాంతంలో బాగా పత్తి పండుతుంది. కఱ్ఱతో తయారు చేసినవి తప్ప వడకడానికీ, నేతకూ వుపయోగపడే పరికరాలన్నీ వారు నివసించిన ప్రదేశాలలో కనిపించేయి.

అక్కడ దొరికిన ఇతర వస్తువుల్ని బట్టి వారు అనేకరకాల రాతిపూసలు, కంకణాలు, పదకాలు, కంఠమాలలు ధరించేవారనుకోవచ్చు. బళ్లారి జిల్లా కుపగల్ కొండ మీద రాతి చెక్కడాలు కొన్ని కనిపించేయి.

ఆగ్నేయాసియాలో కెల్లా రాయచూరు, బళ్ళారి జిల్లాలను నూతన శిలాయుగ సంస్కృతికి జన్మస్థలాలుగా పేర్కొనవచ్చు. ఇక్కడ జీవన సౌకర్యాలు మంచిగా వున్నాయి. ముడివస్తువులు అందుబాటులో వున్నాయి. ఇక్కడి నుంచి వారి సంస్కృతి తూర్పునా, పడమరనా, పక్కనే వున్న నెల్లూరు, అనంతపురం, కడప, కర్నూలు మండలాలకు విస్తరించింది.

ఇటీవల బళ్లారి జిల్లాలోని తెక్కలి కోటవద్దా, అనంతపురం జిల్లాలోని పాలభాయి వద్దనూ జరిపిన తవ్వకాలలో ఇక్కడి నూతన శిలాయుగ ప్రజలు ఉలవలు, రాగులు పండించేవారని బయటపడింది. దక్షిణ భారతదేశంలో పూర్వం వ్యవసాయదారుల ప్రధానాహారం ఈ రెండు పంటలూ. నూతన శిలాయుగ జనావాసాలూ, బృహత్ శిలా సంస్కృతి జనావాసాలూ, రాగి, ఉలవపంట భూములూ ఒక చోటనే కేంద్రీకరించి వుండడం యాదృచ్ఛిక ఘటన అనుకోడానికి వీలులేదు.

బళ్ళారివద్ద ఉత్తరపు మిట్టమీద రాతికత్తులు, తిరగలిరాళ్ళు, బాగా నున్నగా వున్న 5–6 దంపుడు గుంటలూ కనిపించేయి. కోటమిట్టమీద పగిలిపోయిన కుండ పెంకులు దండిగా కనిపించేయి. శాణపు రాతిముక్కలు, నూతన శిలాయుగపు ఆయుధాల నమూనాలు చాలా దొరికేయి. పిడికఱ్ఱ పెట్టేందుకు చక్కగా రంధ్రం కొట్టిన రాతిగుదియ దొరికింది. ముదురు



ఆకుపచ్చరంగు నాపరాతితో చక్కగా చేసిన ఉలి ఒకటి దొరికింది. కుపగల్, లేక నెమలికొండ మీద నూతన శిలాయుగపు పెద్ద ఖార్ఖానా దొరికింది. రాతిమీద అరగదీసి పదును పెట్టిన రాతికత్తులు, గొడ్డలి తలలు, చాకులు, సుత్తులు, రోకలిబండలు ఇక్కడ ఎన్నో కనిపించాయి. రంపాలు, తొరపటాలు వంటివి కూడా ఎన్నో దొరికేయి. అనేక కొండలమీద రెండు ఏనుగు బొమ్మలు, ఏదో పెద్దపక్షి, పెద్ద మూపురం వున్న ఆబోతు, పెద్దది చిన్నదీ రెండు ఎద్దులు, డాలుపట్టుకొని ఈటె విసురుతున్నట్లున్న ఇద్దరు మనుష్యులు, లింగం, పడుకొని వున్న నంది, చెట్టునానుకొని నిలబడ్డ ఒక మనిషి, అయిదు వరుసల్లో నడిచిపోతున్న బక్కచిక్కిన మనుషుల బొమ్మలు రాతి బండలమీద గిరిగీసినవి ఫుట్‌కు కనిపించేయి. లింగోత్థాన స్థితిలో వున్న ఒక మగవాడు ఆడుదానిని జుట్టుపట్టి లాగుతున్నట్లున్న బొమ్మ ఒకటి కనబడింది. గిడగనూరువద్ద ఒకవిధమైన పొరలరాతితో చేసిన కత్తులు దొరికేయి. ఇనుము యుగారంభకాలపు గొడ్డళ్ళకు నమూనాలలా వున్నాయవి. హంపసాగరం వద్ద పగిలిపోయిన కంకణాలు, పూసలూ (శంకుచిప్పలతో చేసినవి) దొరికాయి. హర్పనహల్లి వద్ద ఎద్దుబొమ్మ తాయెత్తు దొరికింది. హంపసాగరం దగ్గర ఏనుగు ఆకారంలో చేసిన నాలుగుకాళ్ళ శవపేటిక దొరికింది.

బళ్ళారి జిల్లాలో సంగనకల్లు వద్ద ఇటీవల జరిగిన తవ్వకాలలో నూతన శిలాయుగపు దశలు మూడు కనిపించేయి. అరగదీసినవీ, పెచ్చు తీసినవీ పనిముట్లు మొదటి దశకు చెందినవి. చేతితో చేసిన కుండలూ, కత్తులూ, బసాల్ట్ రాతిపెచ్చులూ రెండో దశకు సంబంధించినవి. సారెమీద చేసిన పాత్రలూ, అంచులు తీర్చిన పనిముట్లూ మూడోదశకు సంబంధించినవి.

రాతిపనిముట్లూ, మృణ్మయపాత్రలేగాక బళ్ళారిజిల్లాలోని కుపగల్, హలకుండి, బూదికనుమ, గడిగనూరులలోనూ, మహబూబ్‌నగర్ జిల్లాలోని ఉట్నూరులోనూ, రాయచూరు జిల్లాలోని పక్లిహల్‌లోనూ మరికొన్ని చోట్లనూ పెద్ద పెద్ద బూడిదరాసులు కనిపించేయి. బూది కనుమలోని రాసి అడుగున 500 అడుగుల చుట్టుకొలత కలిగి, 50 అడుగుల ఎత్తు వుంది. ఇటువంటి రాసులు 40 వరకూ ఆంధ్ర, కర్ణాటక ప్రాంతాలలో కనిపించేయి. బ్రూస్‌ఫుట్ వానిని జాగ్రత్తగా పరిశీలించి, ఈ రాసులు మొదట పేడపోగులనీ, వేసవుల్లో అంటుకొని, అల్లాగే రాజుతూ మండుతూ బూడిద పోగులయ్యాయనీ అన్నాడు. తరువాత బ్రిటిష్ మ్యూజియమ్ అధికారులు జరిపిన రసాయనిక పరీక్షలలో ఆ వూహ నిజమని రుజువయింది. గడిగనూరు, కుపగల్, హలకుండీలలో దొరికిన ఈ బూడిదరాసులలో అనేకరకాల, చిన్న, పెద్ద రాతికత్తులు దొరికేయి.

బ్రూస్‌ఫుట్ అనంతపురం జిల్లాలో 25 జనావాసాల్ని బయటకు తీసేడు. లత్తవరం కొండమీద పిండి విసరడానికి వుపయోగించిన అనేక బండలు కనిపించేయి. గింజల్ని నూరేందుకు ఇక్కడి ప్రజలు మంచి అందమైన రంగుగల పిస్టసైట్ రాయి మీద ఎక్కువమోజు కనబరచేరు. బూదిహాల్ కొండమీద రాతి మదుగులు చాలా కనిపించేయి. అందులో ఒకదానిలో పొడుగుపాటి రాతిమీద తొట్టిలా గాడికొట్టి వుంది. దానికి అటూ ఇటూ జనం కూర్చునేందుకు పొడుగురాళ్ళు రెండు అమర్చి వున్నాయి. వానిమీద ఆడవాళ్ళు కూర్చుని తొట్టిలో ధాన్యం పోసి దంచుకొనేవాళ్ళేమో. పదిమంది కలిసి పనిచేసుకోవడం వారికి చాలా ఇష్టమయి వుంటుంది. అక్కడికి కొంచెం దూరంలో కొండకింద ఒక పొడుగాటి రాతిబండ వుంది. దానిమీద అరిగి, లొత్తపడి, నునుపు దేరిన 14, 15 పెద్ద గుంటలున్నాయి. ఇక్కడ జనం ధాన్యం

దంపుకుంటూండి వుంటారు అంటాడు ఫుట్. కొండమీద పెద్ద పెద్ద తిరగలిరాళ్ళు కనిపించేయి. విడపనకల్లు కొండమీద కత్తులు, ఉలులువంటివేగాక చెకుముకి మొదలైన వానితో చేసిన మేలుతరహా దోరాలు, తదితరాలు కూడ దొరికేయి. ఈ పనిముట్ల కుపయోగించిన తరహా రాయి (ఆగేట్) 60 మైళ్ళ దూరం నుంచి తెచ్చి వుండాలి. విడపనకల్లు మిట్టమీద వెడల్పయిన పట్టాకత్తి, ఉలి, ఎర్ర చెకుముకిరాతితో (చెర్ట్) చేసిన వడిసెలరాయి, జాస్పర్ రాతితో చేసిన కోరం దొరికేయి. వేల్పుమడుగులో కనిపించిన పనిముట్లు చేయడానికి ఎంతో దూరం నుంచి డియొరైట్ రాళ్ళు తెచ్చేరు. తాడిపత్రి దేవాలయం వద్ద వన్నెచిన్నెలుగల మంచిరకం కుండపెంకులు, ఒక కుంపటి, దోసకాయ చెంబు, వెడల్పునోరు లోటా, ఒక పాత్ర బాపతు జారీకొమ్ము, నలుపు, పసుపు, ఎరుపు జాస్టర్‌రాళ్ల పెద్ద పోగు కనిపించేయి. కలమెదనూరు కొండమీద నూతనశిలాయుగ జనావాసం కనిపించింది. ఇనుముయుగం ప్రారంభమవుతున్న ఛాయలు అక్కడ దొరికేయి. అక్కడలాంటి ఆయుధాలే వజ్రకరూరు, ఉరవకొండ, కరకుముక్కల, భోగసముద్రం, హావలిగెమిట్ట, ముచ్చుకోట, జంబులదిన్నెమిట్ట, యెర్రగుడి మిట్ట, అనంతపురం పట్టణంలో కూడ దొరికేయి.

పులివెందుల తాలూకా వేములలో, కడప సమీపంలోని వెల్లటూరులో, కదిరి తాలూకాలోని ముండ్లవారిపల్లె, దొరిగల్లులో అనేకానేక తరహాల పనులకుపయోపడే నూతన శిలాయుగపు పనిముట్లు దొరికేయి. వెల్లటూరులో దొరికిన చిన్న లోటాలో సున్నంలాంటి పదార్థం కనిపించింది. దానినిబట్టి ఆనాడు తాటికల్లు పరిశ్రమ వున్నదని వూహిస్తున్నారు. ముండ్లవారి పల్లెలో శంకుచిప్పల కంకణాల పరిశ్రమ గుర్తులు కనిపించాయి.

కర్నూలు జిల్లాలో నూతన శిలాయుగపు పరికరాలూ, ఇనుము యుగ ప్రారంభకాలపు పరికరాలూ దండిగా దొరికేయి. పత్తిపాడు వద్ద జారీలు, చుట్టకుదురులు, లోటాలమాదిరి చిన్న పాత్రలు, కుదురుబిళ్ళ, చిన్న గుర్రపుబొమ్మ, అల్లాంటివే అనేక ఆసక్తికరములైన వస్తువులు దొరికేయి. ఈ వస్తువులన్నీ కొద్దిమేరలో పేర్చి ఉండటాన్ని బట్టి వాని నక్కడ దాచిపెట్టి వుంటారని ఫుట్ భావిస్తున్నారు. భారతదేశంలో మరెక్కడా దొరికివుండని మాదిరిది, కొమ్ముకుండ ఒకటి ఇక్కడ దొరికింది. బహుశా పాలు, పెరుగుకు దీని నుపయోగించి వుంటారని భావన. ఇది ప్రస్తుతం మద్రాసు మ్యూజియమ్‌లో వుంది. హంద్రీనది ఎడమగట్టున బస్తిపాడువద్ద ఆసక్తి జనకాలయిన కుండపెంకులు దొరికేయి. వానిలో పెడపొయ్యి బాపతు నడిమిభాగం ఒకటి, పత్తికొండ తాలూకా కప్పతల్ల మిట్ట మీద వస్తువులు మెరుగు పెట్టేటందుకుపయోగించిన గాడిపల్లాలు చాలా కనిపించాయి. వెడల్పయిన పటకా తగిలించేందుకు వీలయిన మెడతోవున్న చట్టికుండ సన్నుగుండ్ల మెట్టమీద దొరికింది. కొయిల్‌కుంట్ల తాలూకాలో రెండు పెద్ద రాతి బరమాలు దొరికేయి. ఆనాడు సున్నపురాతితో బండి చక్రాలు చేసేవారు. వానికి ఇరుసు బొర్రెలు కోయడానికి ఈ బరమాలుపయోగపడి వుంటాయని భావింపబడుతూంది. ఈ ప్రాంతంలో ఇటీవలి కాలం దాకా ఈ మాదిరి చక్రాలనే వుపయోగించేరు.

కృష్ణాజిల్లాలో గుడివాడకు పశ్చిమంగా, ప్రాచీనకాలపు బౌద్ధనగర శిథిలాలతో కలిసిపోయి కొ దిబ్బలు కనిపించేయి. వీటిలో పాతకాలపు కుండపెంకులు చాలా దొరికేయి. అవి నూ న శిలాయుగపువి. ఇనుము యుగం నాటివానికీ, వీనికీ, చాలా తేడా వుంది.

గుంటూరు జిల్లాలో నాగార్జునకొండ ఏలేశ్వరాలలో జరిగిన తవ్వకాలనుబట్టి అక్కడ మనిషి పాతరాతియుగం దశనుంచి చరిత్ర యుగం వరకూ అన్నిదశలూ గడిపిన చిహ్నాలున్నాయి.



రక్షణకూ, రవాణాకు కూడ వీలయిన వడిగల నది ఎంతో సహాయకారి అని చరిత్ర పూర్వకాలపు మనిషే గ్రహించేడనుకోవాలి. ఇక్కడ అనేక తరహాల నూతన శిలాయుగపు పనిముట్లు, పాత్రలు లభించాయి.

మహబూబ్‌నగర్‌జిల్లాలో ఉట్నూరువద్ద ఇటీవల ఎఫ్.ఆర్. అల్‌చిన్ జరిపిన తవ్వకాలలో రెండు నిర్దిష్ట సాంస్కృతిక దశల – నూతన శిలాయుగమూ, చారిత్రక యుగమూ – చిహ్నాలు లభించాయి. ఇక్కడ దొరికిన పాత్రలు నూతన శిలాయుగపు ఆరంభకాలం నాటివి. ఇవన్నీ చేతితోచేసి మంటలతో కాల్చినవే. వాని మెరుగు పెట్టడం గాని, వన్నెచిన్నెలు పెట్టడంగాని జరగలేదు. మొత్తం 13 పాత్రలు దొరికేయి. వానిలో సరుకు నిలవలకుపయోగపడే పెద్దపాత్రలుగాని, కర్మకాండల్లో వుపయోగించేవిగాని ఒక్కటిలేవు. దొరికినపనిముట్లు కూడా మోటుగా వున్నాయి. వైవిధ్యం లేదు. బాగా అరిగిపోయి ముక్కలయిపోయాయి. మంచిరకం ముడిపదార్థాలు లేకపోవడం, జనాభా తక్కువ కావడం, దూరం నుంచి అవసరమైన రాళ్ళు ఏరి తేగల ప్రత్యేక నిపుణులు లేకపోవడమూ వలన ఈ స్థితి ఏర్పడిందని అల్చిన్ అన్నారు. ఇక్కడ దొరికినవానిలో ఎన్నో జంతు అవశేషాలున్నాయి. ఇవన్నీ ఒకేకాలానికి చెందినవి కావు. దొరికిన బూడిదరాసులు కూడా, పేడపోగులు కాలి ఏర్పడినవే.

రాయచూరు జిల్లాలోని కల్లూరువద్ద ఒక మిట్టమీద రాళ్ళపై రెండు ఆంబోతు బొమ్మలూ, ఒక మనిషి బొమ్మా నిజప్రమాణంతో గీసినవి కనిపించాయి. మరో రాతిమీద రెండు దున్నల్ని గీసేరు. ఇక్కడనే ప్రాచీనకాలంలో ఇనుము కరిగించిన చిహ్నాలు కనిపించేయి. ప్రాచీనకాలపు లోహకారులు కొంతకాలం నివసించి వదిలేసిన జనావాసం చిహ్నాలు తోగల్‌గుట్టలో కనిపించేయి. ఇక్కడి గుహల లోపలా, వెలుపలా కూడ కుండలు, లోహచిట్లం, బూడిద, సుత్తెలు, నలగకొట్టిన కాకిరాయి, పాత్రల ముక్కలు అపారంగా కనిపించేయి. ఒకచోట కాకిరాయితో గీసిన చిత్రాలు అతి ప్రాచీనపువి – కనిపించేయి. లేడిని బల్లెంతో పొడుస్తున్న చిత్రం – నిజప్రమాణంలోది వుంది. ఈ రాతికి ఉత్తరాన మరో రాతిమీద గీసినది బల్లో, మొసలో తెలియడం లేదు. దీనికి ఎర్ర రంగు పూసేరు.

మౌలాలీ, భువనగిరి మిట్టల మొదళ్ళలో పెద్ద పెద్ద నూతన శిలాయుగ జనావాసాల చిన్నెలు కనిపించేయి. ప్రమాద సమయంలో కొండలు ఎక్కెయ్యగల అవకాశం కోసమే వారీ ప్రదేశాలను ఎన్నుకొన్నారనీ, దౌలతాబాదు కోటవద్దా, గోల్కొండ వద్దా కూడా ఇటువంటి చిహ్నాలున్నాయనీ, నిజాము రాష్ట్ర పురావస్తు పరిశోధన నివేదికలు తెలుపుతున్నాయి.

ఖమ్మం జిల్లాలో అయిదుచోట్లా, భువనగిరి తాలూకాలో రెండుచోట్లా నూతన శిలాయుగపు వస్తువులు దొరికేయి. భువనగిరి ప్రాంతంలో ఒకేచోట ఆనాటి జనావాసమే కనబడింది.

రాయచూర్ జిల్లాలోని పిక్లిహల్‌లో ఎంతో నైపుణ్యంతో తయారుచేసిన అనేక పనిముట్లతో పాటు ఒక ఆంబోతుది, ఒక మనిషిది టెర్రాకోటా విగ్రహాలు కుండబొమ్మలు కూడా దొరికాయి.

ఆనాటి వారికి రాగి తెలుసు, కాని బాగా తక్కువ. తెక్కలకోటలో ఒక రాగిగొడ్డలి, హల్లూరులో ఒక చిన్న రెండుతలల రాగిగొడ్డలి దొరికేయి. రాయచూరులో రెండునదుల మధ్యమండలంలో బంగారం తీసేవారు. దక్షిణభారతంలో మొట్టమొదటగా దొరికిన బంగారునగలు

అక్కడి బంగారంతో చేసినవే నంటారు సంకాలియా.

ఇంక నూతనశిలాయుగపు మానవుల విశ్వాసాలు గురించి చూద్దాం. మానవాతీతమయిన ఏదో శక్తి వుందనే నమ్మిక, దానిని శాంతస్థితిలో వుంచేందుకై ఏదో ఒకరూపమైన కర్మకాండనే మంతమంటే, ఇది మానవునిలో అతి తీవ్రోద్వేగాల్ని సృష్టిస్తుంది. ఆదిమ మానవుడు తన పరిసరాలను సంతృప్తికరంగా సంభాళించుకోలేడు. బతుకంతా ప్రమాదాల పుట్ట. మనిషికి దేన్ని చూసినా భయమే. కనక తనకు సహాయం కావాలనుకొన్నాడు. ఒక మూల తాను పనిచేస్తున్నాడు. ప్రకృతిశక్తులతోనూ, క్రూర జంతువులతోనూ పోరాడి నిగ్రహించుకు వస్తున్నాడు. ఫలితంగా ఏర్పడిన ఆత్మవిశ్వాసమూ, అత్యంత ప్రాథమిక భౌతిక దృక్పథమూ పెచ్చరిల్లాయి. రెండోవేపున తనకు అర్థంకాని ప్రకృతిశక్తుల ముందు తన నిస్సహాయతనూ, అప్రయోజకత్వాన్ని చూపించే మూఢవిశ్వాసాలూ, మత ధోరణులూ, ఆదర్శవాదాలూ పెచ్చరిల్లాయి.

సమాజం వేటదశ నుంచి పశుపాలక, వ్యవసాయదశకు పెరిగేసరికి పరిసరాలు గురించిన మానవుని పరిజ్ఞానం పెరిగింది. మేధ వికసించింది. ప్రకృతి అతని చెప్పుచేతల్లోకి వస్తోంది. అయినా అతనికి తెలియనివెన్నో వున్నాయి. జ్ఞానం విస్తరించిన కొద్దీ కొత్తకొత్త అనుమానాలు తలెత్తేయి. పాతసమస్యలు పరిష్కారమైతే కొత్తవి పుట్టుకొచ్చేయి. దానితో కొత్తదేవుళ్లు, కొత్త విశ్వాసాలు, కొత్త కర్మకాండలు బయల్దేరేయి. పాతదేవుళ్లూ, విశ్వాసాలూ, కర్మకాండలూ అంతరించాయని కాదు. పాతవాని ప్రక్కనే కొత్తవీ విస్తరించేయి.

నూతన శిలాయుగంలో ఆహారోత్పత్తి నిర్ణయాత్మకమయిన పాత్ర నిర్వహించినా, పంటలెప్పుడూ నమ్మలేని పరిస్థితిగానే వుండేది. వ్యవసాయం చాలా ప్రాథమికదశలో వుండడమే దీనికి మూలకారణం. అందుచేత మానవుడు సరిపడినంత తిండి కావాలనీ, ఇవ్వాలనీ దైవం మీద భారం వేసేవాడు. దక్షిణ భారతదేశంలో ఇది రెండు మార్గాలు పట్టింది. ఒకటి లింగపూజ. రెండోది భూమితల్లి కొలుపులు. బళ్లారిజిల్లా కుపగల్ మిట్టమీద లింగమూ, దానిముందు మోకరిల్లిన నంది గీసి వున్నాయని పైన చెప్పేను. లింగం పరమశివునికి సంకేతం. నంది ఆయన ప్రియవాహనం. సేలంజిల్లా షెద్రాయ్ మిట్టలమీద దొరికిన రాతిలింగాన్ని గురించి చెప్తూ, నూతన శిలాయుగప్రజ మగవానిశక్తి సర్వప్రధానమని భావించారన్నారు పుట్. ఆర్యుల రాకకు పూర్వం ఉత్తరభారతంలో కూడా శివపూజ వుండేది. చిన్నదేవుళ్నీ, వారి నగరాన్నీ ఇంద్రుడు జయించేడని "రుగ్వేదం"లో చెప్పబడింది. ఇంద్రుని పూజించే త్రిత్సుల ప్రతిస్పర్థులనుగా శివులను "రుగ్వేదం" పేర్కొంది.

సమాధి పాత్రలవంటివి ఎక్కడా దొరక్కపోవడాన్నిబట్టి పాతశిలాయుగ మానవులు మృతదేహాల్ని బయటనే వదిలేసేవారనుకోవలసి వస్తోంది. ఆహారోత్పత్తి విధానం విస్తరించి బలపడినకొద్దీ, చనిపోయినవారు తిరిగివచ్చి తిరిగి తమతో బతుకుతారనే భ్రమ పెరిగింది. ప్రతిమనిషిశరీరంలో ఒకే ఆత్మ వున్నదనీ, అది శరీరాన్ని వదిలి వెళ్ళిపోవడమే మరణమనీ వారి భావన. ఆత్మలు, మృతశరీరం పక్కపక్కనే తిరుగుతూంటాయనేది ఓ విశ్వాసం. అందుచేత చనిపోయినవారిని నిలువునా పండబెట్టి పూడ్చేవారు. తరువాత శరీరాన్ని మట్టిపాత్రలో పెట్టి పూడ్చారు. ఆ పాత్రలలో శరీరంతోపాటు ఇన్ని ఆహార పదార్థాలు కూడా వుంచేవారు. ఇప్పటి శవపేటికల పూర్వరూపమే ఈ మట్టిపాత్రలు. బళ్ళారిజిల్లాలోని తెక్కలికోట, హంపసాగరాల లోనూ, బ్రహ్మగిరి, పిక్లిహల్‌లోనూ దొరికిన వానినిబట్టి చూస్తే మొదట మృతశరీరాలను



బయటనే వుంచేవారనీ, తరువాత ఎముకల్ని ఏరి, సాధ్యమైనంత స్వరూపంలో అమర్చి, కుండలలో పెట్టేవారనీ తోస్తుంది. హంపసాగరం వద్ద తుంగభద్ర ఎడమగట్టున నూతన శిలాయుగపు సమాధిస్థలాన్ని పుట్ కనుక్కొన్నాడు. ఇక్కడ ఆయనకు ఏనుగు ఆకారంలో నాలుగుకోళ్లున్న శవపాత్ర ఒకటి, తలుపుతోసహా గుడిసె ఆకారంలో వున్న శవపాత్ర ఒకటి కనిపించాయి. తెక్కలికోట వద్ద శవసంస్కారదశలు మూడు కనిపించేయి. దిగువదశ సమాధులు రెండు కనిపించాయి. ఒకదానిలో పుర్రె, పెద్ద ఎముకలు పూడ్చేరు. మరొకదాంట్లో ముగ్గురితాలూకు ఎముకలున్నాయి. దాని పై దశలలో బోలెడు కర్మ తతంగం సాగింది. ఈ రెండు దశలలోనూ చిత్రచిత్రితములైన కుండలు మొదలైనవి మృతాత్మలకు ఉపాయనంగా సమర్పించబడినాయి. నాగార్జునకొండవద్ద ఏ కీలుకాకీలు విడగొట్టిన కంకాళాలూ, జారీలూ, చట్టులతో ఆరు సమాధులు దొరికేయి. నెల్లూరుజిల్లాలో పెన్నానది మీద ఆనకట్టను కట్టేటప్పుడు స్ఫటికరాళ్ళ మధ్య కాల్చిన మట్టి శవపాత్రలు ఎన్నో కనిపించేయి. వానిలో చాలావానిలో ఒకటికన్న ఎక్కువే కంకాళాలు ఉన్నాయి. ఆ శవపాత్రలు ఏవీ చెక్కుచెదరలేదు. అయితే గాలిలోపెట్టేక క్రమంగా గుండపిండి అయిపోయాయి. ఆ శవపాత్రలు కొన్నిటిలో బల్లెపుమొనలూ, ఇతర పనిముట్లూ కూడా దొరికేయి.

నూతనశిలాయుగారంభదశలో జనం గుహలు మొదలైన ప్రకృతిసిద్ధమైన రక్షణలలోనే వుండేవారు. కాని, తరువాత తరువాత బహిరంగప్రదేశాలలో ఇళ్ళుకట్టుకొని సేద్యాలు చేసుకోసాగేరు. 1968 ప్రథమార్ధంలో భారత పురావస్తు శాఖవారు తుంగభద్ర, పాలారు, పెన్ననదీమండలాలలో పరిశోధనలు జరిపినప్పుడీ విషయం బయటపడింది. కర్నూలుజిల్లాలో రంగుమట్టిపాత్రల వాడకందార్లు బహిరంగ ప్రదేశాలలో వుండడానికే ఇష్టపడేవారు. పెద్ద పెద్ద గ్రామాలు కట్టుకొనేవారు. ఒక్కొక్కప్పుడవి 10-15 ఎకరాలమేర కూడా విస్తరించి వుండేవి. ఇవికాక చిత్తూరుజిల్లాలో కూడా వ్యాపించాయంటూ 1968 సెప్టెంబరు 28న "హిందూ" పత్రిక వ్రాసింది.

బ్రిటిష్ పురాతత్వవేత్త ఎఫ్.ఆర్ అల్చిన్ ఉట్నూరు (మహబూబ్‌నగర్ జిల్లా), పిక్లిహాల్ (రాయచూరు జిల్లా) మొదలైన చోట్ల బూడిదరాసుల విషయమై పరిశోధనలు జరిపి ఒక కొత్త సిద్ధాంతం ప్రకటించేడు. ఈ బూడిదరాసులు అనేక అంతరువులలో వుంటున్నాయి. వానిలో కొయ్యలు పాతి, కోరడులు కట్టిన గుర్తులు కనిపిస్తున్నాయి. వీనినిబట్టి ఈ బూడిదరాసులున్న చోట పశువుల మందల దొడ్లు వుండేవనీ, పేడను పోగువేసి, అప్పుడప్పుడా పోగులు తగలబెట్టే వారనీ, వానిమీద మరల పోగులు వెయ్యడం, వానిని మళ్ళీ తగలపెట్టడం - ఈ మాదిరిగానే ఈ బూడిదరాసులేర్పడ్డాయని అన్నారు.

పేడ కాల్చి వేసిన తరువాత మరల అక్కడనే కోరడికట్టి, పశువుల్ని కడుతూండేవారు. ఈ బూడిదరాసుల అట్టడుగుపొరలలో కర్రలుపాతిన గుర్తులు లేవు. తరువాత పై పొరలలో కర్రలు పాతిన గుర్తులున్నాయి. ఇంకా ఎత్తుకి వచ్చేక కర్ర దొరకలేదేమో కంపవేసి, గోడలా పేడమెత్తి దడులు కట్టిన గుర్తులున్నాయి. ఇంక ఇనుముయుగం వచ్చేనాటికి ఈ అలవాటు మానింది. వారు పేడను చేలల్లో ఎరువుగా వుపయోగించడం ప్రారంభించేరు.

ఈ పశువులదొడ్లు గ్రామాలకు సమీపంలోనో, గ్రామం మధ్యనో వుండేవి. కొన్నిచోట్ల బూడిదపోగులకి సమీపంలో గ్రామాలేవీ లేవు. దానినిబట్టి ఈ మందల్ని కొంతకాలం గ్రామంలోనూ, మరికొంతకాలం అడవుల సమీపంలోనూ మారుస్తూ వుంచుతూ

వుండేవారనుకోవాలి. వాతావరణ పరిస్థితులను బట్టి ఈ మార్పులు జరుగుతుండాలి.

పేడపోగును కాల్చడం, దానిమీద కోరళ్ళు కట్టి పశువులమందలను మరల అక్కడే కట్టడం పద్ధతి చూస్తే రుతువులు మారినప్పుడు పశువుల్ని మార్చే అలవాటున్నదని అర్థం అవుతుంది. మందల్ని చోటు మార్చేటప్పుడు పశుపాలకదశలో ప్రధానమైన వుత్సవాలు, కర్మకాండ పాటించేవారు. ఆ అలవాటు, శతాబ్దాలు గడిచినా నేటికీ పరిపాటిగా సాగుతూనే వున్నాయి. హోలిపండుగలప్పుడు పశువుల్ని బీళ్ళకి కొట్టేటప్పుడు మంటలు వేస్తారు. తమిళనాడులో గొల్లలు మందల్ని బీళ్ళకు తోలేటప్పుడు, బీళ్ళ నుంచి తిరిగి తెచ్చేటప్పుడూ మంటలు వేస్తారు. కొన్నిచోట్ల హోలీ అప్పుడు దీపావళి అప్పుడూ పశువుల శాలలో దీపాలు వెలిగిస్తారు. పశువులదొడ్డి నడుమన కొద్దిపాటి పేడపోగును అంటించి, తరువాతనే పశువుల్ని బయటకు కొట్టే అలవాటు కొన్నిచోట్ల వుంది. అలా చేయడం శుభకరం అని వారి భావన - అంటారు అల్చిన్.

అల్చిన్ యొక్క ఈ భావాలు దక్షిణభారతదేశపు పురావస్తు శాస్త్రావగాహనకు గొప్ప సహాయం చేశాయి. దక్షిణభారతంలో నూతన శిలాయుగ కాలంలో పశువుల శాలలో మంటలు పెట్టడానికి కారణాలు తెలుసుకోడానికి అవి బాగా తోడ్పడ్డాయి. అయితే ఇప్పటికీ స్పష్టం కావలసిన సమస్యలు రెండు మిగిలే వున్నాయి. పేడను ఎరువుగా వుపయోగించవచ్చునని ఎరగనంతటి అజ్ఞాన స్థితిలో వున్నారా, దక్షిణ భారతంలో నూతన శిలాయుగ ప్రజలు? పశువుల్ని రాత్రులప్పుడు అడవుల వద్ద నిలుపుతే క్రూరజంతువులు చంపుతాయనే విషయం తెలియనంత అజ్ఞానులా, వారు?

బ్రహ్మగిరి, పిక్లిహాల్, తెక్కలికోట, టి. నర్సిపూర్‌లలో లభించిన మనుష్య కంకాళాలను మనుష్య శాస్త్రవేత్తలు పరిశీలించి ఈ నూతన శిలాయుగ ప్రజలకు కొంతవరకు ఇటు దక్షిణభారతవాసులతోనూ, కొంతవరకు సుదూర ప్రాంతపు ఇరానీ ప్రజలతోనూ దూరపు బంధుత్వాలున్నాయన్నారు. పైన చెప్పిన ప్రదేశాలలో దొరికిన మృణ్మయపాత్రలు ఈ బాంధవ్యాన్ని సూచిస్తున్నాయన్నారు.

## ఇనుము యుగం (బృహత్ శిలాయుగం)

పైన వర్ణించిన నూతనశిలాయుగ పరివర్తనం లక్షా ఏభయివేలయేళ్ళు పైగా సాగిన రాతియుగపు మానవ సంస్కృతీపరిణామంలో ఒక విప్లవ పరివర్తనమని చెప్పవచ్చును. ఇనుముయుగంలో రెండో విప్లవం వచ్చింది. ఇది మనుష్య జీవితాన్ని మరీ అధికంగా మార్చేసింది. రాయికన్న ఇనుము శ్రేష్ఠమని మానవుడు తెలుసుకున్నాడు. దానితో పనిముట్లు చేయడం నేర్చుకున్నాడు. వాటిని తయారు చేయడంలో ఇనుమును కరిగించేటప్పుడు కలిగే రసాయనిక మార్పులను గ్రహించేడు. అందుకోసం ప్రత్యేక తరహా బట్టీలు కట్టేడు. కొలిమితిత్తులు తయారు చేసుకొన్నాడు.

ప్రథమ పరివర్తనతోనే జనాభా వేవేగం అభివృద్ధి అయింది. సుస్థిర జలసమృద్ధిగల ప్రదేశాలకు జనం అధికంగా చేరసాగేరు. పోడు వ్యవసాయం స్థానంలో నాగలి వ్యవసాయం వచ్చింది. మొదట్లో (కర్ర) దుంపనాగలే వుపయోగించి వుంటారు. ఇనుము కనుక్కున్నాక ఇనుపకర్రు వచ్చింది. అడవులు నరకడానికి ఇనపగొడ్డలి బాగా వుపయోగపడింది. ఇనపపనిముట్లతో



చెరువులు, దొరువులు, కాలవలు తవ్వొచ్చు. ఆ విధంగా అభివృద్ధి పొందిన వ్యవసాయం ఆర్థిక వ్యవస్థకు ప్రధానాధారమయింది. వడ్రం, రాయికొట్టుడు, నేత, పడవలకట్టుబడి మొదలైనవేగాక కమ్మరం, ఇనుము కరిగించడం, కాలువలు తవ్వడం వంటి కొత్త వృత్తిపనులు వచ్చేయి. ఆ విధంగా పనివిభజన బాగా ఎక్కువ అయింది. ఈ వృత్తి పనివారందరినీ సమాజమే పోషించాలి. దానితో అదనపు ఆహారోత్పత్తి అవసరమయింది. శ్రమశక్తిని బాగా ఉపయోగింప చేయడం ద్వారా ఇది సాధ్యమయింది. ఈ పరిస్థితులు పట్టణాలు పెరగడానికి తోడ్పడ్డాయి. బలప్రయోగశక్తిగా రాజ్యాంగం ఏర్పడింది. సమాజంలో క్రమస్థితి కొనసాగడంలో ప్రయోజనం ఉన్న పురోహితవర్గం తలెత్తింది. అదనపు ఉత్పత్తి వాణిజ్యావసరాన్ని తెస్తుంది. వర్తకులవర్గం సమాజంలో ప్రత్యక్షమయింది.

ఈ మార్పులన్నీ ఇనుమును కనుక్కోవడం వలన వచ్చినవే.

మొదట ఇనుమును కనుక్కోవడం యాదృచ్ఛికంగానే జరిగి వుంటుంది. సమిష్టి విందులప్పుడో, ఏ పోతునో బలి యిచ్చినప్పుడో మాంసం వండడానికి పేర్చిన పొయ్యిరాళ్ళలో కొన్ని కాకిరాళ్ళు ఉండి ఉంటాయి. మంటలవేడికి ఇనుము కరిగి ప్రవహించడం, చల్లారిన తరవాత గట్టిపడడం చూసి ఉంటారు. కరిగివున్న దశలో దానిని కావలసిన ఆకారంలో పోత పొయ్యవచ్చు. చల్లారాక రాయిలా గట్టిపడుతుంది. దాని అంచు మహావాడి అవుతుంది. రాయిలాగా, ఎముకలాగా అది సులభంగా విరగదు. విరిగినా మళ్ళీ కరిగించి పోతపొయ్యవచ్చు. అయితే ఇనుమును కరిగించడానికీ పోత పొయ్యడానికీ చాలా నేర్పూ, సాంకేతిక పరిజ్ఞానమూ కావాలి. కొలిమితిత్తులవంటి కొత్త పరికరాలను నిర్మించుకోవాలి. మన పూర్వీకులు ఆ పనులు చెయ్యగలిగేరు.

దక్షిణ భారతంలో ఇనుము పరిశ్రమ యూరపులోకన్నా అతి ప్రాచీనం అన్నారు పుట్. గాలి, తేమ తగులుతే ఇనుప పనిముట్లు తుప్పుపట్టి నాశనం అవుతాయి. ఇనుము యుగం మానవుడు తయారుచేసిన మట్టిపాత్రలు పగిలిపోయినా రూపుమాయవు. ఈ మాదిరి కుండపెంకులు రాతికత్తులు ఇతర పనిముట్లతోపాటు కనిపిస్తూండడాన్ని బట్టి లోహకారులు నూతన శిలాయుగ జనావాసాలలోనే పుట్టుకొచ్చి పనిచేసినారనుకోవాలి. క్రీటుద్వీపంలో, గ్రీసులో, ఇతర యూరపు దేశాలలో లాగా దక్షిణ భారతదేశంలో ఇనుము యుగానికి ముందు కంచుయుగం అంటూ లేదు - అంటారు పుట్.

శ్రీనివాస అయ్యంగార్‌ది అదే అభిప్రాయం. ఇనుము అనేది మొదట భారత దేశంలోనే కనుక్కున్నారంటారాయన.

ఎరుపు–నలుపు మట్టిపాత్రలు, రాతితోచేసిన పొడుగైన కత్తిపట్టాలు, నల్లని రాతిపేళ్ళు, బృహత్ శిలా సమాధులు–ఇవి ఇనుప పనిముట్లు, ఆయుధాల ప్రారంభానికి సమకాలీనములని పురాతత్వవేత్తలు పరిగణిస్తారు. బృహత్‌శిలా సమాధులన్నవి రాతి బండలను పెట్టెలా పేర్చి, దానిలో మృతుని ఎముకల్నీ, ఎరుపు–నలుపు పాత్రలు, చాకులు, బల్లేలు ఆభరణాల్నీ పెడతారు. దానిని ఒక రాతి పలకతో మూసి కప్పెడతారు. పక్కల్ని పేర్చిన రాతిపలకలలో ఒకదానికి కన్నం వుంచుతారు. సమాధి చేయవలసిన వస్తువుల్ని దానిలోంచి పెట్టెలో పడెయ్యడానికై ఈ కన్నం. ఈ పెట్టెలాంటి నిర్మాణాన్ని సిస్ట్ అంటారు. సాధారణంగా ప్రతి సిస్ట్ చుట్టూ పెద్ద పెద్ద రాళ్ళని ఒకటి రెండు వలయాలుగా పేరుస్తారు.

ఈ బృహత్శిలా నిర్మాణపద్ధతి దక్షిణ భారతంలో ఆంధ్ర, కర్నాటక, మద్రాసు జిల్లాలన్నిటా వ్యాపించింది. ఈ నిర్మాణాలు చెరువులను, పంటభూములను ఆక్రమించకుండా కొండలు, గుట్టలమీదనే కడతారు. వానికి కావలసిన రాయికూడా అక్కడ దొరుకుతుంది. చనిపోయినవారికై ఇంత బృహన్నిర్మాణాలను, ఇంత జాగ్రత్తగా నిర్మించడానికై ఆనాటి సమాజ వ్యవస్థ చాలకట్టుదిట్టంగా వుండివుండాలి - అంటారు సంకాలియా. కొన్నిచోట్ల 3 టన్నుల బరువయిన రాళ్ళుకూడా తెచ్చి, పైన పేర్చడం చూస్తే ఇల్లాంటివాని నిర్మాణానికి కావలసిన తీరుబడీ, తిండిపుష్టీ ఆనాటి ప్రజలకు ఉన్నదనుకోవచ్చు నంటారు. డి.డి. కొశాంబి.

బ్రహ్మగిరి, సంగనకల్లులలో ఇటీవల త్రవ్వకాలు జరిగేయి. చారిత్రక యుగారంభకాలపు మట్టిపొరను తవ్వేక, దానికింద 3 శతాబ్దాలపాటు సాగిన బృహత్శిలా దశ కనబడింది. ఇక్కడ 2 వేలకు తక్కువ గాకుండా సిస్ట్‌లు కనిపించేయి. దాని చుట్టూ రాతివలయాలున్నాయి. పక్క పలకలకి కన్నాలున్నాయి. సిస్ట్‌లో బాగా మెరుగుపెట్టిన ఎరుపు-నలుపు కుండలున్నాయి. ఈ సమాధులున్న ప్రదేశం చెరువుకూ, పంటభూములకూ సమీపంలో మిట్టమీదవుంది. బళ్ళారి జిల్లాలోని కోటకల్లు, మల్యాం, తోర్నగల్లు, బెలగుప్ప, జెర్రమల్లలలో ఎరుపు-నలుపు కుంచెలతోపాటు రాతి పనిముట్లూ, అనేకరంగుల గాజుకంకణాలు కూడ సిస్ట్‌లలో కనిపించేయి.

నూతనశిలాయుగపు ఉత్తరదశకు సంబంధించిన భూమిపొరలో నాగార్జునకొండ మీద ఇనుము యుగారంభకాలపు స్మశానం కనిపించింది. అది జనావాసానికి దూరంలో వుంది. నాగార్జునకొండ సమీపంలోని ఏలేశ్వరం తోవలో 135 చదరపు కిలోమీటర్ల మేరలో నాలుగు రకాల బృహత్శిలా సమాధులు కనిపించేయి. బౌద్ధస్తూపం దిగువన కనిపించిన సిస్ట్ రెండు అరలుగా వుంది. ఒక అరలో ఎరుపు-నలుపు కుండలతోపాటు మూడు పుర్రెలు, పక్క ఎముకులు, పొడుగు ఎముకలు పేర్చివున్నాయి. రెండో అరలో ఒకపుర్రె, ఎముకముక్కలు వున్నాయి. రెండో సిస్ట్‌కూడా అదే ఎత్తునవుంది. అయితే దీని గోడపలకకి కన్నం వుంది. మూడోది బౌద్ధస్తూపానికి కిందిగా వలయాకారంగా రాళ్లు పేర్చివుంది. దీనిలో ఒకగుండ్రని దిమ్మ, గడియారంగ్లాసు పెట్టుకునే దిమ్మ, నల్లని మెరుగు పెట్టిన మట్టికూజా కంకాళాలవద్ద పెట్టివున్నాయి. అవేగాక దస్తాగిన్నెల మాదిరి లోతైన పాత్రలు, ఎరుపు-నలుపు మట్టివాజ్, గళ్ళా ఆకారపు మూకుడుకూడా దానిలో వున్నాయి. నాలుగోది కుండ సమాధి. దానిలో మృతుని కంకాళభాగాలతోపాటు ఒక కై జారుమొనకూడా వుంది.

కృష్ణాజిల్లా గుడివాడ దిబ్బలలో ఇనుము యుగానికి ప్రత్యేకం అనదగిన అనేక పాత్రలు దొరికేయి. పొడుగుమెడ లోటాలు, ఈనాడు తయారువుతున్నమాదిరి కూజాలు, ఒకగిన్నె వెలుపలిభాగం శరంగాలమాదిరి నొక్కునొక్కులుగా చేయబడింది. మరోనల్లని మెరుగుపెట్టిన కుండ పై భాగం వలయాలు వలయాలతో చిత్రంగా వుంది. అక్కడే ఒక పెద్ద చట్టి దొరికింది. బహుశా ధ్యానం నిలువచేసుకొనేందుకుపయోగించివుంటారు. ముక్కాలలో ఇనుముయుగపు పాత్రలు ఏడు, ఒక గునపం, జారీకొమ్ము దొరికేయి.

కడప జిల్లా య్రెరగుంట్ల, అమివేపల్లెల వద్ద చాలా సమాధులు (సిస్ట్‌లు) దొరికేయి. వాటి నక్కడివారు పాండవులగుళ్లు అంటారు.

అనంతపురం పట్టణానికి 12 మైళ్ళలోవున్న కాలమేదునూరుమిట్టమీద నూతన శిలాయుగపు ఉత్తరదశనాటి జనావాసం కనబడింది. అక్కడ కత్తుల కర్మాగారం వుండేదేమో,



నాపరాతిముక్కలు పోగులుగా పడివున్నాయి. వాని మధ్య ఇనుముచిల్లు ముక్కలుకూడా చెదిరిపడి వున్నాయి. దీనినిబట్టి నూతనశిలాయుగ జనావాసం తర్వాత అక్కడే ఇనుముయుగపు జనావాసంకూడా ఏర్పడిందనుకోవలసివస్తుంది. అక్కడనే బాగా చిన్నచిన్నపాత్రలేగాని చాలా వరకు ఎరుపు-నలుపుతరహావి దొరికేయి. గుంతకల్లు రైలుస్టేషను సమీపంలో నూతనశిలయుగ, ఇనుముయుగ, జనావాసాలు పక్కపక్కన కనిపించేయి. ఈ జిల్లాలో ముదిగల్లులో, దేవాదులబెట్ట, మాల్యవంతం, కొండాపురం, పూలేరులలో సిస్ట్‌లు కనిపించేయి. ముదిగల్లులో ఈ సిస్ట్‌లు 6-7చరపు మైళ్లవిస్తీర్ణంలో చెదిరివున్నాయి. ఇవన్నీ దీర్ఘచతురస్రాకారపువి. నాలుగుపక్కలా నాలుగు రాతిపలకలు పైన ఏకపలక పేర్చివున్నాయి. వానిలో కొన్నిటికి పక్కపలకలలో చిన్నకన్నం వుంది. దేవాదులబెట్ట వద్ద సిస్ట్‌లమీద మూడు గుండ్రని మట్టి దిబ్బలున్నాయి. వానిచుట్టూ రాతిపలకలు పాతివున్నాయి.

కర్నూలుజిల్లా పత్తిపాడువద్ద దొరికిన పాత్రలలో నాలుగు రకాల బాణం ములుకులు కనిపించేయి. పత్తిపాడు, బస్తిపాడులలో అనేక రంగుల గాజు కంకణాలు కనిపించేయి. పత్తిపాడులో ఎర్రరంగు మట్టిచుట్టు కుదురూ, ఎరుపు-నలుపుల మూకుడు గిన్నె దొరికేయి.

మహబూబ్‌నగర్ జిల్లాలో ఇటీవల ఉట్నూరువద్ద జరిగిన తవ్వకాలలో ఇనుముయుగానికి సంబంధించి మంచి పనితనంగల ఎరుపు-నలుపు మట్టి పాత్రలూ, చారిత్రక యుగారంభంనాటి వానితో కలిసి కనిపించేయి.

నూరేళ్ళ క్రితం మెడోస్ టైలర్ నల్గొండజిల్లా నర్కెట్‌పల్లివద్ద వందలు వేల సంఖ్యలో సమాధిరాళ్ళ పోగులను కనుక్కొన్నాడు. ఈ పోగులలో ఆయనకు రెండు రాగిగంటలు, బల్లెములు, బల్లెపు మొనలుకూడా దొరికేయి. దేవరకొండ వద్దకూడా, కంకాళాలు, వానిమీద పేర్చిన రాళ్ళ పోగులు కనిపించేయి.

నిజామాబాదుజిల్లా తూర్పుకొసనుంచి తెలంగాణా అంతటా ఈ మాదిరి సమాధిరాళ్ళ పోగులు కనిపించేయి. ముఖ్యంగా మధిర, చింతకాని, డోర్నకల్, మానుకోట, రాయగిరి, మౌలాలీ, బాలానగర్, బేగంపేటలలో, ఈ రాళ్ళపోగుల చుట్టూ పెద్ద పెద్ద బండలు వలయాకారంగా పేర్చారు. ఇవి రైలుకట్ట వెంబడినే వుండడం గమనార్హం. మన పూర్వీకులు కూడా ఈ దారివెంబడే వుండేవారన్నమాట.

ఇటీవల కరీంనగర్‌జిల్లా పెద్దబంకూరువద్ద బృహత్శిలా సంస్కృతి కాలపు జనావాసం దొరికింది. ఇదివరకు దొరికిన బృహత్ శిలాసంస్కృతీ చిహ్నాలను వారి శవ సంస్కార పద్ధతిని బట్టీ గుర్తించారు. కాని, పెద్ద బంకూరువద్ద వారుకట్టుకొన్న కోట కనబడింది. దానిచుట్టుగోడ ఇటిక, అడుసుతో కట్టేరు. కోటలోపల ఎద్దుయొక్క కంకాళము, బృహత్శిలా సంస్కృతికి ప్రధాన లక్షణమయిన ఎరుపు-నలుపు మట్టి పాత్రలు కనిపించేయి. చాలా ఇనుప పనిముట్లూ, చిల్లిపొడిచిన నాణేలూ కూడ దొరికేయి. కోటలోపల మూడు నూతులున్నాయి. ఇది ఆ ప్రదేశంలో వెలసిన జనావాసం మొదటిదశ, రెండోదశ శాతవాహనుల కాలానికి సంబంధించినది, ఆ పొరలో శాతవాహనుల నాణాలు, రోమను నాణాలు, యుద్ధానికి, వేటకు వుపయోగించే పనిముట్లు మొదలయినవి దొరికేయి.

రాయచూరుజిల్లా హిక్లిహాల్‌వద్ద ఇనుము యుగపు గుహలు కనిపించేయి. హిరెబెనకల్‌మిట్ట దిగువన చుట్టూ రాళ్ళు వలయాకారంగా పేర్చిన సమాధులు, చిక్కబెనకల్ వద్ద సమాధులదొడ్డి,

శివపూర్‌వద్ద రెండు ఇనుముయుగ జనావాసాలు, లింగసుగూర్‌వద్ద రాతిసిస్ట్‌లు కనిపించేయి.

ఇల్లా ఎన్నేనా చెప్పుకుపోవచ్చు. అయితే ఆనాటి ప్రజల జీవిత విధానంలోని ఇతర అంశాలేవీ మనకి తెలియవు. వారి గ్రామీణ జీవితం పట్టణ జీవితం గురించి ఎరగం. దక్షిణభారతంలో నాగరికతకు నాందిపలికిన ఈ బృహత్‌శిలా సంస్కృతీ ప్రజల జనావాసాలను గురించి తెలుసుకునేందుకు గట్టి కృషి జరగవలసి వుంది.

అనంతపురం జిల్లా పాలవాయివద్ద దొరికిన బూడిదరాసులు ఇనుము కరిగించిన బట్టీలతాలూకువనీ, ఇతరత్రా చూసిన పేడపోగుల బూడిదరాసులు కాదనీ ఇటీవల జరిగిన తవ్వకాలలో బయట పడింది. ఇదే రుజువయితే దక్షిణ భారతంలో పెద్ద ఎత్తున ఇనుము కరిగించడం బృహత్ శిలా సంస్కృతి కాలంలో ప్రారంభమైందనుకోవాలి.

ఇంకో ముఖ్యవిషయం వుంది. వీరు లిపిని ఎరుగుదురా? తెలిసివుంటే మానవ శాస్త్రవేత్తలూ, పురాతత్వవేత్తలూ నాగరికతా లక్షణాలుగా పేర్కొనే లక్షణాలన్నీ వారికి వున్నట్లే. అయితే సాక్ష్యం ఏమీ దొరకడం లేదు. కాని హెచ్.డి. సంకాలియా కొన్ని వూహలు చేస్తున్నారు. మస్కి, బ్రహ్మగిరి, కుపగల్‌ల వద్ద అశోకశాసనాలు వున్నాయి. అక్షరాలు చదవలేనివాళ్ళకి ఆ శాసనాలు వేయడంలో అర్థంలేదు కదా. కనక ఆనాటి బృహత్‌శిలా సంస్కృతి ప్రజలకు లిపి తెలుసునని ఆయన వూహ. అదిగాక అశోకుడు తన శాసనాలలో ఆంధ్రుల్నీ, పాండ్యుల్నీ, చోళుల్నీ, పేర్కొంటాడు. మెగస్తనీస్ ఆంధ్రులవి కోటపట్టణాలు 30 ఉన్నాయంటాడు. వీనిని బట్టి దక్షిణ భారతంలో ఇనుముయుగంతో పట్టణ జీవితం అతివేగంగా విస్తరించిందనుకోవాలి.

పుదుచ్చేరి సమీపంలోని అరికిమేడువద్ద తవ్వకాలలో బయటపడిన తమిళ లిపి బ్రాహ్మిలిపిని పోలివుంది. అంటే ఆనాటి తమిళులు ఔత్తరాహుల లిపినీ దాక్షిణాత్యుల లిపినీ చదవగలిగివుండేవారనుకోవాలి.

ప్రధాన రహదారులవెంట ఉత్తర దక్షిణాలకు ప్రజల రాకపోకలు అధికంగా సాగి పట్టణ జీవితం త్వరగా బలపడిందనుకోవాలి.

ఇంక ఈ ప్రజలంతా ఎక్కడివారనే ప్రశ్న వుంది. ఇండియా, ఇరాన్, సరిహద్దు మండలాలలో బృహత్‌శిలా సంస్కృతి చాలా ఎక్కువగా పరిఢవిల్లింది. దీనిని ఆధారం చేసుకొని సంకాలియా మన బృహత్‌శిలా సంస్కృతి ప్రజ కొంతవరకు స్థానికులూ, కొంతవరకు పాశ్చాత్య సంపర్కంగలవారూను అంటున్నారు, పుర్రెల్ని పరిశీలించినప్పుడు మధ్యధరా ప్రాంతీయ లక్షణాలూ ప్రోటో – ఆస్ట్రలాయిడ్ లక్షణాలూ మిశ్రమం అయి కనిపించాయి. ఆయన అభిప్రాయం ప్రకారం క్రీస్తుపూర్వం ఏడెనిమిదివందల ఏళ్ళనాడు దక్షిణభారతంలో బృహత్‌శిలా సంస్కృతి వ్యాపించింది.

## ముగింపు

మన పూర్వుల సుదీర్ఘ జీవితం ఈ మాదిరిగా నడిచింది. మొదట పూర్తిగా ప్రకృతిమీద ఆధారపడి, అది ఏమిపెడితే అది తింటూ, నిరంతర ప్రమాదాలను ఎదుర్కొంటూ జీవించేరు. క్రమంగా జీవితాధారసాధనాలూ, పద్ధతులూ మెరుగుపరుచుకుంటూ, ఆ పనిలో జ్ఞానం పెంపొందించుకుంటూ ప్రకృతితో నిరంతర పోరాటం జరిపి, ఘన విజయాలు సాధించేరు. ఆహారం సేకరించుకు బతికేవారు ఆహారాన్ని ఉత్పత్తి చేసుకొనేవారయారు. పశువుల్ని



పెంచేరు. పంటలు పండించేరు. ఇళ్లు కట్టుకున్నారు. బట్టలు వేసుకున్నారు. ఇనుము కరిగించేరు. అడవులు నరికేరు. చెరువులూ, కాలువలూ తవ్వేరు. తమలోతాము సమన్వయపడ్డారు. జీవిత పోరాటాలలో మతాన్ని సాయం తెచ్చుకున్నారు. తమ కృషిలో సౌందర్యాన్ని ఉపాసించేరు చదవడం వ్రాయడం ప్రారంభించేరు.

ఈ జీవితయాత్రాగతిలో మనకు ఆరు అంశాలు అతిప్రధానంగా కనిపిస్తున్నాయి మొట్టమొదటిది: ఆదిమ సమాజంలోవున్న వైరుధ్యం మనిషికీ, ప్రకృతికీ మధ్యనే కానీ, మనిషికీ మనిషికీ మధ్యకాదు. ఒక వేపున ప్రకృతి మీద ఆధారపడుతూనే మానవుడు దానితో పోరాటం సాగించేడు. ఆ పోరాటక్రమంలో ప్రకృతిని మార్చడమేకాదు, తానూమారేడు. ఇందులో అతనికి పనిముట్లు బాగా సాయపడ్డాయి. అధికాధికంగా భద్రతను కూర్చుకుని జీవించడంకోసం మనిషి పనిముట్లుచేసుకుని, వానినుపయోగించుకొన్నాడు. మనిషి బతుకులో తిండిఒక్కటే ప్రధానం కాదన్నమాట నిజమే, కాని అతని బ్రతుకు తిండిమీదనే ఆధారపడివున్నదనికూడా గుర్తుంచుకోవాలి. ఉత్పత్తిసాధనాలు కొత్తవి కనుక్కున్నప్పుడల్లా జనాభా పెరుగుదల స్పష్టంగా కనిపిస్తూండడమే దీనికి దాఖలా.

రెండోది: తనతోడివారితోమనుష్యునికి వుండే సంబంధాలను నిర్ణయించేది ఉత్పత్తి సాధనాలే. ఉత్పత్తిసాధనాల స్థాయికిమించి సామాజిక నిర్మాణం పెరగదు. సాధనాలు చాలా ప్రాథమికదశలో వున్నప్పుడు, సంపదలను పరస్పరంగా పంచుకొంటూ సమసమాజ జీవితం గడపకతప్పదు. ఉత్పత్తిసాధనాలు అభివృద్ధిపొందడం, వ్యవసాయం పెంపొందడం జరిగాకనే వర్గాలూ, వానితోపాటు రాజ్యాంగము వచ్చేయి.

మూడు: ఉత్పత్తిసాధనాల అభివృద్ధి ఒకపథకం ప్రకారం జరిగిందేం కాదు. ప్రతి తరమూ తమ పూర్వీకులవారసత్వాన్ని అందుకొని, దానికి మెరుగులు దిద్దుకుంటూవస్తుంది.

నాలుగు: ఈ మార్పులు రాశిగతమూ, వాసిగతమూ కూడ. రాశిగతమైన పెరుగుదల ఒక్కమారుగ వాసిలో మార్పును తెస్తుంది. దానితో మానవుని జీవితపద్ధతే పూర్తిగా మారిపోతుంది.

అయిదు: మనిషి పనిముట్లను చేసుకోవడమేకాదు. అతనిలో మానసిక వాంఛలూ, ఉద్వేగాలూ వున్నాయి. ఇవి అతని ఆలోచనాశక్తిమీద ఆధారపడి వుంటాయి. ఆ ఆలోచనాశక్తి సుదూరంగానైతేనేం, అతని ఆర్థిక నిర్మాణాన్ని అనుసరించి వుంటుంది. కడుపునిండి నప్పుడే ఇతరవాంఛల పరిపూర్తికి ఆలోచన. లేకుంటే అతడు మనిషేకాజాలడు. సంగీతం, నాట్యం, కళలు, శాస్త్రాలు, నైతికసూత్రాలు, మతం మొదలైనవి ఇటువంటివే. వారి అలవాట్లు, ఆచారాలు, విశ్వాసాలు, కర్మకాండలు, పూజలు మొదలైనవి మనుష్యులలో ఐక్యతను దృఢపరుస్తాయి. విశ్వాసాన్ని కలిగిస్తాయి. జీవితంలో ఇబ్బందుల్ని ఎదుర్కోవడంలో ఏకోన్ముఖుల్ని చేస్తాయి.

ఇంక చివరగా: మనం ఈనాడు శాస్త్రసాంకేతికరంగాలలో సాధించిన అపార విజయాలకు గర్వం పొందుతున్నా, మనపూర్వులు, వీరోచితంగా, ఏకాగ్రతతో ప్రకృతి శక్తులు నెదుర్కొని సాధించిన విజయాలకు వారికెంతో కృతజ్ఞులమై వుండాలి. ఈనాడు వారి ఆటవికాచారాలు, అలవాట్లూ మనకు హాస్యాస్పదంగా వుండొచ్చు. ప్రకృతి శక్తుల్ని అదుపుచేయడంలో అద్భుతాలు సాధించినా, మానవులమధ్య సంబంధాలను హేతుబద్ధమైన విధంగా సర్దుబాటుచేసుకోలేక యుద్ధప్రమాదాలను, జాతిహత్యలను, ఆకలిచావులను తెచ్చిపెట్టుకొన్న మన నాగరికతాభివృద్ధికి మన తరువాతి తరాలవారు నవ్వుకోకుండా వుంటారా ?

రెండవ ప్రకరణం

# సజీవ చరిత్ర పూర్వదశ

## ఒక వింత పరిస్థితి

పురాతన సంస్కృతులు మాసిపోయి, వానిస్థానంలో నూతన సంస్కృతులు ఏర్పడడంగాక, భారతదేశంలో, పురాతన సంస్కృతులు మారుమూలలకు తప్పుకుంటూ నూతన, వినూతన సంస్కృతులకు రంగం వదిలేస్తూ వచ్చేయి. ఈ రెండు సంస్కృతులూ పరస్పరం ప్రభావితం చేసుకుంటూ పక్కపక్కనే జీవించడం మనదేశపు ప్రత్యేకత. మూలమూలలకు చేరిపోయిన ఆదివాసిప్రజలు వేర్వేరు దశల ప్రాచీన సంస్కృతుల అవశేషాల్ని నిరూపిస్తున్నారు. దక్షిణ భారతదేశంలో చెంచులూ, యానాదులూ వేల సంవత్సరాలుగా ఆహార సేకరణ దశనే అంటిపెట్టుకొని ఉన్నారు. ఆహారోత్పాదకులు చురుగ్గా విస్తరించి ఖాళీ నేలలు కరువైనకొద్దీ, ఈ రెండు తెగలవారూ జీవిస్తున్న మండలాలలోకి వచ్చేరు. అయినా వారు ఆహారోత్పత్తికి సిద్ధపడలేదు. దానికి బదులు అడుక్కోవడం, దొంగతనం ప్రారంభించేరు. వీరికి బ్రిటిష్ పాలకులు "నేరస్థజాతుల"ని పేరు పెట్టేశారు. దానికి కారణం వారు తమ కూటంలో గాక పైవాళ్ళ వస్తువులు తీసుకోవడం తప్పు, అది దొంగతనం అనుకోక పోవడమే. లోతట్టుప్రాంతాలలో వారి జీవితాల్ని పరిశీలిస్తే వారు వేలఏళ్ళుగా ఆహార సేకరణలోనే జీవించడం కనబడుతుంది. వారు పాతశిలాయుగ సంస్కృతి సంతానం. అంతకన్న ఖోండులు, కోయలు, సవరలు మొదలైనవారు అధిక నాగరికులు. వారు పశుపాలన ప్రారంభించేరు. పురాతన పద్ధతే అయితేనేం, వ్యవసాయమూ ప్రారంభించేరు. అయితే వీరుకూడా ఆహారోత్పత్తి పద్ధతులను మెరుగుపరచుకోవడంలో త్వరగా పురోగమించలేకపోయారు. ఇనుము కరిగించడం తెలుసుకున్న బృహత్ శిలా సంస్కృతి ప్రజలు త్వరత్వరగా వ్యవసాయం, చేతిపనులు బాగా వృద్ధిచేసుకోగలిగేరు.

తమపక్కనే బాగా పురోగమించిన సంస్కృతిగల ప్రజలుండగా ఈ ఆదిమ ప్రజలు మారకుండా వేలాది సంవత్సరాలు వుండడం ఎల్లా సాధ్యమయిందనే ప్రశ్న రాకమానదు.

దీనికి రెండు కారణాలు కనబడుతున్నాయి. భారతదేశంలో, ప్రకృతిలో లభ్యమయ్యే ఆహారపదార్థాలు అసంఖ్యాకం. ఒక్కజంతువుని కూడా చంపనక్కరలేకుండా భారతదేశ వాతావరణంలో మనిషి సులువుగా బతికెయ్యవచ్చు. ఆదిమ తెగలవారు ఈనాటికి ఇక్కడ



కొనసాగుతుండడానికి అదేకారణం-అంటారు డి.డి. కోశాంబీ.

అందులో ముఖ్యంగా దక్షిణదేశంలో తిండికుపయోగించే దుంపలు, గడ్డలు, ఆకులు, కాయలు, పళ్ళు అనేకానేకం. సంవత్సరం పొడుగునా ఏదో ఒకటి దొరుకుతూనే ఉంటుంది. కనక కొండలమీదా, అడవుల్లోనూ తిరుగుతూ తిండితెచ్చుకోవడం సులభం.

రెండోది - ఈ ఆదిమతెగలలో కొన్ని విశ్వాసాలూ, నమ్మకాలూ పాతుకుపోయి ఉన్నాయి. ప్రారంభంలో జీవిత పోరాటానికి అవి ప్రోత్సాహం, సత్తానిచ్చాయి. కాని, కాలక్రమంలో అవి పెరుగుదలకు ఆటంకకారులయి కూర్చున్నాయి. సాహసం, చొరవ ఉన్న తెగలు పాత ఆచారాల్ని వదిలేసి, వచ్చిన కొత్త అవకాశాల్ని వుపయోగించుకొని సుఖజీవితం వేపు పురోగమిస్తూంటే, వీరు పాతనమ్మకాల్నీ, మూఢాచారాల్నీ కర్మకాండల్నీ పట్టుకకూర్చుని, కొత్తమార్గాల వేపు చూడ్డానికి కూడా భయపడ్డారు. ప్రకృతి వారి అవసరాల్ని దండిగా తీర్చగలగడం చేతనే వారింతవరకూ మనగలుగుతున్నారు. ఈ విడ్డూర పరిస్థితినే కోశాంబి "సజీవ చరిత్ర పూర్వదశ" అన్నారు.

దీని అర్థం దేశంలో నాగరిక ప్రజా, ఆదిమప్రజా ఒకరినొకరు ఎరక్కుండా దూర దూరంగా వుండిపోయేరని కాదు. నాగరికులు ఆదిమవాసి ప్రజల విశ్వాసాలూ, ఆచారాలూ కొన్ని నేర్చుకొన్నారు. తమ సంస్కృతి ప్రభావం వారిలో కలిగించేరు. ఆహార సేకరణ కర్తలు ముడిపదార్థాలు, ప్రకృతి సంపదలూ నాగరికుల కిచ్చారు. వారినుంచి భాష, కొన్ని మతాచారాలూ నేర్చుకున్నారు. ఇంక నాగరిక వ్యవసాయదారులు ఎన్నో అడవిధాన్యాల్ని పంటలో పెట్టేరు. ఆదివాసుల కర్మకాండలు తామూ అనుసరించసాగేరు. ఇప్పటికీ ఆంధ్రమండలంలో గ్రామదేవతలకు ఎర్రరంగు పూయడం ఆచారం. ఇది జంతు బలులకు ప్రత్యామ్నాయంగా వచ్చింది. వర్ణవ్యవస్థలో ప్రాచుర్యంగా వున్న భోజన నిషేధమూ, అంతర్వివాహనిషేధమూ ఆదిమ తెగల లక్షణం. బ్రాహ్మణ మతంవారు పూజించే శివ, పార్వతి, కాళి వగైరా దేవతలు, ఏకకాలంలో అనేక మంది దేవతల్నీ, దేవుళ్ళనీ కొలిచే ఆచారం ఈ ఆదిమ ప్రజల నుంచి తెచ్చుకున్నదే.

ఈ పరస్పర ప్రభావక్రమం నడుస్తున్నా, గత శతాబ్ది మధ్యవరకూ ఈ ఆదిమ ప్రజాజీవితపు ప్రత్యేక లక్షణాలు కొనసాగుతూనే వచ్చాయి. బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ వచ్చి భారతీయ ఆర్థిక వ్యవస్థతో పాటు, ఆదిమ ప్రజల ఆర్థిక వ్యవస్థను కూడా భగ్నంచేసింది. దానిని కాపాడుకొనేందుకు ఆదిమప్రజలు చేసిన ప్రతిఘటన విఫలమయింది. తుపాకుల ముందు విల్లంబులు నిలవలేక పోయాయి. నూరేళ్ళకుపైగా ఆర్థిక, రాజకీయ, సైనిక దోపిడీ సాగినాక మిగిలిన అవశేషాలే మనకీనాడు కనిపించే ఆదిమతెగల జీవితం.

## చెంచులూ - యానాదులూ

చెంచుల, యానాదుల జీవిత పద్ధతులు, అలవాట్లు, వృత్తులు, లక్షణాలు ఆచారాలు, సంప్రదాయాలు పరిశీలిస్తే, వారు పాతరాతియుగ ప్రజల సంతానంగా చెప్పవలసి వుంటుంది.

వీరిద్దరి పూర్వులూ ఒక్కరే. ఇద్దరి నివాసభూమీ నల్లమలలే. మెకంజీ వ్రాతప్రతులలో ఈ ఇద్దర్నీ యానాది చెంచులని వాడితే, ఇతర బ్రిటిష్ అధికారులు చెంచు యానాదులన్నారు. ఇద్దరికీ వ్యవసాయం కిట్టదు. ఆహారంనిలవ ఎరగరు. కుదురు కట్టుబాటులేదు. ఇద్దరూ ఏకాంత ప్రదేశాలలో వుండడానికే ఇష్టపడతారు. ఋతువుల మార్పునిబట్టి, ఆహారం వెతుక్కుంటూ

మకాములు మారుస్తారు. వారి ఆహారపు అలవాట్లు ఒక్కటే. ఇద్దరిలో పెళ్ళీ, విడాకులూ కూడ బహు సులభం. ఇద్దరూ జంతుబలులూ, నరబలుల్నీ, వదిలేసారు. అయితే చెంచులు విల్లంబుల్నీ, తవ్వుకోలనీ వుపయోగిస్తారు. యానాదులు విల్లంబులు వదిలేసేరు. వారు జీవిస్తున్న ప్రదేశాలు ఇప్పుడు తెరిపిన పడడమే కారణం. అడవి యానాదులు వాటిని వుపయోగిస్తూ వున్నారు. ఈ ఇద్దరూ తమ భాష మరచిపోయి తెలుగునే వాడుతున్నారు.

చెంచుల సంచార జీవితాన్ని (17వ శతాబ్దం) ఫెరిస్టా వర్ణిస్తూ వారు గుహల్లోనూ, చెట్లకిందనూ వుంటారనీ, చెట్ల ఆకులు కట్టుకుంటారనీ, చర్మంతో కుట్టిన టోపీ పెట్టుకుంటారనీ, విల్లంబులతో వేటాడుతారనీ, చీరిన వెదురు రాపాడించి నిప్పుచేస్తారనీ వారు మాట్లాడే భాష నాగరికుల కెవరికీ అర్థం కాదనీ, వెండి, బంగారాల విలువ నెరుగరనీ అన్నాడు. తుపాకీ చప్పుడుకి భయపడి వారు కొండల్లోకి పారిపోయిన తీరు మనుష్యల్లో చూడలేదన్నాడు.

మరో రెండు శతాబ్దాల అనంతరం థర్స్టన్ అనే ఆయన వారిని గురించి వ్రాస్తూ, వారు చురుకుదనాన్నీ, లాఘవన్నీ మెచ్చుతారన్నాడు. ఎత్తైన చెట్టెక్కి పళ్ళూ, కాయలు కోయగలగడం స్త్రీత్వంయొక్క పరిపూర్ణతగా భావిస్తారన్నాడు.

వారి ఆటవిక జీవితానికి అనుగుణంగానే వారి ఆహారమూ వుంటుంది. మహబూబ్‌నగర్ జిల్లాలోని యానాదులు వివిధ జంతువుల, పక్షుల మాంసం తింటారు. ఎన్నో నెలలపాటు చెడిపోకుండావుండే నల్లగడ్డ, చామగడ్డ మొదలైన అనేక రకాల దుంపలు, అడవిమామిడి, వెలగ, తాడి, ఈత, చింత, అంగూర మొదలైన పళ్ళు, పాలకూర, దుగ్గలికూర మొదలయిన ఆకు కూరలు వారి ప్రధాన ఆహారం. ఇప్ప సారాయి మహా యిష్టం. తేనె, చింతపండు, వెలగపళ్ళు, మూలికలు, జంతుచర్మాలు మొదలైనవి పోగుచేసి వానినిచ్చి బట్టలు, ధాన్యం కొనుక్కుంటారు. దుర్గమస్థలాలలో వున్న తేనెపట్టులలోకి దారం కట్టిన బాణాలు వదిలి, దారం వెంబడి కారిన తేనెను సంగ్రహిస్తారు. తేనెకోసం తాళ్ళు పట్టుకొని వేలాడుతూ, చట్రాళ్ళ అడుగువేపున వున్న తేనెపట్టుల్ని తీసే సాహసాన్ని కడపజిల్లా "మాన్యుయల్"లో యార్డే వర్ణించేడు. లేత వెదురునార పేని తయారుచేసిన పగ్గాన్ని ఒకవ్యక్తి, చెట్టుకో గుంజకో కట్టి దానిని పట్టుకొని నిలువుగా వున్న కొండలోయల్లోకి దిగుతాడు. అంతకుముందే పొగపెట్టి తేనెటీగల్ని తరిమివేసి వుంటారు. ఆ పగ్గం పట్టుమీద అంతరాళంలో వూగుతూ అతడు పట్టును సమీపిస్తాడు. చేతిలోవున్న కర్రతో పట్టును పొడిచి వెంటతెచ్చిన తట్టలోకి పడేస్తాడు. పని జరిగాక పగ్గాన్ని వూపుతాడు. పైనున్నవాళ్ళు అతనిని చేదుకుంటారు. ఈ మాదిరిగా వారొకమారుపయోగించిన పగ్గాన్ని రెండోమారుపయోగించరంటాడు యార్డే.

అదే జిల్లాలో చెంచుల జీవితాన్ని (1943) హైమన్‌డార్ఫ్ వివరిస్తూ, వాళ్ళ నిజాయితీ, సత్యవాదిత్వమూ వేలుపెట్టి చూపలేనిది అంటాడు. అయితే బయటివాళ్ళ విషయంలో వానిని పాటించరు. తనకు తోచింది చెయ్యడమేకాని ఎవరు చెప్పినా వినడు. తనకిష్టంకాకపోతే సహాయ నిరాకరణ చేస్తాడు. పదిమందిలో సరదాగానే వుంటాడు. కాని పరిచయాలు పెంచుకోడు. తనకు అర్థం కాని దానియెడల ఆసక్తిచూపడు. అదృశ్య శక్తుల్ని గురించి భయపడడు.

చెంచులుండే ప్రదేశమంతా వేరు వేరు గ్రామాలుగా విభజింపబడి వుంటుంది. సగటున వూళ్లో 8-9 ఇళ్ళుంటాయి. ఆ ఇళ్ళు గుండ్రంగా, పైకి కొసదేలి వుంటాయి. తాటాకు నేస్తారు వానికి, కొద్దిపాటి కుండలు, ఒకేకర్ర తవ్వుకోల, విల్లు, అంబులు తప్ప ఇంట్లో ఏమీ వుండవు.



రేపటి మాటేమిటనే ఆలోచన వుండదు. మరునాటికని ఏమీ మిగల్చరు. వేటమీదనే బతుకు కనక, ఋతువులు మారడంతో, తరుచు ఇళ్ళూ మారుస్తుంటారు. అడవి పంట తమ స్వంతం అనుకుంటారు. శ్రమపడి తెచ్చిన వస్తువులయితే తమ స్వంతం. మిగతావన్నీ గ్రామ స్వంతం. విల్లంబులు మగవానివి. ఆడవాళ్ళకి గేదెలు అవీ వుంటాయి, అవి ఆమెకు పెళ్ళప్పుడు ఓలిగా వచ్చినవి.

చెంచులు ఎక్కడున్నా ఐకమత్యం చూపుతారు. పరస్పరసహాయం చేసుకుంటారు. సామాజిక కార్యాలకోసమూ, కర్మకాండ తతంగాలకీ పదిమందినీ ఏకంచేసే తెగవ్యవస్థ ఏదీలేదు వారిలో. కోయలు, సవరలు, ఖోండులలో అదుంది. వారి సామాజిక నిర్మాణం కుదురు (clan) వరకే. మేకల, గుర్రం, తోకల, అరటి, గుండం, విండ్ల మొదలైనవి వారి కుదురుల పేర్లు. ఆ కుదురు పేరే ఇంటిపేరుగానూ వుంటుంది. మేనత్త మేనమామల పిల్లలయితే తప్ప కుదురులో వాళ్లమధ్య వివాహం నిషేధం. స్థానికముఠాలో శాశ్వతసభ్యులూ, తాత్కాలిక అతిథి సభ్యులూ కూడా వుంటారు. సమాజానికి యూనిట్ కుటుంబం, చాలా కొండజాతుల్లో వుండే కుదురు అభిమానం చెంచుల్లో వుండదు. ఒకే కుదురులోని వేరువేరుతరాలు మగవాళ్లయితే తాతలు, తండ్రులు, కొడుకులు, మనమలు, ఆడవాళ్లయితే నాయనమ్మ, అమ్మ, కూతురు, మనమరాలు, వివాహ నిషేధం వున్న బంధుకుదుళ్లలోని వేర్వేరు తరాల వారు కూడా వారికి అన్నదమ్ముల బాంధవ్యమే. ఇంక ఇతర కుదుళ్లలోని వారంత బావలు, మరుదులు, అత్తలు, వదినలు, కోడళ్ళూ, అల్లుళ్ళూనే. చెంచుల సామాజిక వ్యవస్థ స్వరూపం ఇది. ఇందులో కుటుంబానికే, కుదురుకే ఎక్కువ ప్రాముఖ్యం ఉంది. మేనరికం పెళ్ళిళ్ళు నేటికీ దక్షిణభారతదేశంలో అన్ని తరగతులవారిలోనూ ప్రచలితంగా వున్నాయి. బహుశా ఈ ఆచారం ఈ ఆదివాసులనుంచే సంక్రమించునట్లు తోస్తుంది.

ప్రతి గ్రామానికీ ఒకపెద్ద వుంటాడు, కాని, అతనికి అధికారం ఏమీవుండదు. ఉత్సవాలలో తినడం, తాగడం తప్ప అతనికి ప్రత్యేక అధికారాలేవీ లేవు. ఎవ్వరూ నజరానా లివ్వడం వుండదు. తగవులు తీరుస్తాడు, కాని, ఆయనకు వ్యక్తిగతంగా పలుకుబడి వుంటేతప్ప, అతని మాటకు విలువ వుండదు. అతనికి శిక్షించే అధికారం లేదు. రెండుమూడు కుదురులమధ్య తగవులు వస్తే ఈ పెద్దలు కుదురులలోని ఇతర పెద్దలతో కలిసి వానిని పరిష్కరిస్తారు. నాగరిక సమాజాలలో కనిపించే దొంగతనం వంటి నేరాలు చాలా అరుదు. వ్యభిచారం, లేవదీసుకు పోవడం వంటి నేరాలు ఎక్కువ. వాటిని పెద్దలముందు పెడతారు. వారు విచారించి నేరస్థులకి జరిమానా విధిస్తారు. ఆ జరిమానా ఫిర్యాదికి చెల్లించడం వుండదు. పెద్దలకు విందుచేస్తారు. ఆ విందుతో చేసిన తప్పు సరి.

ప్రార్థనలు జరపడం, కర్మకాండలు జరపడం, మొదలైన పనులకై పురోహితులు చెంచుల్లో లేరు. సందర్భాన్నిబట్టి ఆయా దేవలతకు ఎవరికివారే ప్రార్థనలు చేస్తారు. ఆ ప్రార్థనలకి ఒక నిర్ణీత విధానం ఏమీ లేదు. తన మనసులోని భావాన్ని తెలుగులో చెప్పెయ్యడమే. "అమ్మా, గారెల మైసమ్మా, ఏమన్నా దొరికితే నిన్ను కొలుచుకుంటానుమ్మా! తల్లీ! నిన్నే నమ్ముకొన్నాం. దయచూడు తల్లీ" - అంటూ ప్రార్థిస్తారు. వేటనుంచి వచ్చేక "నీదయవలన దొరికింది తల్లీ, దండాలు" - అని నమస్కారం చేస్తారు. కాలంలో మొదటి పండు దొరికినప్పుడు, మొదటి ఇప్పపువ్వు నేల రాలినప్పుడు, చెట్లు ఎక్కేముందు గారెల మైసమ్మను పూజించవలసిందే.

వారి పెళ్ళిళ్ళూ, స్త్రీపురుష సంబంధాలూ పాతశిలాయుగాన్ని గుర్తుచేస్తాయి. వివాహ వయస్సు వచ్చిన యువతీయువకులు జంట కలియడానికి ఎన్నో అవకాశాలు. వివాహానికి పూర్వం దాంపత్య సంబంధాలు సర్వసామాన్యం. ఇష్టాపూర్తి సంబంధాలకు ఎవరూ ఏమీ అనరు. సాధారణంగా యువతి కోరికే నెగ్గుతుంది. కంటికి నచ్చిన పడుచు అయితే ఆమె గత జీవితం గురించి ఏ యువకుడూ పట్టించుకోడు.

చెంచులకూ యానాదులకూ మతమనేది లేనట్లే. అయితే వాళ్ళకి బోలెడన్ని నమ్మకాలు మాత్రం వున్నాయి. తాము నరసింహస్వామికీ చెంచీత అనే చెంచు పడుచుకూ పుట్టిన సంతానం అని చెప్పుకుంటారు. పండుగలప్పుడు నరసింహస్వామిని కొలిచినా, వారికి అనేకమంది దేవతలూ, దెయ్యాలమీద ఎంతో భక్తి. వేటకూ, ఇప్ప పూవుకూ దేవత గారెలమ్మైసమ్మ. ఆకాశదేవుడు భగవంతుడు. సుఖదాత గురువప్ప. దేవతలందరికీ దేవుడు లింగమయ్య. మశూచిదేవత పోచమ్మ. వీరుగాక మల్లమ్మ, మారెమ్మ, సుంకులమ్మ, నీడమ్మ, ఎల్లమ్మ ఇంకా ఎందరెందరో దేవతలున్నారు మంచికీ, చెడ్డకీ.

శరీరం నశించినా అందులో ఒకభాగం అయిన జీవం అజ్ఞాతలోకాలలో నివసిస్తుందని మహబూబ్‌నగర్‌జిల్లా చెంచుల నమ్మకం. అది బతికివున్న తన బంధువుల్ని కనిపెట్టుకొనే వుంటుందనుకుంటారు. మనిషి నిద్రపోయేటప్పుడు సంచారం బయలు దేరిన జీవుని అనుభవాలే కలలు అనుకుంటారు. బాగా జబ్బుచేసి స్మృతిలేనప్పుడు జీవుడు సంచారం పోయినట్లే మరణానంతరం పిండాన్ని కాకులో, కుక్కలో, మరే ఇతర జంతువులో తింటే జీవుడు ఆ జంతువులలో ప్రవేశించాడని భావిస్తారు. ఏ జంతువులూ, పక్షులూ ముట్టకపోతే భగవంతుడిలో ఐక్య మయ్యాడనుకుంటారు. పిండం మీద ఈగలు ఎక్కువగా వాలితే జీవుడు పిశాచం అయినట్లు భావన. అటువంటప్పుడు నేలమీద మనిషి బొమ్మగీసి ప్రార్థిస్తారు: "పెద్దపులిని మాకంట పడనీకు, ఎలుగొడ్డును మాకంట పడనీయకు, ఎక్కడికెళ్ళినా తిండి దొరికేలా చెయ్యి" చనిపోయిన బంధువుల్ని జ్ఞాపకం వుంచుకోడానికై, ఏడాదికోమారు వారి సమాధులమీద పిండాలు వేస్తారు. వారు శవాల్ని ఖననమే చేసేవారు. ఇటీవలనే దహనం ప్రారంభించేరు.

చెంచులవీ, యానాదులవీ ప్రత్యేకం పాటలంటూ లేవు. తత్కాలీన సమస్యల మీద నోటికి వచ్చినట్లు అప్పటికప్పుడు పాటకట్టేస్తారు. వాళ్ళనాట్యాలూ అంతే. డప్పు చప్పుడుని పట్టి ఎవరికితోచినట్లు వారు గంతులెయ్యడమే. సంవత్సరానికోమారు ఇప్ప పువ్వుసారాయి ఋతువులో పూర్తిగా త్రాగేసి, ఒళ్ళెరగని ఆనందంతో నాట్యాలు చేస్తారు. నెమలి నృత్యంతో, నల్లకోతి నృత్యంతో వారు వేటాడే విధానాన్ని అంతనూ ప్రదర్శిస్తారు.

మహబూబ్‌నగర్ జిల్లాలో చెంచులు పెళ్ళయినకొత్తలో కొన్నేళ్ళపాటు అత్తవారి వూళ్ళోనో, అత్తవారి యింట్లోనో వుంటారు. అనాథశిశువుల పోషణ తల్లివేపువారిమీద వుంటుంది. వేసవుల్లో మకాం మార్చినప్పుడు తోడబుట్టినవాళ్ళ దగ్గరకు గాక బావమరదులవద్దకే చేరుతారు. తేనె తీసే సందర్భాలలో సోదరులకన్న బావమరుదులను ఎక్కువ నమ్ముతారు. తమకు నచ్చినమగవాణ్ణి చేసుకొనేందుకై పడచులు చేసే సాహసాల కథలు చెంచుల్లో అధికం. ఇవన్నీ గమనించి చెంచులకు మాతృస్వామిక సంబంధాలు అధికమని హైమన్‌డార్ఫ్ అభిప్రాయపడుతున్నారు.



1860లో కర్నూలుజిల్లాలో అటవీపరిరక్షణచట్టాల్ని అమలుపరచడం ప్రారంభించక పూర్వం అక్కడిచెంచులు కూడా మహబూబ్‌నగర్ జిల్లాలో వాళ్ళలాగనే అతి నెమ్మదిగా, ఎవ్వరికీ బాధకలిగించనివిధంగా జీవించేవారు. ఆ చట్టాలు వారిపొట్టకొట్టేయి. ఇంక చిన్నచిన్న దొంగతనాలు ప్రారంభించేరు. వారిని దారిలో పెట్టడానికి ప్రభుత్వం అనేక పథకాలు వేసింది. కాని ఫలించలేదు. వారిప్పుడు ప్రభుత్వపర్యవేక్షణలో కంట్రాక్టర్లవద్ద కూలీలుగా జీవిస్తున్నారు.

ఇంక యానాదులు. 1921 జనాభాలెక్కల ప్రకారం వారి జనాభా నెల్లూరు (79000), గుంటూరు (18000), చిత్తూరు (11000) లలో ఎక్కువ. ఇతర జిల్లాలలో కూడా కొద్దిగొప్ప ఉన్నారు. 1835లో నెల్లూరు జిల్లాలోని శ్రీహరికోటదీవి బ్రిటిష్ పాలనలోకి వచ్చింది. అప్పటి కక్కడున్న యానాదులు ఆటవికదశలో వున్నారు. ప్రధానంగా పళ్ళు, కాయలు, దుంపలు, ఆకులు, వేటమాంసం మీదనే జీవించేవారు. జంతువులవేటలో, చేపలవేటలో నిపుణులు. నిర్భయంగా పెద్దపులుల్నీ, చిరుతపులుల్నీ, గండ్లనీ పట్టుకొనేవారు. అన్ని విషయాలలో వీరికీ, చెంచులకీ విశేషం తేడా లేదు. వున్నదేమన్నా నాగరిక ప్రపంచంతో వీరికున్న సంబంధాన్నిబట్టి వచ్చింది మాత్రమే. ఇద్దరూ మకాములు మారుస్తూ తిరుగుతుండేవారే. అయితే, యానాదుల తిరుగుడు ఇరుగు పొరుగు జిల్లాలను కూడా దాటుతుంది. ఇద్దరికీ వ్యవసాయం కిట్టదు. అయితే చెంచుల సంచారం దగ్గరదగ్గరలోనే కనక, వారు జంతువుల్ని మచ్చికచేయడం నేర్చుకున్నారు. ఇద్దరూ తమ అసలుభాషమరిచి పోయేరు. తెలుగే మాట్లాడతారు. యానాదుల మీద బ్రాహ్మణమత ప్రభావం ఎక్కువ. చెంచులు తవ్వుకోలను దుంపలు తవ్వడానికి, సజ్జచేను విరవడానికి వుపయోగిస్తారు. యానాదులు కేవలం నేల తవ్వడానికే దానినుపయోగిస్తారు.

యానాదులు మంచి ఆరోగ్యవంతులు. మందులంటే వారు ఇష్టపడరు. సర్పగంధివంటి మూలికలను వారు వ్యాధినివారణకు, మాదక ద్రవ్యాలు తయారు చేసుకోడానికి, విషాల తయారీకి కూడా వుపయోగిస్తారు. శ్రీహరికోటలో ఇతర జనాభా అందరినీ పీడించే బోదవ్యాధి యానాదులలో లేదని థర్‌స్టన్ వ్రాసేరు.

ధాన్యపు పొలాల సమీపంలో వుంటారేమో యానాదులు ఎలకల్ని పట్టడంలో అసాధారణమైన నేర్పు గలవాళ్ళు. కోతలయిపోగానే ఎలకకన్నాలు తవ్వి అతినేర్పుగా వానిని పట్టుకుంటారు. వేసవిముందు చెరువుల్లోనూ, దొరువుల్లోనూ చేపలు పడతారు. వెదురు, తీగలతో అల్లిన మావులు వారికి వేటలో పనిముట్లు. వీనినే కొడుములు అని పిలుస్తారు. పందికొక్కులు, నీటిపక్షులు, కొంగలు, తాబేళ్ళు, చెవులపిల్లుల్ని కూడ పట్టుకుంటారు. వీనిని నిప్పులమీద కాల్చితింటారు.

వీరిలో ముఖ్యంగా రెండు తరగతులు మంచి, చెల్ల లేక రెడ్డి, కప్పల–వున్నాయి. అడవి యానాది, సోమరియానాది మొదలైన తరగతులూ వున్నాయి. ఈ విభజనకు మూలం వారు తినే తిండి, వుండే చోటూ, చేసే పానున్నూ. వీరి కుదుళ్ళు నిమ్మల, చొక్కల, కట్టెల, తుపాకుల, ఏకులపులి, యిండ్ల మొదలైన పేర్లతో వుంటాయి. రావూరు, పొట్లూరు, అల్లూరు వంటి గ్రామనామాలు; దొడ్డి, వెన్నెంబాక, తోట్ల, మల్లవరపు వంటి పై కులాలు ఇంటిపేర్లు తమ ఇంటిపేర్లుగా వుపయోగించుకుంటారు. కుదురులో వివాహనిషేధం, మేనరికం, దాంపత్యసంబంధాల స్వేచ్ఛ మొదలైన అన్నింటా చెంచులవీ, యానాదులవీ ఆచారాలు ఒకే విధంగా వుంటాయి. తెగ, కుదురు కట్టుబాట్లంటూ లేవు. న్యాయనిబంధనలు లేవు. అధికారం

గల గ్రామపెద్దలు లేరు.

మాంసంకోసం కూడా యానాదులు జంతువుల్ని పెంచరు, రేపటికి వుంచుకోవటం అనేది ఎరగరు. పొద్దుట గంజేనా తాగకుండా పనిలోకి వెడతారు. ఆనాడు సంపాదించుకొన్నదీ, తెచ్చుకొన్నదీ ఆనాడే అయిపోతుంది. కర్నూలుజిల్లాలో కొద్దికొద్ది భూములిచ్చి యానాదుల్ని వ్యవసాయంలో అలవాటుచేయడానికి ప్రయత్నం జరిగినట్లూ, వారుత్సాహమే చూపనట్లూ జిల్లా "మాన్యుయలు" చెప్తూంది. 1927లో నెల్లూరు జిల్లా కలెక్టరు 200 మంది యానాదులకు సులభంగా తరిసాగు కాగల బీడుభూములు కేటాయించేరు. ఆ భూముల్ని సాగులో పెడితే ఎకరం వెయ్యిరూపాయలు ఖరీదు చేసే స్థితి వున్నా, యానాదులు తమకిచ్చిన భూముల్ని ఎకరం అర్ధరూపాయిచేసి అమ్మేసుకున్నారు.

అటవీచట్టాల ప్రకటన యానాదులమీద చావుదెబ్బ తీసింది. ఇంక బతుకుతెరువు కోసం వారు దొంగతనాలకు దిగక తప్పలేదు. అయితే హత్యలూ, దొమ్మీలవంటి దుర్మార్గాలకి వారు పూనుకోరు. ఇంక వీరికోసం ప్రభుత్వం సెటిల్మెంట్లు పెట్టింది. అక్కడ లంచాలు, హింసలూ రాజ్యమేలేయి. కాని, అదీ వుపయోగించలేదు. 1924లో వారిమీద నేరస్థజాతుల చట్టాల నమలుపరచడం ప్రారంభించేరు. అతిసామాన్యనేరాలకు కూడా దీర్ఘకాల శిక్షలు విధించే అధికారం మేజిస్ట్రేట్లకు ఇచ్చేరు. ఈనాడు వారిలో మగవారు పొలంకాపలా పనులూ, ఆడవాళ్ళు పాచిపనులూ చేసుకు బతుకుతున్నారు. భూస్వాములకూ, ధనికరైతులకు నమ్మకమయిన పాలేర్లుగా వుంటున్నారు.

యానాదులకు ఒక స్థిరజీవితమంటూ లేకపోవడంచేత, వారివి అనదగిన సాంస్కృతిక సంప్రదాయాలు ఏర్పడలేదు. గతంలో వేటనూ, ఆహారసేకరణనూ చూపించే నాట్యాలు చేసేవారు – ఆడా, మగా కలిసి. ఇప్పుడవీలేవు. వట్టి కుప్పిగంతులు మాత్రమే. కోతలు పూర్తి అయాక తీరికగా వున్న రైతులు కోరి వారిచేత హరిశ్చంద్ర, నలుడు, రాముడు–సీత, నరసింహ, చెంచులక్ష్మి వంటి కథలు చెప్పిస్తుంటారు. ఇవి పాట, పదం, నృత్యం అన్నింటితో సాగుతాయి.

చెంచులమీదకన్న యానాదులమీద హిందూమత ప్రభావం అధికంగా వున్నదని పైనచెప్పేను. వారుపూజించేదేవుళ్ళూ, దేవతలూ మూడు తరహాలు. హైందవపురాణ దేవుళ్ళు రాముడు, కృష్ణుడు, వెంకటేశ్వర్లు వగైరా అంతా ఒక తరగతి. చెంచుదేవుడు వాళ్ళ స్వంతదేవుడు. ఒక రాతి పలకను పెట్టి ఈ దేవుణ్ణి పూజిస్తారు. ఈ రెండూ గాక గారెలమైసమ్మ, పొలిమేరమ్మ, మహాలక్ష్మమ్మ వంటి గ్రామదేవతల్ని పూజిస్తారు. నాగపూజ కూడ వీరిలో ప్రాచుర్యంగానే వుంది. పొలిమేర అంటే తెలుగులో గ్రామ సరిహద్దు. ఆదికాలంలో గుంపుగుంపుకీ కొంతమేర నిర్ణీతమయి వుండేది. ఆ హద్దు వెలుపల హక్కు వేరొక గుంపుది. ఈ ఆచారాన్ని పొలిమేరమ్మ పూజ సూచిస్తుంది.మరణానంతర జీవితంమీద వీరికి నమ్మకం వుంది. చనిపోయిన వారికి కర్మకాండ జరిపిస్తారు. శవఖననం ఆచారం. శవాన్ని సమాధిలోకి దింపినాక అతని దగ్గరబంధువు వచ్చి ముమ్మారు అతనిని పేరుపెట్టి పిలుస్తాడు. సమాధానం రాకపోవడం అతని ఆత్మకు ఆ శరీరంలో తిరిగి ప్రవేశించే ఇచ్ఛ లేకపోవడంగా భావిస్తారు.

యానాదులలో సోదెచెప్పడం ఎక్కువ. వారు చెప్పే సోదెకి ఒక క్రమం, అర్థం వుండదు. నోటికి వచ్చింది చెప్పేస్తుంటారు. వినేవారు అర్థాలను వూహించుకుంటారు. సోదె చెప్పేదశలో వారొక తన్మయావస్థలో వుంటారు. దానిని ఒక విధంగా ఆత్మవంచనగా



తీసుకోవాలేగాని, వంచించే వుద్దేశంతో ఆ మాటలు చెప్తున్నారనుకోరు.

## కోయలు

చెంచులూ, యానాదుల్లా కాకుండా ఆంధ్రప్రదేశ్ ఈశాన్యభాగాలలో నివసించే కొండజాతులు సామాజికాభివృద్ధిక్రమంలో కొంత ఉన్నతస్థాయిలో వున్నారు. వారిని నూతన శిలాయుగ ప్రజల సంతానంగా చెప్పవచ్చు. ఆహారసేకరణ అలవాట్లు కొన్ని మిగిలినా, వారు ప్రధానంగా ఆహారోత్పాదకులు. చెంచులూ యానాదుల్లా గాక వారు కొంతకొంతగా స్థిర నివాసాలకు అలవాటు పడ్డారు. ఇరుగుపొరుగు ప్రజల ప్రభావం వున్నా, వారు తమ తమ భాషలనే మాట్లాడుతారు. వారు కుదురులూ, తెగలుగా ఏర్పడి వారి నియమ నిబంధనలు పాటిస్తారు. ఆచారాలూ, సంప్రదాయాలూ పాటిస్తారు. కులపెద్దలూ, పురోహితులూ కులంలోని వారి మీద పూర్తి అధికారం కలిగి వుంటారు. వివాహ వ్యవస్థ కుటుంబాన్ని పట్టి వుంచుతున్నా, స్వేచ్ఛాచార అవశేషాలు మిగిలే వున్నాయి. జంతుబలులు ప్రముఖస్థానం వహించే కర్మకాండ చాలా విస్తృతరూపంలో అమలులో వుంది. వారికి చదువనూ, రాయనూ తెలియకపోయినా వారి సాంస్కృతికస్థాయి హెచ్చయినదే. భాషా శాస్త్రవేత్తలు నిశిత పరిశీలనలు జరిపినాక వీరి భాషలు తెలుగులాగే ద్రవిడభాషా కుటుంబానికి చెందుతాయని నిర్ధారించారు.

కోయలు గోదావరికి ఇరువేపులా ఇంద్రావతీ సంగమ ప్రాంతం నుంచి ఖమ్మం మెట్టు వరకూ ఉత్తరాన బస్తరు, విశాఖజిల్లాలో మలక వగిరివరకూ వ్యాపించి వున్నారు. వారు కోయభాషనే మాట్లాడతారు. అయితే తెలుగు కూడా వచ్చు. పోడు వ్యవసాయం వారి ప్రధాన వృత్తి. అడవిలో కొంతమేర చెట్లు నరికి వానినక్కడే తగలపెడతారు. నేల తవ్వడం ఏమీ లేకుండా ఆ బూడిదలోనే విత్తనాలు చల్లుతారు. అల్లా రెండుమూడు పంటలు తీసేక మరోచోటికి మారుతారు. పశువుల్ని కూడా పెంచుతారు. అప్పుడప్పుడు వేటకూ వెడతారు.

వారి నిజాయితీ చూస్తే ఆనందం కలుగుతుంది. తాగుడూ, ఖర్చుతనం చూస్తే జాలేస్తుంది. నిరాడంబరత, భీరుత్వం, అహంభావం, ఆశ్చర్యం కలిగిస్తాయి. హద్దులేనన్ని మూఢాచారాలు చూస్తే వెలుపరం కలుగుతుంది. తప్పనిసరయి వచ్చినప్పుడు ఎంతో ధైర్య సాహసాలు చూపుతారని కోయల గురించి గోదావరిజిల్లా "గెజిటేర్" వర్ణించింది.

పంటల కాలానికి గ్రామ ప్రజలంతా మంచెలు కట్టుకొని చేలకాపలాకి పూనుకుంటారు. వారు సజ్జలూ, మొక్కజొన్నలతో అంబలి కాచుకు తాగుతారు. ఇప్ప పువ్వు సారా చాల ఇష్టం.

కొండతెగల అందరిలోలాగే కోయలలోనూ భూమిమీద ప్రత్యేక స్వత్వం లేదు. తమ పరిసర భూముల మీద కుదురుది స్వత్వం. బస్తరు పీఠభూములలో నివసించే వారిని గుట్టకోయలనీ, నదీతీర ప్రాంతాలవారిని కొమ్ము కోయలనీ పిలుస్తారు. గుంపు వెలుపల భోజన భాజనాలూ, వివాహాలూ, నిషిద్ధం. వీరిలో రాచకోయలు, లేక దొరకోయలు అంటూ వున్నారు. వారి సంఖ్య బహుళం. తాము వున్నతులమని వారి భావన. కోయగుంపులలో గట్టలనే విభజన వుంది. ఈ గట్టలను ఒకటోగట్టు, రెండో గట్టు అంటూ అంకెలపేరున పిలుస్తారు. గట్టులో వారి మధ్య భోజన భాజనాలూ, వివాహ సంబంధాలూ నిషిద్ధం. ప్రతిగట్టుకు కులపెద్ద, పురోహితుడు ఉంటారు; సమితి వుంటుంది.

భీముడు వేటకు వచ్చి ఒకామెను కలిశాడనీ, తాము వారి సంతానం అనీ కోయలు

చెప్పుకుంటారు. స్వర్గం అనేది పెద్ద కోట అనీ, అక్కడ ధాన్యం దండిగా వుంటుందనీ, నరకమనేది పట్టి గయాళుభూమి అనీ, అక్కడో ఇనపకాకి ప్రజల్ని హింస పెడుతూంటుందనీ వారి నమ్మకం. పాలముని (పాలకు ఆదిదేవత), నీళ్ళముని (నీళ్ల ఆదిదేవత), క్రొరరాజా (క్రొరలకు ప్రభువు) ఇల్లాగే ప్రతిదానికీ ఓ ఆదిదేవతను కొలుస్తారు. కొండమ్మ, భైరమ్మ అంటూ ఎందరో కొండదేవుళ్ళూ, దేవతలూను, భీముడూ, అడవి కుక్కలూ ఆ దేవతలకి వార్తాహరులనే నమ్మకం. అందుచేత వాటినికూడా పూజిస్తారు. గ్రామాలలో కలరా వ్యాపించినప్పుడు పోలేరమ్మ రోగుల్ని ఊరు దాటించి ఎక్కడో ఉత్తరదిశగా తీసుకుపోతుందనుకుంటారు. ఆమె తమ వూరు విడిచిపోవాలని కోరుతూ కోళ్లు మొదలైనవానిని బలి యిస్తారు. ఆ అమ్మను మంచి చేసుకోడానికి ఒకప్పుడు నరబలులిచ్చేవారు. దానిని నిషేధించాక ఇప్పుడు నల్లకోతిని బలి ఇస్తున్నారు. దానికి 'ఏకరొమ్ము పోతు అని పేరెట్టేరు. చదును రొమ్ముగల మగది అని దాని అర్థం. దేవత ఆ కోతిని మనిషిగానే భావించి తృప్తి పడుతుందని వారి ఆలోచన. 1879-80లో జరిగిన రంప పితూరీనాడు కోయలు తమకు పట్టుబడిన పోలీసులెందరినో తమ దేవతకు బలి యిచ్చేరు.

ఈ దేవుళ్ళూ, దేవతలూ గాక వేల్పులంటూ మరికొందరిని కొలుస్తారు. ఒక అడుగులోపు లోహపు ముక్కను ఒక వెదురుబొంగులో పెట్టి, జనసంచారం లేనిచోట అతి రహస్యంగా దాస్తారు. అదే వేల్పు. ఈ వేల్పుల్ని ప్రత్యేక సందర్భాలలో కొలుస్తారు. ప్రతి గట్టుకీ, ప్రతి కుటుంబానికీ వేల్పులుంటారు. అంటు రోగాలు వ్యాపించినప్పుడూ పంటలు చెడిపోయినప్పుడూ ఈ వేల్పుల్ని వూరేగిస్తారు. కోయతెగకంతకూ ఒక ముఖ్య వేల్పు వుంటుంది. దానిని వూరేగించేటప్పుడు మిగిలిన వేల్పులంతా వెంట వస్తాయి. పెద్దల్ని పూజించేటప్పుడు మాత్రమే కుటుంబవేల్పుని తీస్తారు.

కోయలకు చేతబడుల మీద చాలా నమ్మకం. మనిషి సహజంగా చచ్చిపోయేడంటే వాళ్ళు ఒప్పుకోరు. శత్రువు చేతబడి చేయిస్తేనే మనిషి చచ్చిపోతాడనుకుంటారు. ఆ చేతబడి చేయించిన శత్రువు పేరు సోదెలో వస్తుంది. ఇదివరకు వానిని చంపేసేవారు. ఇప్పుడు వానిని కొన్ని కష్టాలకు గురిచేసి వదిలేస్తున్నారు.

ఇష్టం ప్రకారం, ఓలి యిచ్చి పెళ్ళిళ్ళు జరపడం మామూలు. అప్పుడప్పుడు వధువు ఒప్పుకోకపోతే ఎత్తుకుపోయి చేసుకోడం జరుగుతుంటుంది. కోయ గ్రామాలలో బ్రహ్మచారులుండేందుకొకటీ, పెళ్ళికాని పడుచులుండేందుకొకటీ పాకలు వుండేవనీ, రాత్రులు వారు అందులోనే పడుకుంటారనీ థర్స్టన్ వ్రాశారు. పెళ్ళినాడు రాత్రంతా నాట్యాలు, పాటలతో కోలాహలంగా వుంటుంది.

శవాల్ని వీరు దహనం చేస్తారు. ఆవునో, ఎద్దునో బలి యిచ్చి దాని తోకను అతని చేతిలోనూ, ప్లీహాన్ని నోట్లోనూ పెడతారు. భార్య పుస్తెను అతని పక్కన పెడతారు. దహనానంతరం బూడిద పోగుచేసి, ముద్దలా చేసి ఒక కన్నంలో పెట్టి, దానిని రాతిపలకలతో మూస్తారు. దానిమీద రాళ్ళు నిలువునా నిల్పెపెడతారు. అదే సమాధి. చనిపోయినవాని స్నేహితుడెవరన్నా, ఎప్పుడన్నా ఆ పక్కనుండి వెళ్ళడం తటస్థిస్తే, గౌరవ సూచకంగా కొంచెం పొగాకును ఆ సమాధిరాతి మీద పెట్టి పోతాడు. కర్మకాండ అనంతరం విందులూ, వినోదాలూ జరుపుతారు. చనిపోయినవాని ఆత్మశాంతికది అవసరమని వారి అభిప్రాయం.



పంట వచ్చినపుడు కోయలు విందు చేసుకొంటారు. ఆ విందులో అందరూ నాట్యాలూ, నృత్యాలలో పాల్గొంటారు. జొన్నకోతకి, ఇప్ప కోతకి, మామిడికోతకి, ఇల్లాగే సంవత్సరంలో అనేక విందులూ, వుత్సవాలూ జరుగుతాయి. సంవత్సరానికోమారు చైత్రోత్సవం అని చేస్తారు. అది పెద్ద కోలాహలంగా జరుగుతుంది. అప్పటికి పనులేం వుండవు. పోడు కాల్చేస్తారు. తాళ్ళు గీసేసి వుంటారు. ఇప్పపువ్వు రాలుతూంటుంది, ఆ నెలంతా వారు విందులూ, తాగుడు, నాట్యాలతోనే గడిపేస్తారు. ఈ నాట్యాలలో పడుచులొక పంక్తిగా, పడుచువాళ్ళొక పంక్తిగా నిలబడి, ఆశువుగా పాటలు పాడుతూ, మహోత్సాహంతో నాట్యం చేస్తారు. పడుచువాళ్ళు అడవిలోకి ఇప్పపువ్వు ఏరుకు రావడానికి బయలుదేరుతారు. అవివాహితుల మధ్య దాంపత్య సంబంధాలు ఏర్పడేందుకప్పుడు అవకాశాలు ఎక్కువ. ఈ నెలలోనే ఎక్కువగా వేట కూడ సాగుతుంది. దేనినీ చంపకుండా వట్టి చేతులతో వచ్చినవాళ్ళని ఆ రాత్రి ఆడవాళ్ళు వూళ్ళోకి రానివ్వరు. తరువాత నేలతల్లి కొలుపు చేసి ఆ తరువాత చేలల్లో విత్తనం చల్లుతారు.

కోయల వినోదాల్లో నృత్యం బాగా ప్రాచుర్యం అయినది. వూరిలోని స్త్రీ పురుషులు పిల్లల నుంచి వృద్ధులవరకూ దీనిలో పాల్గొంటారు. మగవాళ్ళు తలలమీద దున్నకొమ్ములు అమర్చుకుంటారు. ఆడపిల్లలు ఒకరి భుజాలమీద ఒకరు చేతులు వేసుకుని వలయాకారంగా నిలబడి డప్పుల లయకు అనుగుణంగా నృత్యం చేస్తారు.

## కొండరెడ్లు

ఒకప్పటి పాల్వంచ సంస్థాన మండలంలోనూ, తూర్పు గోదావరి మన్య ప్రాంతాలలోనూ (భద్రాచలం, నూగూరు, చోడవరం, ఎల్లవరం, పోలవరం తాలూకాలు) కొండరెడ్లు కనిపిస్తారు.

కోయలకులాగే వారిదీ ప్రధాన వృత్తి పోడు వ్యవసాయమే. అడవి చట్ట నిబంధనల కారణంగా వారు వేటాడడం తగ్గిపోయింది. అయితే ఆత్మరక్షణకు అడవి జంతువుల్ని చంపుతూనే వుంటారు. ఉడతలు, ఎలుకలు, చుంచులు, తొండలు, పీతలు మొదలైన వానినీ, కాకీ, గద్దా తప్ప మిగిలిన పక్షుల్నీ వారు ఆహారంగా వుపయోగిస్తారు. చేపలవేటకి వారు చేతివలలూ, గాలాలూ మాత్రమే వుపయోగిస్తారు. చేపల పడవలు గ్రామం ఉమ్మడి ఆస్తి. జీలుగు చెట్ల నుంచి కల్లు తీస్తారు. ఆ చెట్టు బెరడు కింద వుండే మెత్తని కండను తీసి దానితో అంబలి కాచుకుంటారు. ఈ చెట్టు కల్లు చాలా పుష్టినిస్తుందని చెప్తారు. వెలిచందగడ్డ వంటి దుంపలు, మెంతికూర, దుగ్గలి కూరవంటి ఆకుకూరలు, లేత వెదురు మొలకల్నీ కూరలకు వుపయోగిస్తారు. ఈ సమపాళ్ళ ఆహారం కారణంగానే మైదాన ప్రజలకన్న కొండరెడ్లు చాలాబలంగా వుంటారంటారు.

బంధువుల యిళ్ళకు పోయినప్పుడు తమ కొత్త పంట నుంచి ఏ కొంచెమో బహుమతిగా తీసుకెళ్ళడం వీరి ఆచారం. పొరుగూరు నుంచి వచ్చిన అతిథుల్ని ప్రతి కుటుంబం ఎన్నో రోజుల పాటు ఆదరించడం ఆచారం. స్త్రీ పురుషులందరికీ అతిథి మర్యాద చేయడం ఉత్కృష్ట ధర్మంగా భావించబడుతుంది. తెచ్చిన వేటను అన్ని కుటుంబాలవారు పంచుకోడం ఆచారం. ఈ విధంగా పంచుకోడం వేటకు మాత్రమే పరిమితం. అది నిలవ వుండకపోవడమే దీనికి కారణం. ధాన్యాన్నీ, కూరల్నీ పంచుకోరు. ఉత్సవాలప్పుడు ప్రతి కుటుంబం తనవంతు ఆహారాన్ని తెస్తుంది. సమిష్టి భోజనాలు గ్రామ కట్టడికి చిహ్నాలు. వ్యక్తి చేసిన నేరాల్ని అతడు

చేసిన విందులో పెద్దలు పాల్గొంటే, క్షమించినట్లే. కొండతెగలందరిలోనూ ఈ ఆచారం వుంది. వ్యభిచరించిన నేరంకన్న బంధువుల యెడ అనాదరం గొప్ప తప్పిదంగా వీరు భావిస్తారని హైమన్ డార్ఫ్ అంటారు.

గ్రామమూ, కుదురూ వారి సామాజిక వ్యవస్థకు ప్రాతిపదికలు. భూమి అంతా గ్రామం ఉమ్మడి ఉత్సవాలూ, కర్మకాండలూ సర్వం ఉమ్మడిగానే జరుపుతారు. ఊళ్లోకి పైవారెవరు వచ్చి కాపురం పెట్టినా వద్దనరు. అందుచేత గ్రామంలోని కుటుంబాలన్నీ ఒకే కుదురుకు చెందినవై ఉండవు. కనక గ్రామంలోనే పెళ్ళి సంబంధాలు కుదరడం అసంభవం కాదు. గ్రామంలోనివారందరికీ సమాన హక్కులుంటాయి. అందరూ పరస్పరం సహకరించుకొంటారు. గ్రామపెద్దను పెద్దకాపు అంటారు. ఆయనకు ప్రత్యేకాధికారాలు వుండవు. కాని, ఆ హెూదా మాత్రం వంశ పారంపర్యం. ఆయన నిర్ణయాలు గ్రామసమితి ఆమోదిస్తేనే చెల్లుతాయి. ఆయనే పురోహితుడుగానూ పని చేస్తాడు. అయితే కొన్ని ఊళ్ళలో పురోహితులు వేరే వుండడం వుంది. గ్రామ సమితి అన్నది నామమాత్రం. సాధారణంగా గ్రామంలోని పెద్దవాళ్ళే నిర్ణయాత్మకపాత్ర వహిస్తారు. కుదురు కట్టుబాట్లను అతిక్రమించినా, వ్యభిచార నేరం చేసినా, లేవదీసుకుపోయినా జరిమానా వేస్తారు. పైన చెప్పినట్లు, దానితో పదిమందికి విందుచేసి, తాగబొయ్యడమే జరుగుతుంది. పెదకాపుకన్నా, గ్రామ సమితి కన్నా కులం పెద్దకు ఎక్కువ అధికారం ఉంటుంది. ఆయన పెద్దరికం చాలా గ్రామాలకు విస్తరించి చెల్లుతుంది. లేవదీసుకుపోయిన నేరాలతోనూ, పెళ్ళిళ్ళకు సంబంధించిన తగవుల్లోను ఆయన కలగజేసుకుంటాడు. అటువంటి సందర్భాలలో గ్రామపెద్ద ఆయనను గ్రామసమితి సమావేశానికి అధ్యక్షునిగా కూర్చుండబెడతారు. ఈ రెండు ఉద్యోగాలు పరస్పర సహాయకాలు. విచారణ అనంతరం నేరస్థుడు ఓ ప్రమాణం చేస్తాడు. "భూమితల్లీ! నేనీ తప్పు చేయలేదు. చేసినట్లయితే, తల బద్దలయి చచ్చిపోతా" – అతడు నిజంగా నేరం చేసి వుంటే మరునాటికల్లా తల బద్దలయి చచ్చిపోతాడనే వారి నమ్మకం.

కుదురు అన్నది గ్రామంకన్న పెద్దది. వివాహాలను ధృవీకరించడమూ, సమాజంలో సమైక్య భావాన్ని దృఢపరచడమూ దాని ప్రధాన బాధ్యతలు. ప్రతి కుదురుకు ఒక పూర్వ పురుషుడుంటాడు. దానికో ఉపనామం – ఇంటి పేరు ఉంటుంది. పాల్వంచ ప్రాంతంలో కనిపించే ఇంటిపేర్లలో కొన్ని : పోగల, వెంట్లగుర్గుంట్ల, చింతల, గొర్లి మొదలయినవి. కుదురుల మధ్య పోటీ పేచీలు వుండవు. అనేక కుదురులు కలిసి ఒక తెగగా ఏర్పడుతుంది. ఆ తెగ పేరు కొండరెడ్లు.

వారిలో చనిపోయినవారిని ఖననం చేయడమూ, దహనం చేయడమూ కూడా వుంది. వెనకటి రోజులలో కేవలం ఖననమే చేసేవారు. అంత్యక్రియలరోజునా, తరవాత మరో మూడురోజుల పాటూ కొద్ది బియ్యం వండి, ఆ అన్నాన్ని సమాధి మీద ఉంచుతారు. పెద్ద కర్మ రోజున మరోమారు ఈ పిండ ప్రదానం చేస్తారు. ఆరోజున పూజారి కర్మకాండను నిర్వహించి కొండదేవతకు నైవేద్యం పెడతాడు. దహనం చేసేటప్పుడు మృతుని భార్య తాలూకు పుస్తెలూ, నగలూ చితి మీద వేస్తారు. ప్రతి ఒక్కరూ ఓ రాగి కానిని మంటలో వేస్తారు. చనిపోయినది పిల్లలయితే ఆకు దొప్పలో తల్లిపాలు పట్టి సమాధిమీద ఉంచుతారు. అంత్య సంస్కారాల అనంతరం విందు చేస్తారు. వెజ్జు – మంత్రగాడు – మరణ కారణాన్ని, అది దైవ నిర్ణయమో, చేతబడో బయట పెడతాడు.



సాధారణంగా వారి పండుగలూ, పెద్దలూ, పెట్టడాలకు సంవత్సరంలో వేరు వేరు ఋతువులలో జరుగుతుంటాయి. ఫిబ్రవరి, మార్చి నెలలో మామిడిపండుగ జరుగుతుంది. వారు పండుగలలో భూదేవత ముత్యాలమ్మనూ, కొండదేవతనూ ప్రస్తుతిస్తూ పాడుతారు, నాట్యం చేస్తారు. ఆ దేవతల్ని ఆహ్వానిస్తారు. పూజారి, "ఓ గోగులపూడి ముత్యాలమ్మా! నీ కొలుపు చేస్తున్నాము తల్లీ, కొండలూ, కొండదేవతలూ రావాలి తల్లీ భూమిలో వుండే నేలతల్లీ నువ్వు దయచెయ్యాలి. తేరకొండ చిన్నమ్మా నువ్వు తప్పక రావాలి. గురుపర్తి కొండాటమరాజా నువ్వు రావాలి. రాజు కొండరాజు కూతురా నువ్వు రావాలమ్మా, పందికొండ కన్నమరాజా నువ్వు తప్పక రావాలి. కోవెలకొండ కన్నమరాజా నువ్వు తప్పక రావాలి." – ఇలాగే.

గంగమ్మ పండుగ, భూమిదేవత పండుగ, కాటమయ్య (వేటదేవత) పండుగ, వానదేవుడి పండుగ, పులి పండగ, కర్ర (వెదురు నరికేటప్పుడు) పండుగ, రేవు (వెదురుతెప్ప కట్టడానికి) పండుగ, కొండదేవుడి పండుగ, వేరు వేరు పంటల కోతల ముందు ఆయా దేవుళ్ళ పండుగలు వారు చేస్తారు. వారి జీవితంలోని ముఖ్య ఘట్టాలకి సంబంధించిన ఈ పండుగలలో ప్రకృతిని తృప్తి పరచడానికై బలులు యిస్తారు. బలిరక్తం విత్తనాల మీద చల్లితే బాగా పండుతుందని వారి నమ్మకం. పాతకాలంలో నరబలులు కూడా యిచ్చేవారు. ఇప్పుడవి లేవు. చాల అరుదు. కూనవరం దగ్గర మేకుపాకలో వరిచేనుకి ఒక కోయపిల్లవానిని బలియిచ్చిన కేసు 1939లో జరిగింది. నూకాలమ్మ మొదలయిన గ్రామదేవతలకి, సింగారమ్మ మొదలయిన కుదురు దేవతలకి అంటురోగాల నుంచి కాపాడడం కోసమై కొలుపులు చేస్తారు.

పూజారిదీ, వెజ్జు (మంత్రగాడు) దీ బాధ్యతలు భిన్నం. దేవతలకి కోపం వచ్చిన సందర్భాలలో వెజ్జు, దినసరి కార్యకలాపాలలో పూజారీ కర్మకాండల్ని నిర్వహిస్తారు. మృత్యువునించీ, చేతబడుల నుంచీ కాపాడడం వెజ్జు బాధ్యత. ఈ నేర్పును అతడు కృషి చేసి సాధిస్తాడు. నైవేద్యాలు పెట్టి, బలులిచ్చి దేవతల్ని మంచి చేసుకోవడం మీద ఆయన మంత్రబలం ఆధారపడి వుంటుంది. కొన్ని మనశ్శక్తులు గలవారికి మాత్రమే ఈ పని సాధ్యం. మనుష్యుని రోగానికి దేవుళ్ళెవరూ కారణం కాదని తెలుసుకున్నప్పుడు రోగమూలం రోగి శరీరంలోనే వున్నదని నిర్ధారణ చేసి వెజ్జు దానికి మందులు వాడతాడు, సాధారణంగా అవి ప్రయోజనం ఇస్తుంటాయి.

## సవరలు

సవరలు అదేపేరున ప్రఖ్యాతి చెందిన ఒక గొప్ప తెగలో చిన్నభాగం. సవరతెగ గురించి ప్రాచీన భారతీయ సాహిత్యంలో – ఐతరేయ బ్రాహ్మణం, రామాయణం, మహాభారతం, కాదంబరి, కథాసరిత్సాగరం మొదలయిన వానిలో ప్రసక్తి వుంది. గ్రీకు యాత్రికుడు టోలమీ వ్రాసేడు. చోడగంగరాజులకు, పశ్చిమగాంగ, పల్లవవంశరాజులకు చెందిన శాసనాలలో వారి ప్రసక్తి వుంది. ఈనాడు వారు అదే పేరున చాలచోట్లకు విస్తరించి వున్నారు. పేరు ఒకటే వున్నా ఆచారాలూ, సంప్రదాయాలలో వారిలో భిన్నత్వం కనిపిస్తుంది. ఇప్పటిలాగే ప్రాచీన కాలంలో కూడా ఆదివాసులు, అనాగరికులు అనే అర్థంలోనే సవర శబ్దాన్ని వుపయోగించినట్లు వెర్నీర్ ఎల్విన్ భావిస్తున్నారు. తరచు అనేక గ్రంథాలలో ఆ పేరు తగులుతుండడాన్ని బట్టి సవరతెగ చాల ప్రధానమైనదీ, విస్తృతంగా వ్యాపించినదీ అయి వుండాలి. తరవాత తరవాత ఆ

తెగ అనేక భాగాలుగా విడిపోయి వుంటుంది. ఈనాడు వారిలో చాలామంది తమ అసలు భాషను మరచి పోయి, తమ ఇరుగుపొరుగున వున్న వారి సంస్కృతినీ, సంప్రదాయాల్నీ అలవరచుకొన్నారు. అయితే విశాఖపట్నం, శ్రీకాకుళంజిల్లా, అడవిప్రాంతాలలోనూ, వానినానుకొని వున్న ఒరిస్సాలోని గంజాం కోరాపుట్టి జిల్లాల అడవులలోనూ నివసిస్తున్న కొండసవరలు తమ ప్రాచీన సంప్రదాయాల్ని కాపాడుకొన్నారు. తమ భాషనే మాట్లాడుతుంటారు. తమదంటూ ఒక మతాన్ని అనుసరిస్తున్నారు. 1941లో వారి జనసంఖ్య విశాఖపట్టణం ఏజన్సీభాగంలో 13 వేలు; గంజాం, కోరాపుట్టి జిల్లాలలో 100,000 మందీను. వీరుగాక పరిసర ప్రాంత ప్రజలతో కలిసిపోయినవారిని కంపుసవరలు, శుద్ధ సవరలు, భీమ సవరలు మొదలయిన పేర్లతో పిలుస్తారు. కొండసవర్లలో కూడా వేర్వేరు శాఖల్ని తెలుపుతూ వేరువేరు పేర్లున్నాయి. వారిలో జాతి సవరలు చాలా ప్రధానం. తమ రక్తం, ఆచారం, మతం పరిశుద్ధమైనదిగా వీరు చెప్పుకుంటారు. వీరిలో అర్సికోతి తెగ అని వుంది. వారు పెట్టే గోచీ వెనుక భాగం పొడుగ్గా వేలాడుతూ కోతిని గుర్తు చేస్తుంటుంది గనక వారికా పేరు వచ్చింది. ఈ ప్రధాన భాగాలుగాక, చేసే వృత్తుల్ని బట్టి పిలువబడుతున్న సవరలున్నారు. అయితే వారి సంఖ్య స్వల్పమేగాక, ఇతర సవరలతో కలిసి, వారిలోభాగంగానే జీవిస్తుంటారు.

సవరల వ్యవసాయం మూడు తరహాలుగా వుంటుంది. మొదటిది మెట్టు వ్యవసాయం. బాగా ఏటవాలుగా వున్న కొండపక్కల్ని రాతితో మెట్లుమెట్లుగా అడుగు నుంచి పై వరకూ రివెట్‌మెంట్ గోడలు గడతారు. ఒకొక్కచోట ఆ గోడ 15 అడుగుల ఎత్తు కూడా వుంటుంది. ఒక్కొక్క మెట్టు ఒక్కొక్క చెలక. ఆ విధంగా వారు కొండవాలు ప్రతి అంగుళంమేరనూ వుపయోగంలో పెట్టడమే కాదు, మెట్టు నుంచి మెట్టుకు జాలువారే నీరు మట్టిని కోసెయ్యకుండా అతి నేర్పుతో వారు ఆ గోడలు కడతారు. తమ చెలకలకు నీరు పారించడానికి వారు ఎంతో మెలకువతో ఏర్పాట్లు చేసుకున్నారు. ఆ చెలకలలో వారు వరినే పండిస్తారు. ఎడ్ల లాగే నాగలితో చేలు దున్నుతారు. ప్రతి గడ్డిపరకను అతి శ్రద్ధగా జాగ్రత్త చేస్తారు. నేలబారున చేలు కోస్తారు. పేడపెంట పోగులు పెట్టి చేలలో ఎరువుగా వుపయోగిస్తారు. చెలకల్లోనే కళ్ళాలు చేస్తారు. గడ్డిని చెమ్మవారకుండ బండలమీదనో, చెట్లమీదనో బణిపి వేస్తారు. ఇల్లా మెట్లుగా కట్టిన వేదికలమీదనే ఇళ్లు వేసుకుంటారు. వీధులు మెట్లుమెట్లుగా ఒకదానిపైన వేరొకటి వుంటాయి.

పోడు వ్యవసాయం సవరలలో అంత ప్రధానం కాదు. పప్పు పంటలు, మొక్కజొన్న, జొన్న, సజ్జవంటి పంటలు పోడుకొట్టిన నేలలో వేస్తారు. సాధారణంగా వారు కొండ శిఖరభాగాల్ని పోడు వ్యవసాయానికి వుపయోగిస్తారు. ఈ చేలు తలోచోటా వుండడమే కాదు, వారి వూళ్ళకు మైళ్ళదూరంలో కూడా వుంటాయి. పంటరోజుల్లో కాపలాకై, చేలవద్దనే గుడిసెలు వేసుకొని రోజంతా అక్కడే వుంటారు.

ఇంక మూడోది పెరటిదొడ్లు. వీటిలో బాగా ఎరువులు వేసి, కోరడులు కట్టి పొగాకు, మొక్కజొన్న, దోస, గుమ్మడి, అల్లం వంటి పంటలు పండిస్తారు.

చెలకలకి పట్టాలు లేకపోయినా, స్వంత ఆస్తులుగానే పరిగణన. వానిని అమ్మడం, కొనడం వుంటుంది. కొత్త చెలకల్ని సాగులోకి తెచ్చేటప్పుడు, దానిని వూరి పెద్దలు వాటాలు వేసి, ఏ ముక్కను ఎవరు చేసుకోవాలో విధిస్తారు.అతడు ఎక్కడికన్నా పోయి తిరిగి వచ్చినా ఆ చెలక అతనికే మిగిలి వుంటుంది. దానినే అతడు చేసుకోవాలి. వ్యవసాయపు పనులలో ఆడ, మగ, పిల్ల, పెద్ద అందరూ తాము ఓపిన పనులు చేస్తూ పాల్గొంటారు.



వారి నెలల పేర్లు మనకు భిన్నం. ప్రతినెలకూ వ్యవసాయపు పనులను బట్టి పేర్లుంటాయి. వారి జనవరి ధాన్యం మాసూళ్ళ నెల. ఫిబ్రవరి కందిపంట మాసూళ్ళది. మార్చి కందుల పండుగ. ఏప్రియలు కొండనెత్తాల మరమ్మత్తుల నెల. మే దుక్కినెల. జూన్ కలుపు తీత నెల. జూలై సజ్జల మాసూళ్ళు. ఆగస్టు కుక్కగొడుగుల నెల. సెప్టెంబరు చల్లికల నెల. అక్టోబరు రాగుల మాసూళ్ళు. నవంబరు ధాన్యం పొట్టపోసుకునే నెల. డిసెంబరు పంటలపండుగ నెల.

సవరల ఇళ్ళు ఒకదానిపక్కన ఒకటిగా వరుసగా కట్టి వుంటాయి. అన్నింటికీ వరండా కలిసిపోయే వుంటుంది. ఒకొక్క ప్రాంతంలో మధ్యన ఖాళీస్థలం వదిలి, చుట్టూ గుండ్రంగా కట్టుకుంటారు. వీధులు కొండ అంచున, ఒకదానికి ఎగువన ఒకటిగా మెట్టుమెట్టుగా కట్టుకుంటారు. గ్రామం చుట్టూతా పెరళ్ళుంటాయి. దానిలో మొక్కజొన్న, అల్లం, కూరగాయలు పండిస్తారు. గ్రామానికి సమీపంలోనే స్మశానమూ, సమాధిరాళ్ళూను. వీధుల్లోనూ, సరిహద్దుదారుల్లోనూ పెద్దలకీ, దేవతలకీ గుళ్ళుంటాయి. ప్రతిచోటా కల్లుతీసే జీలుగు, తాడిచెట్లు వుంటాయి. దృఢంగా కట్టిన ఇళ్ళూ, గ్రామాలు, అసంఖ్యాకంగా కనిపించే సమాధిరాళ్ళూ చూస్తే వీరిలో ఎక్కడా సంచారజాతి లక్షణాలు కనిపించవు. వారి యిళ్లు దీర్ఘచతురస్రంగా వుంటాయి. జమిలి కప్పులు వుంటాయి. తరుచు, ప్రతియిల్లూ ఒక దేవాలయమే అనవచ్చు. బలులలో చాలాభాగం ఇంటిలోపలనే జరుగుతాయి. ప్రేతాత్మలు ఎప్పుడైనా భూలోకాన్ని దర్శించవస్తే మకాము చేయడం ఆ ఇండ్లలోనే. గృహానికి దేవత, పొయ్యికి దేవత, పైకప్పుకి దేవత ఇల్లాగే అసంఖ్యాక దేవతలకు ఆ యిల్లు మకాము స్థలం. గోడల్ని తగిలించిన దేవతా చిత్రాలను, గీసిన పెద్దల చిత్రాలను ఆ దేవతలూ, ఆత్మలూ అంటిపెట్టుకుని వుంటారంటారు. ఈ బొమ్మల ముందు పాత్రలలోనూ, బుట్టలలోనూ పోసి బియ్యమూ, వస్త్రాలూవేలకడతారు. వానిని పూర్వ పురుషులు ఆరగిస్తారు. వరండా వెలుపల దేవుని పేరిట ఒక స్తంభం పాతుతారు. ఆ దేవుడు ఇంట్లోవాళ్ళకి ఏ ఆపదా రాకుండా కాపాడతాడు.

సవరల కట్టుబాట్ల ప్రకారం వారు విశేష అచ్ఛాదనం చేసుకోకూడదు. స్త్రీలు నడుముకు ఒక లంగా కట్టుకొంటారు. మగవాళ్ళు ఒక గోణం పెట్టుకుంటారు. దాని కొసను వెనకవేపున పొడుగ్గా తోకలా వదిలేస్తారు.

బియ్యం, సజ్జలు, పప్పులు వారి ప్రధానాహారం. బియ్యంతోనో, సజ్జలతోనో కాచిన అంబలి, పప్పు, కూరలూ వారి మామూలు ఆహారం. చాల పుష్టి ఉత్సాహమూ, కలిగించే తాటికల్లు తాగుతారు. వారు పదార్థాలన్నీ కలిపి వుడికించి తినేస్తారు. మాంసంతో బియ్యమో, సజ్జలో, ఉప్పు, కారం, పసుపు అన్నీ కలిపేసి వుడికిస్తారు. బియ్యమూ, రక్తమూ కలిపి వుడికించి చాల పుష్టికరమైన జావ కాస్తారు. అనేకరకాల ఓషధులు, దుంపలు, మామిడికాయలు, పనసపళ్లు తింటారు. దోస, గుమ్మడికాయలంటే వారికిష్టం. వారి ప్రధాన జీవనాధారం వ్యవసాయమే అయినా, ఆహారం కోసం అడవి జంతువుల వేట కూడా సాగిస్తారు. ప్రతి ఉత్సవం, ప్రతి పండుగ, విందుతో ముగుస్తుంది. ఈ విందులు బాగా ఖర్చుతో కూడినవయినా, బీదవాళ్ళకి కాస్త కడుపునిండా తిండిదొరికే అవకాశం ఆనాడేనంటారు వెర్నీర్ ఎల్విన్.

అంతర్వివాహాలు మాత్రమే అనుమతించే విభజనలు గాని, బాహిర వివాహాలను విధించే

కులదేవతా విభజనలు గాని సవరలలో లేవు. అతి ప్రధానమైన సమాజ ప్రాతిపదిక బిందువు కుటుంబం. ఒకే పూర్వ పురుషుడిని చెప్పుకొనే యీ కుటుంబంలోని సభ్యులు అనేక ఇళ్ళలో వుండొచ్చు. వారిలో కులీనులు సామాన్యులు అనే విభజన వుంది. గ్రామ పెద్దల్ని "గమాంగ్" లేక "నాయక్" అని పిలుస్తారు. పూజారుల్ని "బుయ్యా" అంటారు. గ్రామంలో వీరే ధనవంతులై వుంటారు. ప్రధాన వ్యక్తులూ వారే. ప్రభుత్వం గుర్తించేదీ వారినే. ప్రభుత్వానికీ, ప్రజలకూ మధ్య సంధానం చేసేది గ్రామపెద్ద. ప్రభుత్వోద్యోగుల కోసం చాకిరీకి మనుష్యలను నియమించేది ఆయనే. గ్రామ ఉమ్మడి కార్యకలాపాలలో ఆయన విధిగా పాల్గొనాలి. భూమి పంపకంలో ఆయనదే తీర్పు. పంట పండుగలలో బుయ్యా ప్రధానంగా పాల్గొంటాడు. పెళ్ళిళ్లు, అంత్యక్రియలు చేయిస్తాడు. పంపకాలు, అమ్మకాలు, తనఖాలు మొదలైనవాని నిర్ణయానికై గ్రామపెద్దల సమితి సమావేశం అయినప్పుడు గమాంగ్‌తో పాటు బుయ్యాకూడ దానిలో పాల్గొంటాడు. వీరిద్దరి హోదాలు వంశపారంపర్యాలు. గ్రామంలో గమాంగ్, బుయ్యాల ఇళ్లు వుండేభాగం వేరు. ఈ కులీనులకు దిగువ వుండే కుటుంబాలవారు పారొజాలు, వీరు రైతులు. కులీనులూ, పారొజాల మధ్య వివాహాలు జరుగవు. ఒక్కొక్కప్పుడు గమాంగ్‌లూ, బుయ్యాలూ, పారొజాల పడుచును చేసుకుంటారేమోగాని, తమ యింటి పడుచును పారొజాల యింటి కివ్వరు.

పన్నుల చెల్లింపులకు, వుత్సవాలు జరపడానికి గ్రామం మొత్తం ఒక యూనిటుగా వ్యవహరిస్తుంది. గ్రామం వెలుపల పిల్లనివ్వడం, తెచ్చుకోవడం నిషిద్ధం.

కుటుంబంలోని వారంతా రక్త బంధువులు కనక వారిలో అంతర్వివాహాలు నిషిద్ధం. మేనరికాలు ఇతర తెగలలో వున్నా వీరిలో నిషిద్ధం. పెళ్ళయాక స్త్రీ మరో కుటుంబానికి చెందదు. ఆమరణం ఆమె తాను పుట్టిన కుటుంబానికే చెందుతుంది. వివాహాల ఏర్పాట్లూ అంత్యక్రియల ఏర్పాట్లూ కుటుంబ యాజమాన్యంలోనే జరుగుతాయి. ప్రతి కుటుంబానికీ వేరే స్మశానం, వేరే సమాధులూ వుంటాయి. కొన్ని బలులు కూడా కుటుంబ యాజమాన్యంలోనే జరుగుతాయి. అంత్యక్రియలలో మృతుని కుటుంబం మాత్రమే పాల్గొంటుంది. మొత్తం గ్రామం పాల్గొనడం వుండదు.

సవరలలో వివాహ కర్మకాండ కేవలం లౌకికం మాత్రమే. అది కుటుంబానికి బంధుత్వాను బంధాల్ని పెంచుతుంది. వివాహపూర్వపు దాంపత్య సంబంధాలను వారు సహిస్తారు. కాని వివాహ బంధానికి చాల విలువనిస్తారు. పూజారి కుటుంబ పూర్వపురుషులకు నివేదనలు చేశాక, విందుతో వివాహతంతు ముగుస్తుంది. రాక్షస వివాహం ఒకప్పుడు వీరిలో పరిపాటి. ఇప్పుడది చాలా అరుదు. విడాకులు సులభం, పెద్ద తతంగం ఏమీ లేదు. కాని దానిని జనం హర్షించరు. ధనిక కుటుంబాలలో బహుభార్యాత్వం సామాన్యం. ఆ కుటుంబాలలో భార్యలంతా మగనితో కలిసి పొలాలలో పని చేస్తారు. సర్వ సామాన్యంగా సవరల్లో కుటుంబ జీవితం సుఖ సంతోషాలతో వుంటుంది. స్త్రీ పురుషులంతా పిల్లలంటే ఎంతో మక్కువ చూపుతారు. అంతా కలిసి పొలాలలో, కొండలలో పనిచేస్తారు. ఉత్సవాలకయ్యే ఖర్చులూ, ప్రభుత్వోద్యోగులూ వారి భృత్యులూ జరిపే దోపిడీ లేకుంటే సవరలు ఎంతో సంపన్నులయి వుండేవారు. వారు తమకు బట్టకొనుక్కోరు. కులదేవతలకీ, పెద్దలకీ ఎంతో బట్ట కొంటారు. తమరు తినే తిండి తక్కువ. పెద్దలికి పెట్టడంలో చేసే దుబారా చాలా ఎక్కువ. వారు నివసించే ప్రదేశం చాలా



అందమైనదే. కాని విషజ్వర పూరితం. ఆ జ్వరాలు వారి మూలుగులేర్నకాక, ధనాన్ని కూడా పీల్చేస్తున్నాయి– అన్నారు వెర్నీర్ ఎల్విస్ తమ గ్రంథం – "ది రెలిజిన్ ఆఫ్ ఏన్ ఇండియన్ ట్రైబ్‌"లో.

మనిషికి రెండు ఆత్మలుంటాయని సవరల నమ్మకం. ఒంటి ఖద్ద (పెద్దది). రెండోది శొన్న (చిన్నది). చిన్నదే ప్రాణం. అది మనిషి చనిపోవడంతో పోతుంది. పెద్దది అతడు జీవించి వుండగానూ అటు తర్వాతనూ కూడ వుంటుంది. మనిషి మరణించినపుడు అతని ఆ ఆత్మ ఛాయారూపం ధరిస్తుంది. ఆ రూపంలోనే అంతర్‌లోకాలకు వెడుతుంది. కాని అక్కడుండే పెద్దలు దాన్ని రానివ్వరు. అందుచేత భూమి మీదికి తిరిగివచ్చి గౌర్ (పెద్ద) కర్మ జరిగి, పోతును బలి వేసేవరకు ఇక్కడే సంచరిస్తూ తిండికోసం, బట్టకోసం, పొగాకు కోసం, తాగుడు కోసం బంధువుల్ని వేధిస్తుంది. తనకి కలిగే బాధలూ, చికాకులూ వారికీ కలిగిస్తుంది. గౌర్‌కర్మ జరగగానే అది అధోలోకాలకు పోయి పెద్దలతో చేరుతుంది. అధోలోకంలో ఎప్పుడూ వెన్నెల వెలుగు వుంటుందనీ, కొండలుంటాయనీ పెద్దలంతా పొలాల్లో కష్టపడి పనిచేసుకుని తిండి తింటారనీ సవరల అభిప్రాయం. అక్కడ వారికి తగినంత తిండి, 'బట్ట, త్రాగుడు, పొగాకు వగైరా దొరకనప్పుడు ఈ లోకంలోకి, తమ యిళ్ళకు వచ్చి కుండల్లోను, బుట్టల్లోను ఎప్పుడూ నిలవగా వుండే వస్తువుల అంతస్సారాన్ని తీసుకుంటారు. ఇంక అవీ చాలనప్పుడు బతికి వున్నవాళ్ళకి బాధలు కలిగిస్తారు. అటువంటి సందర్భాలలో మంత్రగాడు పూనకంలోకి వచ్చి ఆపదలకు నివారణోపాయాలు చెప్తాడు. దీని అర్థం సవరలు ఆత్మ అనశ్వరం (నాశనం లేనిది) అని నమ్ముతారనుకోనక్కర్లేదు. అసలా భావమే వారికి అందదు. జీవించి వుండడానికీ అనశ్వరత్వానికీ సంబంధం లేదు. సవరల దృష్టిలో ఆత్మ మరల ఉజ్జీవం పొందుతుంది. మరణానంతరం కూడా కొనసాగుతుంది. అంతే.

సవరల దేవతలు నాలుగు తరహాలు అంటారు వెర్నీర్. మొదటితరహా సోనుమాన్‌జీలు. వారిలో ప్రతి ఒక్కరికీ వారివారి పేర్లూ, వారివారి అధిష్ఠానాలూ వున్నాయి. (ఆకాశదేవుడు మొదలయినవారు) కొందరు స్థానిక దేవుళ్లు. వారిలో మంచివాళ్లూ, చెడ్డవాళ్లూ కూడ ఉంటారు. రెండోతరహా కిట్టుమాన్‌జీలు. వీరిని దేవతలనడంకన్న పురాణ పురుషులనడం ఉచితం. వీరిలో కిట్టుంగ్ అనే పురాణ పురుషుడు అధిక కథలలో ఎదురవుతాడు. ప్రపంచాన్ని సృష్టించినదీ, సంఘ వ్యవస్థను ఏర్పాటు చేసినదీ ఆయనే నంటారు. మూడోతరహా పూర్వపురుషులు (పెద్దలు). పూనకం అప్పుడు మంత్రగాళ్లు వారిని తెలుసుకుంటారు. చివరతరహా కల్‌బన్‌జీలు. వీరంతా ఛాయాత్మలు. వీరికి పూజ చెయ్యడం వుండదు. గౌర్‌కర్మ జరిగేకనే. వారికి దేవత్వం సిద్ధిస్తుంది.

ఈ దేవతలందరికీ వారివారి స్వంతనివాసాలున్నాయి. కొందరు ఆకాశంలో, కొందరు భూమి మీద, కొందరు అధోలోకంలో నివశిస్తారు. అయితే అందరూ కూడా అప్పుడప్పుడు ఈ భూమి మీద విహరించడానికి వస్తుంటారు.

సవరలకు పరమేశ్వరుని మీద నమ్మకం ఉందా అంటే చెప్పడం కష్టం. దేవతలందరిలోకీ సూర్యుడికి వారు అధిక ప్రాముఖ్యం ఇస్తారు. "ఇచ్చేదీ, తీసేసుకొనేదీ ఆయనే" అని వారి భావం. అయితే సవరలందరూ సూర్యుడికి ఆ ప్రాముఖ్యం ఇవ్వరు. వారిలో చాలామందికి సృష్టికర్తా, మానవ సమాజ వ్యవస్థను ఏర్పరచినది కిట్టుంగ్ అని నమ్మకం. వారి పురాణాలు కొన్ని అతడే

మొదటి మనిషిని చేశాడు అంటాయి. మరికొన్ని అతడే మొదటి మనిషి అంటాయి. మనిషిలాగే అతను వస్తువులను వేరువేరు పదార్థాల నుంచి రూపొందిస్తున్నాడు. కిట్టుంగును పరమేశ్వరుడనటం కన్న మహావీర పురుషునిగా చెప్పవచ్చు. సవరలు తాము జీవిస్తున్న ప్రపంచంలో దయానిధీ, సర్వ సమర్థుడు ఐన పరమేశ్వరుడిని వూహించను కూడా సాధ్యం కాదు.

సవరల మతంలో మంత్రగాడిది అతి ముఖ్యపాత్ర. అతడే వైద్యుడు, పూజారి; మనస్తత్వవేత్త, మంత్రగాడు, సంప్రదాయ పరిజ్ఞానం ఉన్నవాడు, విజ్ఞానానికి మూలం. కలలూ, పూనకాలద్వారా రోగాలకీ, మరణాలకీ కారణాలు తెలుసుకుంటాడు. అతడు నియమబద్ధమైన జీవితం గడుపుతాడు. పెద్ద బలులిచ్చే ముందు ఉపవాసం చేస్తాడు. అప్పుడు స్త్రీ సంపర్కం పెట్టుకోడు. అతనికి అధోలోకంలో ఒక భార్య వుంటుందనీ, ఆమే అతనికి దారి చూపుతుందనీ భావన. సాధారణంగా అతడు తన తండ్రివద్దనే శిక్షణ పొందుతాడు.

పూర్వ పురుషులు తమ బ్రతుకుతెరువు కోసం బలులు మొదలైనవి ఇచ్చేటట్టు చేయడానికై చలిజ్వరం, మశూచి, కలరావంటి రోగాలను వ్యాపింపచేసారు. పక్షవాతం, మతిభ్రమణం, కుంటితనంవంటివి దేవతలు దుర్బుద్ధితో కలిగించే వ్యాధులు. ఇలాగే అనేక వ్యాధులకి అనేక కారణాలు. ఈ రోగకారణాలు తెలుసుకోవడానికి మంత్రగాడు అధోలోకంలో వుండే తన భార్య సాయం కోరుతాడు. ఆమె అతని శరీరంమీద ఆవహించి కారణాలూ, నివారణోపాయాలూ చెప్తుంది. చాల రోగాలకి ఆహార నైవేద్యం ప్రధాన నివారణ. ఆ నివేదనతో తప్పకుండా విందు వుంటుంది. ప్రార్థనలు, మందులు, మంత్రాలువంటి నివారణ మార్గాలున్నాయి కాని, వానిదంత ప్రాముఖ్యం కాదు.

మంత్రగాడు పూనకంలో వున్నాడంటే ఆ ఆత్మలో, దేవతలో అతని శరీరంలో తాత్కాలికంగా ప్రవేశించారని అర్థం. ఒకే పూనకంలో చాలమంది ఆ శరీరంలో వరసగా ప్రవేశించవచ్చు. అంతసేపూ మంత్రగాడు వారి అధీనంలో వున్నాడని అర్థం. ఇది తాగుడు ఫలితమనీ, ఈ వొళ్ళెరగని స్థితిలో అతనికిగల వివిధ విషయ పరిజ్ఞానమూ, అనుభవమూ బయటపడి చిత్రవిచిత్రమైన ధోరణిలో మాట్లాడిస్తాయనీ, తరుచు అవి రోగనివారణకు తోడ్పడుతున్నాయనీ వెర్నర్ ఎల్విన్ వ్రాస్తున్నారు.

రోగాలు దరి చేరకుండా చేయడానికీ, పంటలు పుష్కలంగా పండడానికి తోడ్పడేటట్లు, చనిపోయినవారి సంస్మరణగా గోడలమీద బొమ్మలు వేయడం గురించి చెప్పేను. ఈ బొమ్మల మీద మృతులు వచ్చి చేరుతారని వారి నమ్మిక. ఆ విధంగా మృతులు వచ్చి చేరగలిగేటట్లు వానిని చీకటిగా వుండే మూలల్లోనే గీస్తారు.

ప్రతిదేవుడూ మనిషి లక్షణాలే కలిగి వుంటాడనీ, లంచం చూపుతేనూ పొగిడితేనూ తప్ప సాయం చెయ్యడనీ వున్న నమ్మకమే నైవేద్యాలు పెట్టడానికీ, బలులు యివ్వడానికీ కారణం. దేవుళ్ళూ, ఆత్మలూ ఎల్లప్పుడూ, వీనికి తృప్తి పడకపోవచ్చు. అటువంటప్పుడు ఈ పూజలూ బలులూ రోగాల్ని పూర్తిగా నిలుపలేకపోయినా నష్టం ఎక్కువ కలగకుండా చేస్తాయని విశ్వాసం.

సవరల జీవితం - బట్టలు, నగలు, ఇళ్ళు, కుటుంబ సంబంధాలు, నైతిక నియమాలు అన్నీ ఆచారాలకీ, విధి నిషేధాలకి అధీనమయి కొనసాగుతాయి. అసత్యం చెప్పడం, దొంగిలించడం, చంపడం వంటివి, ఆచారభంగాలు, దేవుడిపేరు చెపి అబద్ధమాడడం,



నైవేద్యాన్ని దొంగిలించడం, కులదేవత అయిన జంతువుని చంపడం విధి నిషేధాలకు చెందినవి. బంధుత్వం లేనివారి మధ్య దాంపత్య సంపర్కం అనాచారం. వావి వున్నచోట కలియడం నిషిద్ధం. ఆచారభంగం తోడివారి అభిశంసకు గురి అవుతుంది. నిషిద్ధ క్రియాచరణ పూర్వ పురుషుల క్రోధానికి గురి అవుతుంది. వావి గల చోట వివాహం పెద్ద తప్పు.

కొండ సవరలు తమ స్వంత భాషనే వుపయోగిస్తారు. అయితే తెలుగు, ఒరియాల సంపర్కం ఆ భాషకి కలిగింది. వారి భాషలో "జెలు-మెలు", "తంగ్లీ-మంగ్లీ"లాగ జంటమాటలు ఎక్కువ. అలంకారాలతో మాట్లాడతారు. "పారపళ్ళవాడు", "చిగురుటాకులాంటి చిన్నది," "కల్లుకుండలాంటి పొట్ట" వగైరా ప్రయోగాలతో వుంటుంది. పొడుపు కథలు తయారు చేయడంలో వారికి గొప్ప నైపుణ్యం వుంది. "మనిషి-ఒళ్ళంతా బొచ్చు"- అంటే మొక్కజొన్నపొత్తి. "ఆకాశం నుంచి కొడవళ్ళు వేళ్ళాడుతున్నాయి." - అంటే చింతకాయలు, ఇల్లాగే.

వారి పాటలు చాల మధురంగా, నిరాడంబరంగా, మెలికలు లేకుండా సూటిగా వుంటాయి. సాధారణంగా తీగవాయిద్యం వెంట పలుకుతూండగా పాటలు పాడతారు.

మొత్తం మీద సవరలు చాల కష్టపడి పనిచేస్తారు. అతిథిమర్యాద చేస్తారు. పరస్పరం దయ కలిగి జీవిస్తారు. తండ్రులుగా, భర్తలుగా, మిత్రులుగా చాల ప్రేమాస్పదులు. కొత్తవాళ్ళంటే మహా అనుమానం. విపరీతమైన మూఢాచారం. క్షణిక కోపులు. గర్వం వైషమ్యాలనూ, వైముఖ్యాలనూ కలిగిస్తుందని దానిని అసహ్యించుకుంటారు. పిసినారితనాన్ని అసహ్యించుకుంటారు. అది దొంగతనమే నంటారు. నిందలు వెయ్యడం మనుష్యుని మంచిపేరును ధ్వంసం చేసే పనిగా ఖండిస్తారు. పని చెయ్యనివాడు దొంగ అని వారి భావం. తన వంతుపని చెయ్యకుండా తిండిలో వాటాకి వస్తున్నాడని వానిని నిరసిస్తారు. మనిషి ప్రాణానికి విలువనివ్వకపోవడంవంటి లోపాలున్నాయి వారిలో. కాని, అది పీడిత ప్రజలలో సహజంగా వచ్చే నిరాసక్త భావం తప్ప వేరు కాదు.

## ఖోండులు

నిజానికి ఖోండుల నివాసం ఆంధ్రప్రదేశ్‌లోకి రాదు. వారి నివాసం ఒరిస్సాలోని గంజాం జిల్లా. కొద్దిమంది మాత్రం దాని నానుకొని వున్న శ్రీకాకుళంజిల్లాలో వుంటున్నారు. కోయలూ, సవరలూలాగే వారు తమ భాష కుయి, కంధి లేక ఖోండ్‌నే మాట్లాడుతారు. అది ద్రావిడ భాషా కుటుంబంలోనిది. ప్రాంత భేదాల్ని బట్టి తూర్పున గుమ్‌సూర్ మాండలికమూ, పడమట చిన్నకిమిడి మాండలికమూ ఏర్పడ్డాయి.

వారి ప్రధానవృత్తి పోడు వ్యవసాయం. పశువుల పెంపకం, వేట సహకార వృత్తులు. దుంపనాగలి, రెండు పళ్ళున్న దంతెన, చిన్నగొడ్డలి, కొడవలి, కర్రకత్తి వారి ప్రధాన పనిముట్లు. గంటెలు, చోళ్ళు, కందులు, పెసలు, నువ్వులు, సెనగలువంటి మెట్టపంటలన్నీ పండిస్తారు. మైదానపు ప్రదేశాలలో తప్ప తరి వ్యవసాయం లేదు. నేలలో తేమను కాపాడడానికై ఎంతో నేర్పుతో గట్లు వేస్తారు. నేలను చదును చేయడానికి ఎడ్లను కట్టి బరువైన పలకను (తొడుగు) లాగించి మహాశ్రమ పడతారు. వర్షాలకు సజ్జలు, కొండధాన్యం పండిస్తారు. వారి పంటలలో పసుపు చాలా విలువైనది. పొగాకు పండిస్తారు. టిస్సార్ శిల్కు, పట్టుపురుగు గూళ్ళు, తేనే, మైనంవంటి అడవి పంటలు ఇచ్చి, ఉప్పు మొదలైనవి తెచ్చుకొంటారు. వేసవిలో వారు

ప్రధానంగా సజ్జలు, ఎండబెట్టిన విప్పపళ్ళు, మామిడిపళ్ళు, మామిడి టెంకలలోని జీడిని విసిరి చేసిన పిండి దుంపలు మొదలయిన వానితో జీవిస్తారు.

కొండ జాతులందరిలోలాగే ఖోండులలో కూడ భూమి తెగ అందరిదీను. ఎవరు ముందు ఆక్రమించి, వ్యవసాయం చేస్తే వారి భుక్తంలో వుంటుంది. కాని దానిమీద వ్యక్తి యాజమాన్యం ఉండదు.

వారిలో మగవాళ్ళు మొలకు ముతకపంచెను, దాని చివరలు ముందూ, వెనకా తోకల్లా వేలాడేటట్లు కట్టుకుంటారు. పొడుగ్గా జుట్టు పెంచి ముడివేస్తారు. దానిలోనే ఒక దువ్వెన, పొగతాగేందుకు చిలుముగొట్టం వంటి చిన్న అవసర వస్తువులు పెట్టుకుంటారు. తలకో గుడ్డ పాగా చుట్టి నెమలి ఈకలో, మరో అందమైన రంగు ఈకలో గుచ్చుతారు. ఆడవాళ్ళు మోకాళ్ళ దిగే లంగా కట్టుకుంటారు. రొమ్ములకి ఆచ్ఛాదన వుండదు. మెళ్ళో వేసుకునే పూసల దండలు తప్ప.

ఖోండులు విలువిద్యలో బహు నేర్పరులు. వారు ప్రయోగించే బాణం యొక్క పృష్ఠం లక్ష్యానికి సమీపంలో నేలకు తగిలి, ఏటవాలుగా లేచి, లక్ష్యానికి తగులుతుంది.

ఖోండు గ్రామంలో వుండే ఇళ్ళు చాలా కొద్ది. అవి నేలబారున ఉండి తాటాకు వేసి ఉంటాయి. సవరల మాదిరిగా స్థిరావాసం గాక, పోడు వ్యవసాయపు అవసరాల్ని బట్టి మకాములు మారుస్తుంటారు.

వారిది అవధిలేని ఆతిథ్యం. ఎవ్వరు వచ్చి ఎన్నాళ్ళున్నా పొమ్మనకుండా కుటుంబంలో వాడినిలాగా ఆదరిస్తారు. మహా స్వాతంత్ర్య ప్రియులు. విపరీతమైన హింసలకూ, చావుకూ సిద్ధమవుతారు గాని కట్టడికి సమ్మతించరని, వారిని నానాహింసలు పెట్టి అణచి వేసిన లెఫ్టినెంట్ మేక్ఫార్సన్ ప్రశంసించేడు.

ఆతిథ్యం నిరాకరించడం, అతిథిని ఆదరించకపోవడం, మాటతప్పడం, ఆచారాతిక్రమణం, బహుమతి తీసుకోకపోవడం, అప్పు చెయ్యడం, యుద్ధంలో పాల్గొనే బాధ్యత నుంచి తప్పించుకోవడం, మంది రహస్యాన్ని బయటపెట్టడం మహా పాపిష్టిపనులని వారి అభిప్రాయం. అటువంటి పాపం చేస్తే మళ్ళీ జన్మలో రోగాలు, దరిద్రం, అవలక్షణాలు చుట్టుకుంటాయని తలుస్తారు.

తెగల పెద్దలు చాల తెలివిగలవాళ్ళనీ, విషయాలను అవగాహన చేసుకోగల సూక్ష్మగ్రాహులనీ మెక్ఫార్సన్ మెచ్చుకున్నాడు.

ఖోండుల తెగలన్నీ ఒక సమాఖ్యగా ఏర్పడ్డాయి. ప్రతి తెగకూ కొంత ప్రదేశం కేటాయించబడి వుంటుంది. తెగ పెద్దను అబ్బాయి అంటారు. తెగ అనేక కుదురులుగా విభజించబడి వుంటుంది. వానికి వేరే వేరే పెద్దలుంటారు. వానికి భూములు పంచి కేటాయించబడి వుంటాయి. ప్రతి కుదురులో అనేక గ్రామాలుంటాయి. దేనికి దానికి కొంత కొంత భూమీ, గ్రామపెద్దా వుంటారు. తెగ పెద్దకు వ్యవహార నిర్వహణలో కుదురు పెద్దలతో ఏర్పడిన సమితి సహాయపడుతుంది. అలాగే కుదురు పెద్దకు గ్రామ పెద్దల సమితి, గ్రామ పెద్దలకు శివారు పేటల పెద్దలూ సాయపడతారు. ఆయా పెద్దల నాయకత్వాన సామూహిక, వైయక్తిక సమస్యల చర్చకై తెగకో, కుదురుకో, గ్రామానికో చెందిన ప్రజలందరు సమావేశం అవుతారు. అలాగే అవసరమైతే సమాఖ్య పెద్ద తెగ పెద్దల సలహా తీసుకొని సమాఖ్య సర్వ ప్రజాసభ జరుపుతాడు. కుటుంబానికి సంబంధించినంతవరకు "పెద్ద"తనం వంశపారంపర్యం అయితే, ఆ కుటుంబంలో ఎవరు 'పెద్ద'గా వుండాలనేది ప్రజలు ఎన్నిక చేస్తారు. అతడే మతాధికారి కూడాను. అయితే ఆయనకు పరిపాలనాధికారం ఏమీ వుండదు. వేరే యిల్లు, కోట లాంటిది, సాయుధ భటవర్గమూ వుండదు. పూర్వుల నుంచీ వస్తున్న భూములు తప్ప ఇతర ఆస్తులుండవు. ఎవ్వరూ నజరానా లివ్వరు. తన వ్యవసాయం తానే చేసుకొంటాడు. అతడు సమానుల్లో ప్రథముడు, అంతే. జమీందార్లతోనూ, ఇరుగు పొరుగు తెగలతోనూ సంబంధాలు కాపాడడం, యుద్ధంలో ప్రజలకు నాయకత్వం వహించడం, శాంతిభద్రతలు కాపాడటం, వ్యక్తుల తగాదాలలో మధ్యవర్తిత్వం వహించడం, పరిష్కరించడం ఇవీ ఆయన బాధ్యతలు. ఆయనకున్న పలుకుబడీ, పెద్దరికమూనే ఆయన నిర్ణయాలను అమలు జరిపించగలవి.



సర్వ ప్రజాసభ ప్రారంభం కావడంతో పెద్ద యొక్క బాధ్యత ముగుస్తుంది. అది ప్రారంభంకాగానే నేలకు వంగి నమస్కారం చేసి మిగిలిన అబ్బయ్యల పక్కన కూర్చుంటాడు.

ఖోండుల శిక్షాస్మృతి వారి ఆచారాలలాగే అతి పురాణం. అయితే అది వారి సమిష్టి జీవితానికి చాలును. హత్యకు శిక్ష మరణదండన. దొంగతనం చేస్తే దొంగిలించిన సరుకును ఇప్పించేస్తారు. పదేపదే చేస్తూంటే, సంఘంలోంచి వెలివేస్తారు. భార్య వ్యభిచరిస్తూండగా భర్త చూడడం తటస్థిస్తే ఆ మగవానిని చంపేస్తారు. స్త్రీని పుట్టింటికి పంపేస్తారు. (ఖోండులు భార్యను భర్త ఆస్తిగా భావించరు) మగపిల్లలది వారసత్వం. ఆస్తి తగవుల్లో మరుగుతున్న నీళ్ళలోనూ, కాగుతున్న నూనెలోనూ చేయి పెట్టడం, ఎర్రగా కాలిన ఇనుమును ముట్టుకోవడం ద్వారా తప్పొప్పుల నిర్ణయం తరుచు చేస్తారు. భూదేవతకు బలి యిచ్చిన మేక రక్తంలో వుడికించిన అన్నాన్ని కలహిస్తున్న వారిచే తినిపిస్తారు. తప్పెవరిదో వారు అది తిని చచ్చిపోతారని వారి ఆలోచన.

కోయలు, కొండరెడ్లు, సవరలలోలాగాక, ఖోండులలో కులదేవత పద్ధతి (Totem) వుంది. మున్నింగ (చేప) తెగ, జానింగ (పీత) తెగ, పోచంగియా (గూబ) తెగ, స్యాలింగ (లేడి) తెగ, నిల్లాయ్ (ఒరాంగో) తెగ పేర్లు వారిలో తరచు కనిపిస్తాయి. కులదేవత ఒకటే అయిన తెగవాళ్ళ మధ్య వివాహాలు నిషిద్ధం. కులదేవతగా వున్న ప్రాణిని పూజించాలి. దానిని చంపకూడదు. తినకూడదు. అలా చేస్తే కుల క్షయం అవుతుందని ఖోండుల భయం. కులదేవత కనబడిందంటే చేతులు జోడించి నమస్కరిస్తారు. ఒకే కులదేవతగల తెగ సభ్యుడు మరణిస్తే అంతా మైలపడతారు. అప్పుడు వారికి భార్య బంధువులు అన్నం పెడతారు.

ఖోండులకు తమ హక్కులను కాపాడుకొనే పట్టుదల చాల ఎక్కువ. ఆ విషయమై తెగల మధ్య యుద్ధాలు జరిగి బాగా ప్రాణ నష్టం జరుగుతుంది.

ఖోండులు స్త్రీలకు చాల గౌరవం ఇస్తారు. తెగ సమావేశాలలో వారి మాటకు చాల విలువ నిస్తారు. తెగల మధ్య యుద్ధాలు జరుగుతున్నా, వారి మధ్య వివాహాలు జరుగుతూనే వుంటాయి. యుద్ధానంతరం ఇరుపక్షాల స్త్రీలు వెళ్ళి బంధునష్టానికి ఒకరినొకరు ఊరడించుకుంటారు. ఖోండులు ఓలి యిచ్చి భార్యను తెచ్చుకొంటారు. భర్త వలన పిల్లలు కలగకపోతే భార్య అతని ఓలిని తిరిగి ఇచ్చేసి పుట్టింటికి వెళ్ళిపోతుంది. మగవాడు భార్య ఇష్టపడితే మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చు. లేనప్పుడు ఉంపుడుకత్తెను పెట్టుకోవచ్చు. ఉంపుడుకత్తెగా వుండడం వారిలో నీచం కాదు. గౌరవ కుటుంబాలవారే తమ బిడ్డలను ఉంపుడుకత్తెగా

పంపుతారు. వారికి కలిగిన సంతానానికి కొన్ని తెగలలో సగం ఆస్తికి మాత్రమే వారసత్వం హక్కు వుంటుంది. కుటుంబంలో భార్య సంతానంతో వారికీ సమాన మర్యాద ఉంటుంది.

ఖోండులలో ఏప్రిలుతో ప్రారంభమయ్యే వేటలకాలం పెళ్ళిళ్ళ రుతువు. చాలా గ్రామాలలో పెళ్ళి యీడు యువకులకూ, యువతులకూ వేరే వేరే శాలలుంటాయి. వారు రాత్రులు ఆ శాలలలో పడుకుంటారు. వాటిని 'దంగడా'లంటారు. యువకులు రాత్రులప్పుడు జట్లుగా పొరుగూళ్ళకు వెళ్ళి అక్కడి పడుచులతో పాటలు, నృత్యాలతో గడిపి వస్తూంటారు. గ్రామస్థుల మధ్య వివాహం ఖచ్చితంగా నిషేధించినపుడు ఆ నియమం పాటించబడాలంటే, పొరుగూళ్ళ యువతీయువకులు కలియడానికి ఇటువంటి అవకాశాలు కలిగించాలి. ఈ నృత్య గానాలతో కలిగిన పరిచయాలు క్రమంగా వివాహాలకు దారితీస్తాయి. తల్లిదండ్రులూ, గ్రామ పెద్దలూ తమ సంతానాన్ని యీ విధంగా పరిచయాలు పెంచుకోడానికి ప్రోత్సహిస్తారు. వ్యవసాయపు ఎద్దడులలో మనుష్యులు కావలసినప్పుడూ, ఇళ్ళు కట్టడం, నేయడంలో సహాయానికి రైతులు "ధంగడా" నాయకుల సాయం కోరుతారు. వారు జట్టువాళ్ళని తీసుకొని వెళ్ళి సాయం చేస్తారు. వివాహ సందర్భాలలో యువతీ యువకులు కట్టెలు తేవడంలో, వంటలూ వడ్డనలలో సర్వ విధాల సాయపడతారు.

ప్రసవ సమయంలో ఇంట్లోంచి మగవాళ్ళని తరిమేస్తారు. ఇరుగుపొరుగు ఆడవాళ్ళ సహాయంతో ప్రసవం జరిగిపోతుంది. పురుడు వచ్చిన మొదటి అయిదురోజులూ ఆ ఇంట్లో మగవాడు తిండి తినకూడదు.

మరణానంతరం శవాన్ని గుడ్డలో చుట్టబెడతారు. బియ్యం, వంటపాత్రలూ పంచి పెడతారు. శవాన్ని దహనం చేస్తారు. మరుసటిరోజున బియ్యం వండి, దహనం చేసిన స్థలంలో పెట్టి మృతుని ఆత్మను ఆ ఆహారం తినమనీ, దయ్యం కావద్దనీ ప్రార్థిస్తారు. దహనం చేసిన మూడోరోజున కర్మ చేస్తారు. ఏడోరోజున పోతుని వేటవేస్తారు. దానితో మైల ఆఖరు. మృతుని భార్య శవదహనమప్పుడు పూసలూ, లోహపు నగలూ తీసి శవం గుండెలమీద పడేస్తుంది.

శవదహనం జరిగిన మూడోరోజు నుంచి మూడురోజులపాటు రాత్రింబగళ్ళు మృత్యు నృత్యం జరుగుతుంది.

ఖోండు పురాణం ప్రకారం బూరాపెన్ను (సూర్యదేవుడు) తనకోసం ఒక స్త్రీని సృష్టించేడు. ఆమె తరిపెన్ను (భూదేవత) అవుతుంది. తరిపెన్ను తాను చెప్పినమాట వినడంలేదని సూర్యుడు ఒక మనిషిని సృష్టించేడు. ఆ కోపంతో తరిపెన్ను మనిషి పనులకు ఆటంకాలు కలిగించసాగింది. చెట్టుచేమలు, చేపలు, జంతువులు, పక్షులు అన్నీ అలా వచ్చినవే. చివరికి సూర్యుడు మానవజాతిని సృష్టించగలిగేడు. తన శరీరం మట్టిలోంచి ప్రేమ, శృంగారం, సంతానం సృష్టించేడు. మొదట మనిషి ఏ పాపం ఎరుగడు. కాని తరిపెన్ను వారిలో పాపచింత కలిగించింది. నూతన సృష్టి మీద అధికారం బూరాపెన్ను తరిపెన్నులు తగవులాడుకోవడంలో మానవజాతే రెండుగా విడిపోయింది. వీరిద్దరేగాక చిల్లరదేవుళ్లూ, స్థానిక దేవతలూ ఖోండులకు చాలామందే వున్నారు.

నరబలి – దీనిని "మెరియా" అంటారు. ఖోండులలో చాల ప్రాచుర్యం వుండేది. ఆ పేరున ఖోండు గ్రామాలు కుటుంబాలనే పోషించేవి. ఆ కుటుంబం నుంచి గాని, కొనితెచ్చిన



వారినిగాని మాత్రమే బలియివ్వాలి. తరుచుగా అవివాహితుల్ని మాత్రమే బలి యిస్తారు. బలి యివ్వడానికి పూర్వం వారిని ఎంతో ప్రేమతో, గౌరవంతో చూస్తారు. ఆ మాదిరి యువకుడికి అటువంటి కుటుంబంలో పుట్టిన యువతినే ఇచ్చి పెళ్లి చేస్తారు. వారికి భూములు, పశువులు ఇస్తారు. వారికి పుట్టిన బిడ్డలు మళ్లీ "మెరియా"లవుతారు.

ఈ ఆచారం గత శతాబ్ది మధ్యవరకూ సాగింది. బ్రిటిష్ అధికారులు బలప్రయోగంతో ఆ ఆచారాన్ని అణచివేసారు.

1837-1854 సంవత్సరాల మధ్య మేజర్ కాంబెల్ 1506 మంది "మెరియా"లను కాపాడేడు. ఖోండులలో ఆఖరు నరబలి 1854లో జరిగినట్లు (గంజాం జిల్లాలో) నమోదయింది. విశాఖపట్నం జిల్లాలో అటువంటి ప్రయత్నం ఒకటి తరువాత జరిగింది. కాని సాగలేదు.

## ఆదిలాబాద్ జిల్లా రాజ్‌గోండులు

రాజ్‌గోండులు ఆదిలాబాద్ జిల్లాలోని కొండ ప్రాంతాలలో నివసిస్తున్నారు. ఉత్తరాన చంబల్‌నది, దక్షిణాన గోదావరి, తూర్పున వెనకటి ప్రాచ్య సంస్థానాలు, పడమటన వెనుకటి బొంబాయి రాష్ట్రమూ, వీరారుల మధ్యగల విశాలమైన గోండ్వానాలో భాగంగా వుండేవారు వీరు. ఈనాడు గోదావరి, పెన్‌గంగల మధ్యనున్న వీరి సంఖ్య 1941 జనాభా లెక్కల ప్రకారం 70 వేలు. తామే సిసలైన గోండు భాషకూ, సంస్కృతికీ పట్టుకొమ్మలమని చెప్పుకుంటారు. వీరి భాష గోండీ. ఇది ద్రావిడ భాషలలోది. తెలుగుకన్న తమిళానికీ, కన్నడానికి దగ్గరగా వుంటుంది.

వీరు చాలాకాలం క్రితమే పోడు వ్యవసాయం మానేసేరు. వివిధ తరహాల నాగళ్ళతో నేల దున్నుతారు. కలుపు తీస్తారు.

వీరు నాలుగుతెగలుగా వున్నారు. చార్‌దేవ్ (నలుగురు అన్నదమ్ముల తెగ) పాంచ్‌దేవ్ (ఐదుగురు అన్నదమ్ములు), షాదేవ్ (ఆరుగురు అన్నదమ్ములు), సాత్‌దేవ్ (ఏడుగురు అన్నదమ్ములు) తెగలని వానిపేర్లు. తెగలలో అంతర్వివాహం నిషిద్ధం. చార్‌దేవలో 14 కుదురులున్నాయి. వీరి కులదేవతలు తాంబేలు, మొసలీను. పాంచ్‌దేవలో 21 కుదురులున్నాయి. ముళ్ళపంది వీరి కులదేవత. షాదేవలో 6 కుదురులున్నాయి. పెద్దపులీ, పాము వీరి కులదేవతలు. సాత్‌దేవలో 7 కుదురులున్నాయి. పాముా, ముళ్ళపందీ వీరి కులదేవతలు. ఈ తెగలన్నీ వింగాల్ అనే ఆదిపురుషుడి నుంచి వచ్చేయని వారు చెప్పుకుంటారు. ప్రతి కుదురుకూ ఓ దేవుడుంటాడు. ఆయనను పెర్సాపెన్ (పెద్దదేవుడు) అంటారు. ఆయనకు పూజా పునస్కారాలను కుదురు పూజారి– "కత్రా" నిర్వహిస్తాడు. కుదురులో అనేక ఖాన్‌దాన్‌లు – కుటుంబాలుంటాయి. ప్రతి ఖాన్‌దాన్‌కి ఓ "కత్రా". ఆయన పెర్సాపెన్‌కి పూజలు చేస్తాడు. గ్రామానికి వేరే పూజారి (దేవరి). గ్రామదేవతల కతడు పూజలు చేస్తాడు. ఈ దేవరియే సాధారణంగా గ్రామపటేలుగా కూడా వుంటాడు. పూనకం ద్వారా వివిధ దేవతలతో సంబంధాలు పెట్టుకొనే స్త్రీ పురుషులు ప్రతి గ్రామంలో వుంటారు. వీరిని "భక్తల్" అంటారు. అకిపెన్ (గ్రామరక్షకుడు – పోతురాజు), అవగ్వాల్ (గ్రామమాత) వగైరా దేవతలున్నారు. మానవజీవితాన్ని ప్రభావితం చేస్తున్నారని నమ్మే భీమన, జంగుబాయ్, బొఆని, రాజుల్‌పెన్‌ల దేవాలయాలు గ్రామాలలో వుంటాయి. వీటికి పూజారులు వేరే వుంటారు. అయితే గోండులంతా భూదేవినీ,

మహాదేవ్‌నూ ఆరాధిస్తారు.

విందులు వేడుకలప్పుడు కింగ్రీ (మూడు తీగలుండే తంత్రీవాద్యం) వాయిస్తూ పాటలుపాడే ప్రధాన్‌లంటూ వుంటారు.

గోండుల జీవిత విధానం పురాణ పురుషుల ఆదేశాలూ, తమ పూర్వ పురుషుల ఆచరణలమీద ఆధారపడి వుంటుంది. ఇవన్నీ పాటలు, పదాలలో నిక్షిప్తమై వున్నాయి. అవి వట్టి జానపద గీతాలు కావు. వివిధ సంప్రదాయాల్ని సూచిస్తూ, తమ సహచరులతోనూ, దేవతలతోనూ గోండుల సంబంధాలను శాసిస్తాయి.

మరణించిన కుదురుపెద్దలకు కుదురు దేవతలతో కలిపి గొర్రెలను బలియిస్తారు. పెర్సపెన్ ఉత్సవంలో మూడో రోజును పూర్తిగా పెద్దల కొలువులకే కేటాయిస్తారు.

సంవత్సరం పొడుగునా గోండులు హడావిడిగానే వుంటారు. వేసవి ప్రారంభంలో శీతాకాలపు పంటల మాసూళ్ళుంటాయి. తరువాత తెగయొక్క ఐక్యతను తెలిపే దురాడీ పండుగ, పెర్సపెన్ ఉత్సవాలు. ఇవి సాధారణంగా ఏప్రిల్‌లో పడతాయి. తరవాత దుక్కులు. విప్పపువ్వు పంట సారాతయారీ. ఆ రోజుల్లోనే సాధారణంగా పెళ్ళిళ్లు జరుగుతాయి. మేనెలలో గ్రామాంతరాలకి వెళ్లడం, అక్కడ దేవతల్ని పూజించడమూను. భీమ్‌సేన్, జంగుబాయిల వివాహ వేడుకలు వగైరాలు ఈనెలలోనే వుంటాయి. వర్షాలు పడడంతో చల్లికలు, అమ్మతల్లి కొలుపులు, విందులు జజూన్‌జూలై లలో వర్షదేవుడి పూజలు సాగుతాయి. తరవాత కలుపుతీత ఏపంట చేతికి వచ్చినా విందులూ, వినోదాలూ వుంటాయి. శీతాకాలంలో కూడా ఏవో హడావిడులు వుంటాయి.

ఇతర కొండ తెగలలో మాదిరిగానే గోండులలో కూడా వివాహేతూర్వపు స్త్రీ పురుష సంబంధాలకు తప్పుపట్టరు. కాని, గర్భం అయితే-ఆ స్త్రీ పురుషులకు వివాహం తప్పదు. వారిలో పెద్దలే పెళ్లిసంబంధాలను నిర్ణయిస్తారు. అయితే ఓలి ఇవ్వలేకపోయినప్పుడు రాక్షస వివాహాలూ, వితంతు వివాహాలూ అభ్యంతరం కాదు.

పనిచేసేస్వభావాన్నీ, అలవాటునూ మెచ్చి, ప్రశంసిస్తూ, సోమరితనాన్ని నిందిస్తూ, అసహ్యించుకుంటూ గోండులలో ఎన్నో సామెతలూ, సూక్తులూ వున్నాయి. వారు చాలా నిజాయితీ గలవారు. ముక్కుకు సూటిగాపోతారు. ప్రమాదాలకి జంకరు. నేర్పరులయిన వ్యవసాయదారులు. ఓపిక, వుత్సాహం గలవారు.

## ముగింపు

వేర్వేరు తెగలు ఆచారాలూ, అలవాట్లూ, విశ్వాసాలూ, నమ్మకాలూ అని పైనచెప్పినవన్నీ ఈనాడు ఖచ్చితంగా అమలుజరగడంలేదు. ముఖ్యంగా ఈ శతాబ్ది ఆరంభంనుంచి, అందులోనూ స్వాతంత్ర్యానంతరం. అమ్మకానికై సరుకుల ఉత్పత్తి, వాణిజ్య - వ్యాపారాలు, రహదారీ రవాణాసౌకర్యాలూ పెరిగి ఈ తెగలవారి ప్రాచీన జీవితపద్ధతుల్ని వేగంగా మార్చివేశాయి.

ఈ ఆదిమతెగలు వ్యవసాయం, వ్యాపారం పెంపొందిన ప్రాంతాలలో నివసిస్తూనే తమ ఆచారాలూ, సంప్రదాయాలూ కాపాడుకొంటూవచ్చేరు. కాలక్రమంలో వారు ఇరుగుపొరుగుప్రజల సామాజిక జీవిత పద్ధతుల్ని ప్రభావితం చేశారు. వారినుంచి తామూ ప్రభావితులయ్యారు. ఈ పరస్పరసంస్కృతీ ప్రభావం ఈనాడు ఆదిమతెగలు నివసిస్తున్న ప్రాంతాలకే పరిమితమై వుండలేదు. ఆదిమ తెగలు ఏనాడో అంతరించి పోయిన ప్రాంతాలలో కూడా ఈ ప్రభావం



కనిపిస్తుంది.

నాగరిక జీవితంలో మొదటవుండిన నాలుగు వర్ణాలే కాదు, ఈ వేళ మనకు సమాజంలో కనిపించేది. అసంఖ్యాకమయిన కులాలు ఏర్పడ్డాయి. ఆదిమతెగలలో విధిగా కనిపించే అంతర్వివాహనిషేధాలూ, బహిర్వివాహ నిషేధాలూ ఈ కులాలలోకి ప్రవేశించాయి.

అనేకచోట్ల రైతుల్లో కులాలు తెగల పేర్లతోనే వున్నాయి. పల్లపుసవరలు, కాపు సవరలు, సాన్నో ఖోండులు, బడో ఖోండులు, కొండదొరలు, జాతాపుదొరలు –ఇల్లాగే అనేకానేక విభాగాలు. నాగరిక ఖోండులు తమదేవల్నీ, హిందూదేవతల్నీ కూడా కొలుస్తున్నారు. వివాహ పద్ధతుల్లో, అంత్య సంస్కారాల్లో ఉభయుల అలవాట్లూ ఆచరించబడుతున్నాయి. అసలు ఖోండు భాషనుంచి తెలుగు, ఒడియా మిశ్రిత మాండలికాలవరకూ అనేకభాషల్లో వుపయోగిస్తున్నారు. మొదట వుండిన కులదేవతావిభజనలనుంచి ఇంటి పేర్లవరకు వచ్చేరు. అలాగే సవరలూను. వీరిలో నాగరికులు తమ్ము కాపుసవరలమని చెప్పుకుంటారు. కాపులుకారు వారు.

ఈ వేళ కులవ్యవస్థకు ప్రధాన లక్షణాలుగావున్న అంతర్వివాహపద్ధతీ, బహిర్వివాహపద్ధతీ ఆహారసేకరణ దశలోనూ, వ్యావసాయిక పశుపాలక దశలోనూ వున్న ఆదిమ తెగలనుంచి సంక్రమించిన ఆచారాలుతప్ప వేరుకాదు. స్థానిక ప్రజలు, వలసవచ్చి తమ మధ్య చేరినవారికన్న తమ ఘనతను నిరూపించుకొనేందుకు చేసిన ప్రయత్నాలే ఈనాడు కనిపించే అసంఖ్యాక కులవిభజనలకు మూలం. కొండకోయలు, కొండసవరలు, కొండఖోండులు మొదలయిన పేర్లలో ఇది కనబడుతుంది. స్థానిక తెగలవారికన్న వలసవచ్చినవారి ఆర్థిక స్థాయి మిన్న. ఫలితంగా వారిసంఖ్యా, సామాజికస్థాయీ వేగంగా పెరిగాయి. తెగల ప్రజలకూ, వలసవచ్చిన వ్యవసాయిక ప్రజలకూ మధ్య కులాల హెచ్చుతగ్గులు పెరిగినా మతం, కర్మకాండలు, మొదలైనవానితో పరస్పర ప్రభావం మిగిలేవుంది.

విశాఖపట్టణంజిల్లా మైదాన ప్రాంతాలలో, తెలుగుమాట్లాడే రైతులు-కాపులనబడే వారు-ఉన్నారు. వీరు పంటకాపులూ, గాజులకాపులు అని రెండుశాఖలుగా వున్నారు. ఈ రెండు శాఖలలోను కూడ తమశాఖలోనే వివాహబంధం ఏర్పరచుకోవాలనేది ఆచారం. గాజులకాపులు పెద్ద పులీ, తాచుపామూ తమ కులదేవతలు అంటారు. కాని కులదేవతావ్యవస్థకు ప్రధానలక్షణం అయిన అంతర్వివాహ నిషేధాన్ని పాటించరు. కాపులలో రెండుశాఖలవారూ ఇంటిపేర్లు వుపయోగిస్తున్నారు. ఒకే ఇంటిపేరుగలవారు అంతర్వివాహ నిషేధాన్ని ఆచరిస్తున్నారు. మళ్ళీ మేనరికాలు ఇద్దరిలో వున్నాయి. కాపులలో నగరాలు అంటూ వున్నారు. భిన్న కులదేవతలు కలిగిన మూడు శాఖలుగా వీరున్నారు. ప్రతిశాఖా వేర్వేరు యింటి పేర్లున్న కుటుంబాలుగా విభజింపబడి వుంది. వీరు మేనరికాన్ని వివాహాల్లో అంగీకరిస్తారు. వీరిలో రజస్వలానంతర వివాహమూ, విధవా వివాహమూ నిషిద్ధం. వివాహాలను బ్రాహ్మణ పురోహితులచేత చేయిస్తారు. కొండకాపులంటూ ఒక ప్రత్యేక కులం వుంది. వీరు పెద్దకొండలు, చిన్న కొండలూ అని రెండు శాఖలుగా విడిపోయి వున్నారు. ఒకరియిళ్ళలో ఒకరికి భోజనభాజనాలున్నాయి. పిల్లల్ని యిచ్చి పుచ్చుకోవడాలున్నాయి. కాని పెద్దకొండలు ప్రాచీనకులదేవత వ్యవస్థ ఆచారాల్నీ, వివాహబంధనల్నీ పాటిస్తున్నారు. చిన్నకొండలు ఇంటిపేర్లు, హిందూ వివాహసంప్రదాయాలు

పాటిస్తున్నారు.

అసంఖ్యాకులైన దేవతల్ని – మంచి చేసేవాళ్ళని, చెడ్డ చేసేవాళ్ళనీ కూడ తృప్తి పరచేందుకై కొండప్రజలు ఎంతో కర్మకాండ జరిపి, బలులను యిస్తూంటారని గమనించాం. వారు తమ తెగల దేవతలతోపాటు హిందూ దేవతల్ని కూడా కొలవడం చూశాం. అంతేకాదు, ఈ వేళ హిందువులు పూజించే దేవతలెందరో తెగలనుంచి తెచ్చుకున్న వాళ్ళే. గౌరీపూజ అటువంటిదే. కాళీపూజ అటువంటిది. కలరా, మశూచి వ్యాపించినపుడు కొలుపులు చేయడం, బలులివ్వడం గ్రామాలలో మొన్నటివరకూ వుంది. రాయలసీమలోని నల్లరేగడిభూములున్న ప్రాంతాలలో గ్రామదేవతలు "పెద్దమ్మ" అంటారు. ఆమె దయ వుంటే పంటలు బాగా పండుతాయని భావన. అలాగే గంగమ్మ చెరువులలో నీరు తరగకుండా వుంచుతుందని నమ్మకం.

ఉదాహరణలన్నింటినుంచి మనం గ్రహించే మొదటివిషయం ః తెగప్రజల, నాగరిక ప్రజల సంస్కృతులు పరస్పరం ప్రభావితం చేస్తున్నాయి. (అవి ఒండొరులపై కలిగించే ప్రభావంలో హెచ్చుతగ్గులుండవచ్చు) –అనేది. రెండోది ః సాంకేతికాభివృద్ధి, కళలు, సాహిత్యం, విద్య, సంస్కృతి ప్రజలలో ఎంతో విజ్ఞానం కలిగించినా, అతి స్వల్పవిషయాలమీద మత సంఘర్షణలు, ఎన్నికలలో కులం పట్టుదలలు, వివాహ విషయాలలో అంతర్వివాహ, బహిర్వివాహ నిషేధాలు, ఆపదలు రాకుండానూ, రోగాలు వ్యాపించకుండానూ, పరీక్షలలో ఫెయిల్ కాకుండానూ చేసేందుకై దేవతలకు, పూజలు, నైవేద్యాలు నేటికీ మన మనస్సుల్ని పట్టి వదలకుండ వున్నాయి. ఇంక మూడోది ః ఆటవికతెగల సమాజంలో వుండే ప్రధాన వైరుధ్యం మనిషికీ, ప్రకృతికీ మధ్య, ఆ దశలో ఈ పరిణామాలు సహజం. తప్పనిసరీను. కాని ఈ మూఢ ఆచారాలు మనవ పురోభివృద్ధికి ఆటంకంగా ఈనాడూ కొనసాగడం అర్థం లేనిది. నాలుగోది ః ఎన్ని మూఢాచారాలు, మూర్ఖత్వాలు వున్నా, ఆటవికతెగల సమిష్టి జీవితం వారిలో ఎంతో ఏకత్వభావనను, నైతిక బాధ్యతలను, పరస్పర సహకారదృష్టినీ కలిగించింది. ఈనాడు వానిని మనం వూహించనుకూడా లేకున్నాము. ఇంక ఆఖరుది ః వారి కళారూపాలు. ఇవి మతమౌఢ్యాలతో ఎంత ముడిపడివున్నా, చాల ఉచ్ఛస్థాయికి చేరాయి. అవకాశాలుంటే సామాన్యవ్యక్తి ఎంత పురోగమించగలడో అవి చూపుతున్నాయి.

మూడవ ప్రకరణం

# శాతవాహనయుగం

## చారిత్రక పూర్వరంగం

ఆటవిక ప్రాంతాలలో వ్యావసాయిక ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి పొందడం ప్రాచీన భారతదేశంలో వచ్చిన మొదటి సాంఘిక విప్లవంగా పేర్కొవచ్చు. వేల సంవత్సరాలుగా పురాతన పనిముట్లను, అంధ విశ్వాసాలను అంటిపెట్టుకొని వున్న అసంఖ్యాక ఆదిమతెగల మధ్యనున్న అడ్డుగోడల్ని కూల్చివేయడమే ఆర్యులు సాధించిన ఘనవిజయం. నూతన మండలాలను వ్యవసాయంలోకి తెచ్చి, నూతన కళాకౌశల్యాల్నీ, ఉత్పత్తిపద్ధతుల్నీ ప్రవేశపెట్టి వారు నూతనసామాజిక సంబంధాలకూ కొత్త తరహా సమ్మాజానికీ పునాదులు వేశారు. బుద్ధిపూర్వకంగా, ఉదారబుద్ధితో చేసిన పని కాదది, సద్యః ఫలితమే వారిదృష్టి. కాని ఇది చరిత్రలో ఒక కొత్త అధ్యాయాన్నే ప్రారంభించింది. విధ్వంసం చేస్తూనే నేలను సారవంతంచేసే వరదలా పనిచేశారన్నారు కొశాంబీ.

క్రీస్తుకు రెండువేల సంవత్సరాల పూర్వం ఆర్యులు భారతదేశంలోకి వచ్చినపుడు వారు పశుపాలక సంచారజీవితం గడుపుతున్నారు. గుర్రం వాహనంగావుండడం, పశువులమందల రూపంలో కావలసినంత ఆహారాన్ని వెంట తీసుకుపోగలగడం, ఇనుము తెలిసి వుండడం వారికి సైనిక విజయాలను సమకూర్చి పెట్టాయి. క్రీ॥ పూ॥ 1750 ప్రాంతం నాటికి వారు సింధులోయ ప్రజల్ని జయించేరు. ఆర్యుల సంపర్కంలో చిరకాలంగా దేశంలో జీవిస్తున్న ఆదిమ తెగలు మారిపోయేరు. ఆర్యులు అనార్యులు కలిసిపోయి కొత్తతెగలుగా ఏర్పడ్డారు. వీరు ఆర్యుల జీవితవిధానాన్నే చేపట్టేరు. పశువులమందల కోసమూ, నీటికోసమూ, ఈ కొత్తతెగలమధ్య సంఘర్షణలు ప్రారంభమయ్యాయి. ఇలా కొత్తగా ఏర్పడిన తెగలలోకూడ భూమీ, పశువులూ ఉమ్మడి ఆస్తిగానే వుండేవి. అయితే వీనిలో వర్గసమాజపు ఛాయలు ప్రవేశించాయి. వీరి అధీనంలో 'దాసులు' అంటూ వుండేవారు. వారిని తెగలో చేర్చుకోడానికి వీలులేదు. వారి ఉత్పత్తి మిగులు తెగకంతకూ చెంది వుండేది. ఏరులు, ఏటి కాలవలద్వారా వ్యవసాయం జరిగేది.

క్రీ॥ పూ. 1000 ప్రాంతంలో ఆర్యులు పంజాబుకు తూర్పుదిశగా వచ్చేరు. అయితే, అప్పటికి వేయిసంవత్సరాలకి పూర్వం సింధులోయనగరాలను నాశనం చేసినప్పటి స్థితిలో లేరు వీరు. వారిప్పుడు ప్రవేశిస్తున్న భూములు బాగా సారవంతమైనవే. అయితే దట్టమైన

అరణ్యాలు, వర్షపాతం బాగా ఎక్కువాను. వీనిని సాగులోకి తేవాలంటే నూతనశిలాయుగపు పనిముట్లు పనికిరావు. ఏదో కొద్ది ఇనుము నెరిగివుంటేనూ చాలదు. స్థిరనివాసి అనే అర్థం ఇచ్చే వైశ్య ఆర్యుణ్ణి 'యజుర్వేదం' పేర్కొంటూంది. ఆర్యులలో క్షత్రియులు యుద్ధానికి అంకితం అయ్యారు. బ్రాహ్మణులు పురోహితులుగా అంకితమయారు. ఆర్యులయిన వైశ్యులూ, అనార్యులయిన శూద్రులూ సమాజానికంతకూ సరిపడేలా అదనపు వుత్పత్తి చేయవలసిన వారయారు. "రుగ్వేదకాలపు సమాజంలో కనిపించేవి రెండే విభాగాలయితే, ఇప్పుడు నాలుగువర్ణాలు సమాజంలో ఏర్పడ్డాయి. రాజులు కావటానికి చిన్నచిన్న నాయకులే కాని–వారి ప్రాబల్యం పెరిగింది. యుద్ధంలో విజయాలకోసం వారు బలులివ్వడం బాగా విస్తరించింది. బలిపశు సేకరణ ఒక పన్నులా తయారయింది. దీనిఅర్థం ఒక్కటే. భూములలో జనం స్థిరపడ్డారు. కొత్తతరహా ఆస్తిహక్కు అమలులోకి వచ్చింది. పశుపాలనలో కన్న ఉత్పత్తి ఎక్కువైంది. అదనం బాగా మిగులుతూంది. నాలుగువర్ణాలు ఏర్పడటంతో భారతదేశంలో కొత్తతరహా వర్గవిభజన వచ్చింది. ఇది ఈ దేశానికి మాత్రమే ప్రత్యేకం. "ఉత్పత్తి ప్రాథమికదశలో వున్నప్పటి వర్గాలే వర్ణాలు; ఆట్టే పీడించకుండా ఉత్పత్తిదారులనుంచి అతని అదనపు వుత్పత్తిని తీసుకొనేందుకు వీలుగా మతతాత్విక రూపమయిన సామాజికస్పృహను కలిగించిన పద్ధతి –" అని వర్ణవ్యవస్థను గురించి డి.డి.కొశాంబీ వ్రాసేరు.

తరవాత క్రమంగా వైశ్యులు వ్యాపారం చేపట్టేరు. పనిచెయ్యడానికి శూద్రులొక్కరే మిగిలేరు. ఈ విధంగా ఒకవర్ణంవారి శ్రమశక్తిని దోపిడిచెయ్యడం భారతదేశానికే ప్రత్యేకమయిన దోపిడిరూపం. ఇక్కడ యూరపులోలాగ, వుత్పత్తికై బానిసల అవసరం రాలేదు. ఏమంటే దేశాన్ని ఆక్రమించి, విస్తరించినదశలో ఆర్యులలో వున్నది సమిష్టి ఆస్తికాని, వ్యక్తి ఆస్తి కాదు. మొదటి రోజుల్లో వర్ణవ్యవస్థ ఉత్పత్తిని వృద్ధిపరచింది. కొత్తతరహా జనావాసాలకు అరణ్యాలను ఖాళీచేసింది. కొత్తకొత్త తెగలను తనలో కలుపుకొంది. సరుకుల ఉత్పత్తికి ప్రాముఖ్యం లేనప్పుడుశ్రమశక్తి సరుకుకావడం జరగదు. వ్యవసాయోత్పత్తియే ప్రధాన మయినప్పుడు పనిచేసేవారు భూమిని అంటిపెట్టుకొని వుండేటట్లు చేస్తేచాలు.

క్రీస్తుపూర్వం 800 ప్రాంతంలో ఆర్యులు హిమాలయపర్వతపాద భూముల వెంబడినే బయలుదేరి గంగానది వెంబడి నేటి రాజగిరివరకూ వచ్చేరు. నదీపరీవాహప్రాంతభూములు చాలసారవంతమైనవే కాని, కీకారణ్యాలు. కనక వ్యవసాయం చాలకొద్దిగా మాత్రమే సాగింది. నదిలో రాకపోకలు సులభమే కాని జనపదాలు విస్తరించక దాని వుపయోగం అంతగా లేకపోయింది. ఇంక మెట్ట మార్గాననే తక్షశిల వరకూ రాకపోకలు జరిగేవి. ఇప్పుడింక కొత్తతెగలపేర్లు వినబడసాగేయి. అంటే కొత్త కొత్త ప్రజలు ఆర్యులలో కలిసిపోవడం ఆరంభమయిందన్నమాట. కేవలం వేటమీదనే జీవిస్తున్న ఆదిమతెగలు ఆర్యులలో కలిసిపోసాగేరు. అనార్యతెగలలోనే కొందరు కొత్తజీవితపద్ధతులను చేబడుతూంటే, మరికొందరు పాతఅలవాట్లను విడవక క్రమంగా సమాజంలో హీనస్థాయికి దిగబడ్డారు. వారే చండాలురు అయారు. దక్షిణాపథంలోని నాగరాజుల్ని ఆర్యులు గుర్తించేరు. కాని ఆ తెగలవారే ఉత్తరాన నేటికీ ఆదిమవాసులుగా వుండిపోయారు. ఆ విధంగా ఆదిమవాసులు ఆర్యులతో చేరిపోవడం మూడు పద్ధతులలో సాగింది. సరాసరి అణచివేసి లొంగతీసుకోవడం ఒకటి. శాంతియుతంగానే తమలో చేర్చుకోవడం రెండోది. మూడోది తెగల ప్రభువులు ఆర్యులు తోడ్పాటుతో సర్వాధికారులయిన



రాజులు కావడం. కలిసిపోయేనాడు ఆయాతెగలకున్న ఆర్థికబలం కొత్తగా ఏర్పడిన వారివర్ణానికి సమాజంలో స్థానబలాన్ని సమకూరుస్తూ వచ్చింది. ఈ మార్పుల తత్ఫలితంగా అక్కడా అక్కడా చెదురు మదురుగా వుండిన జనావాసాలస్థానే వ్యవసాయప్రధానజీవితంగల గ్రామాలు విస్తరించాయి. ఆ విధంగా క్రీస్తుపూర్వం 600 సంవత్సరాల నాటికి అసలు ఆర్యను తెగలు క్షీణించి, అనేక తెగల రాజ్యాలు ఏర్పడి అధికారంకోసం సంఘర్షించడం ఆరంభమయింది. పాత తెగల పూజారివర్గంనుంచి కొత్త బ్రాహ్మణకులాలు పరిణతిపొందాయి. ఆర్యులు అనార్యుల మధ్య అంతరువులు నశించి, ఆర్యులదిగానే ఒకనూతన తెగ ఆర్థిక వ్యవస్థ ఏర్పడింది. ఈ వ్యవస్థలో బేహారులకూ ప్రాముఖ్యం వచ్చింది. ఏమంటే దూరదూరాలనుంచి ఇనుము, ఉప్పు వంటి అత్యవసర వస్తువులు చేరకపోతే ఈ గ్రామాలు ఒక్కరోజు మనలేవు. వైదికకాలంనాటి బలిపూజాదికాలు నిర్వహించే పూజారితనం నుంచి బయటపడి బ్రాహ్మణుడు అడవులలోకి చొచ్చుకుపోయి, స్థానికంగావుండిన అసంఖ్యాక మూఢాచారాలకు గౌరవం కలిగించడం, శాస్త్రాలు, తెగలరాజకుటుంబాల వంశవృక్షాలను పురాణాలుగా వ్రాయడం మొదలుపెట్టేడు. పాముల్నీ, కోతుల్నీ పూజించే తెగ ఆచారాలూ, స్థానిక దేవతల్ని మంచిచేసుకొనేందుకు నరబలులూ, జంతుబలులూ ఇవ్వడం మొదలైనవి అసహ్యకరమే. అనాగరికమే. కాని వీటన్నింటినీ తాముకూడా అంగీకరిస్తే తప్ప శాంతియుతంగా తెగలను కొత్త జీవిత పద్ధతులకు మార్చడం సాధ్యంకాదు. ఈ మార్పువస్తే తెగలప్రజలు ఒకవిధమైన పరాధీనతకు – అర్ధబానిసస్థితికి గురిఅయినా, వారి బతుకుతెరువు సుఖతరం అవుతుంది. ఇందువలన గ్రీసురోములలో మాదిరి బానిసత్వం భారతదేశంలో ఏర్పడవలసినస్థితి కలగలేదు. ఈవిధంగా ఏకకాలంలో దేశంలో రెండుధోరణులు కొనసాగడం కనిపిస్తుంది. వైదికమతాన్నీ, గ్రామ వ్యవస్థనూ వుపయోగించుకొని రాజులు తెగల ఆర్థికవ్యవస్థను తొలగించి స్వాతంత్రులయ్యారు. వర్గవ్యవస్థగా వర్ణవ్యవస్థను ప్రోత్సహించేరు. రెండోవేపున బ్రాహ్మణులు తెగల మూఢవిశ్వాసాలన్నిటికి అధికార ఆమోదముద్ర వేయడం ద్వారా వ్యతిరేకశక్తుల సహకారాన్ని సంపాదించి ఏకోభావం కలిగించేరు. అంతేకాకుండా, దేశంలో ఆహారానికి ప్రధానాధారం అయిన వ్యవసాయం విజయవంతంగా సాగాలంటే చంద్రమానం, జ్యోతిర్గణనం నిర్ధారణచేస్తూ దీర్ఘకాల పరిశీలనలూ, గణితశాస్త్ర పురోగతీ అవసరం. ప్రాచీన ఆదిమతెగలు ఎరుగని వ్యవసాయపు మెలకువలు ప్రవేశపెట్టడానికి ఇవి అవసరం. ఈ విధంగా మూఢ విశ్వాసాలను బలపరచడం ప్రారంభంలో పురోగతికి ప్రోత్సాహం కలిగించింది. (ఐతే తరవాత ముందడుగు వెయ్యడానికి ఆటంకమే అయింది. విదేశీదాడులు, కరువులు, అంటురోగాలు వచ్చినపుడు దేశాన్ని నిస్సహాయస్థితికి తెచ్చింది).

గంగామైదానాన్ని, అడవులు కొట్టిసాగులోకి తేవాలంటే లోహాలు చవకగా లభించడం, తెగకట్టుబాట్లులేని జనం పనిపాటలకు దండిగా దొరకడం అవసరం. రాజగిరికి ఆగ్నేయంగా వన్న ప్రాంతంలో రాగి, ఇనుము దండిగా దొరుకుతాయి. ఫలితంగా నదీతీరానవున్న మగధ ప్రాబల్యంలోకి వచ్చింది. క్రమంగా మౌర్య సామ్రాజ్యం ఏర్పడింది. ఈ నూతన మండలంలో తలఎత్తిన శూద్ర గ్రామాలనుంచి ప్రభుత్వానికి ఆదాయం బాగా లభించింది. తగినంత ఉపాధి ఏర్పడడంచేత శూద్రగ్రామాలు త్వరగా విస్తరించాయి. ఈ పురోగతి క్రీస్తుపూర్వం 500 నుంచి నిరాటంకంగా కొనసాగింది. చంద్రగుప్తునికాలపు మౌర్యసామ్రాజ్యంలో వ్యవసాయం, పరిశ్రమలు, వాణిజ్యం ప్రభుత్వాధీనంలో వుండేవి. అందువలన ఈ నూతనజనపదాలనుంచి ప్రభుత్వాదాయం

హెచ్చుగా వుండేది. తెగలగ్రామాలమీద పన్నులువేయడం అంతముఖ్యంగా వుండేదికాదు. అయితే ఈ మార్పులు తెగలప్రాంతాల్ని కూడా ప్రభావితం చేయకమానలేదు. అక్కడకూడా శూద్రులు నివాసం ఏర్పరచుకోవడం, వారి ఉత్పత్తులు తెగల ఆదాయాల్ని బాగాపెంచడం, దానితో తెగవ్యవస్థ విచ్ఛిన్నంకావడం జరిగింది. తెగలప్రజలే అడవులలో చొరబడి గ్రామాలు ఏర్పరచుకొని కొత్తకొత్త ఆర్యతెగలుగా పరివర్తన చెందసాగేరు. వీరంతా శూద్రతెగలుగానే పరిగణనకు వచ్చేరు. ఈ కొత్తగ్రామాలు ప్రభుత్వాధీనంలో వుండేవి. వలసవచ్చిన బ్రాహ్మణులు వారికి పరివర్తనలో సాయపడ్డారు. వర్ణవ్యవస్థ విజయవంతం అయింది. కొత్తతెగలు, కొత్తవృత్తులు అనేకానేక పేర్లతో కొత్తకొత్త వర్ణాలు, కులాలుగా ఏర్పడి ఆర్యసమాజాంతర్భాగాలయ్యాయి.

ఈ పరివర్తనకంతకూ క్రీస్తుపూర్వం 6 వ శతాబ్దంనుంచి విస్తరించిన అహింసాత్మక జైన, బౌద్ధమతాలు తాత్వికబలాన్ని సమకూర్చి పెట్టేయి.

నిరంతరయుద్ధాలూ, యజ్ఞకర్మలూ రైతులకీ, వర్తకులకీ కూడ చాలనష్టం. తమ రాజ్యానికి వెలుపలనున్న ప్రజలతోకూడ వర్తకుడు మంచిగా వుండాలి. దొంగల భయం వుండకూడదు. అంతేకాదు, వర్తకం విస్తృతంగా సాగాలంటే స్వతంత్రకర్షకులుండాలి. భూమి రైతుదై వుండాలి. తన అదనపుపంటను తెగలోని ఇతరులకు పంచవలసిన అవసరం వుండకూడదు. శాంతివుండాలి. పన్నుల భారం తగ్గాలి. అదేవిధంగా రాజులు యజ్ఞకర్మలకై పశువులను ఉచితంగా తోలుకుపోయే పరిస్థితి వుండకూడదు. ఈ అవసరాలకు సరిపడుతున్నాయి, యజ్ఞాదికర్మకాండను వ్యతిరేకించిన నూతన తాత్విక ధోరణులు.

బుద్ధుడు వర్ణవ్యవస్థను ఖండించలేదు. కేవలసామాజిక విభజనగా, తాత్కాలికమైన దానినిగానే భావించేడు. బ్రాహ్మణుని పెద్దరికాన్ని గొప్పదనాన్నీ ఒప్పుకోలేదు. ఏకులానికి చెందినా గృహస్థు ఎలావ్యవహరించాలో చెప్పేడు. రాజులు చేయవలసిన పనులు సూచించేడు. రైతులకు విత్తనాలూ, పశుగ్రాసం అందించడం, వర్తకులకు పెట్టుబడులివ్వడం, వాణిజ్యమార్గాల వెంబడి చెట్లునాటడం, నూతులు తవ్వడం, సత్రాలు కట్టడంవంటి సౌకర్యాలు కలిగించాలన్నాడు.

బుద్ధుని బోధనలను అమలుజరిపిన అశోకుడు ప్రజా సౌకర్యకల్పనకై ఎంతో ధనం ఖర్చుచేశాడు. అశోకుడూ, ఆయన అధికారులూ నిరంతరదేశ పర్యటనచేస్తూ వర్గాలమధ్య వైషమ్యాలను తగ్గించేందుకు ప్రయత్నించేరు. చంద్రగుప్తుని కాలంలో రాజ్యాంగానికిలేని నూతనలక్షణం ఇది. నూతన జీవితవిధానానికి తోడ్పడే చర్యలు చాలా తీసుకున్నాడు అశోకుడు. కాని అవి సామ్రాజ్యపతనానికి దారితీశాయి. ప్రభుత్వ యాజమాన్యంలో వ్యవసాయదినుసుల్ని వుత్పత్తి చేయడం తగ్గింది. దానిస్థానే స్వయంపూర్ణ గ్రామవ్యవస్థ నెలకొంది. ప్రతిగ్రామం తన అవసరాలను తానే వుత్పత్తిచేసుకొంటుంది. దానితో పట్టణాలలోని ఉత్పత్తిదారుల సరుకులకు విడుదల అవకాశాలు క్షీణించాయి. ప్రభుత్వ యంత్రాంగంమీద ఖర్చు మతం సాయంతో తగ్గించబడింది. సైన్యాల అవసరం లేకపోయినా దానిని భరించడం మిగిలింది. అన్నిటికన్న నష్టకరంగా సింగ్‌భూమ్, ధల్‌భూమ్‌లలోని గనులలో నీరు నిండింది. దానిని తోడేందుకు యంత్రాలులేవు. ఫలితంగా లోహాల ఉత్పత్తిలో మగధ సామ్రాజ్యానికి గల గుత్తహక్కు నిరుపయోగం అయింది. మగధ సామ్రాజ్యం విచ్ఛిన్నంకాక తప్పని పరిస్థితి ఏర్పడింది.

ఈ విధంగా 15 వందల సంవత్సరాలపాటు ఆర్యసంస్కృతి ప్రభావవ్యాప్తి దేశంలో



సాగింది.

ఉత్తరభారతంలో లాగనే దక్షిణ భారతంలోకూడా ఆర్యులరాకతోనే చరిత్ర ప్రారంభమయింది. దక్షిణ భారతంలో ఇంచుమించు ఆంధ్రజిల్లాలన్నింటా క్రీస్తుపూర్వం 500 ప్రాంతాలలో బృహత్ శిలాసంస్కృతి వ్యాపించి మూడు శతాబ్దాలు కొనసాగిందని మొదటి ప్రకరణంలో వివరించేను. ఇనుమును ఉపయోగించిన ఈ బృహత్ శిలా సంస్కృతి అంతకు ముందటి నూతన శిలాయుగ సంస్కృతి నుంచే క్రమ పరిణామంలో వచ్చినది కాదనీ, పై నుంచి వచ్చి అతి వేగంగా ఇక్కడ విస్తరించిందనీ పండితులు అభిప్రాయపడుతున్నారు. మధ్యధరా సముద్రతీర దేశాలలోనూ, కకేషసులోనూ, ఇరాన్‌లోనూ సరిగా ఇలాంటి బృహత్‌శిలా నిర్మాణాలేవున్నాయి. ఉత్తరభారతంలో ఇటువంటివిలేవు. దక్షిణభారతంలో కనిపించిన ఈ బృహత్‌శిలా సమాధులవంటివి పైన చెప్పిన ఆ ప్రదేశాలలో ఉండడాన్నిబట్టీ అక్కడ ద్రావిడభాషమాట్లాడే ప్రజలు వుండడాన్ని బట్టీ బృహత్‌శిలా ప్రజలు ద్రావిడులేనని హైమన్ డార్ఫ్ సిద్ధాంతీకరిస్తున్నాడు. బృహత్‌శిలా సంస్కృతి వ్యాపించడానికీ, చారిత్రక యుగారంభానికీ మధ్య వ్యవధిఆట్టేలేదు. అప్పటికే చాలా అభివృద్ధిదశలోవున్న ద్రవిడుల భాషను ఆర్యసంస్కృతి సంపర్కం తుడిచిపెట్టలేకపోయింది. ఆర్యులువచ్చేనాటికే దక్షిణాపథంలో ఇనుము ఉపయోగించబడుతూంది. నిజానికి ఉత్తరాపథంలో చాలచోట్ల ఆనాటికి ఇనుమునెరగరు. బృహత్‌శిలాప్రజలు దక్షిణభారతదేశంలోకి అరేబియా దక్షిణప్రాంతంనుంచి కోస్తావెంబడినే క్రీస్తుపూర్వం 500 సంవత్సరాలనాడు వచ్చివుండవచ్చునని గార్డన్ వూహిస్తున్నాడు. దీనికి కారణాలు–దక్షిణభారతంలోని బృహత్‌శిలా సమాధులకీ మధ్య ధరాప్రాంతదేశాలలోని బృహత్‌శిలా సమాధులకీ దగ్గర పోలికలున్నాయి. బలూచిస్తాన్ లోని కొన్ని ప్రాంతాలలో మాట్లాడే బ్రాహుయి' ద్రవిడభాషా కుటుంబానికి చెందినది. అఫ్ఘనిస్తాన్, ఇరాన్, ఇరాక్, జోర్డాన్‌లలోని కొన్ని ప్రాచీనస్థల నామాలు ద్రవిడభాషారూపాల్ని సూచిస్తున్నాయి. పెర్సిపోల్‌తవ్వకాలలో అతి ప్రాచీన చరిత్రపూర్వయుగపు పొరలలో కనిపించిన నాగపూజా పద్ధతులకీ, భారతదేశంలో ద్రవిడభాషా ప్రాంతాలలో సాగే నాగపూజ పద్ధతులకీ పోలికలున్నాయి. పర్వత రాణి పేరున అమ్మతల్లి (మాతృదేవత)కి జరిపే కొలుపులూ, ఏటాఉర్‌లోని చంద్ర దేవునితో ఆ దేవతకు పెళ్ళివేడుకలు జరపడానికి దక్షిణభారతంలో జరిపించే శివపార్వతీ వివాహపు వేడుకలకూ పోలికలున్నాయి. వీటన్నింటినిబట్టి దక్షిణభారతదేశానికీ, మధ్య ప్రాచ్యదేశాలకు ఆరోజులలో సముద్రతీరం వెంబడినే రాకపోకలుండినట్లు భావించబడుతూంది.

మగధరాజ్యం దండయాత్రలు సాగించిననాటికి అప్పుడే దక్షిణభారతంలో ఇనుము తవ్వడం కొద్దికొద్దిగా ప్రారంభమయింది. అయితే ఉత్తరదేశంలోలాగ ఇక్కడ దారిసౌకర్యం లేదు. పర్వతభూమి. రెండోది సరుకు వినిమయం జరగాలంటే మిగులు ధాన్యం ఎక్కువగా వుండాలి. భూమిమీద వ్యక్తిహక్కూ, పనులుచేసేందుకు జనమూవుంటేనే అది సాధ్యం. ఆర్యులు వచ్చేనాటికి దక్షిణాపథానవున్న బృహత్‌శిలా ప్రజలు తెగల కట్టడి కలిగి వున్నారు. అక్కడ వాణిజ్యం తెగల పెద్దలతోనే జరగాలి. ఆయనే తెగపండించిన అదనపుధాన్యాన్ని సేకరించి వర్తకుడికి ఇవ్వాలిసుంటుంది. ఇది జరగాలి అంటే ఆయనకు కొంత స్వాతంత్ర్యం ఉండాలి. ఆనాటికిక్కడ వర్ణవ్యవస్థగల గ్రామ ఆర్థికవ్యవస్థ ఏర్పడలేదు.

ఈ పరిస్థితులలో క్రీస్తుపూర్వం 6వ శతాబ్ది ప్రాంతాలలో చిన్నచిన్న జట్లుగా ఆర్యులు

దక్షిణాపథానికి రాసాగేరు. ఆనాటికి గోదావరీతీరంలో నాగేటివ్యవసాయంలేదు. ఆర్యుల రాకతో నాగలి వచ్చింది. అప్పటినుంచి గ్రామాలు త్వరత్వరగా విస్తరించేయి. నర్మదాతీరంలోని మహేశ్వర్‌లోను, మూల గోదావరీసంగమ సమీపంలోని నెవాసాలోనూ జరిపిన తవ్వకాలు దీనిని రుజావు చేస్తున్నాయి. అప్పటికే ద్రవిడప్రజకు ఇనుము తెలుసునేమో. ఈ పరివర్తనం అతి వేగంగా వచ్చింది. దక్షిణదేశంలో ఆర్య సంస్కృతి వ్యాప్తికి సైనిక ఆక్రమణలు అవసరం కాలేదు, ఆర్యులరాకకు ముందుండిన నాయకులను రాజులుగా గుర్తించేరు. అంతకు పూర్వం ఉండిన తెగల పూజార్లు కొత్త బ్రాహ్మణకులంలోకి వచ్చేరు. తెగవ్యవస్థ శిధిలమయి, అదనపు వుత్పత్తి పెరగడంతో వ్యాపారం విస్తరించింది. ఫోనీషియాకు, బాబిలోన్‌కు బంగారం, రత్నాలు, నెమళ్ళు, ధాన్యం, చందనపుకర్ర మొదలైనవి క్రీస్తుపూర్వం 5వ శతాబ్దినాడే దక్షిణభారతం నుంచి ఎగుమతి అయ్యేంతగా వాణిజ్యం విస్తరించింది.

మౌర్యచంద్రగుప్తుడు, ఆయనకొడుకు బిందుసారుడు తమరాజ్యాన్ని దక్షిణాన కూర్గువరకూ విస్తరింపచేశారు. కాని ఉత్తరదేశంలోలాగ దక్షిణాన భూములను ప్రభుత్వయాజమాన్యంలో సాగుచేయించడం సాధ్యంకాలేదు. ఇక్కడ భూమిస్వభావం వేరు. సారవంతమైన నేల అక్కడా అక్కడా తుంపులుగా వుంది. దీనిని సాగులోకి తేవాలంటే జనం బాగా పెరగాలి. గ్రామాలు విస్తరించాలి. పంటపెంచాలనే శ్రద్ధకలిగి వ్యవసాయం చెయ్యాలి. అశోకుడి కాలంనాటికింకా తెగలు విశీర్ణం అవుతూ ఉన్నాయి. ఒక్క ఏడాది వరదలమూలంగానో, వర్షాలు లేకనో పంటలు చెడిపోతే ప్రభుత్వాదాయం వుండదు. కరువునివారణకు ఎంతో ధనమూ ఖర్చు చేయవలసివస్తుంది. దక్షిణదేశం లోని తెగప్రాంతాలలో లోహాలు దొరుకుతుండడంచేత వానిని ప్రభుత్వగుత్తలో పెట్టుకోడానికి వీలులేదు. అందుచేతనే దక్షిణాపథంలో వ్యవసాయాన్నీ, లోహాల వుత్పత్తినీ మౌర్యప్రభుత్వం తనగుత్తలోకి తీసుకోకుండా వదిలేసింది. కేవలం రేవుపట్టణాలను, అధీనంలో వుంచుకొని వాణిజ్యాన్ని వృద్ధిచేసింది. కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో, దక్షిణాపథంలోని వాణిజ్యం గురించీ, వాణిజ్యమార్గాలు గురించీ, సముద్రతీరమార్గాలు, సముద్రాంతరవాణిజ్యం, నదీమార్గాలుగురించి వ్రాసినది చూస్తే, వీనికెంత ప్రాముఖ్యం ఇచ్చేడో కనబడుతుంది. దక్షిణాపథంలో వాణిజ్యం పెద్ద ఎత్తున జరగడం నంద, మౌర్యసామ్రాజ్యాలకు పునాది అయిందంటారు, నీలకంఠశాస్త్రి తమ "ఏ హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా"లో

అశోకుని అభిమాన ఆదరాలవల్ల బౌద్ధమతం దక్షిణాన వాణిజ్యానికి చాల ప్రోత్సాహం ఇచ్చింది. కార్లేచైత్యగుహ, బౌద్ధమతానుయాయులైన గ్రీకువర్తకుల గ్రామమైన ధేనుకటకం (ఈరెండూ శాతవాహనరాజ్యంలోనివే) దీనికి ప్రత్యక్ష సాక్ష్యాలు.

ఆంధ్రదేశంలో కనిపించే అతిప్రాచీన చారిత్రక అవశేషాలు బౌద్ధానికి సంబంధించినవే. అవన్నీ అశోకుని పాలనకాలంలో నిర్మించినవే. శ్రీకాకుళం జిల్లాలో నిర్మించిన శాలిహుండాం మహాచైత్యాన్ని అశోకుడు దర్శించినట్లు చెప్తారు. బుద్ధగయ సమీపంలో అశోకుడు చెక్కించిన లోమశరుషిగుహను పోలినదే కృష్ణాజిల్లాలోని గుంటుపల్లిగుహ. భట్టిప్రోలు, అమరావతిస్తూపాలలో బుద్ధుని అస్తికలను నిక్షేపించిన బరిణలు దొరికేయి.

నాగార్జునకొండ స్తూపంలో కూడ బుద్ధుని అస్తిక వున్న బంగారు బరిణె దొరికింది. ఘంటసాల, గుడివాడ, గుంటుపల్లి, శాలిహుండాలలోని స్తూపాలలో అస్తి నిక్షేపాలు లేవు. ఇవి



శారీరక స్తూపాలుగాక, కేవలం వుద్దేశిక స్తూపాలు మాత్రమే. అంటే, బుద్ధుడో ఆయన శిష్యులో నివసించిన ప్రదేశాలు మాత్రమే.

కర్నూలు జిల్లాలోని ఎర్రగుడిలో వివిధ మార్గాలలో ధర్మాన్ని పాటించవలసిందిగా ప్రజల్ని ఉద్బోధిస్తూన్న అశోకుని శిలాశాసనం వుంది. బీదలనూ, ధనికులనూ న్యాయపథాన నడుచుకోవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్న రెండు శాసనాలు అదే జిల్లాకు చెందిన రాజులమందగిరిలో కనిపించేయి. జీవజంతువులు వేనినీ చంపవద్దనీ, సేవకుల, బానిసలయెడ దయాదాక్షిణ్యాలతో మెలగమనీ, మతసహనం కలిగివుండమనీ, పెద్దలయెడ విధేయత చూపమనీ ఈ శాసనాలు విధిస్తున్నాయి. తన శాసనాలు సక్రమంగా అమలు పరచమనీ, ప్రజలతో సజీవ సంబంధాలు పెట్టుకోమనీ ఆయన తన వుద్యోగులనూ, అధికారులనూ ఆజ్ఞాపించాడు. నేరస్తుల్ని శిక్షించగల సామర్ధ్యం తనకున్నదని గుర్తుచేస్తూ, దుశ్చర్యలు మానవలసిందని ఆటవిక ప్రజను హెచ్చరించేడు. అశోకుడు చెక్కించిన ఈ మాదిరి శిలాశాసనాలు 13 వున్నాయి. వానిలో ఒకదానిలో ఆయన తన సామ్రాజ్యపు హద్దులలోపలా, వెలుపలా చేసిన ప్రజోపయోగ కార్యాలను-నూతులు తవ్వించడం, బాటలపక్కన చెట్లు నాటించడం, మనుష్యులకూ, జంతువులకూ కూడ ఆసుపత్రులు కట్టించడం వంటివి - పేర్కొన్నాడు. తాను "భోజనంచేస్తున్నా, అంతఃపురంలో వున్నా, నిద్రపోతున్నా, విహరిస్తున్నా, ప్రయాణంలోవున్నా, బండిలో వున్నా" ప్రజాసమస్యల్ని తక్షణం తనకు తెలపాలని వుద్యోగుల్ని ఆదేశిస్తూంది, 6వ శిలాశాసనం. జీవజాలానికి తాను రుణపడి వున్నట్లూ, ఆ రుణాన్ని తీర్చుకోవాలనీ ఆయన కోరిక.

ఇలాంటి శాసన భాగాలు శాలిహుండాంలోనూ, అమరావతిలోనూ కూడ దొరికేయి.

ఆంధ్రదేశంలోని ప్రాచీన బౌద్ధక్షేత్రాలలో కనిపించిన ఈ శాసనాలన్నీ బ్రాహ్మీలిపిలో ప్రాకృత భాషలో వున్నాయి. వీనిలోని అక్షరాలు చాలావరకు అశోకుని శాసనాలలోని లిపినే పోలివున్నా, కొన్నికొన్ని భిన్నంగా వున్నాయి. దీనిని బట్టి మౌర్యుల కాలానికి పూర్వమే దక్షిణాపథ ప్రజలు లిపిని ఎరుగుదురనీ వారు బ్రాహ్మీలిపిని స్థానికమైన కొద్దికొద్ది మార్పులతో వుపయోగిస్తూండి వుంటారనీ బుహ్లర్ భావిస్తున్నాడు. వారి భాషలోకూడ అనేక మాండలిక ప్రత్యేకతలు కనిపిస్తున్నాయి.

బౌద్ధమతం వర్ణభేదాలనూ, సామాజిక అసమానతలనూ గుర్తించక పోవడంవల్ల ఉత్తరాపథంలో కన్న ఆంధ్రదేశంలో అది ఎక్కువ వేగంగా విస్తరించింది. అంతే కాదు, ఆనాటికిక్కడున్న బృహత్‌శిలా ప్రజలకు వ్యవసాయమూ, వస్తుమార్పిడి వర్తకముతో పరిచయం వుంది. ఆద్యబౌద్ధసాహిత్యంలో ఆంధ్రదేశపు బౌద్ధసన్యాసుల-అంధకుల-ప్రస్తావనలున్నాయి. వారు కొన్ని ప్రత్యేకతలు కలిగివుండడంచేత వారినొక బౌద్ధశాఖగా కూడ పేర్కొన్నారు. 13వ అశోక శిలాశాసనంలో ఆంధ్రులూ, పులిందులూ బౌద్ధానుయాయులుగా పేర్కొనబడ్డారు. మహిషమండలానికి బౌద్ధమత ప్రచారం కోసం అశోకుడు పంపిన మహాదేవ భిక్షువు, ప్రజలకోరికపై కృష్ణానదీ ముఖద్వారంలో కొంతకాలం ఆగేడనీ, అక్కడినుంచి 10వేల మంది భిక్షువులు వెంటరాగా సింహళం వెళ్ళేడనీ "సింహళ మహావంశ" చెప్తూంది. ఆంధ్ర కోస్తా జిల్లాలలో ఏ రాజాదరణా అవసరం లేకుండానే బౌద్ధం వ్యాపించింది. ప్రజలు, వృత్తికారులు, వర్తకులు ధారాళంగా విరాళిలిచ్చి బౌద్ధవిహారాల నిర్మాణానికి తోడ్పడ్డారు. శాతవాహనరాజులు కనబరచిన మతసహనం

ఆనాటి ప్రజలలోవున్న వుత్సాహానికి ప్రతిబింబం మాత్రమే.

## సామ్రాజ్యనిర్మాణంలో ఆటుపోటులు

మౌర్యసామ్రాజ్య పతనానంతరం విదేశాలనుంచి గ్రీకులు శక – పహ్లవులు కుషానులు ఉత్తరభారతాన్ని వరసగా జయించి పాలిస్తూ వచ్చారు. దక్షిణాపథం మాత్రం దేశీయరాజుల పాలనలోనే వుంది. ఉత్తరభారతంలో వ్యవసాయం బాగా వృద్ధిపొంది ఎంతో ఆదాయం సంపాదించుకోగలగడంచేత విదేశీయులకన్ను దానిమీద పడింది. దక్షిణాపథాన వ్యవసాయం వృద్ధిపొందలేదు. పరిశ్రమలూ, వస్తుమార్పిడి వాణిజ్యమూ వృద్ధిపొందినా వ్యవసాయం అక్కడా అక్కడా మాసికలుగానే వుంది. మౌర్య పాలన అంతరించాక శాతవాహనుల పరిపాలనలోనే అది విస్తరించసాగింది. ఉత్పత్తిసాధనాల అభివృద్ధిలో వున్న ఈ ప్రధానభేదమే ఉత్తర, దక్షిణ భారతాల రాజకీయచరిత్రలో ప్రతిఫలిస్తూంది. శాతవాహనుల కిందనే దక్షిణాపథంలో నాగరికత విస్తరించిందని పురాతత్వ సాక్ష్యం చూపుతుంది.

శాతవాహన, శాలివాహన, శాతకర్ణి అనేవి ఆటవికుల కుదురుపేర్లని తోస్తూంది. శద అంటే గుర్రం. కన్, హన్ అంటే కొడుకు. ముండా భాషకు చెందిన ఈ రెండుపదాల సమ్మేళనమే శాతకర్ణి, లేక శాతవాహన. అంటే గుర్రం కులదేవతగా గల కుదురు అన్నమాట. అంటే గుర్రం అనేది దేశంలోకి ఆర్యులతో వచ్చినది. కనక ఇది అతి ప్రాచీనమైన కులదేవతా కుదురు కాదు. శాతవాహనరాజుల చివరి కాలంలోవున్న వాత్స్యాయనుడు తన "కామసూత్రాల"లో కుంతలరాజు ను శాతవాహనుడనీ, శాతకర్ణియనీ రెండు విధాలుగా పేర్కొంటాడు.

శాతవాహన రాజులు యజ్ఞాలు చేశారు. బౌద్ధమతాన్నీ అభిమానించారు. ఆ రోజులలో బ్రాహ్మణ పురోహితులు ధనంగల క్రింది తెగలవారికి ఉన్నత కులోద్భవులుగా పునర్జన్మనిప్పిస్తూ "హిరణ్యగర్భ" వ్రతం చేయించేవారని పురాణాలనుంచి తెలుస్తూంది. దీనిని బట్టి హిందూమతం తెగల సమాజంలోకి వర్ణవ్యవస్థను ఏవిధంగా ప్రవేశపెట్టిందో తెలుసుకోవచ్చు. శాతవాహనులలో చాలా బలవంతులైన రాజులు అశ్వమేధం, రాజసూయంవంటి వైదిక కర్మలు చేసి బ్రాహ్మణులకు భూరిదక్షిణ లిచ్చినట్లు చెప్పుకొన్నారు తమ శాసనాలలో.

మౌర్య రాజ్యపతనానంతరం దక్షిణాపథంలో శాతవాహనుల పాలన ప్రారంభమయింది. ఒకదశలో దక్షిణాపథమేగాక ఉత్తరాన మగధవరకూ కూడ వారి పాలన సాగింది. క్రీస్తుపూర్వం 221 నుండి క్రీస్తుశకం 218 వరకూ మొత్తం 439 ఏళ్ళు శాతవాహనుల పరిపాలన సాగింది.

మత్స్య, వాయు, బ్రహ్మాండ, విష్ణు, భాగవత పురాణాలు శాతవాహనులు ఆంధ్రులని పేర్కొన్నాయి. బహుశా ఆ పురాణాలు వ్రాయబడుతున్న నాటికి వారి పాలన ఆంధ్రమండలానికే పరిమితమై యున్నదనిపిస్తుంది.

అశోకునికిపూర్వం ఆంధ్రులను గురించి చెప్పిన వన్నీ కట్టుకథలూ, అతి శయోక్తులూనే. విశ్వామిత్రుడు శపించి తరిమివేసిన స్వసంతానం 50 మందిలో ఒకని సంతానం ఆంధ్రులంటుంది "ఐతరేయ బ్రాహ్మణం". ఆంధ్రులు కౌరవుల పక్షాన యుద్ధం చేశారనీ వారిని సహదేవుడు ఓడించాడనీ "మహాభారతం"లో ఉంది. ఆంధ్రులు చాలశక్తిమంతులనీ, వారికి 30 కోటలున్నవనీ, లక్ష పదాతిసైన్యం, 2000 హయసైన్యం, వేయి గజసైన్యం వున్నదనీ మౌర్య చంద్రగుప్తు



ఆస్థానానికి (క్రీ.పూ. 4వ శతాబ్ది) వచ్చిన మెగాస్థనీస్ వ్రాశాడు. శాతవాహనులకు పూర్వం దక్షిణాన రాజ్యాలేవి అభివృద్ధి పొందలేదని పురాతత్వసాక్ష్యం నిరూపిస్తుంది. దీనికితోడు కర్నూలుజిల్లాలోని ఎర్రగుడి పాడులో దొరికిన అశోకశిలాశాసనం రథికులు, పులిందులు, భోజులు, ఆంధ్రులు బౌద్ధ ధర్మాన్ని అనుసరిస్తున్న వారినిగా పేర్కొంది. ఇవన్నీ తెగల పేర్లు మాత్రమే. మెగాస్థనీస్ వ్రాసినట్లు గొప్ప సైన్యబలంవున్న రాజ్యం–మౌర్యరాజ్యం వంటిది – ఆనాడు ఇక్కడ వుండడం సాధ్యంకాదు. మౌర్యుల దండయాత్రలతో దక్షిణాపథంలో తెగపెద్దలు ప్రభువులుగా మారేరు. క్రీస్తుపూర్వం 300 ప్రాంతంలో ఆంధ్రమండలంలో 118 తెగలున్నాయని అరియన్ వ్రాసిన "ఇండికా" తెలుపుతూంది.

30 మంది ఆంధ్రరాజులు నాలుగున్నర శతాబ్దాలపాటు రాజ్యం చేశారని చెప్తూ పురాణాలు వారి వంశవృక్షాల నిస్తున్నాయి. శాతవాహనుల నాణాలమీదనూ, శాసనాలమీదనూ కనిపించేపేర్లూ పురాణాలిచ్చిన ఆంధ్రరాజుల పేర్లూ సరిపడుతున్నాయి. అందుచేత "ఆంధ్ర" అనేది జాతినామమూ, "శాతవాహన" అన్నది కుటుంబనామమూ అని చరిత్రకారులు నిర్ధారణ చేస్తున్నారు. ప్రాంతభేదాలతో పాలకులూ, పాలితులూ మాట్లాడేది ప్రాకృతమే గనక ఆ రాజుల నాణాలు, శాసనాలలో ప్రత్యేకించి ఆంధ్రభాష అనేది కనబడదు.

శాతవాహనుల రాజధాని మహారాష్ట్రంలోని ప్రతిష్ఠానపురం కావడమూ, వారి శాసనాలు అధికభాగం మహారాష్ట్రంలోనే లభించడమూ, ఆంధ్రమండలంలో దొరికిన నాణాలూ, శాసనాలూ క్రీస్తుశకం 102–130లలో పాలించిన వాసిష్ఠీపుత్ర పులమావివీ, ఆయన తరవాత వారివీ కావడమూ చూపించి శాతవాహనులు మహారాష్ట్రులనే వాదం ఒకప్పుడు వచ్చింది. అయితే మెదక్ జిల్లాలోని కొండాపురంవద్ద దొరికిన నాణాలు ఆ అభిప్రాయాన్ని తోసిపుచ్చేయి. అందులో ఒకనాణెం కొండాపురం రాజయిన శాతవాహనుణ్ణి పేర్కొంటూంది. ఈయన శాతకర్ణరాజ్యం స్థాపించిన శ్రీముఖునికి పూర్వుడు. అక్కడ దొరికిన ఇతర శాతవాహన రాజుల నాణాలు మొదలయిన వానినిబట్టీ, హైద్రాబాద్, వరంగల్, పూనాలలో లభించిన మూడు సీసపునాణాలమీద "రాజ" శాతవాహనుని పేరూ, కులముద్రా వుండడాన్ని బట్టీ, కొండాపురంలో శాతవాహనుడనే రాజు వుండివున్నాడనీ, అతనినుంచే శాతవాహనుల కులంపేరు వచ్చిందనీ, క్రీ.పూ. 221లో పాలించిన శ్రీముఖ శాతవాహనుడి నుంచే ఆంధ్ర రాజుల పేర్లను పురాణాలు ఇవ్వడాన్ని బట్టీ కొండాపురం శాతవాహనుడు చాల చిన్న ప్రభువై వుంటాడనీ శ్రీ మారేమండ రామారావుగారు చెప్తున్నారు.

అందుచేత శాతవాహనుల పరిపాలన తెలంగాణాలో ప్రారంభమై క్రమంగా పశ్చిమానికి, ఉత్తర, దక్షిణాలకూ విస్తరించిందని చెప్పవచ్చు.

పురాణాలు ఆధారంగా శాతవాహనరాజుల వంశ క్రమాన్నీ, వారి పరిపాలనా క్రమాన్నీ చెప్పడం కష్టం. అవి అన్నీ తలొకక్రమాన్నీ ఇచ్చేయి. వంశక్రమాన్నీ కాలాన్నీ, నిర్ధారణ చేయడానికి శాస్త్రజ్ఞులు పురాణాలు, శాసనాలు, నాణేలు, భాష దేశీయవిదేశీయ సమాచారాలు అన్నీ చాలాజాగ్రత్తగా పరిశీలించారు. హెచ్చుసంఖ్య పురాణాలు ఏకీభవిస్తున్న వంశక్రమాన్ని తీసుకున్నారు. మౌర్య శాసనలిపిని ప్రాతిపదికగా తీసుకుని నాణాలమీది లిపి శాసనాలలిపీ దానితో తహవేలు వేసి వెనకముందులు నిర్ణయించారు. నాణాలమీద వుపయోగించిన మాటలూ, సంకేతాలూబట్టి వానిని వర్గీకరించారు. శాతవాహనుల శాసనాలలో పేర్కొన్నఘటనలను

దక్షిణాపథంలోని ఇతర రాజుల శాసనాలలోని ఘటనలను సరిచూసేరు. వానిని ఆనాడు దేశంలో పర్యటించిన విదేశీయుల రాతలతో సరిచూసేరు. ఈ విధంగా కష్టపడి శాతవాహన రాజుల వంశ క్రమాన్నీ, వారిపాలన కాలాన్నీవారి జయాపజయాల్నీ చాలవరకు సరిగ్గా చరిత్ర కారులు నిర్ధారణ చెయ్యగలిగేరు.

అశోకుని మరణానంతరం శ్రీముఖశాతవాహనుడు (క్రీ.పూ. 221-198) మహారాష్ట్రం మీద దండయాత్ర చేశాడు. రధికుల రాజ్యాన్ని అణచివేసి, తన అధికారాన్ని దృఢపరచుకొనేందుకు మహారధి కూతురు నాగనికను తన కుమారుడు శాతకర్ణితో వివాహం జరిపించేడు. ఈ శ్రీముఖుడే శాతవాహనరాజవంశ ప్రారంభీకుడు. ఇతడు చివరిరోజులలో ప్రజాకంటకుడుగా తయారావడంచేత అధికారంనుంచి తొలగించబడి చంపివేయబడ్డాడని జైనగాథలు తెలుపుతున్నాయి.

శ్రీముఖుని అనంతరం అతని సోదరుడు కృష్ణ (క్రీ.పూ. 198-189) నాసిక్ ప్రాంతాన్ని స్వాధీనపరచుకొన్నాడు. అతని పరిపాలనాకాలంలో రాజోద్యోగి (మహామాత్ర) ఒకరు నాసిక్ బౌద్ధగుహలయాన్ని నిర్మించేడు. ఇది మౌర్య సంప్రదాయం. మహామాత్రులు ఒకతరగతి వుద్యోగులు. వీరి ప్రసక్తి అశోకుని శిలాశాసనాలలో కనిపిస్తుంది.

ఆయనతర్వాత శ్రీముఖుని కొడుకు ఒకటవ శాతకర్ణి (క్రీ.పూ. 180-170) అధికారానికి వచ్చేడు. ఇతడు ఉజ్జయిని రాజధానిగావున్న పశ్చిమ మాళ్వదేశాన్ని జయించేడు. తర్వాత శుంగవంశపు రాజుల్ని జయించేడు. ఇప్పుడతని రాజ్యం ప్రతిష్ఠానం నుంచి ఉజ్జయిని, విదిశ వరకు వ్యాపించింది. ఈతని పాలనాకాలంలో కళింగ రాజు ఖారవేలుడు శాతవాహనులమీద ముమ్మారు దాడిచేశాడు. కాని జయించలేకపోయేడు.

విజయవాడ సమీపంలోవున్న గుంటుపల్లిలోని శిధిలబౌద్ధాలయ సమీపంలో దొరికిన శాసనం ఖారవేలుని లేఖకుడైన చులగోముడు మండపనిర్మాణానికి ధనం ఇచ్చినట్లు తెలుపుతూంది. అదివరకే హాథిగుంపలో దొరికిన శాసనాన్నిబట్టి ఖారవేలుడు పెద్దసైన్యంతో పశ్చిమంగా దండయాత్రచేశాడనీ, అది కృష్ణానదివరకూ వెళ్ళి మూషికుల నగరాన్ని కల్లోలపరచిందనీ, పితుండనగరాన్ని "గాడిదలతో దున్నించిం"దనీ తెలుపుతోంది. ఇటీవల దొరికిన గుంటుపల్లి శాసనం ఖారవేలుని సేనలు నేటి గోదావరి కృష్ణాజిల్లాలను ఆక్రమించినట్లు సూచిస్తూందన్నారు. డా.ఆర్.సుబ్రహ్మణ్యం. మూషికుల నగరం అంటే శాతవాహనుని కొండాపురమేననీ, పితుండనగరం గుంటుపల్లేననీ ఆయన అభిప్రాయం.

ఒకటవ శాతకర్ణి భార్య నాగనిక శాసనం ఒకటి నానేఘాట్ వద్ద దొరికింది. ఇది శాతకర్ణి రెండు అశ్వమేధాలూ, ఒక రాజసూయమూతో సహా 20 క్రతువులు చేశాడనీ, వానిని జరిపించిన ఋత్విక్కులకు 36వేల కర్షపణాలు, 44వేల ఆవులు, 13 గ్రామాలు, 10 ఏనుగులు, వేయి గుర్రాలు, ఇతర కానుకలూ ఇచ్చేడనీ తెలుపుతూంది. వైదిక క్రతువులు నిర్వహించినరాజుని ప్రశంసిస్తున్న ఈ శాసనం బౌద్ధగుహలో వుండడం విశేషం.

శాతకర్ణిరాజవంశంలో 6వ వాడైన రెండవ శాతకర్ణి (152-96 క్రీ.పూ.) దీర్ఘ కాలం పరిపాలన చేశాడు. ఆయన శాసనం విదిశ సమీపంలోని సాంచీలో దొరికింది. ఖారవేలుని మరణానంతరం కళింగమును ఆయన జయించినట్లు కనిపిస్తుంది. ఆయన కాలంలో సైస్తాన్‌కు చెందిన శకులు మగధను పాలిస్తుండేవారు. వారిలో ఒకడు శాతవాహనుల అధీనంలోని



కళింగముమీద దాడిచేసేడు. కాని 2వ శాతకర్ణి అతనిని ఓడించి, పాటలీపుత్రం వరకు ఆక్రమించేడు. పాటలీపుత్రం క్రీ.పూ. 106-96 మధ్య పదేళ్ళు ఆయన స్వాధీనంలో వుంది. శకులు ఆయన సామ్రాజ్యంలో పశ్చిమప్రాంతంమీద దాడిచేసి ఉజ్జయినిని ఆక్రమించారు. కాని శాతకర్ణి విదిశనూ, మగధనూ, కళింగమునూ ఆక్రమించి తన రాజ్యాన్ని విస్తరింపచేశాడు. నేటి మధ్యప్రదేశ్ ఆయన అధీనంలో వుండి వుంటుంది. ఆయన తర్వాత రాజ్యానికి వచ్చిన అపిలకుని నాణెం ఆ మండలం తూర్పుప్రాంతంలో దొరికింది.

శాతకర్ణి తరవాత రాజ్యానికి వచ్చిన లంబోదరుని కాలంలో (క్రీ.పూ. 96-78) శకులకు దగ్గరవారైన క్షహరాతులు శాతవాహనరాజ్యభాగాలయిన గుజరాతునూ, కథియవాడునూ స్వాధీనపరచుకొన్నారు. వారిరాజు నహపణుడు మహారాష్ట్రమీద దండయాత్రచేసి స్వాధీనపరచుకొన్నాడు. క్రీ.పూ. 78-66ల మధ్య రాజ్యంచేసిన అపిలకుని ఓడించి కాణ్వులు మగధను ఆక్రమించేరు.

క్రీస్తుపూర్వం 38-30ల మధ్య పరిపాలనచేసిన కుంతలశాతకర్ణి శాతవాహన రాజులలో 11వ వాడు, ఆయన కాణ్వుల నోడించి పాటలీపుత్రాన్ని తిరిగి స్వాధీనపరచుకొన్నాడనీ, దౌత్యనీతికౌశల్యంతో ఎందరో ఉత్తరదేశపు రాజులను లొంగదీశాడనీ చెప్తారు. ఆయన తరవాత (క్రీ.పూ. 30-6) రాజ్యానికి వచ్చిన ఒకటవ పులమావి పాటలీపుత్రాన్ని పట్టుకొని కాణ్వరాజవంశాన్ని తుద ముట్టించేడు.

క్రీస్తుశకం 19-24లలో హాలుడు పాలించేడు. ఈయననే శాలివాహనుడని కూడా అంటారు. బాణుడు తన "హర్షచరిత్ర" ఉపక్రమణికలో ప్రస్తుతించిన "గాథా సప్తశతి" ఈయన కూర్చినదే. వీనిలో ఆనాటి సామాజిక, ఆర్థిక పరిస్థితుల సూచనలున్నాయి. ఇది మహారాష్ట్ర ప్రాంతపు ప్రాకృతం (పాళీ)లో వుంది. ప్రస్తుత రూపంలోని దీని భాష స్వరూప లక్షణాలు క్రీ.శ. 2,3 శతాబ్దాలవిగా కనబడుతున్నాయని పండితులు అభిప్రాయపడుతున్నారు.

హాలుని తర్వాత అయిదుగురు రాజులు మొత్తం 55 ఏళ్ళు పాలించేరు. పశ్చిమ క్షత్రపుల రాజు నహపణుడు క్రీ.శ. 40-80ల మధ్య శాతవాహనులను జయించి గుజరాతు నుంచి కొంకణం వరకూ పశ్చిమకోస్తాను ఆక్రమించేడు. శాతవాహనుల రేవుపట్టణం కల్యాణ్‌కు వస్తున్న గ్రీకు నావలను నహపణుడు (మంబనస్) బ్రోచ్ (బరిగాజ్-భరుకచ్ఛ)కు మళ్ళేటట్లు చేశాడని ఒక గ్రీకు గ్రంథం తెలుపుతూంది. ("పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సీ")

గౌతమీపుత్ర శాతకర్ణి (క్రీ.శ. 78-102) క్షహరాతరాజు నహపణుని ఓడించి ఉత్తర మహారాష్ట్రను, కొంకణను, నర్మద లోయను, సౌరాష్ట్రమును, మాళ్వ, పశ్చిమ రాజపుత్రస్థానాన్ని స్వాధీనపరచుకొన్నాడు. విదర్భ, కళింగము, యావదాంధ్రము, దక్షిణాన వనవాసివరకు అతని రాజ్యంలో వుండేవి. ఈయన విజయాలను ఉద్ఘాటిస్తూ ఈయన తల్లి బాల శ్రీ నాసిక్‌లో ఒక శాసనం వేయించింది.

ఆయన శకులను, పహ్లవులను, యవనులను విధ్వంసం చేశాడని, అశిక, అశ్మక, మూలక, సౌరాష్ట్ర, కుకుర, అపారంత, అనూప, విదర్భ, అకరావంతిలను పాలించేడనీ, వింధ్యావత, పారిజాత, సహ్య, కృష్ణగిరి, మలయ, మహేంద్ర, పుష్పగిరి, చకోర పర్వతాలకూ అధిరాజనీ, అతని గుర్రం మూడు సముద్రాల నీరు తాగిందనీ ఆ శాసనం గౌతమీపుత్ర శాతకర్ణిని వర్ణిస్తూంది. ఆయన బ్రాహ్మణుల ఏకైక రక్షకుడు, క్షత్రియుల గర్వం అణచేడు, వర్ణ సంకరం

కాకుండా కాపాడేడు అని చెప్తోంది. శాసనం చివర బాలశ్రీ గుహాచైత్యన నిర్వహణకై ఒక గ్రామాన్నిచ్చినట్లు వాక్యం వుంది. గౌతమీపుత్రుని మరొక శాసనం గుహాలయంలో నివసించే సన్యాసుల పోషణకై రాజుకు చెందిన భూమిని దానం చేసినట్లుంది. ఈయన నాణాలు వందల సంఖ్యలో కొండాపురం, పెద్దబంకూరు (రెండూ తెలంగాణాలోనివే)లలో దొరికేయి. నాసిక్ శాసనం వేసిన కాలంలో బాలశ్రీ తన కొడుకు ధాన్యకటకంలోనూ, మనుమడు రెండవ పులమావి ప్రతిష్టానంలోనూ రాజ్యం చేస్తున్నట్లు వర్తమాన క్రియారూపం వుపయోగించింది.

వాసిష్ఠీపుత్ర పులమావి 2 (క్రీ.శ. 102-130) తండ్రి సంపాదించి యిచ్చిన రాజ్యాన్ని దృఢపరిచేడు. ఈయన తూర్పుమండల వ్యవహారాలలో మునిగివున్న అదను చూసుకుని క్షహరాతరాజా చస్తనుడు కథియవాడు, గుజరాతు, అజ్మీర్, ఉజ్జయినులను జయించి ఉజ్జయినిని రాజధానిగా చేసుకొని పాలించేడు.

పులమావి సోదరుడు వాసిష్ఠీపుత్ర శాతకర్ణి (క్రీ.శ. 130-150) రాజ్యకాలంలో రుద్రదమన మహాక్షత్రవుడు తన రాజ్యాన్ని గట్టిపరచుకొంటూ శాతవాహనులతో ఘర్షణ రాకుండా చేసుకొనేందుకు తన కూతురును శాతకర్ణికిచ్చి పెళ్ళి చేశాడు. శాతకీర్ణ తన రాజ్యాన్ని దృఢపరచుకొని "అపరాంత" (ఉత్తర కొంకణం)ను జయించేడు. పశ్చిమ క్షత్రపుల ననుకరిస్తూ అతడు రెండు భాషలలో ఒకవేపున ప్రాకృతం రెండో వేపున తమిళం - నాణాలు వేశాడు. ఆ రోజులలో తెలుగు, కన్నడ దేశాలలో తమిళం కూడా ప్రచారంలో వుందేమో ననుకోవలసి వస్తోంది. తరువాత రాజ్యానికి వచ్చిన వాసిష్ఠీపుత్ర యజ్ఞశాతకర్ణి కూడా ద్విభాషా నాణాలు (తమిళం, ప్రాకృతం) ముద్రించేడు.

వాసిష్టీపుత్ర శాతకర్ణి మరణానంతరం రుద్రదమనుడు రెండుమార్లు ధర్మయుద్ధంలో శాతవాహన రాజును ఓడించి, అపరాంతనూ, అనూపనూ (నర్మదలోయ) వశపరచుకొన్నాడు.

గౌతమీపుత్ర యజ్ఞశ్రీ (క్రీ.శ. 174-203) శాతవాహన రాజులలో 26వవాడు. అతడు విదేశీయులతో యుద్ధాలు చేసి తన వెనుకటివారు కోల్పోయిన చాలా రాజ్య భాగాలను తిరిగి స్వాధీనం చేసుకొన్నాడు. క్షత్రపుల నమూనాతో ముద్రించిన ఈయన నాణాలు గుజరాత్, కథియవాడ్, బరోడా, మాల్వా, ఉత్తర కొంకణం, మహారాష్ట్ర, ఆంధ్ర, తెలంగాణా, మధ్యప్రదేశ్‌లలో దొరికేయి. వానిలో రెండు తెరచాపల నౌకల బొమ్మగలవి కొన్ని, అవి తూర్పు తీరంలో దొరికేయి. తూర్పు, పడమర రాష్ట్రాలన్నింటిమీదా రాజ్యాధికారం నెరపిన ఆఖరు శాతవాహన రాజు ఈయనే. శ్రీపర్వతం మీది బౌద్ధారామంలో నివసించిన మహాయాన బౌద్ధ ప్రవక్త ఆచార్య నాగార్జునుని భక్తుడీయన.

తరువాత విజయ, చంద్రశ్రీ, మూడవ పులమావి మొత్తం 16 ఏళ్ళు పరిపాలించేరు. విజయుని నాణేలుకాని, శాసనాలు గాని, మహారాష్ట్రంలో లభించలేదు. బహుశా క్షత్రపులు మహారాష్ట్రాన్నీ, అపరాంతనూ శాతవాహనుల నుంచి స్వాధీన పరచుకొని ఉంటారు. చంద్రశ్రీ, మూడవ పులమావులకు కూడా ఆ మండలాల మీద అధికారం లేదు. చంద్రశ్రీ నాణాలు కోస్తా ఆంధ్ర జిల్లాలో దొరికేయి. ఆయన శాసనం తూర్పు గోదావరి జిల్లా కొడవలిలో దొరికింది. బహుశా ఈయన అధికారం తూర్పు, దక్షిణ జిల్లాలకే పరిమితమయి వుంటుంది. మూడవ పులమావి శాసనం బళ్ళారిజిల్లా మైకదోనిలో దొరికింది. ఈయనే ఆఖరి శాతవాహన రాజు. క్రీ.శ. 218లో శాతాహనుల పాలన ముగిసింది.



పులమావి అనంతరం శాతవాహన రాజ్యం తునాతునకలయింది. పశ్చిమాన ఆభీరులూ, మహారథులూ స్వతంత్రులయ్యారు. రాజ కుటుంబానికి చెందిన పలువురు కోస్తా ఆంధ్ర, తెలంగాణం, రాయలసీమలలో చిన్న చిన్న ప్రాంతాలకు రాజులుగా ప్రకటించుకొన్నారు. వీరుగాక సామంతరాజులు స్వతంత్రులయ్యేరు. దక్కను పశ్చిమభాగంలో చూటులు ప్రభువులయ్యారు. మహాసేనాపతి స్కందనాగుడు మొదలైన నాగసేనాపతులు వేర్వేరు ప్రదేశాలలో ఆధిపత్యం ప్రకటించుకున్నారు. శ్రీశైలానికి సముద్రానికి మధ్యనున్న ప్రాంతానికి పుగియాలు రాజులయ్యారు. కడపజిల్లా ఉత్తరభాగం కర్నూలుజిల్లా దక్షిణభాగం కలిపి హిరణ్యకులు ఆక్రమించుకొన్నారు. శ్రీపర్వత ప్రాంతంలో ఇక్ష్వాకులు ప్రభువులయ్యేరు. వీరు శాతవాహనుల కింద మహాతలవరులుగా వుండేవారు. ఇక్ష్వాక శాంతిమూలుడు మరికొందరు సామంతులను సాయం చేసుకొని శాతవాహన వంశీకులతో యుద్ధాలు చేసి ఆ సామ్రాజ్యంలోని తూర్పు భాగానికి తాను ప్రభువయ్యేడు.

## శాతవాహనుల గురించి గాథలు

"శాలివాహన", "శాతవాహన" అనేది కుటుంబనామం అనేది మరచి, ఆ రాజకుటుంబంలోని కొందరికి ఆ పేరు నుపయోగించడం మామూలయింది.

మనం ఈనాడు "శాలివాహనశకం" అనే శబ్దాన్ని కాలవాచిగా వాడుతున్నాం. అది ఏ శాలివాహనుడితో ప్రారంభమయిందో చెప్పడం సాధ్యంకాదు. 11వ శతాబ్దం వరకూ దానపట్టారేకులమీద 'శక ఉర్వకల' లేక శకరాజులయుగం అనేశబ్దం వుపయోగించబడింది. తరవాత సంగ్రహంగా శకసంవత్సరం అని ప్రయోగించసాగేరు. అంటే శకశబ్దానికి ఒక యుగం అనేఅర్థం వచ్చేసింది. "యుగం అన్నదానిని ఎవరో ఒక పురుషునికి జతపరచాలిగనుక శాలివాహనునిపేరు చేర్చేరు. ఇక శాలివాహనశకం అని మనం వాడేస్తున్నాం. నిజానికి అది రెండు రాజకుటుంబాల పేర్లుకలసి ఏర్పడిన శబ్దం" అని ఆర్.జి. బండార్కరు వ్రాసేరు.

ప్రతిష్టానపురంలో ఒక బ్రాహ్మణకన్య వుండేదట. ఆమె సౌందర్యం చూసి నాగరాజు మోహితుడయ్యాడు. వారికి శాలివాహనుడు పుట్టేడు. ప్రతిష్ఠానంమీద దండయాత్ర చేసిన విక్రమాదిత్యుణ్ణి తండ్రివరంతో శాలివాహనుడు ఓడించేడనేది ఒక కథ వుంది. ఉజ్జయినీరాజైన శకరాజు రుద్రదాముణ్ణి తన తండ్రిసాయంతో ఓడించిన పులమావియే ఈ శాలివాహనుడని భండార్కరు వూహిస్తున్నారు.

శాతవాహనుడి మంత్రియైన గుణాఢ్యుడు పైశాచీభాషలో 'బృహత్కథ' వ్రాశాడని ఒక ఐతిహ్యం ఉంది. దానిలోని కథను తీసుకొని క్షేమేంద్రుడు 'బృహత్కథనూ, సోమదేవుడు 'కథాసరిత్సాగరా'న్నీ సంస్కృతంలో వ్రాశారు. 'కథాసరిత్సాగరంలో' ఈ 'బృహత్కథ' గురించి ఒక కథ వుంది. శాతవాహనుడు భార్యతో సరస్సులో జలక్రీడలాడుతూ ఆమెమీద నీళ్ళు చల్లేడట. ఆమె సంస్కృత పండితురాలు. "ఇంక నీళ్ళు చల్లవద్ద"న్న అర్థంలో "మోదకైస్తాడయ" (మా+ఉదకైః+తాడయ) అంది. సంస్కృతభాష తెలియనిరాజు "మోదకై" శబ్దానికి 'ఉండ్రాళ్ళు' అనిఅర్థం చెప్పుకుని ఉండ్రాళ్ళుతెమ్మని భృత్యులకు ఆదేశించేడట. ఆయనకు తెలిసింది ప్రాకృతం మాత్రమే. రాజు ఆదేశం విని రాణి నవ్వింది. రాజుకు అభిమానంవేసి త్వరగా సంస్కృతం నేర్చుకోవాలని మంత్రులను కోరాడు. గుణాఢ్య మంత్రి ఆరేళ్ళలో నేర్పుతానన్నాడు.

శర్వవర్మ అనే మరోమంత్రి ఆయనతో పందెంవేసి తాను ఆరునెలల్లో నేర్పుతానన్నాడు. నేర్పేడు కూడా. పందెంప్రకారం గుణాఢ్యుడు అడవులకు పోయేడు. అక్కడ పైశాచీభాషలో 'బృహత్కథ' వ్రాశాడు. కాని ప్రభువు దానిని వినడానిక్కూడా నిరాకరించడంచేత తగలపెట్టేశాడు. శర్వవర్మ రాజుకు సంస్కృతం నేర్పడానికై ఒక వ్యాకరణం వ్రాసేడు. దానిపేరు "కాతంత్రం" దీనిని గురించి ఏడవశతాబ్దిలో చైనా యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ వ్రాసేడు. ఒక దక్షిణాపథరాజు కోరికమీద ఒక దక్షిణాపథ బ్రాహ్మణుడు 2500 శ్లోకాలకుతగ్గించి వ్యాకరణం వ్రాశాడనీ, అది చాలవ్యాప్తిలో వుందిగాని పండితులు దానిని స్వీకరించరని, ఆయన వ్రాశాడు.

చేరరాజు సెంగుట్టవన్ తన మిత్రుడైన మగధరాజు నూరువర్ కణ్ణర్ సహాయంతో హిమాలయాలనుంచి ఒక ప్రత్యేకమైన రాయి తెప్పించి దానితో కణ్ణగి విగ్రహం చేయించేడని ప్రాచీన తమిళ కావ్యం. "శిలప్పదికారం"లో వుంది. "నూరవర్ కణ్ణర్" – నూరు చెవులు – అనేది "శతకర్ణి" పదానికి తమిళానువాదం అనీ, ఈ సెంగుట్టవన్ సింహళరాజైన ఒకటవ గజబాహునికి (క్రీ.శ. 113-125) సమకాలీనుడు గనక మగధను పాలించిన ఈ శాతకర్ణి మత్స్యపురాణం పేర్కొన్న మొదటి శాతకర్ణి (క్రీ.శ. 77-133) తప్ప వేరొకరు కాదని వి.కనకసభై వ్రాస్తున్నారు.

## పాలనా నిర్వహణ

మౌర్యసామ్రాజ్యంలాగ శాతవాహనసామ్రాజ్యం అంతరంతరువులుగా వున్న అసంఖ్యాక అధికారవర్గం గలదికాదు. కేంద్రీకృత ప్రభుత్వాధికారం కలది కాదు. గూఢచారివర్గం కలదికాదు. ప్రధాన వుత్పత్తిసాధనాలమీద ప్రభుత్వ యాజమాన్యం కలదీకాదు. వ్యవసాయం, వాణిజ్యంమీద పెత్తనం కలది కూడా కాదు. దీనికి కారణం ఉత్పత్తి సాధనాలలో వున్న భేదమేనని పైనచెప్పేను. ఉత్తరాన గ్రామాలు చిరకాలంగా స్థిర స్వయంపూర్ణ వ్యవస్థ కలిగివున్నాయి. దక్షిణాన వ్యవసాయం బాగా విస్తరించక గ్రామాలుకూడా అంతమాత్రంగానే వున్నాయి. స్వయంపూర్ణ గ్రామాలలో వృత్తిశ్రేణులు ఉత్పత్తి యూనిట్లుగా వుండవు. కాని దక్షిణాన అవి ప్రముఖ పాత్ర నిర్వహించేయి. సరుకుల వుత్పత్తి ఉన్నతస్థాయిలో జరగడమూ, వాణిజ్యమూ వలన వృత్తినిపుణులు ధనం బాగా సంపాదించేరు. వారిచ్చిన విరాళాలతో దక్షిణాపథంలో బౌద్ధవిహార నిర్మాణం విస్తృతంగా సాగింది.

ఇక్కడ బలమైన వర్తకబృందంకూడా వృద్ధిపొందింది. పశ్చిమకోస్తామీద వున్న కార్లే, భాజే మొదలైన బౌద్ధ గుహాలయాలూ, తూర్పుకోస్తామీద వున్న అమరావతి, ఘంటసాల, నాగార్జునకొండ, భట్టిప్రోలు మొదలైన చోట్లగల బౌద్ధవిహారాలూ వాణిజ్య మార్గాల కూడలులలో వున్నాయి. కార్లే చైత్యనిర్మాణానికి ధనం ఇచ్చినది భూతపాలుడనే ధనాఢ్యుడు. ఆనాడు ప్రభుత్వం కూడా వీనికి సహాయం ఇవ్వక పోలేదు. కాని ఈ గుహాలయాలనుంచి వారికి ఎంతో ఆదాయం వస్తుంది. శాతవాహనుల కాలంనాటి రోమను వాణిజ్యపు సరుకులు కొల్హాపురంలో, కర్హాద్‌లో, పుదుచ్చేరి సమీపంలో దొరికేయి. నహపణుని నాణేలు, గౌతమీపుత్ర శాతకర్ణి నాణేలు పెద్ద మొత్తంలో దొరికేయి. ఇది చూస్తే, ఆనాడు రాజ్యం ఎంత సంపన్నంగా ఉండేదో గ్రహించవచ్చు. అదే సమయంలో ఆ నాణాలు సీసంతో, రాగితో పోటిన్‌తో (సీసం, రాగి,తగరముల మిశ్రమం) చేయడాన్నిబట్టి వాణిజ్యం, ప్రధానంగా తెగప్రజలతో వస్తుమార్పిడి పద్ధతిలోనే జరుగుతుండినట్లు వూహించబడుతూంది. శాతవాహనులు కొత్తరాజ్యాలు నాక్రమించు కొనేందుకూ



తమ రాజ్యాన్ని దృఢపరచుకొనేందుకూ నిరంతర యుద్ధాలు సాగిస్తూండేవారు. ఈ సైన్యాలకు అవసరమయ్యే ఖర్చునంతా భరించగల ఆదాయం ప్రభుత్వానికి ఈ నూతన గ్రామాలనుంచే వచ్చింది. దానిని చూశాక ఇంకా ఎక్కువ గ్రామాలు తమ అధీనంలోకి తెచ్చుకోవాలనే ఆశ ప్రభువులకు కలగడం సహజమే.

పరిపాలనా వ్యవస్థ సామంతులూ, ప్రభుత్వోద్యోగుల ద్వారా సాగేది. ఓడిపోయినరాజును తొలగించకుండా సామంతునిగానో, ప్రభుత్వాధికారిగానో చేసేవారు. రాజాలూ మహారధులూ, మహాభోజులూ నని సామంతులు మూడు తరహాలుగా వుండేవారు. రాజాలు చిన్నచిన్న రాజకుటుంబాలకు చెందినవారు. వారినాణాలు కొల్హాపూర్‌లో దొరికేయి. భట్టిప్రోలు అస్థికలబరణిమీద కుబేరక రాజాపేరు చెక్కివుంది. మహారథి అనేది ఒక బిరుదుపట్టా. అది వంశపారంపర్యం. రాజాకోసం ఒక రాష్ట్రంలో పన్నులు వసూలు చెయ్యడం వీరి పని. అందుచేత వీరిచేతిలో తగినంత సాయుధ బలగంవుండేది. పన్నుల విధింపు తగవుల పరిష్కారానికై న్యాయ నిర్వహణాధికారమూ వుండేది. వారు పన్నులు రద్దు చేయవచ్చుకూడా. వాలూరక విహారానికి "పన్నులు ఇతరరాబడులతో సహా" ఒక గ్రామాన్ని మహారధి వాసిష్ఠీపుత్ర సోమదేవుడు దానం చేసేడు. ఆయన దానంచేసింది గ్రామంనుంచి ప్రభుత్వానికి రావలసిన ఆదాయాన్ని. ఇటువంటి దానాలు చేయగలది ప్రభువులేగాని సామంతరాజులు కాదు. అందుచేత ఈ మహారధులు ప్రభుకుటుంబానికి సన్నిహితులేనా అయివుంటారు. లేదా వారిహోదా ప్రభువు తరవాతి స్థాయిది అయివుండొచ్చు. శాతవాహన వంశ ప్రారంభకుడైన శ్రీముఖుడు మహారధి త్రనకాయిరో కుమార్తెను తనకొడుక్కు పెళ్ళి చేసుకొన్నాడని పైన చదివాము. నానేఘాట్ గుహలోని చిత్రాలలో శ్రీముఖుడు, కోడలు నాగనిక, ఆమెభర్త శ్రీశాతకర్ణి, ఆమె తండ్రి మహారధి త్రనకాయిరో, రాజకుమారులు హకుశ్రీ, శాతవాహనులు వరసగా వున్నారు. అది బౌద్ధగుహకాదు. సావడిలాంటి దయివుంటుంది. బిడారులనుంచి పన్నుల వసూళ్ళకు వుపయోగిస్తూండి వుంటారు. ఇక్కడ మహారధికి యువరాజు తరవాత, ఇతర రాజకుమారులకన్న పైన స్థానం ఇచ్చేరంటే, ప్రభుకుటుంబంలో ఆయనది ఉచ్చస్థానమే అయివుంటుంది. మహాభోజులు కూడా సామంతులే. అయితే ఆ బిరుదుపదం మహారధికన్న ఉన్నతం. ఈ రెండు బిరుదులూ వంశ పారంపర్యాలే. దక్కను పశ్చిమ భాగంలో కొద్దికుటుంబాలకే ఈ బిరుదులు పరిమితంగా వున్నాయి. మహాభోజుల శాసనాలలో వారిచక్రవర్తుల పేరు ప్రసక్తులు లేకపోవడంచేత వీరిది స్వతంత్రహోదా అనుకోవలసి వస్తూంది. వీరి శాసనాలు ఇతరేతరములైన స్తుతులేవీ లేకుండా సామాన్యులవిలాగ సంగ్రహంగా వున్నాయి. తరవాతకాలంలో ఆ స్తుతులు క్రమంగా ప్రారంభమయి వారి ప్రభుత్వం బలపడడాన్ని చూపుతున్నాయి.

రాష్ట్రాలు పైనచెప్పిన సామంతుల అధికారంలో ఉండేవి. ఈ రాష్ట్రాలు అహారలుగా విభజించబడేవి. సోపారాహార, గోవర్ధనాహార, మామలాహార–ఇల్లాగే. అమాత్యులనబడే అధికారుల అధీనంలో ఇవి వుంటాయి. ఈ అధికారం వంశ పారంపర్యం కాదు. ఆ అమాత్యుడుండే ప్రదేశాన్ని బట్టి అహార అని పిలవబడుతుంది. ఈ అమాత్యులు మతసంస్థలకు భూములిచ్చినా, ధనం ఇచ్చినా ప్రభువు ఇచ్చిన నిర్దిష్టాదేశాల ప్రకారమే చేశారు. శాసనాలలోవున్న ఆదేశాల వివరాలు చూస్తే వారికి స్వతంత్రంగా వ్యవహరించే అధికారం ఏమాత్రం లేదని అర్థం అవుతుంది. వీరుగాక మహాసేనాధిపతులంటూ వుండేవారు. వీరికి సైనికబాధ్యతలు లేవు. ప్రభు ఆదేశాలు

వ్రాయడం వీరి బాధ్యత క్రీ.శ. 2వ శతాబ్దిలో సామ్రాజ్యం వేగంగా విస్తరిస్తున్న ఘట్టంలో లేఖకుల అవసరం బాగా వచ్చివుంటుంది. మహాసేనాపతులను అహారాలకు అధిపతులనుగా నియమించేవారు. ప్రభుత్వాదేశాలకు అక్షరరూపం ఇవ్వడం చాల బాధ్యతతోకూడిన పని. వ్రాయడంలో తప్పులుదొర్లితే వచ్చే ప్రమాదాలదృష్ట్యానూ వ్రాయవలసిన ఆదేశపత్రాలు చాలా వుండడం దృష్ట్యానూ ఒక బాధ్యతగల అధికారిక్రింద లేఖనశాఖ అవసరపడి వుంటుంది. అంటారు, కె.గోపాలాచారి తమ "ఎర్లీ హిస్టరీ ఆఫ్ ది ఆంధ్ర కంట్రీ"లో. ప్రతీ అహారలో కొన్ని గ్రామాలుంటాయి. గ్రామాధికారిని 'గుమిక' అంటారు. మహాతారక(గ్రామప్రభువు), మహాఆర్యక (హిందూమత కార్యకలాపాల నిర్వాహకుడు), భాండా గారిక (కోశాధికారి), నిబంధకార (పత్రాలునమోదుచేసే అధికారి), ప్రాతిహార, దూతక (రాజాదేశాలను తీసుకువెళ్ళేవాడు) అంటూ ఇతర ప్రభుత్వోద్యోగులుండేవారు.

గుమికులనే అధికారులు కొన్ని గ్రామాలలోనే వుండేవారు. గ్రామాలలో శాంతి భద్రతల పరిరక్షణ వీరి ప్రధానబాధ్యత.

దక్కన్ పశ్చిమ భాగంలోని నాసిక్, కార్లే మొదలైన పలు తావులలోనూ, కోస్తా ఆంధ్రలోని అమరావతి, నాగార్జునకొండ, భట్టిప్రోలు, కొడవలి, చినగంజాం మొదలైన చోట్ల, బళ్ళారిజిల్లా మైకదోనిలోనూ దొరికిన శాసనాలలో ఈ అధికార్లవీ సామంతులవీ పేర్లు కనిపిస్తున్నాయి.

కొత్తగా ఏర్పడుతున్న ఈ గ్రామాలుగాక శాతవాహనరాజులకు స్వంతభూములూ, గ్రామాలూ వున్నాయి. ఒకటవ నానేఘాట్ శాసనం శాతకర్ణి ఎంతో ధనమూ, ఆవులూ, ఇతర బహుమతులూ గాక 13 గ్రామాలను కూడా బ్రాహ్మణులకు దానం ఇచ్చినట్లు చెప్తోంది. త్రిరశ్మికొండకు నైరుత్యంగావున్న గ్రామాన్ని గుహాలయంలోని చైత్యాల కోసం యిస్తున్నట్లు గౌతమీపుత్రశాతకర్ణి నాసిక్ శాసనం తెలుపుతూంది. పరివ్రాజకులు ఒకగ్రామాన్ని నిరాకరిస్తే దానికి బదులు గోవర్ధనమండలంలోని మరో గ్రామాన్ని 'వాసీకూపతటాక సమేతం'గా గుహాలయ పోషణకై శాశ్వతంగా దానం చేస్తున్నట్లు పులమావి నాసిక్ శాసనం తెలుపుతూంది. తన పిత్రార్జితమైన భూమి నుంచి నూరు నివర్తనలను (నివర్తనం రమారమి ఒకటిన్నర ఎకరానికి సమానం) సర్వసంగ పరిత్యాగులయిన పరివ్రాజకులకు దానంచేస్తున్న గౌతమీపుత్రశాతకర్ణి మరో శాసనం నాసిక్‌లో దొరికింది. దానం అన్నది గ్రామంనుంచీ ప్రభుత్వానికి చెల్లించే పన్నుకు మాత్రమే పరిమితం. ఆపన్నులు హెచ్చించకూడదు. గ్రామంనుంచి ఇతర ఆదాయాలు తీసుకొనే హక్కూవారికిలేదు. వాలూరక బౌద్ధారామానికి మహారధి వాసిష్ఠీపుత్ర సోమదేవుడు ఒక గ్రామాన్ని దానం ఇచ్చినట్లు తెలిపే కార్లే గుహాలయంలోని శాసనం గురించి పైన చెప్పేను. దానినిబట్టి ప్రభువులకేగాక సామంతరాజులకు కూడ కొన్ని గ్రామాలు స్వంతానికి వున్నట్లు అర్థం అవుతూంది. హిందూమతాన్ని అనుసరించిన శకరాజులకు కూడా స్వంతానికి గ్రామాలున్నాయి, వానిని బ్రాహ్మణులకు దానం చేసినట్లు శాసనాలున్నాయి. నహపణుని అల్లుడు రుషభదత్తుడు దేవుళ్లకూ, బ్రాహ్మణులకూ 16గ్రామాలు దానం ఇచ్చినట్లు, ఏటా లక్ష బ్రాహ్మణ్యానికి సమారాధనలు జరుపుతున్నట్లు, 8 మంది బ్రాహ్మణులకు వివాహాలు చేయించినట్లు, 3 లక్షల గోవులూ, ఎంతో బంగారమూ బ్రాహ్మణులకు దానం ఇచ్చినట్లు నాసిక్‌లో దొరికిన ఒక శాసనం తెలుపుతూంది. తన నగరానికి వాయువ్యంగా ఉన్న 700 నివర్తనల భూమిని



అశ్వభూతి అనే బ్రాహ్మణుడి వద్ద 4000 కర్షపణములకు కొని రుషభదత్తుడు దేశం నలుమూలలనుంచీ వచ్చి తన గుహాలయంలో నివసిస్తున్న యోగులయిన బ్రాహ్మణుల పోషణార్థం దానం చేసినట్లు మరొకశాసనం. దీనినిబట్టి భూమి స్వత్వం క్రయ విక్రయాధికారాలతో చెల్లుతున్నదని తెలుస్తూంది. దక్షిణాపథంలో వర్తకపు సరుకుల వుత్పత్తి ఉచ్ఛస్థాయికి చేరిందనీ, అన్ని తరగతులకు చెందిన ప్రజాసామాన్యం దానిలో పాల్గొంటున్నదనీ రుజావు అవుతూంది.

రాజులు ఎంత ఉదారులయినా, ఎంత దైవభక్తీ పరలోకచింతన వున్నా, ఎన్ని దానధర్మాలు చేసినా పీడనలేకుండా ప్రభుత్వం జరగదు.. శాతవాహనులూ, వారి ప్రతిక్షులూ కొత్తభూములు స్వాధీనం చేసుకోడానికీ, వానిని కాపాడుకోడానికి నిరంతర యుద్ధాలు చేశారు. ఈ సైనికచర్యలు సాగించడానికై నూతన గ్రామాలూ, వ్యాపార వాణిజ్యాలూ అదనపు సంపదల్ని కూర్చాయి. రాజ్యంలో సామంతులూ, అధికారుల ద్వారా పరిపాలన సాగించడానికి ఎంతో వ్యయం అవుతుంది. దానికీ యీ గ్రామాలూ, వర్తక వాణిజ్యాలనుంచే ఆదాయం రావాలి. వీనికి తోడు యజ్ఞాలు, యాగాలు, రుషభదత్తుడిలా లక్ష మంది బ్రాహ్మణ్యానికి సమారాధనలు, 3 లక్షల గోవుల దానాలు ఇవిగాక ప్రజా సౌకర్యాలకై చెరువులూ, నూతులూ తవ్వించడం, రహదారులపక్క చెట్లు నాటించడం, సత్రములు కట్టించడం వంటివున్నాయి. వీని వలన వర్తకం, దానితో ఆదాయం పెరగడం వున్నా ఈ రాజమహారాజులు ఎంత ఆదాయం తీస్తున్నారో అర్థం అవుతుంది. ప్రతి ప్రభువూ అశోకుడు కాదు. ప్రతి రాజా భిక్షువు కాదు. ఆదాయం వస్తున్నకొద్దీ ఆశా పెరుగుతుంది. ప్రతిసామంతరాజూ అధికార విస్తరణకు కృషి చేస్తుంటాడు. వాళ్ళని అదుపులో వుంచగల కేంద్రాధికారం లేదు. ఈ పరిస్థితులలో సామాన్యపౌరుల స్థితిగతులెల్లా వుంటాయో వూహించడం కష్టంకాదు. "నా సుఖదుఃఖాలు సాధారణ ప్రజలకన్న భిన్నం కాదు–" అని గౌతమీ పుత్ర శాతకర్ణి చెప్పవచ్చు. కాని ఇంత సామ్రాజ్యాన్ని పాలించడానికీ, దాన్ని శత్రువులనుంచి కాపాడడానికీ అవసరమవుతూన్న ధనాన్ని, హింసించకుండా సంపాదించే డనలేము.

అమరావతి శిల్పాలలో ప్రభువు యొక్క శక్తి, అధికారమూ ప్రతి సూక్ష్మాంశమూ కనిపిస్తుంది. సామాన్యునికన్న రాజును భిన్నంగా చూపించేవి రాజచిహ్నాలు. ఛత్ర, చామరధారులు ప్రభువును నిరంతరం పరివేష్టించివుంటారు. ఆయన రాజసాన్ని దీపించే సింహాసనంమీదనే కూర్చుంటాడు. ఎక్కడకు కదిలినా వెంట కేతనదారి వుంటాడు. ఖడ్గవాహిని వుంటుంది. ఒక స్త్రీ పెద్ద అందమైన బాకా వూదుతూ రాజాగమనాన్ని తెలుపుతూంటుంది. మరొక స్త్రీ మధుపాత్రతో ఎప్పుడూ సిద్ధంగా వుంటుంది. చివరచెప్పిన ఇద్దరుస్త్రీలూ, మిగిలిన అందరికన్న భిన్నంగా గ్రీకుదేశపు వేషభూషలతో ఆ శిల్పాలలో కనిపిస్తారు.

శిల్పాలలో కనిపించే రాజభవనాలు పలు అంతస్తులు కలవి. అంతస్తుల సంఖ్యా, భవన మహత్వమూబట్టి క్రింది అంతస్తులోని స్తంభాల సంఖ్య వుంటుంది. తిన్నని దూలాలమీద అంతస్తు నిలబడి వుంటుంది. అన్నిటికన్న పై అంతస్తులో అనేక శాలలు నిర్మించబడతాయి. దేనికి దానికే కప్పు వుంటుంది. గుర్రపునాడం ఆకారంలో కిటికీ లుంటాయి. బురుజులమాదిరిగా వుండే కూటాగారాలు వుంటాయి. అలిందలు లేక వరాండాలుంటాయి. అయితే బయటివారికి కనిపించకుండా వానికి తెరలుంటాయి. రాజగృహాల పై కప్పులు చదునుగానో, కొనదేరో వుంటాయి.

ప్రజలలో వున్న అసంతృప్తిని గురించి రాజులశాసనాలు ఏమీ చెప్పవు. అయితే పాళీభాషలో వ్రాసిన జాతకకథలలో ఆనాటి సామాజిక పరిస్థితుల వర్ణనా, ప్రజల కష్టాలూ వర్ణించబడినాయి. ఈ కథలు చరిత్ర కాకపోయినా, చరిత్రను సూచనగా తెలుపుతాయి.

అయిదువందలకు పైగా లభిస్తున్న ఈ జాతకకథలు జానపద గాథా సాహిత్యం అని చెప్పవచ్చును. వీనిని ఎవరు, ఎప్పుడు వ్రాసేరో చెప్పలేరుకాని, ఆ కథావిషయాలను జాగ్రత్తగా పరిశీలించి పురావస్తుపరిశోధనల సమాచారంతోను, దేశీయ విదేశీయ చారిత్రకాధారాలతోనూ సరిచూసి అవి ఏనాటివయి ఉంటాయో చరిత్రకారులు నిర్ధారణచేశారు. అవి ఏ విధంగానూ క్రీ.పూ. 3వ శతాబ్దంకన్న వెనుకటివయి ఉండవని ఆర్. ఎల్. మెహతా అంటారుం. ఆ కథలలో కనిపించే వాణిజ్య వాతావరణంబట్టి అవి బుద్ధుని కాలంలో వ్రాయబడి వుండలేదనీ, శాతవాహనుల కాలానికి చెందినవయి వుంటాయనీ కొశాంబి అంటున్నారు. "వాణిజ్యవాతావరణమూ, ధనాశ ఇవి సంస్కృతంలోగాని, పాళీభాషలో గాని కనబడని "లంచం" అనే కొత్త పదాన్ని 'లంచం తినడం' అనే పదప్రయోగాన్నీ, జాతకకథల్లో (229 , 511, కథలు) ప్రవేశ పెట్టాయి అంటున్నారు.

ఆనాటి వాతావరణాన్ని తెలుసుకొనేందుకు శాతవాహనుల పరిపాలన ఆఖరు దశలో- క్రీ. శ. 3వ శతాబ్దిలో - జీవించిన వాత్స్యాయనుని "కామసూత్రాల" నుంచి సమాచారం లభిస్తోంది.

మరొక ఆధారం క్రీ.శ. 19-24ల మధ్యకాలపు శాతవాహనరాజు హాలుడు సేకరించిన "గాథా సప్తశతి".

మొదట జాతక కథలు చూద్దాం. రాజు పన్నులు, జరిమానాలు, హింసలు, దొంగతనాలతో ప్రజలను గానుగలో చెరుకు కర్రనులా పిండేశాడని ఒక కథ వర్ణిస్తోంది. రాజరికం వంశపారంపర్యం. పరోహితుడు ఆయనకు నిత్యసన్నిహితుడు. డబ్బు ఆశ ఎక్కువ. యజ్ఞయాగాదులతో భూములూ, ధనమూ సంపాదిస్తాడు. పన్ను రాజుల ఇచ్ఛాధీనం. పన్ను వసూలుచేసేవారిని గురించి ఈ గాథలలో ఒక్క మంచి మాట కనబడదు. కర్షకుల కష్టార్జితాన్ని దోచుకునే దొంగలుగానే వర్ణించబడతారు.

భూమిపన్నులు చెల్లించలేక రైతులు కుటుంబాలతో సహా పారిపోయి పగలంతా అడవుల్లో తలదాచుకొని రాత్రులు ఇళ్ళకు తిరిగివచ్చేవారు.

ఇంక న్యాయవిధానం అవినీతి పూరితం. న్యాయాధికారులు లంచం తిని తీర్పులిస్తారు. అమాయకుల్ని పట్టుకుని, హింసించి, నేరం ఒప్పించేవారు. జరిమానాల నుంచి, అంగవైకల్యం, దేశాంతర నిర్వాసం, మరణం శిక్షలుండేవి.

ఇటువంటి పరిపాలకుల మీద ప్రజలు తిరుగుబాట్లు చేసిన కథలు కూడా జాతక కథలలో వర్ణించబడినాయి. తన భూమిలోని నిక్షేపాన్ని హరించేరని రాజునూ, రాజపురోహితుణ్ణి ఒక బ్రాహ్మణయువకుడు నిందిస్తాడు. ఆ రాజును ప్రజలు చంపెయ్యబోతూంటే దైవం అడ్డుపడ్డాడు. రాజును రాజ్యంనుంచి తరిమివేశారు. ఇదొక కథ. తనకుపకారం చేసినవానియెడ కృతఘ్నత చూపిన ఒక రాజును ప్రజలు చంపేస్తారు, మరో కథలో. ఆ రాజును బాణాలు, బల్లేలు, రాళ్ళు, కర్రలతో కొట్టి చంపేసి కాలికి తాడుకట్టి ఒక గోతిలోకి ఈడ్చేస్తారు. మరో రాజును ఎన్నుకుంటారు మరోకథలో. రాజు సుజాత అనే సుందరి భర్తను ఏమీ ఎరగనివానిని



దొంగతనం నేరంమోపి మరణశిక్ష విధిస్తాడు. అప్పుడు సక్క అనే ప్రజాదేవత రాజును ఈడ్చితెచ్చి తలారి కత్తి ఎత్తిన సమయంలో దానిముందు పెడుతుంది. సుజాత మగని తలకుబదులు రాజుతల తెగి నేలబడుతుంది. ఇలాగే అనేక కథలు.

వాత్స్యాయనుడు తన 'కామసూత్రాల'లో పరదారలతో సంపర్కం పెట్టుకుని ప్రజలకు దుష్టాదర్శం చూపవద్దని ఉన్నత రాజోద్యోగి మహామాత్రులకు హితబోధచేస్తాడు. 'కామసూత్రాల' 5వ భాగం, 5వ ప్రకరణంలో గ్రామాలలో పనిపాటలు చేసుకొనేవాళ్ళూ, వాళ్ళయెడ వుద్యోగుల దుర్వ్యవహారమూ గురించి చాలావివరంగా వ్రాసేడు. అనేకమంది బీదస్త్రీలు, వితంతువులు, నిరాధారలు, పరివ్రాజికలు (సన్యాసినులు) కౌటిల్యుని కాలంనాడు లాగనే నూలువడకడం, నేయడం ద్వారా పొట్టపోసుకుంటున్నారు. ప్రభుత్వోద్యోగులయిన సూత్రాధ్యక్షులు (నూలు తీసుకునేవారు), పణ్యాధ్యక్షులు (సరుకులు కొనేవారు) వారికి జీతాలు చెల్లిస్తారు. పంటలో భాగం తీసుకుని జీవించే గ్రామాధికారి (ఆయుక్త) అధీనంలో గ్రామంలోని రైతు స్త్రీలు వివిధ కార్యకలాపాలు సాగిస్తారు. వీరంతా అతనికి వెట్టిచేస్తారు. ధాన్యం గాదుల్లో పొయ్యడం, ఇంటికి సరుకులుతేవడం, ఇంటిపనులు చేయడం, అతని పొలాలలో పనిచెయ్యడం, నూలు, ఉన్ని నార పట్టుకెళ్ళి దారం వొడికి ఇవ్వడం, పడుగుచేసి ఇవ్వడం వంటి పనులు చేస్తూంటారు. అల్లాగే వ్రజ (గోశాల) స్త్రీలు గవాధ్యక్షుని అధీనంలో పనిచేస్తారు. ఈ స్త్రీల దుర్భర దశను ఆయన ఇల్లా వివరించేడు. 'గ్రామాధికారో రివెన్యూ ఆఫీసరో, వ్యవసాయాధికారి కొడుకో సైగచేస్తూచాలు గ్రామ స్త్రీలు అంగీకరించవలసిందే. వీళ్ళని విటులు "చర్షని" అని (శృంగార చేష్టితాలతో కూడ పనిలేని పడుపుకత్తెలు) అపహాస్యం చేస్తాడు. అదేవిధంగా గవాధ్యక్షుడు గోపాలకుల భార్యలనూ, సూత్రాధ్యక్షుడు వితంతువులను అనాథలనూ, పరివ్రాజికలనూ, నగరాధ్యక్షుడు రాత్రులు నగర సంచారంలో సంగ్రహించిన రహస్యాలతో దిక్కులేని ఆడవాళ్ళను, రాజభవనానికి కావలసిన వస్తువులుకొనే అధికారి క్రయవిక్రయ దార్ల భార్యలను అనుభవిస్తారు." అంటాడు.

హాలుని "గాథా సప్తశతి" ఉపమానాలరూపంలో ఆనాటి పరిస్థితుల సూచనను అందిస్తోంది. నేరస్థుణ్ణి వధ్యశిలకు తీసుకుపోయేటప్పుడు మోగించే డప్పులమోతలా చెవులు బద్దలుకొడుతున్న దంటాడు ధ్వనిని. దేవాలయ శిఖరం పైన కనిపించే శూలం శరీరంలో దిగవేసినట్లుందనీ, దేవాలయం నేరం చేసి, శిక్షపడి, బాధపడుతున్న దానిలా ఉందనీ అంటాడు. స్మశానంలో చెట్లకి నేరస్థులను వేలదీసేవారని ఒకపద్యం సూచిస్తోంది.

గ్రామణి మంచివాడనో, క్రూరుడనో, పిసినారి అనో, భూస్వామి అనో, వర్తకుడు అనో పేర్కోడం కనిపిస్తుంది. ఒక గ్రామణికి చెరుకుతోట వుంది. మరొకడు బెల్లంతో సారాకాచి అమ్ముతాడు. వేరొకడు తన కూతురిపెళ్ళి ఎంతో ఆర్భాటంతో చేస్తాడు. ఒకడు తనమిత్రుడికి ఉప్పులేని తిండి పెట్టేటంత పిసినారి. మరొకడు స్నేహితుడి స్నానానికి నీళ్ళు ఇవ్వకుండా నదికిపోయి స్నానంచేసి రమ్మనే దుర్మార్గుడు. మరొకడు ధనంవున్నా చింకి గుడ్డలు వేసుకుంటాడు. వేరొకడు వట్టిపోయిన ఆవును పాలుపితుకుతాడు. ఒక గ్రామణి తనకు దొరికిన నిక్షేపాన్ని రాజుకు చెప్పచెప్పక అన్యాయంగా దగ్గర పెట్టుకుని త్రాచుపాములా రాత్రీపగలూ దాన్ని కాపలాకాస్తుంటాడు. గ్రామణి ప్రభుత్వాధికారి గనక జనం అంతా అతనికి భయపడతారు. అతని దుష్టచర్యల గురించి చాటుచాటున గుసగుసలుపోతారు.

ఒక గ్రామణి కొడుకు వేపపండులో పురుగులా భార్యకు అణగిమణగి వుంటాడట. వాడు వట్టికసాయి. చూస్తేనే అసహ్యంవేస్తుంది. కాని వూరంతా వాడికి లొంగివుంటూంది. మరో గ్రామణి కూతురు వేలెడంతవున్నా మహా టక్కులాడియట. పెద్దదయితే నాభిమొక్కలా మహానాశం కలిగిస్తుందట.

శాతవాహనులది కేంద్రీకృత సైన్యవ్యవస్థ కాదుగాని, మంచి ఉచ్చస్థాయిసైన్యం మాత్రం అవును. అమరావతి శిల్పాలలో యుద్ధాలూ, సైనికవ్యవస్థ గురించిన చిత్రాలూ వున్నాయి. పట్టణాలచుట్టూ ఎత్తయిన గోడలూ, బురుజులూ వుంటాయి. గోడల్నీ, ద్వారాల్నీ ఇటికసున్నంతో కట్టేవారు. "బురుజుమీద వుండే ఒక్క విలుకాడు నూరుమంది శత్రువులకు, నూరుమంది విలుకాళ్ళు పదివేలమందికీ ఈడవుతారు. కనక రాజుకు కోట ఉండాలని శాస్త్రాలు విధిస్తున్నాయి. ఆ కోటలో ఆయుధాలు, ధనం, ధాన్యం, వాహన పశువులు, బ్రాహ్మణులు, వృత్తిపనివారు, శిల్పకుశలురు, పశుగ్రాసం, నీరు సమృద్ధిగా నిలవచెయ్యాలి" అని "మనుధర్మశాస్త్రం" ఉద్బోధిస్తూంది. సైన్యం నాలుగు అంగాలుగా వుండేది. కాల్బలం, అశ్వసైన్యం, గజసైన్యం, రథాలు, విల్లు–అంబులు, కత్తి, బల్లెము, పరశువు, గద, డాలు, దృఢమైన కర్ర ఆనాటి ఆయుధాలు. అమరావతి శిల్పాలలో ఇవన్నీ కన్పిస్తాయి. ఆనాటి కత్తులు తొమ్మిదిరకాలవి వుండేవి. యుద్ధాలు కోటగోడల మధ్యనున్న నగరాలవద్దనే జరిగేవి. గుండ్రని డాలూ, కత్తితో కాల్బలం యుద్ధరంగంలో ముందు నడిచేది. దానికిరువైపులా తురంగబలం, గజబలం వుండేవి. విలుకాండ్రున్న రథాలు వెనకభాగాన వుండేవి. ముదుకుతల అనే సేనాధిపతి (సేనగోప) పేరు అమరావతి శాసనం కన్పిస్తూంది.

నాలుగవ ప్రకరణం

# తెగసంస్కృతి నుంచి నాగరికతకు పరివర్తన

## వ్యవసాయం, పరిశ్రమ

శాతవాహనుల కాలంలో ప్రజల ప్రధానవృత్తి వ్యవసాయం. మొత్తం భారత దేశంలోనే భూమిని మొట్టమొదటి దానం ఇచ్చినది క్రీ.పూ. 2వ శతాబ్దిలో శాతవాహనులు. తరవాత అది ఉత్తరానికి కూడ వ్యాపించింది. పశ్చిమానా, తూర్పునాకూడ బౌద్ధారామాలకూ, బ్రాహ్మణులకూ భూములూ, గ్రామాలూ యిచ్చినట్లు శాసనాలు తెలుపుతున్నాయి. బాగా అభివృద్ధి పొందిన ప్రాంతాలలో భూమిహక్కు రాజులకేగాక సామాన్య వ్యక్తులకూ వుండేది. ఆ భూముల్ని లాక్కోడంగాక, రాజు కొనుక్కునేవాడు. ఒక్కొక్కప్పుడు భూమిమీద చాలామందికి సమిష్టిహక్కు వుండేది. ఆదాయాన్ని ఒక్కొక్కరికెంతెంతో "పనాల" లెక్కన పంచేవారు. "అర్ధపనఖేతు"డని ఒకనిని కన్హేరీశాసనం పేర్కొంటూంది. రాజులు, ప్రభువులేకాక అనేకవృత్తులవారు, ఆఖరికి సన్యాసులుకూడా తమభూములను విహారాలకు దానం చేసేవారు. కొన్ని భూముల మీది ఆదాయాన్ని చెట్లు పెంచడానికే వుపయోగించేటట్లు దానం ఇవ్వడం వుంది. నాసిక ప్రజలు ఒక గ్రామాన్ని దానం ఇచ్చినట్లు చెప్పే నాసిక శాసనాన్ని బట్టి, పొరుగు గ్రామాలమీద పట్టణ ప్రజలకు సమిష్టి హక్కు వుండేదనుకోవలసివస్తూంది. అయితే ప్రధానంగా భూమి వ్యక్తులదే. భూమిని సాగులోకితేవడం, బాగుచేసి వృద్ధిపరచడం వంటివి ప్రభుత్వంద్వారా గాక వ్యక్తులే చేసుకునేవారు. చెరువుల క్రింద తరిసాగు వుండేది.

చంద్రగుప్తుడి కాలంలోలాగ ఇక్కడ ప్రభుత్వక్షేత్రాలూ, ప్రభుత్వోద్యోగుల పర్యవేక్షణలో కూలీలు వ్యవసాయపు పనులు చేయడమూలేదు. బానిసలు ఇళ్ళలో పనిచేసేవారు. వారిని వ్యవసాయపు పనులకి వుపయోగించేవారుకాదు. శాలికేదారజాతకంలో ఒక పెద్ద భూస్వామి భూములలో కూలీలు ఉదయంనుంచి సాయంకాలంవరకూ పనులు చేసేవారని ఉంది. వాళ్ళకిచ్చే కూలితో జీవితం నడిచేదికాదని ఆ కథే చెప్తూంది. "కూలిపనిలో మొత్తం పెట్టుబడిదారీ వుత్పత్తి పద్ధతి బీజరూపంలో వుంటుంది. అట్టి కూలిపని చాలా ప్రాచీనకాలంనుంచి వుంది. బానిసల చాకరీతో పాటు పక్క పక్కనే అక్కడాఅక్కడా కూలిపని ఎన్నో శతాబ్దాలుగా వుంది. అయితే అనుకూల చారిత్రక పరిస్థితులు సమకూడినపుడే ఈ బీజం పెట్టుబడిదారీ వుత్పత్తివిధానంలోకి అభివృద్ధి పొందగలదు" అన్నారు ఫ్రెడరిక్ ఏంగెల్స్.

అడవికొట్టిసాగులోకి తెచ్చినవాడిదే భూమి అని "మిలిందపన్హా", 'మనుస్మృతి' కూడ చెప్తున్నాయి.

భూమిని సాగులోకి తెచ్చేందుకు రైతులకు ప్రభువులకుకూడ సౌకర్యాలు కలిగించేవారు. క్రీ. పూ. 2వ శతాబ్దినాటి కళింగరాజు ఖారవేలుడు లక్ష పణములు ఖర్చుచేసి గతంలో నందుడు తవ్వించిన ఒక పాతకాలువను ఇంకా దూరం పొడిగించేడు. క్రీ.శ. 2వ శతాబ్దంలో మహాక్షత్రప రుద్రదాముడు తన ఖజానానుంచి ఎంతో సొమ్ము ఖర్చుచేసి, ప్రజలమీద పన్ను వెయ్యకుండా, బలాత్కారంతో పనులుచేయించడం గాని అత్యవసర విరాళాలు వసూలుచేయడంగాని లేకుండా సుదర్శన చెరువు డాముకు పడిన పెద్ద గండిని మరమ్మతు చేయించాడు.

సరస్సులు, నూతులేగాక బుగ్గలనీటిని గొట్టాలద్వారా వ్యవసాయానికి ఉపయోగించేవారు. ఈ పనిలో సహాయంచేసే "ఔదయాంత్రికుల" శ్రేణి ప్రసక్తి క్రీ.శ. 3వ శతాబ్దంనాటికి నాసిక్ శాసనంలో వుంది. "సంస్కృత సాహిత్యంలో ఏ యంత్రాన్నీ పేర్కోడం చాలా అరుదు. శాసనాలలో యంత్ర ప్రసక్తి వచ్చినదిదొక్కటే" నంటాడు వి.కె. మజుందార్ "రీడింగ్స్ ఇన్ ఇండియన్ ఎకనమిక్ హిస్టరీ"లో.

వ్యవసాయాభివృద్ధికి ఆ రోజులలో ప్రభువులు చట్టాలు చేశారు. వ్యవసాయపరికరాలను అపహరిస్తే కఠినంగా శిక్షించాలని "మనుస్మృతి" ప్రభువులను కోరుతూంది. తప్పుడు విత్తనాలను అమ్మినా, చెడిపోయిన విత్తనాలను అమ్మినా, సరిహద్దురాళ్ళు తొలగించినా అంగవైకల్యశిక్ష విధించాలంది. చెరువులూ, పళ్ళతోటలూ అమ్మడం భార్యాపిల్లల్ని అమ్ముకోవడం అంత దోషమంటుంది.

ధాన్యం, గోధుమ వంటి కాయధాన్యాలు, కందులువంటి పప్పుధాన్యాలు, నువ్వులు ఆముదాలవంటి నూనెగింజలు, జనుమువంటి పశుగ్రాసం, ప్రత్తి, చెరకు ఆనాటి ప్రధాన పంటలు. అయితే కోస్తా ప్రాంతపు అభివృద్ధికి వ్యాపార పంట అయిన కొబ్బరి మూలం అయింది. అయితే మలయానుంచి మనదేశం వచ్చిందని, ఆ దేశపు "న్యోర్‌కలి" యే "నారికేళం" అయిందని కొశాంబి అభిప్రాయం. క్రీ. శ. 120 సం॥ నాటి శకరాజు రుషభ దత్తుడు 32 వేల కొబ్బరిచెట్లు, 8 వేల కొబ్బరిచెట్లు ఉన్న రెండు తోటలను బ్రాహ్మణులకు దానం ఇచ్చినట్లు నాసిక్ శాసనం తెలుపుతూంది. పశ్చిమతీరపు రేవులనుంచి ఎగుమతి అయ్యే వస్తువుల పట్టికను వివరంగా యిచ్చిన "పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సీ" అను గ్రీకు గ్రంథం నారికేళం మాటే ఎత్తలేదు. అంటే అప్పటికి చెట్లు పశ్చిమ కోస్తా చేరలేదనుకోవాలి. క్రీ.పూ. ఒకటవ శతాబ్దం ప్రాంతంలో ఇది తూర్పు కోస్తాకి చేరింది. పుదుచ్చేరి సమీపంలోని అరికమేడు వద్ద తవ్వకాలలో క్రీ.పూ. ఒకటవ శతాబ్దపు మట్టిపొరలలో కొబ్బరినార పగ్గం కనిపించింది. తరువాత యిది పశ్చిమ కోస్తాకు పాకింది.

రజుగాహక అమాత్యులు భూములు కొలిచి, వేర్వేరు 'ప్రత్యయాల'నుగా విభజించి, సరిహద్దులు నిర్దేసిస్తారని జాతకకథలు చెప్తున్నాయి. పంటమీద సెట్టి అంచనా వేస్తాడు. మరో అధికారి పంటలో రాజభాగం వసూలుచేసి, రాజుగారి ధాన్యాగారాలను చేరుస్తాడు.

క్రీ.శ. రెండవ శతాబ్దికి చెందిన అమరావతి శిల్పాలలో ఆనాటి గ్రామస్వరూపం మనకు కనబడుతుంది. (మిత్తవిందక జాతక కథ) ఇందులో రెండురకాల గుడిసెలు కనిపిస్తాయి. ఇవి మట్టితో కట్టి, ఆకు నేసినట్లున్నాయి. ఒకటిం గుండ్రంగా వుండి, చిప్పబోర్లించినట్లు కప్పుఉంది రెండోరకం దీర్ఘచతురస్రంగా ఉండి కప్పు బండి గూడులా ఉంది. గ్రామం చుట్టూ పొట్టిగా ఇటుకగోడ వుంది. దొంగలనుంచీ, క్రూరజంతువులనుంచీ రక్షణకోసం గ్రామాలచుట్టూ అటువంటి గోడలు కట్టడం ఆ రోజులలో పరిపాటి. ఆ గోడకి వెలుపల ఊరికాపలాదారు ఇల్లు. చండాలుర ఇళ్ళుకూడా ఆ గోడ వెలుపలే. వారు ఊరిమధ్య నివసించడం నిషిద్ధం.



జాతక కథల్ని బట్టి గ్రామాలు మూడు తరహాలుగా ఉండినట్లు తెలుస్తుంది. అనేక వర్ణాలవారూ, వృత్తులవారూ కలిసివుండే గ్రామాలు ఒకరకం. ఏదో ఒక వర్ణంవారో, వృత్తికి చెందినవారో మాత్రమే కాపురం ఉండే గ్రామాలు మరో రకం, యుద్ధబాధలూ, దోపిడుల ప్రమాదాలూ వలన జీవితానికి రక్షణలేని సరిహద్దు గ్రామాలు మూడోరకం. రెండోరకం గ్రామాలలో వృత్తి పనివారి సంఘాలు శ్రేణులు అనే పేరున ఉంటాయి. గ్రామాధికారితో కలిసి ఈ శ్రేణులు గ్రామ పాలనలో పాల్గొంటాయి. శ్రేణి సభ్యుల మధ్య సంబంధాలను నియమిస్తూ శ్రేణీ నిబంధన లుంటాయి. వానికో నాయకుడుంటాడు. అతడు సాధారణంగా మంచి పనివాడూ, చొరవా, చురుకూ గలవాడయిఉంటాడు. గణపక విశ్వవర్మ తల్లియిచ్చిన దానం గురించి ఒక నాసిక్ శాసనం వివరిస్తూంది. గణపక అంటే గణ రక్షకుడు–నాయకుడు అని బుహ్లర్ వ్యాఖ్యానిస్తున్నాడు. ఈ నాయకులకు సైన్యాధికారం కూడా ఉంటుంది. ప్రతి గణపకుని చేతిలో మూడు "గుల్మా" లుంటాయి. "గుల్మము" ఒక పటాలము. అంటే గణపకులు ఇంచుమించు కర్నల్‌తో సమానం. ఈ నాయకులు చాల ధనవంతులయి రాజాదరం కలిగిఉంటారు. ఈ నాయకుల్ని ప్రభువే నియమిస్తాడు. ఇటువంటి హెూదా గతంలో ఎన్నడూ లేనిదీ, కొత్తదీను. ఒక రాజు ఈ మాదిరి వృత్తి శ్రేణులు పద్దెనిమిదింటిని సమావేశపరచాడని 538వ జాతక కథ చెప్తూంది.

పైన చెప్పిన మూడు తరహాల గ్రామాలు కూడా మౌర్యసామ్రాజ్యపు గ్రామాలవలె స్వయంపూర్ణ గ్రామాలు కాదు. అమ్మకపు సరుకుల ఉత్పత్తి హెచ్చుగా సాగి, రకరకాల వృత్తి నిపుణులు ధనవంతులయ్యేరు. అటువంటి అవకాశం స్వయంపూర్ణ గ్రామాలలో ఉండదు. పశ్చిమ భారత గుహాశాసనాలు పేర్కొన్న దాతలలో కోవికులు (నేతగాళ్ళు), తిలపేషకులు (తేలీలు), కాంస్య కారులు (కంచు పనివారు), కమ్మరులు, తేషకరులు (తరిమన పట్టేవారు), స్వర్ణకారులు, మణికారులు (రత్న పనివారు), వడ్రంగులు, తాపీ పనివారు, మిథికులు (రాళ్ళు నునుపు పెట్టేవారు) ఔదయాంత్రికులు (జల యంత్రకారులు) కుమ్మరులు, చర్మకారులు, గాధికులు (సుగంధ ద్రవ్యకారులు), ఆవేశనులు (గృహకర్మ కుశలురు) మొదలైన అనేక వృత్తిపనులవారి పేర్లున్నాయి. బౌద్ధ విహారాలలో లభ్యమయిన అనేక రకాల నగలు, మణి ఆభరణాలు మొదలయినవి చూస్తే అత్యద్భుతమైన పనితనం కనిపిస్తుంది. మెదక్ జిల్లాలోని కొండాపురం మొదలైన చోట్ల బౌద్ధ విహారాలలో దొరికిన పనిముట్లు మృణ్మయ పాత్రలు, దంతపు నగిషీలు చూస్తే ఆనాటి వారి అసాధారణ చాతుర్యం కనబడుతుంది.

తెలుగుదేశంలో మూసలలో తయారుచేసే "వూజు" అనే ఉక్కు చాల ప్రశస్తమని ప్రసిద్ధి. కొండాపురంలో దొరికిన కొలిమి తిత్తులు ఉక్కు తయారీకై వుపయోగించినవిగా భావించబడుతున్నాయి.

మైసూరు రాష్ట్రంలోని కోలారులోనే గాక రాయచూరు జిల్లాకు చెందిన హట్టి, వండపల్లి, మస్కిలలో కూడా ప్రాచీన కాలంలోనే బంగారం తవ్వేరు. మెహెంజోదారోలో

దొరికిన నగలను రసాయనిక విశ్లేషణచేస్తే ఆ బంగారం దక్షిణదేశపు గనులలో లభించినదిగా తేలిందని సర్ జాన్ మార్షల్ వ్రాస్తున్నారు.

ఇంచుమించు వృత్తులన్నీ శ్రేణులుగా ఏర్పడ్డాయి. క్రీ. శ. 2 వ శతాబ్దంలో భక్తులూ, ఆరాధకులూ సన్యాసులకు వస్త్రాలూ, తదితర అవసరాలూ సమకూర్చేందుకై ఈ శ్రేణులకు ధనం వప్పచెప్పేవారు. క్రీ. శ. 119-20లో రుషభ దత్తుడు గోవర్ధనంలోని నేతగాళ్ళ శ్రేణికి 2 వేల కర్షపణలు నూటికి 12 శాతం వడ్డీ చొప్పున మరో నేతగాళ్ళ శ్రేణికి 9 శాతం వడ్డీకి పెట్టుబడి ఇచ్చి, ఆ వడ్డీతో స్థానిక పరివ్రాజకుల జీవితావసరాలు సమకూర్చబడాలని ఆదేశించినట్లు నాసిక్ శాసనం తెలుపుతూంది. "పట్టణ నిగమసభలో ( ఈ పెట్టుబడుల గురించి) ప్రకటించి నమోదుచేశారు".- అని నాసిక్ గుహా శాసనం తెలుపుతూంది. విష్ణుదత్త అనే మహిళ కుమ్మరుల శ్రేణిలో వేయి కర్షపణలు, జలయాంత్రికుల శ్రేణిలో 2వేల కర్షపణలు, మరో శ్రేణి (పేరు కనబడ్డంలేదు) లో 500 కర్షపణలు, తేలీల శ్రేణిలో కొంత మొత్తం (వివరం కనపడ్డం లేదు) పెట్టుబడి పెట్టినట్లు క్రీ. శ. 258 నాటి శాసనం తెలుపుతూంది. ఈ శ్రేణులన్నీ గోవర్ధనంలోనివే. ఇక్కడ వడ్డీ ఎంతో చెప్పలేదు. ఆనాడు అలవాటుగా వున్న వడ్డీ ప్రకారమే అనుకోవాలి.

అంటే శాతవాహనుల కాలంలో వృత్తికారులు శ్రేణులుగా ఏర్పడి స్వతంత్రంగా వ్యవహరించేవారు – అనాలి. తమ వద్ద ప్రజలుంచిన ధనంతో ముడిసరుకులు తెచ్చి, అమ్మకాల నుంచి వడ్డీలు చెల్లించేవారు. రెండోది ఈ శ్రేణులు స్థిరత్వం కలిగి నమ్మకంగా పనిచేస్తుండడంచేత రాజులు తమ ఖజానాలలోకన్న వీరివద్ద ధనం భద్రంగా ఉంటుందను కునేవారు. దానికి ఇచ్చే వడ్డీ దేశంలోని భద్రతకూ, ప్రభుత్వ సమర్ధతకూ సాక్షిభూతంగా వుంది. ఇంక మరొకటి కూడా వుంది. ఒకే నగరంలో ఒక వృత్తికి ఎన్నేనా శ్రేణులు ఉండవచ్చు. ఉన్నాయి. ఈ బహుత్వం గుత్త వ్యవస్థ ఏర్పడకుండా నిరోధిస్తుంది. నాలుగోది – ఈ శ్రేణుల వద్ద నిక్షేపించేది స్థానిక నాణెమయిన కర్షపణములనే గాని బంగారమో, కుషానునాణెమో పెట్టకూడదు. ప్రజలలో కర్షపణముల మీద నమ్మకం పెంచడానికి చేసిన పని అయి వుంటుంది. రుషభదత్తుడు తన విరాళం మొత్తాలను నగర సభలో ప్రకటించి నమోదు చేయించేడనడం బట్టి ఈ ధనానికి మంచి హామీ వున్నదని తెలుసుకోవచ్చు. అంటే ప్రతి పట్టణంలో పాలక సంస్థ ఒకటి వుండేదనీ, అది శ్రేణిలాగే స్థిరత్వం కలిగి వుండేదనీ అనాలి.

దక్షిణాన వివిధ రాష్ట్రాల మధ్యనా, ఉత్తరానికీ, దక్షిణానికీ మధ్యనా రహదారి, వార్తా, రవాణాలు కష్టంకాదు. సోప్రా, వైజయంతిలలోని వారికి ఇచ్చిన దానాలు గురించిన శాసనం కార్లేలో, కల్యాన్ వారికిచ్చినది కన్హేరిలోనో జున్నార్‌లోనో, నాసిక్ వారికిచ్చినది బెడ్సాలో వున్నాయి. ఈ యీ ప్రదేశాల మధ్య రాకపోకలు అధికంగా వుండకపోతే ఒక వూరివారు మరో వూరివారికి దానం ఇచ్చిన శాసనం మూడో చోట వుండదు.

## వాణిజ్యమూ–వ్యాపారమూ

రోమను సామ్రాజ్యంతో ఇంతదూరం నుంచి విలాస వస్తువుల వ్యాపారం జరపడం ఆనాటి అతి ముఖ్య ఘటన. శంఖువులు, ముత్యాలు, రత్నాలు, బంగారం దక్షిణ దేశంలో హెచ్చుగా దొరుకుతాయనీ, అనేక గనులను కలుపుతూ, తక్కువ ఖర్చుతో, సుఖంగా



ప్రయాణం చేయగల మార్గం ఒకటీ, అనేక తరహాల వస్తువులు అపారంగా కొనితెచ్చేందుకు సాయపడే మార్గం వొకటీ దక్షిణానికి రెండు మార్గాలున్నాయన్నాడు కౌటిల్యుడు, తన "అర్థశాస్త్రం"లో.

క్రీ.శ. 1 వ శతాబ్దికి చెందిన రోమను పండితుడు ప్లినీ, అదే శతాబ్దపు మధ్య కాలానికి చెందిన గ్రీకు గ్రంథం పెరిప్లసూ మన విదేశీ వ్యాపారం గురించి, వాణిజ్య మార్గాలూ, వ్యాపార కేంద్రాలూ, రేవులూ గురించి విశ్వసనీయమయిన సమాచారం ఇచ్చేయి.

తన 16గురు శిష్యులతో బవరి అనే బ్రాహ్మణుడు ప్రతిష్ఠానం నుంచి రాజ్‌గిరిలో వున్న బుద్ధుని కలుసుకొనేందుకై ఉజ్జయిని, సాకేతం, శ్రావస్తి మీదుగా ప్రయాణం చేశాడని "సూత్తనిపాతం" అనే బౌద్ధ గ్రంథం తెలుపుతూంది. భరుకచ్ఛం నుంచి పశ్చిమంగా ఉజ్జయినికీ, దక్షిణంగా తమిళ దేశంలోని దామరికవరకూ అనేక పట్టణాలకు వ్యాపార మార్గాలున్నట్లు "పెరిప్లసు" గ్రంథం తెలుపుతూంది. భరుకచ్ఛం నుంచి ప్రతిష్ఠానమునకు 20 రోజుల ప్రయాణం. అక్కడి నుంచి 10 రోజుల ప్రయాణంలో తగర వుంది. భరుకచ్ఛకు దక్షిణాన వున్న మరో రేవు పట్టణం సోపర. అక్కడి నుంచి కోసల రాజధాని శ్రావస్తికి సరాసరి మార్గం వుందని అదే గ్రంథం వ్రాస్తూంది. సుప్రసిద్ధ వ్యాపార కేంద్రమైన కల్యాణ్‌ను ప్రతిష్ఠానంను ఒక మార్గం కలుపుతూంది. సోపర-శ్రావస్తిమార్గం మాహిష్మతి మీదుగా కల్యాణ్‌ను కలుపుతూంది.

పశ్చిమకోస్తా మీద బౌద్ధగుహాలయాలు వ్యాపార మార్గాలకు సమీపంలో వున్నాయి. వ్యాపార మార్గాల కూడలులలో పెద్దపెద్ద గుహలున్నాయి. ఈ గుహలున్న ప్రదేశాలు నేటికీ వట్టి అడవులూ, వెనకబడివున్నవీనే. అందుచేత ఆ నాడిక్కడ "అర్థ శాస్త్రం"లో వర్ణించిన గ్రామాలు ఉండి వుండవు. పైగా ఆనాడు కొబ్బరితోటలు ఇంకా లేవు. కనక అక్కడ ఉప్పుతప్ప మరేం దొరకదు. లోపలి ప్రాంతాల నుంచి సేకరించడానికైనా పడమటి కొండలు దాటడం సులభం కాదు. అక్కడక్కడ పడమటి కొండలలో కనిపించే గుహారామాల్ని బట్టి అసలు రహదారులే లేవనడానికి వీలులేదు. అయినా "పెరిప్లసు" గ్రంథమూ, టాలెమీ "భూగోళమూ" బట్టి ఆనాటి పడమటి కోస్తా రేవులయిన భరుకచ్ఛమూ, సోపరా కల్యాణ్, చౌల్ మొదలైనవి నదులలోనూ, ఉప్పుటేరులలోనూ పడవలు ప్రయాణం చేయగలంత లోపలగా ఉండేవి.

మచిలీపట్నం నుంచి ఒకటీ, వినుకొండ నుంచి వేరొకటి వ్యాపార మార్గాలు గోల్కొండ, తెర్, ప్రతిష్ఠానముల మీదుగా భరుకచ్ఛంవరకు వుండేవనీ, దాని గుర్తులు నేటికీ వున్నాయనీ డా. ఫ్లీట్ వ్రాస్తున్నారు.

ధాన్య కటకం, కేవురూర, విజయపుర, నర్సలలో వర్తకులు నివసిస్తున్నారని అమరావతి శాసనం చెప్తూంది.

దక్షిణ భారతదేశంలో బౌద్ధ ఆరామాలూ, విహారాలూ, దేవాలయాలూ వున్న ప్రదేశాలను పరిశీలిస్తే ఆనాడు వేంగి కేంద్రంగా కళింగ, కర్ణాటక, తమిళ, మహారాష్ట్ర, కోసలలకు అయిదు వ్యాపార మార్గాలుండినట్లు కనిపిస్తుంది.

ఈ స్థల మార్గాలే గాక, దేశీ, విదేశీ వాణిజ్యాన్ని సులభం చేస్తూ, నర్మదా, గోదావరి, కృష్ణానదులు దక్షిణాన అనేక వర్తక కేంద్రాలను కలుపుతున్నాయి. సింధు లోని బర్బరికమ్ నుంచీ, తరవాత భరుకచ్ఛం సమీపంలోని సిగెరస్ నుంచీ పశ్చిమ దేశాలతో వాణిజ్యం జరిగేదని ప్లినీ వ్రాశారు. ఇంకా పశ్చిమ కోస్తా వెంబడినేవున్న అనేక రేవుల్ని కలుపుతూ ఓడలు నడిచేవి.

"దామరికకంటా తూర్పు కోస్తా వెంబడిన పడవలూ, గంగానది కంటా పెద్ద నౌకలు సాగర, సాలంబియాలూ ప్రయాణిస్తూంటే తూర్పు కోస్తా రేవు పట్టణాలు చామర, పాదుక, సాపాత్మలు మహాధనవంతము "లయా" యని "పెరిప్లసు" గ్రంథం వ్రాస్తూంది. యజ్ఞశ్రీ శాతకర్ణి నాణేలమీద రెండు తెరచాపలున్న నౌకబొమ్మ వుంది. అందులో ఒకటి దోనెలా కనిపిస్తున్నదని అలగ్జాండర్‌రియా వ్రాశాడు. దాని వెనుక భాగాన చుక్కాని వుంది.

(ఈ మధ్యనే, గుంటూరుజిల్లా చేబ్రోలులో జరిగిన తవ్వకాలలో అనేక సీసపు నాణేలు బయటపడ్డాయి. వాటిలో పన్నెండు "ఓడ నాణేలు" అపురూపమైనట్టివి. వాటిని పురావస్తుశాఖ కమీషనరు శ్రీ పి. సీతాపతి పరిశీలించి, అవి క్రీ.శ. రెండవ శతాబ్దం చివరిపాదంలో ఏలిన యజ్ఞశ్రీ శాతకర్ణి నాణేలనీ, వాటిమీద మూడు తెరచాప కొయ్యలూ ఒక చుక్కాని వున్నాయని తెలుసుకున్నారు. అది వరకు రెండు కొయ్యలూ ఒక చుక్కాని మాత్రమే వున్న నాణేలు బయటపడ్డాయి) దీనిని బట్టి ప్రపంచంలో చుక్కానిని మొట్టమొదట కనిపెట్టింది ఆంధ్రులేనన్న అభిప్రాయం ధృవపడింది. (ఇండియన్ ఎక్స్‌ప్రెస్/- హైదరాబాద్ ముద్రణ- 24-5-1980-) దూరతీరాలకు బరువైన సరుకులు చేరెయ్యాలంటే ఓడలకు చుక్కాని అత్యవసరం. క్రీ.శ. మూడవ శతాబ్దంలో చుక్కానితో కూడిన ఓడ వుండేదని 1960లో పెకింగునుంచి వెలువడ్డ ఒక గ్రంథం (లేబర్ అండ్ స్ట్రగుల్) తెలుపుతోంది. చేబ్రోలు తవ్వకాలలో బయటపడ్డ నాణేలను బట్టి అంతకు ముందు రెండవ శతాబ్దంలోనే ఆంధ్రుల చుక్కానిని కనిపెట్టినట్లు స్పష్టమవుతూంది.

రుతుపవనాలు, వాటిసమయాలు గురించి క్రీ.శ. 47లో హిప్పాలసు ఖచ్చితమైన సమాచారం ఇవ్వకముందే ఆంధ్రనావికులు "అకాలవాతాలు" గురించి ఎరుగుదురు.

సుప్పారక జాతకం భరుకచ్ఛం నుంచి ఒక గుడ్డి సరంగు సాయంతో వర్తకులు పశ్చిమంగా అనేక సముద్రాలకు వెళ్లేరని చెప్తూంది. అందులో ఇచ్చిన పేర్లూ వర్ణనలూ బట్టి, ఈజిప్టులోని రెడ్‌సీక్ దేవాలయంలో దొరికిన శాసనం బట్టి పర్షియన్ జలసంధి, ఏడెన్ ప్రాంతం, సోమాలీలాండ్‌లో కొంత భాగం, ఎర్రసముద్రం, ఆఫ్రికా ఈశాన్యంలో వున్న నుబియా, అగ్నిపర్వతాలుండే మధ్యధరాసముద్ర భాగాలు, నైలునది మీదనున్న ఏడ్ఫూ రేవు మొదలైన వానికి భారతదేశపు వర్తకులు వాణిజ్యం కోసం వెళ్లేవారని తెలుపుతున్నాయి.

సముద్రాంతర ప్రయాణాలుచేసే వర్తకులు తమతో పక్షుల్ని తీసుకువెళ్లేవారనీ, వానిని వదిలిపెట్టి, అవి తిరిగిరాకపోతే సమీపంలో భూమివున్నట్లు తెలుసుకొనేవారనీ "దీఘ నికాయ" చెప్తూంది.

విదేశాలనుంచి వచ్చే నౌకలకు భరుకచ్ఛం రేవులోకి దారిచూపేందుకు త్రప్పగ, చోటింబ అనే పడవలున్నాయని "పెరిప్లసు" తెలుపుతూంది.

ఇక భూమిమీద ప్రయాణాలకు ఎడ్లబండి నుపయోగించేవారు. వర్తకులు ప్రయాణించే బండ్లు చాలా అందంగా వుండేవని అమరావతిశిల్పాలు చూపుతున్నాయి. విలాస, వినోదయాత్రలకు తేలికరకం బళ్లుండేవి. ఉత్సవాలలో ఉపయోగించే రథాలకు నాలుగు గుర్రాలను పూనుస్తుండినట్లు కనబడుతూంది.

పడమటి కోస్తానుంచి విదేశీవాణిజ్యం చాలవరకు అరబ్బులు, సిరియనులు, ఈజిప్టియనులు, రోమనులద్వారా జరిగేది. తూర్పుకోస్తా వాణిజ్యం దేశీయులద్వారా జరిగేది. బాక్ట్రియా, మెర్వ్, సెల్విన్షియా మొదలైన కేంద్రాలద్వారా భారతదేశపు సరుకులు చైనా, పర్షియా



మొదలైన ప్రాంతాలకు వెళ్ళేవి. సువర్ణభూమి (మలయా) వగైరా ప్రాంతాలకు వాణిజ్యం కళింగలోని దంతపురం (పాలూర) నుంచి జరిగేది. దక్షిణం నుంచి కోస్తా వెంబడి సరుకులు దంతపురానికి చేరవేసే వారు. అస్సాము ఉత్తర బర్మా, యునాన్‌ల మీదుగా చైనాతో వాణిజ్యం జరిగేదనీ, గంగానది మీదుగా చైనానుంచి తమిళ దేశంలోని దామరికకు ముడిపట్టు, పట్టుదారం, పట్టువస్త్రాలూ వచ్చేవనీ "పెరిప్లస్" పేర్కొంటూంది. చైనానుంచి బాక్ట్రియా, భరుకచ్ఛముల మీదుగా తమిళ దేశంలోని పట్టుసరుకులు వచ్చేవనీ చెప్తూంది.

భరుకచ్ఛం నుంచి రోముకు, ఈజిప్టుకు, తూర్పు ఆఫ్రికా, పర్షియన్ రేవులకు పెద్దపెద్ద ఓడలలో రాగి, చందనం, దూలాలు, సహామినాదుంగలు, ఎబనీ, కొమ్ములు, బియ్యం, గోధుమ, నెయ్యి, నువ్వులనూనె, నూలుబట్టలు, చక్కెర మొదలైనవి పెద్ద మొత్తాలలో ఎగుమతి అయ్యేవనీ, నూలు వస్త్రాలకు రోము బజారులలో చాల లాభాలు వచ్చేవనీ "పెరిప్లసు"లో ఉంది.

రోముతో జరిగే వ్యాపారానికీ, చైనా నుంచి ఆఫ్గనిస్తాన్ మీదుగా జరిగే వ్యాపారానికీ, దక్షిణానికీ, ఉత్తరానికీ కూడ మొత్తం భరుకచ్ఛమే కేంద్రంగా ఉండేది. "పెరిప్లసు" గ్రంథం వ్రాసిన నాటికి ఈ భరుకచ్ఛం సహపణుల చేతిలో ఉండేది. శాతకర్ణి (శాతవాహనులలో మూడవరాజు) కాలంలో వ్యాపార కేంద్రంగా వుండిన కల్యాణ్‌కు ప్రాముఖ్యం పోయిందనీ, ఏ గ్రీకు ఓడయినా ఆ రేవుకువస్తే బందోబస్తు కింద భరుకచ్ఛకు తీసుకెళ్ళే ప్రమాదం వున్నదనీ "పెరిప్లసు" లో ఉంది.

అంటే కల్యాణ్ వ్యాపారకేంద్రమే గాక శాతవాహన రాజ్యంలో మంచి రేవుగా కూడా వుండేదనీ, ప్రతిష్ఠానం, తగర మొదలైన దేశ మధ్యనగరాల సరుకులు ఆ రేవుమీదుగా ఎగుమతి అయ్యేవనీ, శకసత్రపులు దక్షిణాపథంలోని ఉత్తర ప్రాంతాలను స్వాధీనంచేసుకుని భరుకచ్ఛాన్ని వాణిజ్య కేంద్రంగా పెంపొందించాక కల్యాణ్ ప్రాముఖ్యం అంతరించిందనీ అర్థమవుతూంది. "పెరిప్లసు" అనంతరం అరవై ఏళ్ళకు వ్రాసిన టాలెమీ "భూగోళం"లో అసలు కల్యాణ్ పేరేలేదు.

కల్యాణ్‌కు చెందిన వర్తకులు, ఒక స్వర్ణకారుడు, ఒక కమ్మరి, మరో స్వర్ణకారుడు చేసిన దానాలను వర్ణిస్తున్న నాలుగు కన్హేరీశాసనాలను బట్టి కల్యాణ్ సంపన్నస్థితిని అర్థంచేసుకోవచ్చు.

శ్రావస్తిని కలుపుతూ శాతవాహనరాజ్యంలో సోపరారేవు వుండేది. నాసిక్, కార్లే, నానేఘాట్, కన్హేరీలలో వున్న శాసనాలు వేసినది. ఆ రేవుపట్టణానికి చెందిన ఒక వర్తకుడు, నగల వర్తకుడూ, ఒక గృహస్థూ, ఋషభదత్తుడూను.

చౌల్ అనేది మరో వాణిజ్యకేంద్రమైన రేవుపట్టణం. మండగోర అనేది చిన్న రేవేగాని, ఇక్కడనుంచి టేకు, నల్లమద్దికలప ఓడలనిర్మాణానికై ఎగుమతి అయ్యేది.

వైజయంతి అనేది మరోరేవు. గౌతమీపుత్రశాతకర్ణి విడిసిన నగరం. ఇక్కడ భూతపాలుడనే ధనాఢ్యుడు జంబూద్వీపంలోనే అతి సుందరమైన బౌద్ధ విహారాన్ని నిర్మించేడు.

తూర్పుకోస్తాలో మచిలీపట్నం అనేరేవు అందమైన మస్లినులకు ప్రసిద్ధమనీ, ఆ నగరం నుంచి చైనాకూ, దూరప్రాచ్యానికి సుందరమైన వస్త్రాలు ఎగుమతి అవుతున్నాయనీ, "పెరిప్లసు" తెలుపుతూంది.

మచిలీపట్నంనుంచి ధాన్యకటకాన్ని, శాతవాహన రాజధాని ప్రతిష్ఠానాన్ని కలుపుతూ బాటలున్నాయి. చిన్నగంజాంలో శ్రీయజ్ఞ శాతకర్ణి కాలంనాటి శాసనం వున్న స్థూపస్తంభభాగం

దొరికింది. ఈ శాసనం మోటుపల్లిరేవును పేర్కొంటూంది. అది చిన్న గంజాంకు మూడుమైళ్ళలో వుంది. మోటుపల్లి వాణిజ్యసరుకులమీద పన్నులు రద్దుచేసినట్లు రెండు శాసనాలు తెలుపుతున్నాయి.

ఇక్ష్వాకురాజు వీరపురుషదత్తుని పరిపాలన 14వ సంవత్సరంలో వేసిన ఒక శాసనం (నాగార్జునకొండ వద్ద దొరికింది) ఘంటసాలను పేర్కొంటూంది. కృష్ణానదీ ముఖ ద్వారంలో వుండడంచేత దీనికి చాలాప్రాముఖ్యం వున్నదంటాడు టాలెమీ. ఘంటసాలలో దొరికిన క్రీ.శ. 2 వ శతాబ్దపు శాసనం ఆంధ్రదేశంలో ప్రసిద్ధి పొందిన ఒక నావికుని పేర్కొంది.

కృష్ణానదిలో చాలా దూరంవరకూ పడవలమీద వర్తకం సాగేది. కోస్తా పొడుగునా, సముద్రం మీదుగా వాణిజ్యం బాగావిస్తరించింది. గూడూరు ఒక వర్తకకేంద్రంగా వుండేది. దాని సమీపంలో వున్న అల్లోసినే మంచి వర్తక కేంద్రమనీ, క్రిసే (మలయా)కి నావలు యిక్కడి నుంచే బయలుదేరుతాయని అమరావతీ శాసనం పేర్కొంటూంది.

క్రీ.శ. 68-127 కాలానికి సంబంధించిన రోమను నాణాలు కోస్తా ఆంధ్రలో పలుచోట్ల–వినుకొండ, నాగార్జునకొండ, నెల్లూరు, కడప, విజయవాడ, ఘంటసాల, సాలిహుండాంలలో దొరికేయి.

రోమనునాణేలు తెలంగాణంలోనూ దొరికేయి. మూడు సూర్యాపేటలో దొరికేయి. మరొకటి ఏలేశ్వరం తవ్వకాలలో శాతవాహనరాజు పులమావి రెండు నాణేలతో పాటు దొరికింది. ఇవీ ఇక్కడ దొరికిన ఇతరవస్తువులూ క్రీ.శ. 2 వ శతాబ్దంలో కృష్ణాతీరం రోముతో సంబంధాలుకలిగి వుండేదని రుజువు చేస్తున్నాయి.

రోముచక్రవర్తి అగస్టస్ (క్రీ.పూ. 19) నుంచి నీరో వరకు (క్రీ.శ. 68లో నీరో మరణించేడు) రోము సామ్రాజ్యంలోని ధనికులు భారతదేశం నుంచి వచ్చిన విలాసవస్తువులకోసం ఎగబడేవారు. క్రీ.శ. 70 ప్రాంతాలలో ప్లినీ ఈ దుర్వ్యయాన్ని అధిక్షేపిస్తూ రోము మార్కెట్లలో ఇండియనువస్తువులు వాని విలువకు నూరింతలు ఖరీదుకు అమ్ముతున్నాయన్నాడు. ఏటా ఈ విలాసవస్తువులకోసం 10 కోట్లసెస్టెర్సులు (11 లక్షల పౌనులు) సామ్రాజ్యం నుంచి పోతున్నవని, అందులో 5 లక్షల పౌనులు ఇండియాకే చేరుతున్నాయని ఆయన వ్రాసేరు. నీరో చక్రవర్తి మరణానంతరం రోములో అధికారం తగవులతో అంతర్యుధం చెలరేగటమూ, దుర్వ్యయం గురించి ప్రజలలో తీవ్ర వ్యతిరేకత పెరిగి, వెస్పాసియన్ రాజు విలాసవస్తువుల వినియోగాన్ని నిరుత్సాహపరుస్తూ శాసనాలు చేయడమూ, ఆయన అనుచరులు ఆ దుర్వ్యయాన్ని అణచివెయ్యడానికి కఠినచర్యలు తీసుకోవడమూతో విలాసవస్తు వాణిజ్యం తగ్గిపోయింది. విదేశీ వాణిజ్య బలంమీదనే ప్రధానంగా ఆధారపడిన శాతవాహన సామ్రాజ్యం రోమను సామ్రాజ్య పతనంతో క్షీణించసాగింది.

క్రీ.శ ఒకటవ శతాబ్ది నుంచి పారిశ్రామికంగానూ, వాణిజ్యంలోనూ ధాన్యకటకం ప్రాముఖ్యం వహించసాగింది. అనేకమంది వర్తకులు, వారి భార్యలు, అత్తరువర్తకులు, ధనాఢ్యులు, గ్రామపెద్దలు, కుటుంబ యజమానులు ఎందరో ధాన్యకటకంలో బౌద్ధస్తూప నిర్మాణానికీ విస్తరణకూ ఎంతెంతో ధనం ఇచ్చేరు.

ప్రతిష్ఠానం ఒకటీ, తగర ఒకటి పెద్ద జౌళి పరిశ్రమ కేంద్రాలనీ ప్రతిష్ఠానం నుంచి మాహిష్మతి మీదుగా ఉజ్జయిని విదిశలకు వాణిజ్య మార్గాలున్నాయనీ "పెరిప్లసు" వ్రాస్తోంది



ధాన్య కటకం చుట్టూ వున్న తీరప్రాంతాల నుంచి సరుకులు తగరకు రవాణా చెయ్యబడేవి. విదిశ బట్టలకూ, దంతపు పనులకూ ప్రసిద్ధి. ఈ ప్రదేశాలకు చెందిన వర్తకులు, ధనాఢ్యులు, వృత్తి పనులవారు చేసిన దానధర్మాలు వివిధ బౌద్ధ గుహల గోడలమీద చెక్కివున్నాయి.

వ్యాపారంతో ధనానికి ఉపయోగం వుంది. దానితో అప్పులు ఇవ్వడం, వడ్డీ వ్యాపారమూ వస్తాయి. బౌద్ధ మత గ్రంధాలు వడ్డీ వ్యాపారాన్ని, బానిస యాజమాన్యాన్ని నిరసించవు. గృహస్తులు రుణాల్ని తీర్చెయ్యాలని బుద్ధుడు బోధించేడు. రుణగ్రస్తుణ్ణి సంఘంలో చేర్చుకునేవారు కాదు. రుణ విముక్తి మనశ్శాంతి నిస్తుందని "దీఘ నికాయం" చెప్తోంది. వడ్డీ వ్యాపారమూ, దాని దుష్ఫలితాలూ గురించి జాతక కథలున్నాయి.

పారిశ్రామిక ముడిసరుకులకు దక్షిణ భారతం చాల ప్రసిద్ధికెక్కింది. ఓడల నిర్మాణానికి, వ్యవసాయ పరికరాల నిర్మాణానికీ కావలసిన టేకు, నల్లమద్ది వంటి ప్రశస్తమైన కలపతో పెద్దపెద్ద నౌకలు భరుకచ్ఛంనుంచి పర్షియన్ సింధు శాఖలోని ఒమాన్‌కు వెళ్ళేవని "పెరిప్లస్" చెప్తోంది. చేరరాజ్యంలో మంచి ఇనుము తయారయ్యేదని ప్లినీ వ్రాస్తున్నాడు. హైదరాబాదు నుంచి ఇనుము పంజాబుకూ, పెర్షియాకూ తీసుకెళ్ళి ఉక్కు తయారు చేసేవారనికూడా "పెరిప్లసు" వ్రాస్తోంది. దక్షిణాన తయారుచేసిన 'వూజ్' ఉక్కు, రాగి 2వేల ఏళ్ళ క్రితమే పశ్చిమదేశాలకు (అలోలోగస్, ఒమాన్‌లకు) ఎగుమతి అయ్యేవి.

దక్షిణ భారతం నుంచి ఎగుమతి అయ్యే రత్నాలను, మణులను సీజరు మొదలైన రోమను చక్రవర్తులు సేకరించేవారు. నర్మద తూర్పు తీరాన రత్నాలు దొరుకుతాయని టాలెమీ వ్రాసేడు. కృష్ణా, గోదావరీ, భీమనదులలోనూ, బిజాపూర్ వెల్లడి భూములలోనూ రత్నాలు, కురువింద, గోమేధిక మొదలైన విలువైన రాళ్ళు దొరికేవని బాల్ వ్రాస్తున్నాడు.

అగస్టసు చక్రవర్తికి దక్కను రాజు పంపిన నజరానాలతో వస్తున్న ఒకదూతను సిరియా రాజధాని అంటియోక్‌లో చూశానంటూ నికొలాస్ డామెస్కానోస్ అనే రచయిత తనకు వ్రాసేడని స్ట్రాబో వ్రాసేడు. ఆ బహుమతులలో ఎన్నో నగలు, మణులు ఏనుగులు వున్నాయని రోమను చరిత్రకారుడు ఫ్లోరసు వ్రాసేడు. ఆ దక్కను రాజు శాతవాహన కుటుంబీకుడే అయివుంటాడని ప్రొ. సాలెటోరే వ్రాస్తున్నారు.

శాతవాహనుల వాణిజ్య సంబంధాలు మన పురాణాలలో వర్ణించిన భూగోళవిషయాలను చాలా ప్రభావితం చేశాయి. పురాణాలలో స్థల దేవతలూ, జలదేవతలూ అంటూ ఇచ్చిన వర్ణనల ఆధారంతో 1801లో లెఫ్టినెంట్ ఫ్రాన్సిస్ విల్ఫర్డ్ అనే ఆయన ఒక దేశ పటాన్నీ, "హిందువుల ప్రాచీన గ్రంధాలనుంచి కాళీ లేక నైలునది పక్కనే ఉన్న ఈజిప్టు తదితర దేశాల గురించిన సమాచారం" అంటూ ఒక వ్యాసాన్నీ, "ఏషియాటిక్ రీసెర్చెస్" 3లో ప్రకటించేడు. 60 ఏళ్ళ తరువాత జె. హెచ్. స్పెకే అనే ఆయన ఆ దేశపటం ఆధారంగా వెళ్ళి నైలునది జన్మస్థలాన్ని తెలుసుకొన్నాడు. పురాణాలలో చెప్పినట్లు ఆ నది పుట్టిన విక్టోరియా సరస్సును స్థానిక ప్రజలు నేటికీ అమర సరస్సనే పిలుస్తారనీ, పురాణాలలో వ్రాసిన చంద్ర పర్వతం ఒక స్థానిక ప్రజలు అదే పేరుతో పిలిచే పర్వతం వున్నదనీ, ఇతర స్థలాల ఆఫ్రికను పేర్లు కూడా సరిగ్గా అల్లాగే వున్నాయనీ వ్రాసేడు. ఈ హిందువులు చెప్పినవి విని వానినే ఈజిప్టు చరిత్రకారులు అదంతా తమ తెలివిగా ప్రదర్శించారంటూ స్పెకే వ్రాసేడు. "ఈ మండలంలోని నదీ జలాల సమాచారం మనకు తెలిసిందంతా ప్రాచీన హిందువుల నుంచి వచ్చిందే" అన్నాడు.

ఈ విధంగా శాతవాహనుల కాలంలో స్థల పరిశీలనా, అన్వేషణా ఉచ్ఛస్థాయిలో జరిగిందని చెప్పాలి. దీనికి తోడ్పడినవి దేశీ, విదేశీ వాణిజ్యాలు. కాని తర్వాత స్వయంపూర్ణ గ్రామ వ్యవస్థ బలపడినకొద్దీ ఆ సాహసయాత్రోత్సాహం వెనక బట్టింది.

క్రీ.పూ. 6వ శతాబ్దినుంచీ భారతదేశంలో కర్షపణం ఒక నాణెంగా వుంది. వెండి కర్షపణం నాసిక్ శాసనంలో ఉదహరించబడింది. అది అనేక భాగాలు, అంశాలుగా కూడ వాడుకలో వుండేది. అయితే అన్నింటికీ అదేపేరు. వెండికర్షపణం బరువు 32 రతులు (రతి–1.75 గ్రెయిన్లు). రాగి కర్షపణం బరువు 80 రతులు. మౌర్య సామ్రాజ్యం ఒక్కమారుగా విచ్ఛిన్నంకావడంతో వాణిజ్యం, పరిశ్రమలు కంగుతిన్నాయి. వ్యాపారమార్గాలు పలురాజుల పెత్తనాలకిందికి వచ్చేయి. దానితో స్వేచ్ఛావాణిజ్యం భగ్నం అయింది. దేశీయ నాణెమును కూలగొట్టడంకోసం, వాయువ్య భారతదేశం మీద అధికారంలోవున్న ఇండో–గ్రీకులు బాక్ట్రియానుంచి వెండిని తెప్పించడం ఆపేసేరు. అయితే ఉత్తరానా, దక్షిణానా కూడ దేశీపాలకులు రాగితోనూ, సీసం తోనూ నాణేలు వేశారు. దేశీయ వాణిజ్యం సాగడానికి అవి చాలు. మరల కొన్నాళ్ళకు దండ యాత్రల ఖర్చులకూ, దేశంలో మారకాన్ని సరియైన స్థితిలో వుంచేందుకూ విదేశీయరాజులు వెండితోనూ, రాగితోను మరల నాణేలు ముద్రించ సాగేరు. దేశీభాషలలో ముద్రించి, మత సంబంధమయిన సంకేతాలు ముద్రించే ఆ నాణెములను వారు ప్రాచుర్యంలోకి తెచ్చి స్థిరపరిచేరు.

మొదటిశాతవాహనుల రాజ్యకాలంలోను, క్షహరాతులు ఆక్రమించిన మొదటి రోజులలోనూ పశ్చిమ దక్కనులో పరిశ్రమలూ వాణిజ్యమూ బాగా అభివృద్ధి చెందేయనడానికి నాగనికరాణి నానేఘాట్‌లో వేయించిన శాసనమూ, నహపణుల వెండినాణేలు నిక్షేపాలలో అత్యధికంగా దొరకడమూ, రుషభదత్తుడు బ్రాహ్మణులకూ, పరివ్రాజకులకూ 70వేలు, 3 వేలూ కర్షపణములు దానంచేయడమూ రుజువులు. గౌతమీపుత్ర శాతకర్ణి నహపణులను అణచివేశాక వారువేసిన నాణేలనే తిరిగి తనపేర ముద్రించి చలామణీలో పెట్టేడు. అయితే శాతవాహన రాజ్యంలో నిత్య చలామణీలో వున్నవి సీసపునాణేలే. "దక్షిణదేశాన వెండి దొరకదు. కనక ఇంక సీసం నాణేలనుపయోగించాలి. దానితోనే శాతవాహనులు ఉత్తరాన వాడకంలోవున్న రాగినాణేలతోనూ, పశ్చిమాన చలామణీలోవున్న వెండినాణేలతోనూ మార్పిడి వ్యవస్థను సరియైన స్థితిలో నిర్వహించే"రంటారు బి. శ్రీవాస్తవ తమ 'ట్రేడ్ అండ్ కామర్స్ ఇన్ ఏన్సెంట్ ఇండియా'లో.

ఆనాడు నిత్యవ్యవహారంలో వెండినాణాల వుపయోగం చాల తక్కువ. శ్రమ యొక్క ఉత్పాదకశక్తి హీనంగా వున్నప్పుడు వెండి బంగారాలను మార్పిడికై వుపయోగించడం అర్థరహితం. వెండి నాణేలను కరిగించి ప్రజలు నగలకూ, దేవాలయాల ఆస్తిగానూ వుపయోగించారు. అందుకే శాతవాహనులు సీసంతోనూ, రాగి మిశ్రమంతోనూ నాణేలు వేశారు. దీనిని బట్టి మార్పిడిసరుకుల వుత్పత్తి దక్షిణదేశంలో బాగా స్థిరపడిందనే చెప్పాలి. అయినా శాతవాహనులు తమ ఉద్యోగులకు వేతనాలు నాణెంతోగాక వస్తురూపంలో చెల్లించేవారు. రివెన్యూ వుద్యోగులకు జీతాలుగా భూములు యిచ్చేవారని 'మనుధర్మశాస్త్రం' చెప్తోంది. మారకపు సరుకుల వుత్పత్తి బాగా పెరిగినా, వస్తుమార్పిడి పద్ధతే పల్లెటి ప్రాంతాలలో నడుస్తోంది.

మనదేశంనుంచి తీసుకెళ్ళిన సరుకులకు ఎదురు తాము పంపేవి విశేషంగా లేవు గనక రోమనువర్తకులు మనకు బంగారునాణేలలో విలువ చెల్లించేవారు. క్రీ.శ. ఒకటవ శతాబ్దికి



చెందిన రోమను బంగారునాణేల నిక్షేపాలు భారతదేశంలో 68 దొరికేయి. వానిలో 57 దక్షిణాన దొరికినవే. అందుకే భారతదేశంతోడి వాణిజ్యంవలన బంగారం అంతా వెళ్ళిపోతూందని ప్లినీ అన్నది. రోమను పార్థియను వర్తకులు తమ బంగారు వెండి , నాణేలను దేశీ నాణెములకు మార్చుకుంటున్నారని అపొల్లోనియస్ వ్రాశాడు. ఈ బంగారు వెండి నాణాల వుపయోగం నిత్యవ్యవహారంలో లేదు. కనక ప్రజలువానిని కరిగించేసి నగలు చేయించుకొనేవారు. ఈ విధంగా దేశంలోంచి బంగారం పోతున్నదని నీరో బంగారునాణెంలో కల్తీ కలిపేడు. ఇంక వెస్పాసియస్ బంగారం ఎగుమతులు నిషేధించేడు. మేలిమి బంగారునాణాలను యివ్వడానికి లేక రోమను వర్తకులు భారతదేశంతో వర్తకం తగ్గించేరు. తవ్వకాలలో బయల్పడిన విషయాలు, నాణాలు దీనికి సాక్ష్యంగా వున్నాయి.

దేశ జీవితంలో వణిజ శ్రేణులు ముఖ్య పాత్రను నిర్వహించేయి. వ్యాపారుల్ని "వణిజులు" అనీ, శ్రేణీ సభ్యుడిని "నిగమ" అనీ అనేవారు. కొందరు వర్తకులకు "గాహపతి" అనే బిరుదు శాసనాలలో కన్పిస్తోంది. "సెట్టి" అనేది వణిజులలో ప్రభుత్వ ప్రతినిధికి బిరుదం. "మహాశ్రేష్ఠి" (ప్రభుత్వ ఉన్నత కోశాధికారిగా టి. రైస్‌డేవిడ్స్ అనువదిస్తున్నారు) వేరువేరు శ్రేణుల మధ్య తగవరిగా వ్యవహరిస్తారు. ఇద్దరు మంత్రులకూ శ్రేణీ ప్రముఖునికీ మధ్య తగవును ఒక జాతకకథ వివరిస్తోంది. వృత్తి శ్రేణులు స్థిరత్వంగలవి. కాని వణిజ శ్రేణులు తాత్కాలికం. భద్రతలేని ప్రదేశాలగుండా వెళ్ళవలసి వస్తే వర్తకులు బిడారులుగా ఏర్పడేవారు. విదేశీ వాణిజ్యానికై నలుగురు కలిసి ఓడలు కుదుర్చుకొనేవారు. పరివ్రాజకులకు వర్తకులు చేసిన ధర్మాలను గుహాశాసనాలు పేర్కొంటున్నాయి. ప్రతి శ్రేణికీ ఒకకమిటీ నాయకత్వం వహిస్తుంది. దానికో అధ్యక్షుడుంటాడు. పెట్టుబడులను వాటాదార్లు సమకూర్చుకొని కలసి పనిచేసి లాభాలు సంపాదించేవారని జాతకకథలు తెలుపుతున్నాయి. వాణిజ్యావసరాలకై దీర్ఘ కాలంపాటు దూరదేశాలలో వుంటున్న వణిజుల భార్యలు, ప్రేయసుల దుస్థితిని "గాధాసప్తశతి"లో శ్లోకాలు ఎన్నో వివరిస్తున్నాయి.

## బౌద్ధమతం పాత్ర

తన అహింసావాదంతో బౌద్ధమతంతో వ్యవసాయం వాణిజ్యం పరిశ్రమలు అభివృద్ధి పొందడానికి ఎల్లా తోడ్పడిందో పైన చెప్పేను. దక్షిణాన బౌద్ధగుహలకూ, వర్తక మార్గాలకూ వున్న సన్నిహిత సంబంధం చూశాక ఒక ముఖ్యమైన ప్రశ్న తోస్తుంది. వర్తక, వాణిజ్యాలలో బౌద్ధారామాలు ఎంతవరకు పాల్గొన్నాయి? ప్రథమంలో పరివ్రాజకులు బిడారులతో కలిసి వెళ్ళేవారు. బాటల కూడలులలో మత బోధకు మంచి అవకాశాలుంటాయి. రెండోది–వివిధ ప్రాంతాలలో జంతుబలుల్ని నిలుపు చేయడం వారి ప్రధాన లక్ష్యం. బౌద్ధగుహలున్న ప్రదేశాలన్నీ అంతక్రితం శక్తి పూజా కేంద్రాలే. క్రీ.పూ. 150 నాటికే ఉచ్ఛస్థితిలో వున్న వారి గుహాలయాలు క్రీ.శ. 7వ శతాబ్దంనాటికి సంపదలు సమకూర్చుకున్నాయి. వానికి ముఖ్యంగా విరాళాలిచ్చినది బిడారువర్తకులు అని శాసనాలు తెలుపుతున్నాయి. వినయ నిబంధనలకు ఆస్తి వుండరాదని చెప్పినా, బౌద్ధవిహారాల అధీనంలో అత్యధికసంపదలు సమకూడినట్లు పురావస్తుసాక్ష్యం తెలుపుతూంది. మూల సర్వాస్తివాదులూ, మహాసాంఘికులూ వినయ నిబంధనలను మార్చేసినట్లు కనిపిస్తుంది. రుషభదత్తుడు సంఘానికి శాశ్వత విరాళాలిచ్చేడు. ఆ ధనం వృత్తి శ్రేణులవద్ద

వుంచేడు. దానిని తిరిగి ఇవ్వనక్కర్లేదు. ఆ ధనంమీద వడ్డీ పరివ్రాజకుల అవసరాలకోసం శాశ్వతంగా వినియోగపడుతూంటుంది.

క్రీస్తుశకానికి ముందు 200 ఏళ్ళూ, తరవాత 300 ఏళ్ళూ కృష్ణాతీరంలో బౌద్ధమతానికి ఎంత పలుకుబడి వున్నదో అమరావతీశాసనాల్ని బట్టి తెలుస్తుంది. అనేకమంది కుటుంబీకులు భార్యలు, పిల్లలు, అల్లుళ్ళు, కోడళ్ళతోసహా, పెద్దపెద్ద వర్తకులు, ధనాఢ్యులు, సన్యాసులు, సన్యాసినులు, వివిధ వృత్తులవారు, వుద్యోగాలవారు, ఒక్కొక్కప్పుడు మొత్తం పట్టణమే ఓ స్తంభానికి, ఓ దూలానికి, ఓ మెట్టుకోసం విరాళాలు ఇచ్చినట్లు అమరావతి స్థూపంమీది శాసనాలు తెలుపుతున్నాయి. పాటలీపుత్రంనుంచి వచ్చిన ఒక పరివ్రాజకుడు, ఒక తమిళదేశీయుడు, వాకాటక కుదురుకు చెందిన ఒక గృహస్థు ఇల్లాగే ఎందరో స్థూపానికి ధనం ఇచ్చినట్లు అవి చెప్తున్నాయి.

కాలక్రమంలో బౌద్ధమతంకూడా ఎన్నో పరివర్తనలు పొందింది. గుడ్డపీలికలతో కుట్టిన అంగీ వేసుకోవాలని పరివ్రాజకునికి విధి. అటువంటిది సిల్కుదుస్తులు, ఖరీదయిన జాబరారంగు వేసినవి ధరిస్తున్నారు. సుఖ సమృద్ధులతో కూడిన జీవితాన్ని సమర్థిస్తూ మహాయానం వచ్చింది. బుద్ధుని అవశేషాల్ని పూజించడం, బుద్ధుని పూర్వజన్మలంటూ జానపద గాథల్ని విశ్వసించడం వచ్చింది. బౌద్ధమతంలో చీలిక రాకముందే ఆటవికులికి, పారిపోయివచ్చిన బానిసలకు, నేరస్థులకు సంఘంలో ప్రవేశం నిషేధించబడింది. బుద్ధుడు దేవుడే అయాడు. మహాసాంఘికులు తమకువచ్చిన విరాళాల్ని తామే వడ్డీకి తిప్పడం ప్రారంభించేరు.

కార్లేలోనూ, ఇతర విహారాలలోనూ గాలీ, వెలుతురూ చొరకుండా, దృఢమైన తలుపులూ, గడియలతో కట్టిన లోపలిగదులు కనిపిస్తాయి. విలువయిన వస్తువులు దాచడానికి కట్టిన కొట్టుగదులు ఇవి.

ఈ విహారాలు బిడార్లుకు రుణాలిచ్చేవి. వానికిగల పవిత్రత వానికెంతో ప్రతిష్ఠను కూర్చిపెట్టింది. వాని సంపదలను ప్రభువులు స్వాధీనపరచుకోకుండా కాపాడింది. పైగా దేశ ఆర్థికాభివృద్ధికి ఎంతో సాయంగా వుండడంచేత వానికి ప్రభువులే ఎంతెంతో ధనం యిచ్చేవారు. బౌద్ధారామాలలో చేరిన ధాన్యాన్ని కష్టసమయాలలో దానధర్మాలకు వినియోగించడంచేత ఆటవిక తెగలూ, కొత్తగా వలస వచ్చినవారూ వానియెడ ఎంతో గౌరవ ప్రపత్తులు కలిగి వుండేవారు.

అమరావతి, నాగార్జునకొండ విహారాల చరిత్ర ఎంతో సంక్లిష్టమైనదిగా కనబడుతుంది. కృష్ణానదీ తీరానికి బౌద్ధమతం చేరేనాటికి అది ఒక తరహా మిశ్రమహీనయానం. బుద్ధుని పూజించడం ప్రథమంలో వారి ఆలోచనలలో లేదనడానికి సాక్ష్యం వుంది. కాని నూరేళ్ళలోపున మొత్తం అంతా మారిపోయింది. రెండుమూడు శతాబ్దాల నాటికి మహాయాన బౌద్ధానికి అతి దగ్గరగా ఉన్న మహాసాంఘికశాఖ ప్రాముఖ్యానికి వచ్చింది.

మతాచార్యులకూ, లౌకిక ప్రజానీకానికి మధ్య వైషమ్యాలే హీనయాన, మహాయానాల మధ్య పేచీకి మూలం. శ్రమణులకే గాక, బౌద్ధ మతానుయాయులయిన ప్రతి ఒక్కరికీ మతానుసరణ ఫలితమైన నిర్వాణం లభిస్తుందని మహాయానం ఉద్బోధిస్తుంది. అంటే గృహస్థు కూడా నిర్వాణాన్ని సాధించవచ్చు. ఉన్నతులు, హీనులు అనే భేదం అక్కడ పనిచెయ్యదు.

అమరావతి శాసనాలను బట్టి మహా సాంఘిక పంథాలోనే అనేక శాఖలున్నాయి



తెలుస్తూంది. మహావని సెలియ (ఇదీ, నాగార్జున కొండలోని అపర మహావని సెలియా ఒకే మాదిరివి), పూర్వ సెలియ, అపరసెలియ, రాజశిల చైత్య లేక చైత్యవాద, సిద్ధాతిక లేక సిద్ధార్థిక, ఇంకా ఎన్నో. నాగార్జునకొండ శాసనాలు అపర మహావని సెలియ, పూర్వ సెలియ, అపర సెలియ, బహుశ్రుతీయ మొదలైన వానిని పేర్కొంటున్నాయి. ఆంధ్రదేశానికి చెందిన మహాసాంఘికులను అంధకులనేవారు.

మహాసాంఘిక పంథా బుద్ధుల్నీ, బోధిసత్వుల్నీ, అసంఖ్యాక దేవతల్నీ సృష్టించింది. ఆది బుద్ధుడు, ధ్యానబుద్ధులు, శక్తులు, స్వర్గసీమలోని బోధిసత్వులు, భూలోకంలో బోధిసత్వులు వారి జన్మాంతరాలు, దేవతలు, వారి భార్యలు, ఇంకా ఎందరెందరో. వారిలో ఆంధ్రులకు అతిప్రియులు గౌతమ బుద్ధుడు, సంపదల అధిదేవత జంభాల, అవలోకితేశ్వరులు.

బౌద్ధమతంయొక్క పాత్రలో వచ్చిన మార్పే పైమార్పునూ తెచ్చింది. గాంధారంనుంచి అజంతా, అమరావతి వరకూ బౌద్ధగుహారామాలలో అతిసుందర విగ్రహాలు కనిపిస్తున్నాయి. కేవలం పరివ్రాజకులు మాత్రమే నివసించేవి, సందర్శించేవీ ఐతే ఆ చిత్రాలు కేవలం అసంగతంగానే వుంటాయి. కాని భవిష్యత్తుమీద ఎన్నో ఆశలు పెట్టుకొని సుందర దృశ్యాలను చిత్రించుకుంటున్న ప్రజా సామాన్యానికి నచ్చేవి అంగాంగ సౌష్ఠవం, సుందరమైన వస్త్ర భూషాద్యలంకారాలూ గల విగ్రహాలే.

తెగల నాయకుల్ని అసంఖ్యాక నియమ నిబంధనల నుంచి విముక్తుల్ని చేసి, నూతన వర్ణవ్యవస్థలోకి ఇరికించి, దానికి మత సిద్ధాంతాల ఆశీర్వాదం కలిగించిన బ్రాహ్మణులను రాజులు ఎంతో గౌరవించేరు. క్రీ. పూ. 150 ఏళ్ళనాటి శాతవాహన శాసనాలలో యజ్ఞయాగాదులను గురించీ బ్రాహ్మణుల కిచ్చిన అపార దానాల గురించీ చదువుతాము. ప్రథమ శాతవాహన రాజులూ, వారి ప్రతిస్పర్థులైన విదేశీయులూ కూడా పోటాపోటీలుగా వైదికమతాన్నీ బౌద్ధమతాన్నీ కూడా ఆదరించేవారు. ప్రజల అపరిణత మనస్థితికి సరిపడే శివుడు, పార్వతి, కృష్ణుడు, గణేశుడు మొదలైన అసంఖ్యాక దేవీ దేవతలు పురాణాల కెక్కారు. చివరకు బుద్ధుణ్ణి కూడా ఓ అవతారం చేశారు. చేప, పంది, గుర్రం, తాబేలు మొదలైన కులదేవతల్ని అవతారాలుగా మార్చేరు. ఈ అనాగరిక ప్రజల దేవతల్ని స్వీకరించడంలో వైదిక మతంవారి సంస్కృతిని ఇముడ్చుకోవడం కనబడుతుంది. వీరందరినీ మహాయాన బౌద్ధ మతమూ లీనం చేసుకుంది. శివ, గౌరి, గణేశ, కృష్ణుల ప్రసక్తి గాథాసప్తశతిలో చూస్తాం. పక్కపక్కనే సూర్యుణ్ణి, బుద్ధపాదాల్నీ, అసంఖ్యాక గ్రామదేవతల్నీ పూజించడం చూస్తాం. అందుచేత, రాజు హిందువా, బౌద్ధుడా అనే ప్రశ్నకు అర్థం లేకుండా పోయింది. రాజులూ, రాణులూ, వుద్యోగులూ సామాన్య ప్రజలూ ఒక వేపున పరివ్రాజకుల్ని పూజిస్తారు. ఆరామాలు, విహారాలకు ధనం ఇస్తారు. రెండో వేపున గ్రామదేవతలకు బలులిస్తారు. కులదేవతలకి పూజలూ చేస్తారు. ఈ విధంగా రెండు విభిన్న తాత్వికధోరణులు ఘర్షణ లేకుండా సహజీవనం చేయగలిగేయి.

ఆంధ్రదేశం చైనా, మలయా, సుమత్రాలతో వ్యాపారసంబంధాలు కలిగివుండేదని, దక్షిణ మండలాలనుంచీ వచ్చే సుగంధ ద్రవ్యాలు, చందనం, ముత్యాలూ, మలయాలోని తకోలానుంచీ, కలహా (సుమత్రా) నుంచీ వచ్చే బంగారం మొదలయినవీ, తూర్పు సముద్రాలనుంచివచ్చే పగడాలూ, చైనా నుంచి వచ్చేకర్పూరం సిల్కులూ తదితరాలూ ఆంధ్రదేశపు బజారుల్లో దొరికేవనీ టాలెమీ గ్రంథం చెప్తూంది. టాలెమీ గ్రంథంలో కనిపించే

భౌగోళికనామాలు ఎన్నో తెలుగు పేర్లకు దగ్గరలో వున్నాయి. ఆరకాన్ రాజధాని శ్రీలింగ సయాం సముద్రశాఖలోని కాకుళ, అమరావతి, విజయ, కౌతర, సింహపుర (సింగపూర్), కళింగ (పెరూ కోస్తా ప్రాంతం) మొదలైనవెన్నో. కోరమాండల్ తీరం నుంచి వచ్చే వారందరినీ 'కళింగ' పేరుతో పిలుస్తారని టాలెమి పుస్తకం చెప్తుంది. మహానదికీ, గోదావరికి మధ్య ప్రాంతాలను కళింగమనేవారు. జావాలోని సుప్రసిద్ధ బోరోబుదూర్ స్థూపం అమరావతీస్థూపం నమూనాలో కట్టిందే. ఈనాడు జావా అంటున్న ద్వీపాన్ని క్రీస్తుశకారంభంలో కళింగ అనేవారు. అదే పేరుగల రెండు పట్టణాలు ఆ దీవిలో వుండేవి. ఆంధ్రుల విస్తరణ అనేక ఆటవిక తెగల్ని నాగరికుల్ని చేసింది. కొత్తమతం, కళలు, సాహిత్యం ఇచ్చింది. ఒక ఉన్నత జీవితం కోసం ఉత్సాహం కలిగించింది.

సుమత్రా, దక్షిణజావా, సయాం, అన్నాంలలో దొరికిన అనేక బుద్ధవిగ్రహాలు రాతితో మలచినవీ, కంచువీకూడ లక్షణాలలోనూ శిల్పంలోనూ క్రీ.శ. 2వ, 3వ శతాబ్దాలనాటి అమరావతి శిల్పాలను పోలివున్నాయి.

## ప్రజల నమ్మకాలు, ఆచారాలు

వ్యవసాయం అభివృద్ధి పొందడానికి బాగా వత్తాసునిచ్చిన బౌద్ధమతాన్ని ప్రజలెంత అభిమానించేవారో బౌద్ధవిహారాలకూ, ఆరామాలకూ అన్నితెగల ప్రజలిచ్చిన అపార కానుకలే సాక్ష్యం. దక్షిణభారతంలోని తెగలన్నింటిలో నాగతెగ బౌద్ధమతాన్ని బాగా అభిమానించింది. ఆంధ్ర సంస్కృతిలో బాగా లీనమయిపోయిన తెగలలో నాగులొకరు. కన్నబెన్న (కృష్ణానది) ప్రాంతమే నాగలోకమని శంఖపాల జాతకం తెలుపుతూంది. అమరావతి, నాగార్జునకొండ శిల్పాలలో రాజుల, రాణుల శిరోవేష్టనాలమీద పాము పడగలుండడం వారు నాగజాతివారనడానికి నిదర్శనం. సింహళ రాజకుమారుడు బుద్ధుని దంతాన్ని తీసుకెళ్లిన కథలో కృష్ణానదీ ముఖద్వార ప్రాంతపు నాగరాజా ప్రసక్తి వస్తుంది. అమరావతీ శిధిలాలలో "నాగబు" అనేమాటవున్న రాతి పలక దొరికింది. హాలుని రాజ్యకాలంలో పైశాచీ భాషలో "బృహత్కథ" వ్రాసేడని చెప్పే గుణాఢ్యుడు ఒక నాగరాజుకి బ్రాహ్మణకన్యవలన కలిగిన సంతానం. శాతకర్ణి భార్య నాగనిక నాగజాతి పడుచు.

ఆంధ్రలో బౌద్ధమతం బాగా వ్యాపించడానికి తోడ్పడినది సముద్ర వ్యాపారం. అమరావతి, నాగార్జునస్థూపాల నిర్మాణానికి వర్తకులధనం వుపయోగపడింది. ఇవిగాక రామతీర్థం, శంకరం, శాలిహుండం, కొడవలి, ఆరుగొలను, గుంటుపల్లి, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి, అల్లూరు, బెజవాడ, గుడివాడ, ఘంటసాల, గరికిపాడు, గోలి, పెదమద్దూరు, చినగంజాం, పెదగంజాం, కనుపర్తి, భట్టిప్రోలు, కొండాపురం – ఇంకా ఎన్నో ప్రదేశాలలో బౌద్ధనిర్మాణావశేషాలు దొరకడం ఆంధ్రలో బౌద్ధమతం ఎంత వ్యాప్తి చెందిందో తెలుపుతుంది.

తెలంగాణాలోకూడ బౌద్ధమతానికి విశేషాదరమే వుంది. బౌద్ధనిర్మాణావశేషాలయిన మృణ్మయపాత్రలు, ఇటికలు, సున్నపురాయి నాగారం, యేలేశ్వరం, పనిగిరి, గాజులబండ, తిరుమలగిరి, సింగారం, వర్ధమానుకోటలలో దొరికేయి. పెద్దపెద్ద ఇటికల ఆవం నాగారంలో దొరికింది. శిల్పాలు, కుండబొమ్మలు పనిగిరిలోనూ, గాజులబండలోనూ దొరికేయి. ఈ అవశేషాలన్నీకూడ రమారమి క్రీ.పూ. ఒకటవ శతాబ్ది నాటివే. క్రీ.శ. రెండు మూడు శతాబ్దాలనాటి రాతిచెక్కడాలు అశ్వారావుపేట సమీపంలోని కోరుకొండలో కనిపించేయి. ఇవి



మహాయాన పంథాకు చెందినవి.

అమరావతిలో స్థూపాలు, బోధివృక్షం, బుద్ధుని పాదముద్రలు, ధర్మచక్రం, బుద్ధుని, ఆయన శిష్యుల భౌతికావశేషాలు, వాస్తవ ప్రమాణంలోవున్న బుద్ధమూర్తులు, నాగరాజుగా మూర్తీభవించిన బుద్ధవిగ్రహం ఆరాధించబడేవి. మొదటిరోజులలో బుద్ధుని రూపారాధన లేదు. ఆయనకు సంకేతాలైన వస్తువుల్ని పూజించేవారు. వానికీ వస్త్రాలు పుష్పాలు, కలశాలతో తెచ్చిన జలం సమర్పించేవారు. బౌద్ధకేంద్రాలకు తీర్థయాత్రలు వెళ్ళడం సర్వసామాన్యం. నాగారాధన బౌద్ధమతంలో బాగా వేళ్ళుపాతుకుంది. స్థూపాలను పాము చుట్టుకుని వున్నట్లు నిర్మించడం, నాగరాజులు, రాణులూ స్థూపాలకు పూజచేయడం, బుద్ధుని బోధనలు వినడం, పడగకింద పాముచుట్టమీద బుద్ధుడు కూర్చుని వుండడం వంటి చిత్రాలు నాగార్జునకొండ, అమరావతి శిల్పాలలో తరచుగాక కనిపిస్తాయి. హీనయానానికి చెందిన ప్రారంభకాలపు పంథాలలో ఒకటయిన చైత్యవాదం అమరావతి శాసనాలలో నాలుగుచోట్ల ప్రసక్తమయింది.

దక్కను పశ్చిమభాగంలో క్రీ.శ. ఒకటి, రెండు శతాబ్దులలో బౌద్ధమతం చాల ఉచ్ఛస్థితిలో వుండేది. అక్కడ భద్రాయనిక, ధర్మోత్తరీయ, మహాసాంఘిక అపరాజిత సిద్ధగాన పంథాలు ప్రధానంగా వుండేవి. వీటి అనుచరులు గుహాలయాలలో కలిసే జీవిస్తుండేవారు. రుషభదత్తుడు అన్ని పంథాలవారినీ గౌరవించేవాడు. గౌతమపుత్ర శాతకర్ణి మహాసాంఘిక పంథావారినీ, రెండో పులమావి భద్రాయనికుల్నీ అభిమానించేరు.

పరివ్రాజకులు, పరివ్రాజినులు ఏడాది పొడుగునా తీర్థ యాత్రలలోనే గడిపేవారు. వర్షాకాలంలో మాత్రం గుహాలయాలలో వుండిపోయేవారు. వీనిని విహారాలంటారు. ముందొక వరండా, దాని వెనుకనొక చావడి, చావడికి మూడువేపుల గదులుగా యీ విహారాలు పర్వతాన్ని తొలచి నిర్మిస్తారు. ఈ విహారంలో భాగంగానేకాని, దానిప్రక్కనేగాని భోజనశాల, విశ్రాంతిమందిరం తొలుస్తారు. దాని చివరలో చైత్యం. దానిలో పూజాస్థానంలో స్థూపాకారం. ఈ స్థూపం అన్నది గుండ్రని మట్టిదిబ్బ. దానిలోపల బుద్ధునిదో, ఆయన మహనీయ శిష్యునిదో భౌతికావశేషం వుంటుంది. లేదా ఒక పవిత్ర స్థల చిహ్నం వుంటుంది. చైత్యనిర్మాణం మహాపుణ్యకర్మ. ఆ పని నిర్వాణానికి సన్నిహితుణ్ణి చేస్తుందని విశ్వాసం.

క్రీ.శ. రెండవ శతాబ్దిలో మహాయానపంథా విస్తరించేక బుద్ధుని పాత్రే మారిపోయింది. మనుష్యునికి నిర్మాణపంథా బోధించిన సాధుమానవుడుగా గాక మానవజాతి ఉద్ధరణకు వచ్చిన అవతారపురుషుడుగా భావించసాగేరు. చిన్నప్పుడే ఆయనలో ఉన్నత, ఉత్తమ గుణాలు ఎల్లా ప్రకటిత మయాయో ఉద్ఘాటిస్తూ ఆయన జీవిత చరిత్ర వ్రాసేరు. ఈ ప్రపంచం మాయతో నిండినదనే నూతన తాత్వికాలోచన వచ్చింది. తత్వ విచారానికీ, యోగానికీ అధిక ప్రాముఖ్యం ఇవ్వసాగేరు. అంతక్రితపు నిరాడంబర జీవిత నియమాలను పక్కకు పెట్టేరు.

మహాయానపంథా ప్రబోధించిన ఆచార్య నాగార్జునుడు శ్రీపర్వతం మీద క్రీ.శ. రెండవ శతాబ్దిలో జీవించేడు. ఆయన ఖగోళ శాస్త్ర వేత్తగా ప్రసిద్ధి పొందాడు. సుశ్రుతాన్ని సంస్కరించేడు. 'ఆరోగ్యమంజరి' వ్రాసేడు. గొప్ప విషవైద్యుడని బాణుడు ప్రశంసించేడు. ఆయన వ్రాసిన 'రసరత్నాకరం' ఆయనను భారతీయ రసాయన శాస్త్ర పితామహస్థానంలో కూర్చోబెడుతూంది. బట్టీపద్ధతినీ, భస్మాలు తయారుచేసేపద్ధతినీ కనుక్కొన్నవాడు. బంగారం చేయడానికై ఆయన చేసిన కృషి సుప్రసిద్ధం. శ్రీపర్వతం మీదనున్న ఆయన విహారం గొప్ప శాస్త్ర సాంకేతిక

విద్యాలయంగా అభివృద్ధి పొందింది. దానిలో చదువుకొనడానికై దేశదేశాల నుంచి విద్యార్థులు వచ్చేవారు. ప్రప్రథమంగా ఆయన తత్వవేత్త. మహాయాన బౌద్ధమత ప్రవక్త. ఆయన తాత్విక పంథాను శూన్యవాదం అంటారు. "ఈ ప్రపంచం పూర్తిగా యధార్థం కాదు. అయదార్థమూ కాదు. అది నిత్యంకాదు, స్వయం అస్తిత్వం గలదేదీలేదు" ఇట్లాగే నడుస్తుంది. "పుట్టుక-చావు, రాక, పోక, ఇవేవీ సత్యంకావు" కాని అవి అనేక అభిమాన దురభిమానాలకు మూలం అవుతున్నాయి. అశాంతికీ, దుఃఖానికీ అవే మూలం. మనుష్యుడు వానిని అంటిపెట్టుకొని వున్నంతకాలం అతను సుఖదుఃఖాల ననుభవిస్తూనే వుంటాడు. అనుబంధాలున్నచోట సత్యం వుండదు. సత్యాన్ని సాధించాలంటే అనుబంధాలను పక్కకు పెట్టాలి. అప్పుడే మనస్సు నిర్వాణాన్ని లేదా శూన్యత్వాన్ని పొందుతుంది" అందుచేత నాగార్జునుణ్ణి ఆత్మప్రత్యయభావవాది అనవచ్చు. ఆయన శూన్య వాదం యొక్క విస్తరణే శంకరుని మాయావాదం. నాగార్జునుని మహాయానసిద్ధాంతం బుద్ధుడు నిరసించిన అన్ని తరహాల పూజలకూ దారితీసింది.

నాగార్జునుడు తన అంత్యదినాలను శ్రీపర్వతం మీద గడిపేడని హ్యుయాన్‌త్సాంగ్ వ్రాసేడు. తన "సుహృల్లేఖ" గ్రంథంలో నాగార్జునుడు శాతవాహనుని పేర్కొంటాడు. ఆయన రచనలలో కనిష్కుడు, వసుమిత్రుడు, అశ్వఘోషుడు మొదలైనవారి పేర్లు తగులుతాయి. కనక నాగార్జునుడు క్రీ.శ. 2వ శతాబ్దిలో ఉన్నాడనీ, ఆయన పేర్కొన్న శాతవాహనుడు యజ్ఞశ్రీ శాతకర్ణి (క్రీ.శ. 178–207) గాని, ఆయన అనంతరపు వారెవరోగాని అయివుంటారని భావించబడుతూంది. నాగార్జున కొండవద్ద దొరికిన శాసనాన్ని బట్టి శ్రీపర్వతమూ అదీ ఒకటేనని తేలుతూంది. అక్కడి మహావిహారం ఆయన పర్యవేక్షణలో నిర్మించబడింది. సౌశీల్యానికి, మతానికీ విరుద్ధం అయిన పిసినారి పద్ధతులను, అసూయను, ఆశపోతుతనాన్ని, మోసకారి వ్యవహారాలను, కుటిలత్వాన్ని, సోమరిపోతుతనాన్ని గొప్పవాడైన రాజు నిరాకరించాలి. దూరంగా పెట్టాలి. సౌందర్యం, బాహ్యాడంబరం, విషయవాంఛలు అస్థిరమైనవీ, బుద్బుద ప్రాయాలున్నూ" అని నాగార్జునుడు తన "సుహృల్లేఖ"లో రాజులకు హితబోధ చేసేడు.

సాధారణంగా బౌద్ధులు జలసమృద్ధిగల చోట్లనే ఎన్నుకొనేవారు. నదులు లేని చోట్ల వారు పెద్ద సరస్సులూ, చెరువులూ నిర్మించేవారు. శతాబ్దాలు గడిచేసరికి నదీగర్భాలు మారుతుంటాయి. నాగార్జునకొండ, భట్టిప్రోలు, ఘంటసాలల్లోని స్తూపాల సమీపంమీంచే ఒకప్పుడు కృష్ణ ప్రవహిస్తూండి వుంటుంది. మధిర సమీపంలోని రామిరెడ్డిపల్లి విహారానికీ, జగ్గయ్యపేట విహారానికీ మునేరు, పాలేరు నదులు నడకదూరంలో వున్నాయి. నెల్లిమర్ల సమీపంలో రామతీర్థం కొండమీద 65 అడుగుల వెడల్పయిన చెరువును తవ్వేరు. అక్కడున్న బుగ్గలనీరు దానిలోకి ప్రవహించేటట్లు చేశారు. మురుగునీటి ప్రవాహానికి కూడా పరివ్రాజకులు గట్టి ఏర్పాట్లు చేసేవారు. సింహాచలం వద్ద ధారలకొండ ప్రక్క బౌద్ధస్తూప అవశేషాలను పురాతత్వవేత్తలు కనుక్కున్నారు.

వైదికమతం కూడా బౌద్ధమతంతోపాటు విస్తరించింది. అయితే ఈ వైదికమతం కొత్తతరహాది. గౌతమీపుత్ర శాతకర్ణి తాను క్షత్రియుల గర్వం అణచివేశాననీ, వర్ణసంకరం కాకుండా నిరోధించాననీ గొప్పలు చెప్పుకొన్నా ఆయన వంశీయులలో ఒకడయిన వాశిష్ఠీ పుత్ర శాతకర్ణి రుద్రదాముని కుమార్తెను పెళ్ళాడాడు. రుద్ర దాముడు శకసత్రపుల నాయకుడు; వైదిక మతాన్ని చేపట్టి క్షత్రియుణ్ణని చెప్పుకొన్నాడు. కుడాలోని ఒక శాసనంలో శకజాతి



చెందిన ఉపాసకుడు అయితిల తన్ను "బాంహన" అని చెప్పుకున్నాడు. కన్హేరీ శాసనం క్షత్రియులుగా పేర్కొన్న గజసేన, గజామితులు వణిజకుల వృత్తిని అనుసరించేరు. వృత్తి ప్రధానంగా హాలికులు (దున్నే వారు), గోలికులు (మందల్ని కాచేవాళ్ళు) మూర్ధకులు (క్షత్రియులలో ఒక శాఖ) మొదలైన అనేక ఉపకులాలు ఏర్పడ్డాయి. వీటన్నింటా కులం వెలుపల వివాహాలు నిషిద్ధం. వాత్స్యాయనుడు తన 'కామసూత్రాలలో' అనేక కులవృత్తుల్ని పేర్కొంటాడు. ఇవి చతుర్వర్ణాలలోకి రావు. మాలకారుడు, గంధికుడు, రజకుడు, నాపితుడు, సౌందికుడు (కల్లు అమ్మేవాడు), తాంబూలకుడు, సువర్ణకారుడు, మణికారుడు, కుశీలవుడు (నటుడు), గాయకుడు, నటి, శిల్పకారిక (కళాభ్యాసకురాలు).

యవనులు (గ్రీకులు), శకులు (పెర్షియనులు) మొదలైన విదేశీయులు దేశీయులైన పేర్లుపెట్టుకొని బౌద్ధమతం అనుసరిస్తూ సంఘంలో కలిసిపోయారు. ఇంద్రాగ్ని దత్తుడు, ధర్మదేవుడు, ధర్మరక్షితుడు మొదలైన పేర్లు సింహధ్యాయ, యశోవర్ధన, ధర్మాధ్యాయ వంటి ఇంటి పేర్లతో సహా. ధేనుకటక యవనులు ఎందరో ఆరామాలూ, విహారాలకు ధనం ఇచ్చేరు. శకులుకూడా అంతే. నహపణుని అల్లుడు శకుడు. ఆయన రుషభదత్తుడని పేరుపెట్టుకొన్నాడు. ఆయన తండ్రిది మళ్ళీ విదేశీనామమే (దినిక). యవనులు బౌద్ధులు. కాని శకులు బౌద్ధ, వైదికమతాలు రెంటినీ అనుసరించారు. రుషభదత్తుడు రెండు మతాలవారికీ కానుకలిచ్చేడు. అమరావతి శాసనంలో శకగిరి అనే పేరు కనిపిస్తుంది. నాగార్జునకొండ శాసనం మోద (సంతోషం) అనే శకుని గురించి వ్రాస్తుంది. కులనిబంధనలకన్న కులనిబంధనల భంగం గ్రంథాలలో కనిపిస్తుంది. దాస బ్రాహ్మణ జాతకం అనుచిత వృత్తులను అనుసరిస్తున్న పదిమంది బ్రాహ్మణుల్ని పేర్కొంటుంది. జ్యోతిషం అనే వంచకవృత్తిని బ్రాహ్మణులు అనుసరిస్తుండేవారు. వాణిజ్యం, వ్యవసాయం, వడ్రం, వేట మొదలయిన అన్యుల వృత్తులను చేపట్టుతున్నారు. కొండతెగలవారు, చండాలురు అస్పృశ్యులుగా సేవావృత్తికి పాల్పడ్డారు. తల్లిదండ్రులు తమసంతానం ఏ వృత్తిచేసుకోవాలో ఆలోచించడం జాతక కథలలో కనిపిస్తుంది. అంటే వాటికి కులనియమాలు బిగిసిపోలేదనాలి. శూద్రులు అనేకానేక ఉపజాతులు, కులాలుగా ఏర్పడుతున్నారు. వారువారు అనుసరించే తెగల నిబంధనలు, కులకట్టుబాట్లు, కులసంఘాలు మొదలైనవి వారు తెగలనుంచి వచ్చి కలిసిన వారని చూపుతున్నాయి. స్మృతికాలపు శూద్రులకూ, ఆ తరువాతికాలపు శూద్రనామం పనిపాటలు చేసుకొనే అనేక దిగువకులాలకు సమిష్టి పేరు అయింది. "మనుస్మృతి" ఈ మార్పును గుర్తించింది. ప్రతివర్ణమూ, ప్రతిజాతీ ఒక్కొక్క వృత్తి చేస్తుంది. దానిని బట్టే దాని మంచి చెడ్డల్ని నిర్ణయించాలి అంటుంది.

దీని అర్థం చాతుర్వర్ణ్య విభాగంలో పీడన, దోపిడి లేదని కాదు. అదొక తరహా వర్గవ్యవస్థ. బ్రాహ్మణుడు ప్రత్యేకసౌకర్యాల ననుభవిస్తాడు. పన్నులివ్వనక్కర్లేదు. క్షత్రియుడు పన్నులు వసూలు చేస్తాడు. అతడూ ఇవ్వడు. వైశ్యుడు భూయజమాని. ఇంక శూద్రునిదే చాకిరీ అంతా. చాకిరీ అతని ధర్మం. ధనికులకూ బీదలకూ మధ్య వున్న అంతరం – ఇక్కడ ఉన్నత – అధమకులాలకు మధ్యనున్న అంతరం – సమాజంలో వారి స్థానాన్ని నిర్ణయిస్తుంది.

పురావస్తుతవ్వకాలవలన ఆనాటి విలాసవస్తువు లేమిటో తెలుస్తుంది. అందమైన రకరకాల పాత్రలు, కుర్చీలు, బల్లలు, పీటలు, మంచాలు పెద్దకులాల యిళ్ళలో వుండేవి. అంబారీలతో అలంకరించిన ఏనుగులు, గుర్రాలు, రథాలు వారికి ఉన్నాయి. అమరావతి

ఆసన శయ్యాసామాగ్రి - అమరావతి శిల్పము

శిల్పాలలో కూర్చునేవీ, పడుకునేవీ, పీటలు 16 రకాలవి కనిపిస్తాయి.

వివిధ వృత్తిపనులు చేసే శూద్రులేగాక, ఆనాడు బానిసలుకూడా చాల మంది వుండేవారు. అయితే వారు యింటిపనులకే వుండేవారు. గ్రీసు, రోము ఈజిప్టులలో మాదిరిగా సామాజికోత్పత్తిలో వారు పాల్గొనరు. దాడులలో బందీలుగా పట్టుబడ్డవారు, న్యాయశిక్షలలో స్వేచ్ఛను కోల్పోయినవారు, తమంత తాముగానే బానిసత్వానికి ఒడబడ్డవారు, బానిసలకు పుట్టినసంతానం బానిసలు అవుతారు. వీరు గృహసేవలోనే వుంటారు. పర్షియానుంచీ, అపోలోగస్ నుంచీ విలాసవస్తువులీ్న, ఆడబానిసలీ్న వర్తకులు భీరుకచ్ఛం, ఉజ్జయిని మొదలయిన



ఆసన శయ్యాసామాగ్రి - నాగార్జున శిల్పము

చోట్లకు తీసుకొచ్చేవారనీ, గాయకులయిన యువకులీ్న, అందమైన యువతులీ్న రాజులు బహుమతులుగా తీసుకొనేవారనీ "పెరిప్లస్" అనే గ్రంథం చెప్తున్నది.

సంపదలు, తెలివి, సంస్కారం వున్న నాగరికులను ఉద్బోధిస్తున్నాడు వాత్స్యాయనుడు, తన "కామసూత్రాల"లో. వాణిజ్యం విస్తృతరూపంలో సాగుతున్న దశ లోనే సంఘంలో ఒక భాగం భోగాల ననుభవించే అవకాశంవుంటుంది. ఆయన తన "కామసూత్రాల"లో ఆనాటికి సమాజంలో వున్న స్త్రీ పురుష సంబంధాలను శాస్త్రీయపద్ధతిలో, నిరాసక్తంగా వివేచన చేసేడు. మానవుని మనస్సులో ప్రేమవల్ల కలిగే ఈర్ష్యలను, కోపాన్ని, ద్వేషాన్ని, ఆవేశాన్ని, దురాశల్ని, స్వార్థాల్ని అద్భుతంగా వివరించేడు. అతని అభిరుచుల్ని అవి ఎల్లాతప్పుదారి పట్టిస్తాయో, విచక్షణాశక్తిని భగ్నపరుస్తాయో వివరించేడు. ఎప్పుడేనా పల్లెటి ప్రాంతాలకు వెళ్ళినప్పుడు తన

తరగతి మనుష్యుల్ని నాగరిక జీవిత పద్ధతుల నలవరచుకొనేటట్టు ఉత్సాహపరచమంటాడు. కూటాలను ఏర్పరచి, సభలను కూర్చి ఆటపాటలు, సరస సంభాషణలు ప్రోత్సహించమంటాడు.

సంగీతం, నృత్యం, చిత్రలేఖనం, శబ్దోత్పత్తి, కవిత్వం, శబ్దకోశం మొదలైన సాహిత్యచర్చలు, లోహకారక్రియలు, గృహనిర్మాణం, ఈత, నూతుల నుంచి నీళ్ళుతోడే యంత్రాల నిర్మాణం మొదలైన చతుష్షష్టి (64) కళలను 'కామసూత్రాల'లో వాత్స్యాయనుడు పేర్కొంటున్నాడు.

తల్లికుదురు పేర్లను (గౌతమి, వాశిష్టి, మాధరి వగైరా) చెప్పకొనే శాతవాహనుల అలవాటు దక్షిణదేశంలో పరిపాటిగావున్న మేనరికాలను సూచిస్తున్నది. ఎవరికో ప్రధానమయి పోయిన మేనమామ కూతురును ఎల్లగ ఆకర్షించాలో వాత్స్యాయనుడు తన 'కామసూత్రాల'లో మెలకువలు బోధిస్తున్నాడు. శాతవాహనులు, క్షత్రియులు తల్లి కుటుంబనామాన్ని వుపయోగించు కొనేవారు. దీని వుపయోగం ఆస్తి వారసత్వానికి కాదు; వివాహసంబంధ నియమం కోసమే. బహుభార్యాత్వం దీనికి కారణమై వుండొచ్చు. సవతి సోదరుల్ని గుర్తుపట్టడానికై తల్లి కుటుంబ నామాన్ని వుపయోగించి వుంటారు.

ఆనాడు స్త్రీలకు సమాజంలో గౌరవస్థానం వుంది. గుహ విహారాలకు పెద్దపెద్ద దానాలిచ్చిన స్త్రీల సంఖ్య చాలా ఎక్కువగావుంది. అమరావతిలోని 145వ శాసనం, 72, 30 కుడా శాసనాలు, 13,29 నాసిక్ శాసనాలు 16గురు స్త్రీలిచ్చిన దానాలను చెప్తున్నాయి. నాసిక్, కుడా చైత్యాలను నిర్మింపజేసినది స్త్రీలు. కార్లే చైత్యనిర్మాణంలో వారిపాత్రా వుంది. విష్ణుదత్త అనే శకమహిళ 3500 కర్షపణాలను నాసిక్ విహారానికిచ్చింది. అంటే స్త్రీలకు వేరే ఆస్తులుండే వన్నమాట. స్త్రీలు బహిరంగ గోష్టులలో పాల్గొంటుండినట్లు అమరావతి శిల్పాలలో చూస్తాం. స్త్రీలు జంత్రవాద్యాలను వాయించడం, పాడడం, నృత్యంచేయడంకూడా ఆ శిల్పాలలో చూస్తాం. వయసు వచ్చినాకనే వివాహాలయ్యేవని 'గాథాసప్తశతి' నుంచి తెలుస్తున్నది. పడుచులు ప్రేమలేఖలు వ్రాయడం. పడుచువాళ్ళతో స్నేహం చేయడం, కలిసి నృత్యం చేయడం 'గాథాసప్తశతి' వర్ణిస్తుంది. ఇక్కడ ఇంకో విషయంకూడా వుంది. స్త్రీ స్వాతంత్ర్యం, సమానత్వం అనేవి తెగలక్షణాలు. అవి వున్నా, అమ్మకపు సరుకుల వుత్పత్తి, వ్యాపార, వాణిజ్యాలూ రెండో వేపున కుటుంబ సంబంధాలను ప్రభావితం చేయడంకూడా కనబడుతుంది. ఆర్థిక వ్యవస్థలో ప్రముఖపాత్ర వహిస్తున్న మగవాడు ఆడదానిమీద పెత్తనం చేయడం కూడా నేర్చుకొన్నాడు.

"ధనికులకు స్త్రీ ఉపభోగ వస్తువయింది. సాధారణగృహస్తుకామె ధనార్జన కుపకరణమయింది. సేవకుడులాగ ఆమె కేవలం పద పరిచారిక మాత్రమే" నంటాయి జాతకకథలు. దానితో వచ్చిన యథేచ్ఛాచారం, వివాహబంధాన్ని అతిక్రమించడం, భర్తృవంచనలు 'గాథాసప్తశతి' వర్ణిస్తుంది.

వెనుకటి తెగ కుటుంబం విచ్ఛిన్నం కావడంతో దిక్కులేని స్త్రీలు అంటూ వచ్చేరు. బతకడానికి వ్యభిచారవృత్తిని స్వీకరించక తప్పలేదు అంటుంది 'గాథాసప్తశతి'. వాత్స్యాయన 'కామసూత్రాలు' ఆంధ్రులలో కనిపించే ఒక ఆచారాన్ని వర్ణించింది. 'పెళ్ళి పదోరోజున వధువు బహుమతులు తీసుకొని గ్రామాధికారి ఇంటికి వెడుతుంది. ఆ రాత్రి అతడామెను భోగిస్తాడు.'

'గాథాసప్తశతి' వర్ణించే అనేక పండుగలలో ఒకటి బృహత్శిలాయుగం నాటిది. నేటికీ హోలీ తెలంగాణాలో జరుపుతారు. స్త్రీ పురుషులు బాగా తాగడం. ఊగుతూ, ఊరకలేస్తూ రంగుపొడులు, రంగునీళ్ళు చివరకు బురదసహా పులుముకోవడం ఒక వినోదం దీనిలో.



అమరావతి శిల్పాలు చూస్తే నగలమీద ఆడవాళ్ళకుగల మోజు కనబడుతుంది. చూడామణులు, అనేక రకరకాల కుండలాలు, కంకణాలు, కంఠహారాలు, భుజబందులు, మేఖలలు, మంజీరాలు, అంగుళీయకాలు ఇంకా ఎన్నెన్నో. తలకట్టులలో కూడా ఎన్నెన్నోరకాలు రమారమి ఇరవై రకాలు కనిపిస్తాయి. ప్రవేణి, ఏకవేణి, కేశపాశం, కబరీబంధం, ధమ్మిల్లం, నెమలిపింఛం, జట, శిఖ మొదలైనవి. ఆనాడు పురుషులు కూడ కర్ణాభరణాలు, కంకణాలు, భుజం బందులు ధరించేవారు.

ఆనాడు సమిష్టి కుటుంబపద్ధతి ప్రధానంగా వుండేది. తండ్రి, తల్లి, కొడుకులు, కూతుళ్ళు, కోడళ్ళు, అల్లుళ్ళు, తమ్ముళ్ళు, చెల్లెళ్ళు అంతాకలిసి సమిష్టిగా విరాళా లివ్వడాన్ని అమరావతి శాసనం పేర్కొంది. కన్హేరీలోను, నాసిక్‌లోను దాతతో సహా రక్తబంధువులంతా తలా కొంత చొప్పున దానం ఇవ్వడం పేర్కొబడింది. ప్రాచీన కుటుంబవ్యవస్థ అవశేషాలు అంత బలంగా వున్నాయన్నమాట.

ఆంధ్రదేశంలో ఈనాడు పెళ్ళిళ్ళలో కనిపించే ఆచారాలన్నీ 2 వేల ఏళ్ళనాటి ఆచారాలకు చాల దగ్గరగానే వున్నాయి. వధూవరుల కాళ్ళకు పారాణి పెట్టడం, అరివేణి కుండలు వానిలో పద్యాలుంచడం ఆనాడుండేవి. ప్రథమ రజస్వల అయినప్పుడు వేడుకలు, ఇతరులకు దూరంగా వుంచడం, రంగుకలిపిన నేతిని ముఖానికి రాయడం ఆచారం అని 'గాథాసప్తశతి' పేర్కొంది.

సతీసహగమనాన్ని "గాథాసప్తశతి" వర్ణిస్తుంది. వితంతువు భారత దేశంలో సహగమనం చేయడం చూచి గ్రీకులు దిగ్భ్రమ చెందేరని స్ట్రాబో వ్రాశాడు. అయితే "అర్థ శాస్త్రం"లో గాని, జాతక కథలలోగాని దీని ప్రసక్తే లేదు. నాగార్జునకొండ పడమటి పాద భూమిలో దొరికిన ఒక శిల్పంలో మంటల మధ్యన ఒక నిచ్చెనకు జేరబడి నిల్చున్న సన్నని, నిరాభరణ స్త్రీ విగ్రహం వుంది. సహగమనం అందరూ ఆచరించలేదని భావించాలి. క్రీ.పూ. 500, క్రీ.శ. 300 మధ్యకాలంలో భారతదేశంలో కొంత కొంత భాగాన్ని పాలించిన సిథియన్లలో ఈ ఆచారం వున్నదనీ, దానిని చూసి భారతీయులూ ఆచరించసాగేరనీ మోనీరే, విలియమ్స్ వంటి పండితులు చెప్తున్నారు.

## భాషా సమస్య

క్రీ. పూ. 2 వేల సంవత్సరాలనాడు భారతదేశంలోకి చొచ్చుకువచ్చిన ఆర్యులు ఏదో ఒక రూపంలో సంస్కృతం మాట్లాడుకొనేవారన్నది నిస్సందేహం. తరువాత వారు ప్రవేశించిన ప్రదేశాలలోని ప్రజల సంస్కృతినీ, భాషనూ అలవరచుకొన్నారు. ఆర్యులవీ, అనార్యులవీ కొత్త కొత్త గ్రామాలు వెలిశాయి. అయితే ప్రారంభ కాలపు జనపదాలు ప్రత్యేకించి ఆర్యతెగలవిగా తయారయాయి. వారి భాష ఆర్యభాష అయింది. వారి కొత్త కొత్త పనిముట్లు, వృత్తులు, సామాజిక సంబంధాలు అనార్య ప్రజలవారికి పూర్తిగా భిన్నం. వాణిజ్యాభివృద్ధి, నూతన ఉత్పత్తుల మార్పిడి, కొత్త కొత్త ప్రజలతో కొత్త కొత్త భావాలను, సంక్లిష్టమయిన వానిని పరస్పరం తెలుపుకోవలసిన అవసరం, మంత్రాలతో నూతన కర్మకాండలు – ఇవన్నీ తెగల భాష పరిధిలో ఇమడలేవు.

ఆర్యుల ఆధీనంలోకి వచ్చేక దేశంలోని ఆదివాసి ప్రజకూడా తమకన్న ఉన్నత స్థితిలో ఉన్న వారి భాషనే స్వీకరించేరు. స్వీకరిస్తూనే, వుచ్చారణను తమ అలవాట్లకు అనుగుణంగా

మార్చేరు. క్రమంగా ఆ మార్పు ఫలితంగా ప్రాకృత భాషలు రూపొందేయి.

మిశ్రమ తెగల ప్రజలు సంస్కృత పదాలను ఉచ్చరించిన పద్ధతిని తెలుపుతాయి ప్రాకృతపదాలు.

మొదటిరోజుల్లో ప్రాకృత పదాలకీ సంస్కృతపదాలకీ పెద్ద తేడా వుండేదికాదు. క్రమంగా ప్రాంతీయ భేదాలు విస్తరించి సూరసేని, మాగధి పాళీ అంటూ మాండలిక నామాలతో వేర్వేరు భాషలే అయాయి. ప్రాకృతం అంటూ ఒక భాషలేదు. ప్రాకృతులు (అసంస్కారులు) మాట్లాడేది ప్రాకృతం అన్నారు. పైవర్ణాల ఈ అహంకారం, పీడన దిగువ వర్ణాలలో తీవ్ర వ్యతిరేకతను కలిగించింది. ఈ దశలో బౌద్ధమతం వచ్చింది. బ్రాహ్మణుల పెద్దరికాన్ని నిరసించడమూ, పాటలీపుత్ర ప్రాంతపు ప్రాకృతభాష పాళీలో బోధలు సాగించడమూతో ప్రజాభిమానాన్ని పొందింది. పాళీ, బౌద్ధమత భాష అయింది. సంస్కృతం హిందూ (బ్రాహ్మణ) మతభాష అయింది. బౌద్ధమత గ్రంధాలన్నీ పాళీలోనే వున్నాయి. అశోకుడు, కుషానులు, శాతవాహనులు శాసనాలలో వుపయోగించిన భాష చూస్తే సంస్కృతానికి భిన్నమైన దేశభాష ఒకటి కనిపిస్తుంది. శాతవాహనుల కాలంలో సంస్కృతానికన్న ప్రాకృతానికి అధిక ప్రాచుర్యం వున్నదని గుణాఢ్యుని కథ చూపుతుంది. ఆయన పైశాచీ భాషలో "బృహత్కథ" వ్రాసేడు. అది చండాలురకి కూడా అర్థం అవుతుంది.

క్రమంగా సంస్కృతం కూడా అనార్యభాషల నుంచి అనేక పదాల్ని తీసుకుంది. లేకుంటే దానిలో అంత విస్తృతమూ, సంపన్నమూనైన సాహిత్యం రాదు.

అయినా ప్రజల భాష సాహిత్య భాషనుంచి దూరం అయింది. సంస్కృతం వ్యాకరణ బద్ధమయి, క్లిష్టవాక్య నిర్మాణంతో, క్లిష్టసమాసాలు, అతిశయోక్తులూ ఉపమానాది అలంకారాలతో శ్లిష్టసాహిత్యం అయింది. ప్రజా సాహిత్యానికుండే గాంభీర్యం, భావప్రకటనలో నిరాడంబరత, నిజమైన మానవత్వపు మాహాత్మ్యమూ దానికిలేవు.

శాతవాహనుల కాలపు అసంఖ్యాక శాసనాలలో ఒక్కటే సంస్కృతంలో వుంది. అదయినా శకరాజు రుషభదత్తునిది. శకులు ఇటు బౌద్ధులకీ, అటు బ్రాహ్మణులకీ, బృహద్విరాళాలిచ్చి తామూ భారత సమాజంలో చేరిపోవాలనుకొంటున్న వాళ్ళు. నాసిక్ శాసనాలలో ఒకటి పాళీ మిశ్రితమయిన సంస్కృత భాషలో వుంది. సంస్కృతం రాని వాడు సంస్కృతంలో రాయడానికి చేసిన ప్రయత్నమిది అన్నాడు ఆర్. జి. బండార్కరు.

ఆంధ్రులు బౌద్ధ మతాభిమానులుగా తమ తెలుగుతోపాటు ప్రభువుల భాష పాళీని కూడా ఉపయోగిస్తుండేవారు. కర్నూలు జిల్లాలోని ఎర్రగుడిపాడు, రాజుల మందగిరిలోని అశోక శాసనాలకు భాషలో వ్యాకరణంలో ఒకదాని కొకదానికి చాల దగ్గరతనం వుంది. గుంటూరు జిల్లాలోని భట్టిప్రోలు శాసనభాష అశోకుని పై శాసనాలు భాషకీ నానేఘాట్ శాసన భాషకీ మధ్యస్థంగా వుంది. బళ్ళారి జిల్లాలో మైకదోన శాసనం నిస్సందేహంగా తెలుగేనని చెప్పదగిన రూపంలో వుంది. అందులోని 'వేపూరు' పదం, వేము+ఊరు అనే రెండు పదాల సంధిరూపంగా గుర్తించబడింది. షష్టీవిభక్తి స్థానంలో పద అంత్యాక్షరం అయిన 'ము' 'ప'గా మారి సంధి కలియడం తెలుగు ప్రత్యేకత (పాము+రేడు = పాపరేడు, ఇనుము+కమ్మి = ఇనుపకమ్మి) అమరావతి శిల్పాలలో ఒక పలకపై కినిపించిన "నాగబు" "నాగము" యొక్క ఆద్యరూపంగా గుర్తించబడింది. ఆ విధంగా క్రీస్తు శకారంభ కాలంనాటి ఈ రెండు తెలుగు పదాలూ తెలుగు



భాషా చరిత్రకు ఎంతో అమూల్యం.

వాశిష్టీపుత్ర శ్రీశాతకర్ణి (క్రీ.శ. 2వ శతాబ్ది) ప్రాకృతం, తమిళభాషలలో వేసిన ద్విభాషా నాణెంబట్టి ద్రావిడులైన ఆంధ్ర, తమిళ ప్రజల మధ్య వుండిన సాన్నిహిత్యాన్ని వూహించగలం.

శాతవాహనుల కాలంలో ప్రాకృతం జనానీకంలో చాల ప్రచారంలో వున్నా అనేక దేశభాషలు కూడా అభివృద్ధి పొందేయి. కౌటిల్యుడు, వాత్స్యాయనుడు, భరతుడు పద్దెనిమిది దేశభాషల్ని పేర్కొన్నారు. వానిలో ఆంధ్రం ఒకటి. దేశభాషలలో పరిజ్ఞానం చతుష్షష్టి కళలలో ఒకటిగా వాత్స్యాయనుడు పేర్కొన్నాడు. నాగరికులు వానిని నేర్చుకోవాలన్నాడు.

సంస్కృతం కన్న పాళీ తేలికే అయినా దక్షిణ దేశ ప్రజల భాషా సంప్రదాయాలకు అవి రెండూ భిన్నమే. తమిళం, తెలుగు మొదలయిన దక్షిణాత్య భాషల మూల భాష ద్రావిడమనీ, ఆ మూలభాష ఏనాడో అదృశ్యమయి, దాని శాఖలుగా ఇవి అభివృద్ధి నొందాయనీ పురాతత్వ వేత్తలు, భాషాతత్వవేత్తలు, మానుష శాస్త్ర వేత్తలు కూడా అభిప్రాయ పడుతున్నారు.

దక్షిణానికి వచ్చిన ఆర్యులు కొద్ది మంది ఇక్కడి ప్రజలతో సఖ్యంగా, శాంతంగా జీవిస్తూ తమమతాన్నీ, కళాకౌశల్యాన్నీ ప్రచారం చేసుకొనేందుకు ప్రయత్నించేరు. అందుచేత వారిరాక దక్షిణ దేశ ప్రజలను సంక్షోభ పరచలేదు. ఉత్తరాన లాగా దక్షిణాన ప్రజల భాష పూర్తిగా సంస్కృతం ప్రభావంలో పడలేదంటే అదే కారణం. అయితే ఆర్యులు అవసరంకొద్దీ దక్షిణాది భాషలకు తమ భాషపద్ధతిలో వ్యాకరణం మొదలయినవి రూపొందించి క్రమస్థితిని కల్పించవలసి వచ్చింది. అందుచేతనే దక్షిణాదిభాషల సహజపరిణామక్రమం కుంటు పడింది. ప్రతి దక్షిణదేశ భాషా సాహిత్యమూ తనమీద వున్న సంస్కృత ప్రభావాన్ని బట్టి భిన్న రూపాలలో స్వతంత్ర పంథాలో విస్తరించేయి.

దేశ భాషల మీద సంస్కృత ప్రభావం ఆ భాషా ప్రాంతాల భౌగోళిక స్థితిని బట్టి భిన్నభిన్న స్థాయిలలో వుంది. ఆంధ్ర ప్రదేశం ఉత్తర దక్షిణాలకు మధ్యన రెంటినీ కలుపుతూ వారధిలా వుంది. దాని ఉనికిని బట్టి తెలుగు అటు ఆర్యుల ఇటు ద్రవిడుల భాష, సంస్కృతి, సాహిత్యంలోని మంచిని క్రమంగా స్వాయత్తపరచుకోగల అవకాశం చిక్కింది.

ప్రాకృతభాష మాట్లాడే రాజవంశం అధికారంలో ఉండడంచేత దాని ప్రభావం పడినా తెలుగుభాషవిషయంలో ప్రభువులు జోక్యం పెట్టుకోలేదు. ఆ ప్రజల మతాన్ని అభిమానించేరు. వారి సాయంతో సామ్రాజ్యాన్ని నిర్మించేరు. ఆ ప్రజలుండే దేశానికీ, వారి భాషకీ తమపేరు నిచ్చేరు. శాతవాహనులు తమ దేశాన్నిగాని, జాతినిగాని, భాషనుగాని ఆంధ్రమని చెప్పుకోకపోయినా, స్థానిక ప్రజల భాషకు ఆంధ్రమనే పేరువచ్చిందని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు వ్రాసేరు. క్రీ.శ. 234లో పల్లవరాజు శివస్కందవర్మ వేసిన ఒక ప్రాకృత భాషాశాసనంలో ఆంధ్రపదం మొదట కనబడుతుంది. ఆంధ్రప్రజలు నివసించే మండలంగా దానిని పేర్కొన్నాడు. క్రీ. శ. 5 శతాబ్దిగా చెప్పే ప్రాచీన తమిళ గ్రంథం "ఆగథియమ్"లో కొంగనమ్, కన్నడమ్, కొల్లమ్, తెలుంగమ్ భాషలు పేర్కొబడ్డాయి.

సంస్కృతం ప్రభావంతో అనేక తత్సమశబ్దాలూ, ప్రాకృతం ప్రభావంతో అనేక తద్భవశబ్దాలూ తెలుగులో ప్రవేశించాయి. అయితే తెలుగునుంచి అనేక శబ్దాలు ప్రాకృతంలోకి ప్రవేశించాయి. శ్రీతిరుమల రామచంద్ర "గాథాసప్తశతి"లోంచి అనేక తెలుగుపదాలను చూపించారు. అత్త, పొట్ట, వాలుగ, పిల్లి, పంది, అద్దం, పత్తి, తీరదు, కుసుమ, ఒల్లను మొదలైనవెనో.

ప్రాకృతంలోకి చేరేయి. చూచు, చెక్కు, చెప్పు వంటి క్రియలు కూడా ప్రాకృతంలోకి వెళ్ళాయని ఆయన చూపారు.

ఈ విధంగా సంస్కృతం దక్షిణానికి రాకపూర్వమే తెలుగు ఒక స్వతంత్ర భాష అనీ, దాని సోదరభాషలయిన తమిళం, కన్నడం, మళయాళంలతో సహా అది ప్రజల వాడుకలో వున్నదనీ నిరభ్యంతరంగా చెప్పవచ్చు.

ఆంధ్రభాష అనేశబ్దం శాసనాలలో 11వ శతాబ్దినుంచి కనిపిస్తుంది. క్రీ.శ. 1053లో నన్నయ వ్రాసిన నందంపూడి (తూ.గో. జిల్లా) శాసనంలో ఆ గ్రామాన్ని పొందిన నారాయణభట్టు సంస్కృతం, కర్ణాటకం, ప్రాకృతం, పైశాచి, ఆంధ్రభాషలలో కవిత్వం వ్రాయగలడని పేర్కొంటాడు.

పైనచెప్పిన నాలుగేగాక ద్రవిడ భాషా కుటుంబానికి చెందినభాషలు కుయి, గోండ్, కొలామీ మొదలైనవి చాలావున్నాయి. ఈ భాషలు మాట్లాడే కోయలు, గోండ్లు, కొలామీలు, భిల్లులు మొదలైనవారు అనేక శతాబ్దాలపాటు తమభాషల నైసర్గికతను కాపాడుకున్నారు. వారు నివసించే ప్రదేశాలు అటువంటివి. వారు బాహ్యసంపర్కం లేకుండా పాత ఆచారాలూ, అలవాట్లూ, విశ్వాసాలనే అంటిపెట్టుకుని వుండేలా చేశాయి. ఆ కీకారణ్యాలూ, పర్వతభూములలోకి చొరబడడానికి ఆర్యులు ఆసక్తి చూపలేదు; బౌద్ధమత ప్రచారకులు ఉన్నవి చాలక కొత్త మతవిశ్వాసాలనూ, ఆచారాలనూ పట్టుకువచ్చేందుకు ఉత్సాహమూ చూపలేదు. వారిభాష పాళీకూడ కొండప్రజల భాషను కదిలించలేదు. ప్రభుత్వాలేవీ తమభాషను వారికి అంటగట్టే ప్రయత్నం చెయ్యలేదు. అందుచేతనే లిపిలేకపోయినా కుయి, గోండీ మొదలయిన భాషలు ఇంతకాలం నిలదొక్కుకొని వుండగలిగేయి.

పండితులు దక్షిణాదిన ప్రచారంలోవున్న వివిధ భాషల్ని – లిఖితములూ, అలిఖితములూ కూడ పరిశీలించి వాటికిగల బంధుత్వాలను నిర్ధారణ చేశారు. లింగం లక్ష్మాజీ పంతులుగారు కుయి భాషకు వ్యాకరణం తయారుచేశారు. ఈ భాష తెలుగుకో, దాని మాతృభాషకో మాండలికమని ఆయన అభిప్రాయపడుతున్నారు.

ఒక భాష ఏ కుటుంబానికి చెందినదో నిర్ణయించేందుకు పండితులు సర్వనామాలు సంఖ్యావాచకాలు, శరీరాంగాల పేర్లు, బంధుత్వపు పిలుపులు మొదలయినవి పోల్చిచూస్తారు. భిన్న భాషలమధ్య సంబంధాన్ని ఆ భాషాపదాల, ధ్వనుల మధ్యవున్న క్రమ సంబంధాన్ని బట్టి నిర్ణయిస్తారు. దీన్ని తులనాత్మక పరిశీలన అంటారు. ఈ పరిశీలనబట్టి తెలుగు, తమిళం, కన్నడం, కుయి భాషలు ఒకే కుటుంబానికి చెందినవని రుజువవుతూంది. సంస్కృతానికి వీటికి పోలికే లేదు.

హాలుని కాలంనుంచీ గాథ అనేది తెలుగుఛందోరూపంగా వృద్ధిపొందింది. ఇది మాత్రాఛందస్సు. సంస్కృతఛందస్సు గణబద్ధం. గాథలు ఏడురకాలవి వున్నాయి. వానిలో కందం ఒకటి. 64 మాత్రలుగల గాథారూపాన్నే ప్రాకృతంలో "కంద" అంటారు. తెలుగు కందపద్యంకూడా మాత్రాబద్ధమే. ఇందులోనూ 64 మాత్రలే పరిమితి. తెలుగులో మొదటి ఛందోరూపం ఇదే. నన్నయ వ్రాసిన భారత పద్యాలలో సగం 1219 కందపద్యాలే. ఈ ఛందస్సును తెలుగునుంచి ప్రాకృతమూ, దానినుంచి ఆర్యాశ్లోకంగా సంస్కృతమూ స్వీకరించాయని చెప్పవచ్చును.



బుద్ధుని కాలంలో భారతదేశంలో 64 భిన్నలిపులు వున్నాయని "లలితవిస్తర" గ్రంథం చెప్తూంది. బ్రాహ్మి, ఖరోష్టి, వంగ, మగధ, ద్రవిడ, దాక్షిణ్య, కిరాత, యక్ష, గంధర్వ లిపులు వానిలో కొన్ని. క్రీ. పూ. 3వ శతాబ్దిలో 'లలితవిస్తర' వ్రాయబడింది. అంటే ఆనాటికే అనేక లిపులు దేశంలోని తెగల మండలాలలో వాడుకలోవున్నాయన్న మాట. అశోకుని శాసనాలలో 'లిపికార' శబ్దం కనిపిస్తుంది. దానినిబట్టి శిలలమీద లిపులు చెక్కే ఒక ప్రత్యేకకులం వున్నదనుకోవాలి. క్రీ. పూ. 3వ శతాబ్దినాటికి బ్రాహ్మిలిపితో ప్రాకృతభాషను చదవడం ప్రజలకు బాగాతెలిసివుంటుంది. అందుకే అశోకుడు శాసనాలలో ఆ లిపిని వుపయోగించేడు. ఎర్రగుడి, రాజులమందగిరిలలోని శాసనాల లిపి, అమరావతిలో ఒక స్తంభం ముక్కమీద కనిపిస్తున్న శాసనభాగలిపీ అశోక లిపికి చాల దగ్గరగా వున్నాయి.

భట్టిప్రోలు, జగ్గయ్యపేట శాసనాల లిపి ఐతే బ్రాహ్మియే. కాని అశోకలిపిని పోలి వుండలేదు. అది అశోకానంతరలిపి బ్రాహ్మిరూపం. దక్షిణాన బ్రాహ్మిలిపి వివిధ రూపాలలో వుపయోగించబడేదని బుహ్లర్ భావిస్తున్నాడు. భారత లిపులన్నిటికి బ్రాహ్మియే మూలమని శాతవాహనులు తమ గుహ శాసనాలలో వుపయోగించిన లిపియే నేడు దాక్షిణాత్య లిపులన్నిటికి మాతృకయనీ కొమర్రాజు లక్ష్మణరావుగారు "ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ" వ్యాసంలో వ్రాసేరు.

## లలితకళలు

సరుకుల వుత్పత్తి, మార్పిడుల ప్రభావంలో కళలు ఉచ్చస్థాయిని అందుకున్నాయి. శాతవాహనుల పోషణలో అవి మరింత ఉచ్చస్థాయికి చేరేయి. వానికి ఊపిరి బౌద్ధమతం అనార్యతెగలను దగ్గరకు చేర్చుకునే ప్రయత్నంలో బౌద్ధమతం ప్రజల దేవుళ్ళనీ, వారి విశ్వాసాల్నీ, పూజాపద్ధతుల్నీ తానూ గుర్తించవలసివచ్చింది. దానితో బౌద్ధమతంలో కూడా



ప్రతీక్షానిరత
అమరావతి శిల్పము



మాంధాతు చక్రవర్తి
జగ్గయ్యపేట - శిల్పము 1వ శతాబ్ది

అనేకమంది దేవుళ్ళూ, దేవతలూ వచ్చేసేరు. గనుల సంపదల్ని రక్షించే యక్ష యక్షిణులూ, అడవుల, చెట్లనీటిపట్టుల దేవతలుగా అనార్యులు పూజించిన నాగులూ బౌద్ధ దేవగణంలో ప్రముఖులు, బౌద్ధశిల్పాలలో ఈ విగ్రహాలు తప్పకుండా వుంటాయి. ఆనాటి సమాజంలో బుద్ధుడిని కొన్ని సంకేతాలతో గుర్తించడం అలవాటు. పద్మం బుద్ధుని పుట్టకకు సంకేతం, ఆయన బుద్ధత్వానికి బోధివృక్షం, ధర్మ చక్రం ఆయన బోధనకు, స్తూపం ఆయన నిర్వాణానికి సంకేతాలు. క్రీ.శ. ఒకటవ శతాబ్దినాటి శిల్పికి ఈ సంకేతాలు తృప్తి కలిగించలేదు. 'బుద్ధుడు



సాతవాహన యుగపు రథ, శకట, శిబికలు యుద్ధ సాధనములు
అమరావతి శిల్పము క్రీ.శ. 1వ శతాబ్ది



దేవుడుగా, ప్రజలను ఉద్ధరించడానికి పుట్టినవాడుగా శిల్పాలలోకి వచ్చేడు. ఈ పద్ధతికి మహాయాన పంథా మంచి ప్రోత్సాహాన్నిచ్చింది. శాతవాహనుల కాలంలో శిల్పాలకు మతమే వస్తువైనా, ప్రపంచ సుఖాల అనుభూతికి ఒకసాధనంగా మతం శిల్పాలలో ప్రతిబింబించింది. ప్రతిచిత్రమూ పండుగ ఉత్సాహాల చలచ్చిత్రం. వివిధ దుస్తులతో, అలంకారాలతో, భంగిమలతో పన్నని అందమైన యువతీయువకుల ఉత్సవకోలాహలాలు వానిలో చిత్రించబడసాగేయి.

అమరావతీశిల్పాలు లాలసోన్మాదభరితాలూ, భారతీయ శిల్పాలలో అతిసుకుమార సుందరాలూను అని ఆనందకుమారస్వామి వర్ణించేరు. 'భారతీయ కళకు అత్యున్నత స్థితి' అని అలగ్జాండర్ ఫెర్గుసన్ అన్నారు. గాంధారంనుంచి వచ్చిన కొన్ని అలంకారాలూ, సంకేతాలూ పూర్తిగా అంతర్లీనం అయిపోయి స్థానీయ లక్షణాలుగానే ఈ శిల్పాలలో భాసిస్తున్నాయి అన్నారు సర్ జాన్ మార్షల్.

అమరావతీస్థూప నిర్మాణం మూడవదశలో క్రీ.శ 150-250ల మధ్య దానిని విశేషంగా అలంకరించడం జరిగింది. అమరావతీ బుద్ధవిగ్రహాన్నే బౌద్ధమతం వ్యాపించిన ప్రతిచోటా నమూనాగా స్వీకరించారు. అన్నాంలోని డాంగ్‌డువాంగ్‌లో, తాయిలాండ్‌లోని పాంగ్‌తుక్‌లో, జావాలోని దక్షిణ జంబర్‌లో, సుమత్రాలోని పాలెంబాంగ్, బోర్నియోలోని కోటా, బాంగోయస్‌లలో అమరావతి శిల్పకళారూపాల ప్రభావం కనిపిస్తూంది.

అమరావతిలో మూడు అతి సుందరమైన సామూహిక నృత్యదృశ్యాలున్నాయి. ఒకదానిలో వీణ, వంశి, మృదంగం మొదలైన సంగీతసాధనాలన్నీ ఉన్నాయి. ఆ మూడు దృశ్యాలలో భరతుడు చెప్పిన ముద్రలన్నీ కనిపిస్తాయి. రెండు దృశ్యాలలో అంతఃపురం వున్న రాజుముందు స్త్రీలు నృత్యం చేయడం చూపబడింది. మూడో దృశ్యంలో కుశీనరలో బుద్ధ అవశేషాల్ని పంచుకోవడం చిత్రించబడింది. అమరావతిలో ఆంగిక, వాచిక, ఆహార్యక, సాత్విక అభినయాలు నాల్గింటి విశేషాలనూ అత్యద్భుతమైన నేర్పుతో శిల్పి చెక్కేడు.

రెండురకాల వీణలు ఆ శిల్పాలలో కనిపిస్తాయి. వీణకు సహవాద్యంగా వేణువు, శంఖము మలచబడినాయి. తాళ వాద్యాలలో తబలా, మృదంగం ప్రముఖంగా కనిపిస్తాయి. మృదంగాలు మూడుతరహాలవి ఆంక్య, ఆలింగ, ఊర్ధ్వక.

కొండనే చైత్యగుహలో నాలుగు నృత్యదృశ్యాలున్నాయి. ఒకదాంట్లో యిద్దరు యువతులు ఇరుపక్కలా నాట్యం చేస్తూంటే పెద్ద విల్లు చేతబూని ఒక యువకుడు మధ్య నిలబడి హుషారుచేస్తున్నాడు. ఆ నృత్యం ఆద్యకాలపుది. అతివేగంగా తిరుగుతూ గెంతడం సూచిస్తుంది. అయితే కళాత్మకంగా పరిణతి పొందినది. పరస్పరత, సమతూకం వుంది శిల్పంలో. కార్లేగుహలో స్త్రీపురుషులు జంటలుగా నృత్యంచేసే దృశ్యాలు పన్నెండు వున్నాయి. దుస్తులను, ఆభరణాలనుబట్టి వారు కొండజాతుల జంటలుగా గుర్తించవచ్చు. పట్టలేని ఆనందోత్సాహాలూ, లయబద్ధమైన కదలికలు ఆ శిల్పాలలో రూపొందించబడినాయి.

అజంతా గుహ చిత్రాలు కొన్నిటిలో మనపూర్వుల కళాత్మకజీవితాలు కనిపిస్తాయి. ఒక గుహలో పదిహేనుమంది స్త్రీలు పాడుతూ, నాట్యంచేస్తూ కనబడతారు. వారిలో ముగ్గురు నృత్యం చేస్తూంటే ఇద్దరు బాకాలూదుతున్నారు. మిగతావారు చప్పట్లు చరుస్తున్నారు. ఇది క్రీ.పూ. 2వ శతాబ్దపుదిగా భావించబడుతూంది.

అజంతా చిత్రాలలో భారతీయచిత్రకళ పరాకాష్ట కనిపిస్తుంది. చిత్రకారులు శ్రేణి

సభ్యులుగా వుండేవారు. నవకార్మికులుగా పేర్కొనబడే పరివ్రాజకపర్యవేక్షకుల అజ్మాయిషీలో వారు పనిచేసేవారు. పర్యవేక్షక పరివ్రాజకులుగాని, చిత్రకారులుగాని శుద్ధ విరాగులుకారు. వాళ్ళు భౌతిక జీవితాన్ని, మత దృష్టినీ అద్భుతంగా సమ్మిశ్రం చేశారు. అజంతాగుహలలో అన్ని తరగతుల ప్రజల జీవిత వ్యవహారాల దృశ్యాలు కన్పిస్తాయి. బుద్ధుణ్ణి కూడ ప్రజలలో తిరుగుతూ, బోధిస్తున్నవానినిగా చూపేరేగాని ఏకాంతవాసిగా చిత్రించలేదు.

శాతవాహనులకాలంలో మనకళలు బాగా అభివృద్ధిపొందినట్లు మన సాహిత్యం కూడా సాక్ష్యం ఇస్తుంది. మన ప్రజల కళాభిరుచిని గురించి "గాథాసప్తశతి" నుంచి ఎన్నో ఉదాహరణలివ్వవచ్చు. విరగపండిన పొలాన్ని చూసుకొని ఆనందాతిరేకంతో పాట అందుకున్న రైతును చిత్రిస్తుందోగాథ.వండిన అన్నం మనిషీ మృదంగాన్నీ కూడా మాట్లాడిస్తుందంటుంది మరోగాథ. అలసిసొలసిన తరుణి ఆకర్షణను వర్ణిస్తుంది ఇంకోగాథ. ఇల్లాగే అనేకం.

## ముగింపు

వెనుకటి తెగ సంబంధాలను నిర్మూలించి, దక్షిణాన నూతన సామాజిక వ్యవస్థను ప్రవేశ పెట్టిన మహత్తర సామాజిక విప్లవ స్వరూపం ఇది. ఈ విప్లవానికి ఆర్థిక పునాది. నాగేటి వ్యవసాయం, సరుకుల ఉత్పత్తి, వాణిజ్యాల సహాయంతో అభివృద్ధి పొందింది. అందుకు ప్రభుత్వం సర్వవిధాలా సహాయపడింది. విదేశీయులను కూడా వైదిక మతంలో చేర్చుకున్న నూతన వైదిక మతం ఆనాడు అభ్యుదయాత్మక పాత్రనే నిర్వహించి, ఆర్థిక వ్యవస్థను ముందుకు తీసుకెళ్ళింది. ఉత్తరాదినిలాగా దక్షిణాన ఆనాటికి వర్ణ వ్యవస్థ కరడుకట్టుకుపోలేదు. మహాయాన బౌద్ధం మానవునిలోని సృజనాత్మక శక్తికి ఎంతో దోహదం చేసింది.

ఇవన్నీ మానవుని మేధను తెగబంధాల నుంచి విముక్తం చేశాయి. ఆ మేధ అంతకు పూర్వం ఎన్నడూ ఎరగనంత ఎత్తుకు పెరిగింది. కళలు, సాహిత్యం, నృత్యం, నాట్యం, పాట, సంగీతం మానవుని జీవితాన్ని సంపన్నం చేశాయి.

ఈ విధంగా మనిషి ప్రకృతి మీద నూతన విజయాలను సాధించడమేకాదు. ఆ విజయ సాధనక్రమంలో తానూ మారిపోసాగేడు.

ఈ విప్లవం రక్తపాతం లేకుండానే జరిగిపోయింది. పరస్పరం సంస్కృతులను సమన్వయించుకోవడంలో ఆర్యజాతి విస్తరణ జరిగింది. దాని వలన ఉత్తరాన కన్న దక్షిణాన హెచ్చు ఫలితాలు కలిగేయి. ఆర్య ద్రావిడ ప్రజలు ఇద్దరూ సహకరించుకోవడం లాభకరమని గ్రహించేరు. ఇద్దరూ రెండో వారి నుంచి మంచిని స్వీకరించేరు. ఆర్యులు దక్షిణాపథంలో అడుగు పెట్టే నాటికి అప్పుడే ద్రావిడులు ఉన్నత నాగరికత స్థాయిని చేరుకోవడం ఈ పరిణామానికి ప్రధానకారణం.

శూద్ర వర్ణపు శ్రమఫలితాన్ని స్వాయత్త పరచుకొనే భారతీయ పద్ధతి బానిస విధాన అవసరం లేకుండా చేసింది. వలసవచ్చిన ఆర్యులూ, స్థానికులయిన ద్రావిడులూ కూడ సమష్టి అనుభవ లక్షణాలున్న తెగ అస్తులు గలవారు. వారికి వ్యక్తి ఆస్థి అనేది తెలియదు. భారతదేశంలో సమష్టి ఆస్థికీ వర్ణ వ్యవస్థకీ సంబంధం వుంది. ఆ వ్యవస్థ ఉత్పత్తిని పెంచింది. తెగల ప్రజలకు భద్రత నిస్తూ కొత్త కొత్త తెగలను తనలో చేర్చుకొంది. ఆ విధంగా ఉత్పత్తి రంగంలో బానిస విధానం పెద్ద ఎత్తున ప్రవేశించలేదు.

దీని అర్థం శాతవాహనుల కాలంలో సమాజం న్యాయబద్ధంగా వుందని కాదు. ఆనాటి



వర్ణవ్యవస్థ ఎంతో ఉదారపంథాలో సాగినా, అది స్వభావంతోనే దోపిడి మీద ఆధారపడ్డది. ఉత్పత్తి శక్తులకు సంబంధించినంతవరకు అది అభ్యుదయకర పాత్రనే నిర్వహించివుండవచ్చు. కాని, అది దోపిడి స్వభావం కలది. ప్రారంభదశలో ప్రపంచంలో ఎక్కడైనా వర్గ నిర్మాణం యొక్క స్వభావం అంతే.

ఉత్పత్తి శక్తులలో అతిముఖ్య శక్తి మనిషి. సంపదలను సృష్టించగల శక్తి అతనికుంది. ఉత్పత్తిలో అతనికి నేర్పువుంది. కళాత్మక ప్రతిభ వుంది. నైతిక స్ఫూర్తి వుంది. సాహసికత వుంది. అన్యాయాల్ని ఎదిరించే చైతన్యం వుంది – ఇవన్నీ సమాజం పురోగమించడంలో ప్రముఖపాత్ర వహిస్తాయి. ఒక మనిషిని వేరొకడు దోచుకోవడం ఈ అభివృద్ధిని ఆటంకపరుస్తుంది. దానిని రద్దు చేసినప్పుడే అభివృద్ధి. అయితే దోపిడిని రద్దు చేయగలిగాలంటే పీడనను సహించలేకపోవడం, వ్యక్తిత్వ నిరూపణశక్తి, తిరుగుబాటు స్వభావమూ మనిషిలో వుండాలి. నూతనవర్ణ వ్యవస్థ, నూతన మతం బౌద్ధమూ, నూతన ఆర్థిక ప్రాతిపదిక అయిన నాగేటి వ్యవసాయమూ మనిషికి ఈ అవసర లక్షణాల్ని సమకూర్చిపెట్టేయి.

ఈ సామాజిక నిర్మాణాన్ని ఏమని పిలవాలి? అది బానిస వ్యవస్థకాదు. ఉత్పత్తికి ఉపయోగించబడింది శూద్రులశ్రమే గాని బానిసల శ్రమకాదు. దానిని ఫ్యూడల్ వ్యవస్థ అందామా? అనేక పేర్లతో, అనేక అంతరువులలో శాతవాహనుల క్రింద సామంత ప్రభువులున్నారు. కాని వారికి భూమిమీద సంపూర్ణ స్వత్వాధికారం లేదు. సాగులోవున్న భూమి చాలవరకు రైతుల యాజమాన్యం క్రిందనే వుండేది. అయితే దానిని పెట్టుబడిదారీ విధానం అందామా? వట్టి అర్థంలేని మాట అది. పెట్టుబడిని సృష్టించగలస్థాయికి ఉత్పత్తి సాధనాలుగాని, పంపిణీగాని ఎదగలేదు. రెండోవేపున, తనకిష్టం అయిన వృత్తిపనికి పోగల స్వాతంత్ర్యం శూద్రునికి లేదు. అందుచేత దీనిని ఫ్యూడల్ పూర్వదశ అనవచ్చు. ఫ్యూడల్ వ్యవస్థ లక్షణాలవంటివే దీని వీను. కాలక్రమంలో అవి ఫ్యూడల్ వ్యవస్థలోకి పరివర్తన చెందేయి.

ఐదవ ప్రకరణం

# శాతవాహనుల అనంతరపు వ్యవస్థారూపం

## ఉపక్రమణిక

శాతవాహనుల కాలంలో తెగ పెద్దల సంఖ్య బాగా తగ్గిందంటే స్వయంపూర్ణ గ్రామాల సంఖ్య త్వరగా పెరిగిందని అర్థం. నీటి పారుదల ఏర్పాట్లు విశేషంగా చేయడం ఈ పెరుగుదలకు కారణం. ఉత్పత్తి ఎక్కువ కావడంతో వర్తకుడూ లాభపడ్డాడు; ఆదాయం పెరిగి రాజ్యమూ బలపడింది.

ఉప్పు, లోహాలు మొదలైన అవసర వస్తువుల్ని పట్టణాలూ, నగరాలూ తగినంతగా గ్రామాలకు సరఫరా చెయ్యలేకపోయినాయి. గ్రామావసరాల నన్నింటినీ క్రమపద్ధతిలో అందచెయ్యడం శ్రేణులకు సాధ్యంకాదు. జనాభా పెరుగుదలకు సమస్థాయిలో అమ్మకపు సరుకుల ఉత్పత్తిని సాగించేందుకు తగినన్ని నాణేలు చలామణీలో లేవు. సరుకుల తలసరి ఉత్పత్తి తగ్గింది. ఏమంటే, తయారయిన వస్తువులలో అధికభాగం స్థానికంగానే ఖర్చయిపోయేది. దూరదూరాలకు పంపే భోగవస్తువుల వ్యాపారం క్షీణించింది. శాతవాహనుల కాలం నాటి బలీయమైన శ్రేణులు విచ్ఛిన్నమయ్యాయి. నెత్తిమూటలూ, కావిళ్ళతో ఊరూరు తిరిగి అమ్మే కొత్త తరహా వర్తకులు వచ్చేరు.

ప్రతి గ్రామంలో కమ్మరులు కావాలి. వడ్రంగులు కావాలి. కుమ్మరులుండాలి. వేర్వేరు అవసరాలకై అనేక వృత్తి పనుల వారుండాలి. మరమ్మతులు చేసినందుకూ, కొత్త వస్తువులు కొనుక్కొనేందుకూ డబ్బు చెల్లించే అవసరం చాల తక్కువగా వుండేటట్లు గ్రామాన్ని స్వయం పూర్ణం చెయ్యాలి. సరుకుల గిరాకీ ఎప్పుడూ ఒకే స్థాయిలో వుండదు గనక విలువ ప్రకారం వస్తు మార్పిడిద్వారా వృత్తి పనుల వారికి చెల్లించడం వీలుకాదు. అందుచేత ఒక పద్ధతి రూపొందించేరు. వృత్తి పనుల వారికి గ్రామం అందరితో పాటు భూములు ఇచ్చేరు. ఆ విధంగా వారు గ్రామంలోని వారయ్యేరు. ఇంక ప్రతి గృహస్థూ వారు చేసిన పనికని ఏటా తన పంటలోంచి కొంత భాగం అతనికిస్తాడు. ఆ విధంగా అతడుచేసే సాంకేతిక సహాయానికి సంప్రదాయరీత్యా కొంత మొత్తం చెల్లింపు నికరం చేయబడింది. ఈ వృత్తి పనుల వారికి వర్ణ వ్యవస్థ గట్టి రక్షణ నిస్తుంది. ఆ గ్రామంలోనే వుండే ఇతర వృత్తుల వారి సౌహార్దమే గాక, పొరుగు గ్రామాలలోని తమ కులం వారి ఆసరా కూడా వారికి వుంటుంది. గ్రామ జీవితంలో కులవ్యవస్థ యొక్క అవలక్షణాలు ఘనీభవించడంతో పాటు ఎంతో ప్రధానమైన రక్షణ ఆ నష్టాన్ని కూడదీస్తూ కులవ్యవస్థను



నేటికీ నిలబెట్టి వుంచింది.

పైనుంచి వచ్చే వొత్తిడులు బాధించకుండా వుండే అవకాశం గ్రామాలకు కూడా వచ్చింది. రాజ్యాలు రానీ, పోనీ గ్రామీణులు చిన్న చెలకల్లో పనిచేసుకుంటూ బతికెయ్యగలరు. కావలసిన ఉప్పూ, లోహ వస్తువులూ సరుకు చెల్లించి కొనుక్కొంటారు. సంతలూ, తీర్థాలూ, యాత్రలూ అప్పుడప్పుడు ఆ ఏకాంత జీవితాన్ని భగ్నం చేస్తున్నా గ్రామానికి బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా పోయింది. గ్రామ సంస్కృతి స్థాయి పెరిగే దారి లేకుండా పోయింది.

దీనివలన ఉత్పత్తి కేంద్రాలుగా వుంటుండిన పట్టణాలు దిగజారేయి. శ్రేణులు భగ్నం అయాయి. తాను ఉత్పత్తి చేసినదానితో గ్రామం గడుపుకొనేది. అదనం ఏమన్నావుంటే, ఫ్యూడలు అధికారులు వస్తురూపంలో ఉచితంగానో, పన్నుల రూపంలోనో పట్టుకుపోయేవారు.

ఇప్పుడిక కోస్తామీది వాణిజ్య కేంద్రాల సంపన్నత గురించీ, శక్తి గురించీ, దాతృత్వం గురించీ వినబడదు. గూడు కట్టుకు పోయినట్లుండే గ్రామాల ఆర్థిక నిర్మాణంలో డబ్బుకు స్థానం తక్కువ. పన్నులు కూడా వస్తురూపంలోనే చెల్లించేవారు. ఏవో కొన్ని పంటలు మాత్రమే రొక్కానికి అమ్మేవారు. ఉప్పు, లోహాల వంటి వాని అవసరమే కొంచెం. వాటిని గింజలిచ్చి తీసుకొనేవారు. ఇంక కొద్దిపాటి బజారు స్థలాలలో మాత్రమే వ్యాపారం పెద్దగా వుండేది. అక్కడే సరుకులు ఎక్కువ పోగుపడేవి.

రెండోవైపున కొత్త తరహా భూమి సంబంధాలు తలెత్తాయి. అవి ఫ్యూడల్ వ్యవస్థకు పునాదివేశాయి. రాజులు గృహస్థులకు వీరు సామాన్యంగా - బ్రాహ్మణులయి వుండేవారు. సర్వదుంబాలాగా ఇనాములివ్వసాగేరు. వారు ప్రభుత్వానికి చెల్లవలసిన పన్నులు వసూలు చేసుకొని ఉపయోగించుకోవచ్చు. భూమిలోవున్న నిక్షేపాలు వారివే. వెట్టికూడా తీసుకునే హక్కువుంది. దాతలు ఏ వుద్దేశంతో ఇచ్చినా, ఇది అధికమైన ఆర్థిక, రాజకీయ బలంవున్న దళారీలను సృష్టించిందన్నారు శ్రీ ఆర్. ఎస్. శర్మ తమ "ఇండియన్ ఫ్యూడలిజమ్"లో.

తెగల తాలూకు భూములు ఇంకా ఆస్తులుగా మారలేదు. దానం యీయబడిన భూమిని అమ్మేందుకూ, కొనేందుకూ ప్రతిగ్రహీతకు హక్కులేదు. దానిమీద ఆయనకు యాజమాన్యం ఏర్పడలేదు. వ్యవసాయంలోవున్న తెగభూములలోంచిగాక, వానికి వెలపలగా వున్నవే బ్రాహ్మణులకు ఇనాములుగా యిస్తారు. గ్రామానికి సమీపంలో సివారులుగా చిన్నచిన్న జనావాసాలు తల ఎత్తుతాయి. తెగ భూమి ఆస్తులుగామారే క్రమం మనకిక్కడ కనబడుతుంది (క్రీ.శ. 400-410). ఫాహియాన్ విహారాలకు కూడా ఇనాములున్నాయన్నాడు. వాటిలో ఇళ్ళు, తోటలు, పెరళ్ళు, రైతులు, వారి పశువులూ కూడ వున్నాయన్నాడు. అయితే రైతులు ఆ ఇనాము గ్రామం వదిలేసి వెళ్ళిపోవచ్చు. వారు అర్ధబానిసలు కారు. తెగల అలవాట్లూ, కులం కట్టుబాట్లూ అర్ధ బానిస. వ్యవస్థ భారతదేశంలో ఏర్పడకపోవడానికి కారణం అంటారు - డి.డి.కొశాంబీ. ఉద్యోగ ధర్మంతో సబురువచ్చిన ఉద్యోగులకు వసతి, భోజనం సౌకర్యాలు గ్రామస్థులే సమకూర్చాలి. ఈ విధంగా భూమిమీద యాజమాన్యంలేని రైతులప్రక్కనే భూస్వాములవర్గం ఏర్పడింది.

శాతవాహనరాజ్యం విచ్ఛిన్నమై చిన్నచిన్న సామంతరాజ్యాలు ఏర్పడ్డాయి. అవి ఒకదానితో ఒకటి యుద్ధాలు సాగిస్తున్నాయి. రెండో వేపున వుత్పత్తి విస్తరిస్తూంది. బ్రాహ్మణుల

సాయంతో ఉత్పత్తి చేసేవాడు. తనపని తానుమానకుండా కొనసాగించేటట్లు రాజులు చూసే వారు. ఈ ఈనాములిచ్చింది ఆ సహాయంకోసమే. ఉత్పత్తిదారులు అణగిమణిగి పడివుండేటట్లు సిద్ధాంతాలు బోధించడం ద్వారా వారిని అణచిపెట్టేందుకై హింసాకాండకు దిగనక్కర్లేకుండా చేస్తుంది ఈ ఇనాము పద్ధతి. పాలన వ్యయం తగ్గిస్తుంది.

బౌద్ధమతానికి రాజాదరణ ప్రజాదరణా ఇంకా కొంతకాలం లభిస్తూనే వచ్చింది. బౌద్ధ విహారాలు సంపదలకు, భోగాలకు, ఆడంబరాలకు నిలయమయాయి. పరివ్రాజకులు ఉత్పత్తిలో పాల్గోరు. కేవలం అనుభవించడమే వారిపని. పైగా నైతికంగాకూడ విహారాలు అప్రతిష్టపాలయ్యాయి. ఇక క్రమంగా జనం వానిని వదిలేశారు. వానికి బదులు దేవాలయాలు పట్టుకువచ్చేయి.

స్వయంపూర్ణ గ్రామాల సంఖ్య పెరిగినకొద్దీ తలసరిలెక్కన అమ్మకపు సరుకుల వుత్పత్తి క్షీణించసాగింది. గ్రామాలు చేసుకోలేని నీటిపారుదల ఏర్పాట్లవంటివి చేయడం తప్ప కేంద్ర ప్రభుత్వం చేసేపని పెద్దగా లేకుండా పోయింది. ఇంక చిన్నచిన్న సామంతులూ, గ్రామాధికార్లూ తమ పెత్తనాన్ని విస్తరింప చేసుకొంటూ, పొరుగురాజ్యాలమీద దండయాత్రలు చేస్తూ గ్రామాలలోని అదనపు వుత్పత్తిని తీసుకుంటూ స్వాతంత్ర్యం బలపరచుకోసాగేరు. చిన్నచిన్న రాజులుకూడా అశ్వమేధాలూ అవీ చేసి చక్రవర్తుల మనుకుంటుండేవారు. ఓడిపోయిన రాజులు విజేతకు సామంతులుగా వుంటూ కప్పాలు కట్టేవారు. యుద్ధాలప్పుడు ధనం, సైన్యాలతో సాయంచేసేవారు. దర్బారులకు హాజరవుతుండేవారు. అవకాశం చూసుకుని మళ్ళీ స్వాతంత్ర్యం సంపాదించేందుకు ప్రయత్నించేవారు. రాజుయొక్క భద్రతకు ప్రధానమైన ప్రమాదం ఈ సామంతులనుంచే.

సమాజ నిర్మాణంలో వరసక్రమంలో ఎక్కువ తక్కువలను సూచించడం సాధ్యంకాకపోయినా, అసంఖ్యాకంగా వచ్చిన దళారీలు రైతాంగాన్ని ఇంచుమించు సేవకుల స్థితిలో వుంచేరు.

కులనిర్మాణం బాగా బిగిసిపోయింది. పనిముట్లు యింకా ఆద్యదశలోనే వున్నా ఉత్పత్తి సంబంధాలు తెగదశలోకన్న ఉన్నతస్థాయికి చేరేయి. ప్రతివర్ణానికీ, ప్రతిజాతికీ, ప్రతితెగజనపదానికీ ప్రతిశ్రేణికీ, ప్రతి కుటుంబానికీ దాని దాని నియమ నిబంధనలు ఏర్పడ్డాయి. అవి ఒక్కొక్కటి ఒక వృత్తిపని చేస్తుండడమే దానికి కారణం. అందుచేత రాజ్యాంగం ఈ గ్రూపులమధ్య సంబంధాలను సరియైనస్థితిలో వుంచడం వరకేతప్ప ఆ గ్రూపులలోని వ్యవహారాలను ఒకే నియమాల నిబద్ధం చేయలేదు.

ఈకాలంలో బౌద్ధమతం క్షీణించి వైదిక మతం బలపడింది. అయితే యిప్పుడు యీరెండు మతాలూ కూడ ఇంతకుపూర్వంకన్న భిన్నమే. గతంలోవానిమధ్య కనిపిస్తుండిన వైవిధ్యం క్రమంగా మసకబారింది. చాలాకాలం తరవాతవరకూ రెండు మతాలూ ఘర్షణ లేకుండా సహజీవనం చేశాయి.

విదేశీవ్యాపారంమాత్రం ఉచ్చస్థాయిలో సాగుతూంది. తూర్పుదేశాలతో సాంస్కృతిక సంబంధాలు పెంపొందడం ఈ దశ యొక్క ప్రత్యేకత.

## తిరుగుబాట్లు, దండయాత్రలు, దేశాక్రమణలు

శాతవాహన రాజ్యభాగాలు కొన్ని ఆ రాజ్యపు ఆఖరు దినాలలో సామంతరాజుల



అధీనంలో వుండేవి. వారిలో ఇక్ష్వాకులొకరు. వీరు ఆఖరు శాతవాహనరాజైన నాలుగో పులమావి క్రింద మహాతలవరులుగా నేటి కృష్ణా, గుంటూరు జిల్లాలనూ, నెల్లూరుజిల్లాలో భాగాలనూ పాలిస్తుండేవారు. నాలుగవ పులమావి చనిపోయాక నాటి ఇక్ష్వాకురాజు శాంతిమూలుడు పుగియ, హిరణ్యక, ధనక, కులాహల్ సామంతుల సహాయ సహకారాలతో శాతవాహనరాజ వంశీకుల్ని ఓడించి తన్ను చక్రవర్తిగా ప్రకటించుకున్నాడు. పైన చెప్పిన సామంతుల సహాయంతో ఆయన శాతవాహన రాజ్యపు తూర్పుభాగాన్ని పాలించేడు. ఈ ఇక్ష్వాకురాజులు క్రీ.శ. 220-295 మధ్య 75 సంవత్సరాలు విజయపురి రాజధానిగా పాలన చేశారు.

వారి వెనువెంటనే బృహత్పలాయనులు అధికారంలోకి వచ్చేరు. వీరు శాతవాహనులకింద సామంతులుగా తీర ప్రాంతాన్ని కాపాడేవారు. కృష్ణానదీ ముఖద్వార ప్రాంతాలూ, ఘంటసాల, కోడూరు, అవనిగడ్డ మొదలైన రేవులూ వీరి అధీనంలో వుండేవి. వీరి రాజధాని కోడూరు. ఇక్ష్వాకులపతనానంతరం బృహత్పలాయన గోత్రీకుడైన జయవర్మ స్వాతంత్ర్యం ప్రకటించేడు. నేటి గుడివాడ, బందరు తాలూకాలూ, రెపల్లె, తెనాలి తాలూకాలూ ఆయన పాలనలో వుండేవి. ఈయన 10 ఏళ్ళు పరిపాలన చేశాడు.

క్రీ.శ. 295లో చివరి ఇక్ష్వాకురాజైన పురుషదత్తుణ్ణి పల్లవరాజాం ఒకటవ సింహవర్మ ఓడించి రాజ్యం వశపరచుకున్నాడు. ఈ రాజ్యంలో తనకు ప్రతినిధి నొకరిని ధాన్యకటకంలో వుంచి, తాను తన రాజధాని కంచికి వెళ్ళిపోయేడు. క్రీ.శ. 310లో సింహవర్మ చనిపోయేక బృహత్పలాయనులు పల్లవులనోడించి ఉత్తరజిల్లాలను స్వాధీనపరచుకొన్నారు. కాని పల్లవులు మరల తమరాజ్యభాగాల్ని స్వాధీనపరచుకున్నారు. ఇల్లా నిరంతర యుద్ధాలు చేస్తున్నా పల్లవులు నేటి గుంటూరు, నెల్లూరు, కడప జిల్లాప్రాంతాల మీద క్రీ.శ. 295 నుంచి 610 వరకూ ఆధిపత్యం నిర్వహించేరు.

ఇక్ష్వాకుల అనంతరం శాలంకాయనులు వేంగి రాజధానిగా క్రీ.శ. 300 నుంచి 450 వరకూ కృష్ణాగోదావరీ మధ్య భూమిని పాలించేరు. ఈ శాలంకాయనులు పల్లవుల దండయాత్రలలో వారికి సహాయం చేశారు.

సముద్రగుప్తుడు దక్షిణభారతదేశం మీద దండయాత్ర చేసినప్పుడు ఆంధ్రదేశంలోని అనేకమంది సామంతులు ప్రతిఘటించి లొంగిపోయేరు. వారి నాయన విడుదల చేసినట్లు క్రీ.శ. 350 నాటి అల్హాబాద్ శాసనం తెలుపుతూంది. కాంచీనగరపు పల్లవరాజా విష్ణుగోపుడు, వేంగిరాజా హస్తివర్మ, కుశస్థలపుర (తెలంగాణంలోనిది) రాజా ధనంజయుడు, నెల్లూరు జిల్లాలో పలక్కడరాజా ఉగ్రసేనుడు, (ఈయన పల్లవరాజా విష్ణుగోపుని వారసుడూ, రాజప్రతినిధీను), పిఠాపురంరాజా మహేంద్రుడు, ఉత్తర కళింగరాజా స్వామిదత్తుడు, ఆముదాలవలస ప్రభువు దమనుడు, అవముక్త (గోదావరి ఉత్తర మండలం) ప్రభువు నీలరాజా, దేవరాష్ట్ర (విశాఖజిల్లా దక్షిణభాగం) ప్రభువు కుబేరుడు అలాగ విడుదల చేయబడ్డవారు.

క్రీ.శ. 350 నుంచి 600 వరకూ ఆనందగోత్రీక రాజులు గుంటూరుజిల్లా ఉత్తర భాగాన్ని పాలించేరు. వీరికీ, శాలంకాయనులకీ, పల్లవరాజులకీ యుద్ధాలు సాగేయి. ఓమారు ఓడినా, మరోమారు నెగ్గుతూ ఆనందరాజులు రమారమి 300 సంవత్సరాలు పాలనచేశారు. చివరకు విష్ణుకుండినులు ఆనందులనీ, శాలంకాయనులనీ కూడ అణచివేశారు.

బృహత్పలాయనులు, శాలంకాయనులు, ఆనందులు సంఘర్షిస్తున్న కాలంలో

రాయలసీమకు చెందిన రేనాడులో (స్థూలంగా కడప, కర్నూలు జిల్లాలు) తెలుగుచోళులు పరిపాలించేవారు. ఈ కుటుంబానికిచెందిన కరికాలచోళుడు త్రిలోచన పల్లవుడనే వాలుగో విజయస్కందవర్మను ఓడించేడు. ఈయనే చోళవంశారంభకుడు. కరికాల చోళుడు త్రిలోచన పల్లవుని చేత కావేరిపోత గట్టుకి తట్టలు మోయించేడనీ, ఆయన ఆ అవమానంతో మరణించేడనీ చెప్తారు. కరికాలచోళుని వారసులు పల్లవరాజ్య భాగాలను నిలుపుకోలేక పోయినా, కడప జిల్లాలోని కమలాపురం, పొద్దుటూరు, జమ్మలమడుగు తాలూకాలనూ, కర్నూలుజిల్లాకుచెందిన కోవెలకుంట్ల తాలూకానూ క్రీ.శ. 700 వరకూ పరిపాలించేరు. మదనపల్లితాలూకాలోని చిప్పిలి వారి రాజధానిగా వుండేది.

కంచి రాజధానిగా పల్లవరాజులు క్రీ.శ. 295 నుంచి 610 వరకూ విశాల భూభాగాన్ని పాలించేరు. వీరికి కంబులు, బృహత్ఫలాయనులు, ఆనందులు, విష్ణుకుండినులతో నిరంతర యుద్ధాలు సాగేవి. వీరి పరిపాలనాకాలం సగపడ్డాక వేగి రాజధానిగా పాలిస్తున్న విష్ణుకుండినులు వీరికి ప్రబల ప్రత్యర్థులయ్యారు. ఈ విష్ణుకుండినులు శాలంకాయనులను ఓడించి క్రీ.శ. 420లో వేంగిరాజ్యాన్ని స్వాధీనపరచుకొన్నవారు క్రీ.శ. 616 వరకూ పాలించేరు.

క్రీ.శ. 350 నుంచి 430 వరకు ఉత్తర కళింగాన్ని మాధర రాజులు పాలించేరు విష్ణుకుండినరాజు ఒకటవ విక్రమేంద్రవర్మ (క్రీ.శ. 488-493) వారిని ఓడించి రాజ్యం స్వాధీనపరచుకున్నాడు. ఈయన కుంతల, అవంతి, కోసల, త్రికూట, లాటమండలాలను కూడా జయించినట్లు చెప్పుకున్నాడు. ఈ వంశంలోని ఇంద్రభట్టారక వర్మ కాలంలో (క్రీ.శ. 500-530) కొందరు రాజులు, సామంతులూ కూటంగా ఏర్పడి కళింగ రాజయిన ఇంద్రాధిరాజ నాయకత్వాన తిరగబడ్డారు. పృధ్వీమల్లుడనే సామంతుడు ప్రభు ద్రోహంచేసి ఇంద్రాది రాజ పక్కన చేరాడు. యుద్ధంలో ఇంద్రభట్టారకుడు ఓడిపోయి, చనిపోయాడు. అయితే ఆయన కొడుకు విక్రమేంద్రవర్మ (క్రీ.శ. ౦530-40) సామంత రాజకూటాన్ని ఓడించి మరల తన రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నాడు. క్రీ.శ. 540-46లలో రాజ్యమేలిన గోవిందవర్మ చివరిరోజ లలో పిఠాపురం సామంతరాజా రణదుర్జయుడు ప్రాబల్యానికి వచ్చేడు. కాని క్రీ.శ. 546-611ల మధ్య పాలించిన మూడవ మాధవవర్మ దిగ్విజయం సాగించి ఈ సామంతుని అణచివేసేడు.

పశ్చిమాన బాదామిలో చాళుక్య వంశపు రాజులు పాలిస్తుండేవారు. వారిలో క్రీ.శ. 610-642 మధ్య పాలించిన రెండవ పులకేశి చాల సమర్థుడు. దక్షిణాపథం తూర్పురాజ్యాల మీద ఈయన దండయాత్రలు చేశాడు. మధ్య, దక్షిన కళింగాలు ఆయన స్వాధీనమయాయి. గోదావరిదాటి విష్ణుకుండిన రాజు మూడవ మాధవవర్మను కొలనుపాక (కొల్లేరు దగ్గర) యుద్ధంలో ఓడించి చంపేసేడు. అటునుంచి కాంచీపురం మీద దాడిచేసేడు. పల్లవరాజు ఒకటవ మహేంద్రవర్మ కాంచీనగరాన్ని కాపాడుకున్నా, రాజ్యపు ఉత్తర రాష్ట్రాలను కాపాడుకోలేక పోయాడు. (క్రీ.శ. 610). పులకేశి తన తమ్ముడు విష్ణు వర్ధనుణ్ణి రాజ ప్రతినిధిగా వేంగిలో నిలిపి తన విజయాలను స్థిరపరచుకొన్నాడు. ఇది క్రీ.శ. 630 ప్రాంతాలలో జరిగింది. వేంగీచాళుక్యులు లేక తూర్పు చాళుక్యులు అనే రాజవంశం ఈ విధంగా తెలుగుదేశంలో అధికారానికి వచ్చి అయిదు శతాబ్దాలకు పైగా పాలించింది.



## పరిపాలనా వ్యవస్థ

శాతవాహనుల అనంతర కాలపు పాలకుల పరిపాలనావ్యవస్థ స్వరూపం గురించి సంస్కృత, ప్రాకృతభాషలలో వున్న అనేక శాసనాల నుంచి తెలుసుకోవచ్చు. శాతవాహనుల "ఆహార" పద్ధతిని బృహత్ఫలాయనులు అనుసరించినా కొన్ని గ్రామాల సమూహాన్ని "రాష్ట్ర"మని గాని, "విషయ" మనిగాని పిలిచేవారు. ఒక స్వతంత్ర రాజ్యం పరాధీనమయినప్పుడు దాని పూర్వపు స్వాతంత్ర్యాన్ని గుర్తుచేస్తూ దాన్ని "రాష్ట్ర"మని పిలిచేవారు. "ముండరాష్ట్ర", "కర్మ రాష్ట్ర", "వేంగి రాష్ట్ర" మొదలైనవి. "పుగినాడు", "హిరణ్య రాష్ట్ర" మొదలయినవి ఆయా కుటుంబాల పేర్లతోనో, వారి అధీనంలోవున్నవిగానో వుండేవి. ఇక్ష్వాకుల శాసనాలలో కనిపించే "రథిక"డు "రథి" లేక "రాష్ట్రం" యొక్క పాలకుడు. "పుగినాడు" అనేది గుంటూరు జిల్లాలోని దక్షిణ ప్రాంతమూ, పొదిలి తాలూకా నంది కొట్కూరు తాలూకాలు కలిసి ఏర్పడిన భాగం. కడపజిల్లా ఉత్తర భాగం కర్నూలుజిల్లా దక్షిణ భాగమూ కలిసి "రేనాడు" అనబడేది. బృహత్ఫలాయనులు "కుదరాహర" అని పిలిచినదే శాలంకాయనుల కాలంలో "కుదురవిషయ" అయింది. నేటి దివి, మచిలీపట్నం, రెపల్లె తాలూకాలు ఈ "విషయ"లో వుండేవి.

పల్లవులు తమ రాజ్యభాగాలను "రాష్ట్ర" అనే పిలిచేవారు. నేటి బళ్ళారి, అనంతపురం జిల్లాలనూ, వాని సమీప గ్రామాలనూ "శాతవాహన రాష్ట్ర" అని పిలిచేవారు. నేటి నెల్లూరుజిల్లా ప్రాంతాన్ని "ముండా రాష్ట్ర" అనేవారు. గుంటూరు, నెల్లూరు జిల్లాల భాగాలను "కర్మ రాష్ట్ర" లేక "కార్మికరాష్ట్ర" అనేవారు. గోదావరి, కృష్ణానదీమధ్య ప్రాంతాన్ని - పడమటి కనుమలవరకు దీని హద్దు అనిర్దిష్టంగా వుండేది - "వేంగినాడు" అనేవారు. విష్ణుకుండినులు "రాష్ట్ర", "విషయ" నామాలు రెంటినీ ఒకే అర్థంలో ఉపయోగించేవారు. నేటి బొబ్బిలి చీపురుపల్లి తాలూకాలు "ప్లకిరాష్ట్రం". తూర్పు గోదావరిజిల్లాలోని రామచంద్రపురం తాలూకా ప్రాంతాన్ని "గుడ్డవాడి విషయ" అనే వారు. కొన్ని పల్లవ శాసనాలు "వాతాప" లేక "వ్యాప్రిత" అనే వుద్యోగి అధికారంలో వున్న "ఆంధ్రపథ"ను పేర్కొంటున్నాయి.

దక్షిణ కళింగానికి చెందిన వాశిష్ఠులు జిల్లాలను "విషయ"లనీ, రాష్ట్రాలను "రాష్ట్ర"లనీ పిలిచేవారు. ఉదా: "దేవరాష్ట్ర", "తల్లవల్లి విషయ" వగైరా. మాధరులూ, తూర్పుగాంగులు "విషయ" పదాన్నే ఉపయోగించేరు. తెక్కలికి వంశధారనదికి మధ్యనున్న ప్రాంతాన్ని వారు "వరాహవర్తనీ విషయ" అనేవారు.

ఈ "రాష్ట్ర"లను వేర్వేరు పేర్లతో, వివిధ ప్రమాణాలలో విభజించేవారు. ఇక్ష్వాకులు అయిదేసి గ్రామాలను "గ్రామపంచిక"గా పిలిచేవారు. "మహాగ్రామ" అనే భాగాన్ని "మహాగ్రామిక" అనే వుద్యోగి అధీనంలో వుంచేరు. పల్లవులు, వాశిష్ఠులు, మాధరుల రాష్ట్ర విభాగాలలో "భోగ" అనేది ప్రధానమైనది. కర్మరాష్ట్రంలో "కవచకారభోగ" వుండేది. భోగ అధికార్లు "భోగికులు". మాధరులూ, తూర్పు గాంగులు "పాంచాలి" పేరున మరొక విభజన చేసేరు. వాశిష్ఠులు 11 గ్రామాల కూటాన్ని "ముదంబి" అనేవారు అంటే వారి పరిపాలనలో "ముదంబ", "భోగ", "విషయ", "రాష్ట్ర" అంటూ నాలుగు విభజనలు వుండేవన్నమాట. పల్లవులు "ఆంధ్రపథ" అని పిలిచినది ఏదో గౌరవనామమేగాని, పాలనామండలంగా దానికి విభజనలేవీ లేవు.

తన పాలిత ప్రాంతంలో రాజు సర్వాధికారి. ఆయన కొత్త చట్టాలు ఏవీ చేయలేదు.

సంప్రదాయికాచారాలనీ, ధర్మశాస్త్ర నియమాలనూ అమలు జరిగేటట్లు చేయడమే ఆయన పని. అమలులో వున్న సామాజిక వ్యవస్థను ఆంతరిక ఘర్షణల నుంచీ, బాహ్యాక్రమణల నుంచీ పరిరక్షించడం ఆయన బాధ్యత. పంటలో ఆరోవంతు రాజభాగం. అదిగాక ఇంకా ఎన్నో వసూళ్ళు, లేదా మామూళ్లు వుంటాయి. వాణిజ్య వస్తువుల మీద పన్నులుంటాయి. భూమిమీద పండినవీ, తయారుచేసినవీ వస్తువులన్నింటిలో రాజుకు భాగం వుంటుంది. నెయ్యి, పెరుగు, పాలు, పంచదార, కూరలు మొదలైనవానిలో ఆయనకు వాటా ఇవ్వాలి. రాజ కార్యాలకు మనుష్యుల్నీ, ఎడ్లనీ నిర్బంధించి తీసుకోవచ్చు. ఆయన యుద్ధంలో సైన్యాలను నడుపుతాడు. తరుచు తీర్థయాత్రలకు వెడతాడు. దేవతలకూ, మనుష్యులకూ దాన ధర్మాలు చేస్తాడు. పల్లవుల దాన శాసనాలలో చాలభాగం ఆ మాదిరిగా క్షేత్రాలు దర్శించినప్పుడు వేసినవే. ఈ కాలపు రాజులలో మతధర్మారాధకులయిన స్కందవర్మ, విష్ణుగోప, ఒకటవ మహేంద్రవర్మలు పండితులుగా కూడ ప్రసిద్ధులు. ఆనాటికి ప్రసిద్ధులయిన పండితుల శిక్షణలో రాజులు యుద్ధ శిక్షణ, ధర్మ, సాహిత్య విజ్ఞానము పొందేవారు. పరిపాలనా కార్యకలాపాలలో నేర్పు గడించేవారు. రాజ దర్బారు దృశ్యాలు నాగార్జునకొండ శిల్పాలలో చాలా వున్నాయి. వానిలో రాజు నిరాడంబరమైన దుస్తులలో కనిపిస్తాడు. అమాత్యులు పొడుగుచేతుల అంగరఖా, దానిమీద నడుముకు ఒక కమర్‌బంద్, మెడలో వుత్తరీయం ధరించి వున్నారు. క్రింద పై జామా వేసేవారు. రాజును పరివేష్టించి వుండేవారిలో స్త్రీలు అధికం. పురుషులు వితానధారులు, ఛత్రధారులు, మశాలీలు, రాజదండ ధారులు, గదాధారులు, భల్లధారులు మాత్రం అయివుంటారు. ఒక రాతి స్తంభం మీది దృశ్యంలో రోమను శీర్షకవచం వంటిది ధరించిన గడ్డపు సైనికుడున్నాడు. బహుశా సిధియనుడై వుంటాడు. బొంతవంటి పొడుగు చేతుల అంగరఖా, పంట్లామూ వేశాడు. చేతిలో బరువైన బల్లెం వుంది. రోముతో వాణిజ్యం జరుగుతున్న రోజులలో రోము సైనికులు ఎందరో రాజుల వద్ద ఉద్యోగాలలో చేరేరు. వారిలో ఎందరో సిధియనులూ కృష్ణా తీరపు రాజుల వద్ద కొలువు కుదిరి, ఇక్కడే స్థిరపడి పోయివుండవచ్చు.

ఈ రాజులలో బలవంతులయినవారు అశ్వమేధయాగాలు చేసేవారు. అంటే నాలుగు దిశలకూ దండయాత్రలు జరిపి, ప్రత్యర్థుల నోడించి, కప్పం తీసుకొనేవారు. ఇక్ష్వాకు రాజవంశ మూలపురుషుడు వాశిష్టీపుత్ర శాంతమూలుడు అశ్వమేధం, వాజపేయం, అగ్నిష్టోమం చేశాడు. పల్లవరాజు శివస్కందవర్మ, ఆయన కొడుకు ఒకటవ కుమారవిష్ణువు అశ్వమేధయాగాలు చేశారు. శాలంకాయన రాజు విజయదేవవర్మ కూడా అశ్వమేధం చేసినవాడే. విష్ణుకుండినరాజు ఒకటవ మాధవవర్మ రెండు అశ్వమేధాలూ, వాజపేయం, సర్వమేధం, పురుషమేధం, పుండరీకం మొదలైన అనేక క్రతువులూ చేసేడు.

రాజులలో కొందరు గొప్ప రాజనీతిధురంధరులున్నారు. వారు రాజనీతిని ఒక శాస్త్రంగా అభ్యసించేరు. ఇరుగుపొరుగు రాజులతోనూ, సామంతరాజులతోనూ సంబంధాలు కలుపుకొని తమ రాజ్యాన్ని స్థిరం చేసుకొనేవారు. ఇక్ష్వాకురాజు శాంతమూలుడు తన కూతురు అడవి శాంతిశ్రీని ధనిక కుటుంబానికి చెందిన మహాతలవర, మహాసేనాదిపతి, మహాదండనాయక స్కంద విశాఖనాగుని కిచ్చి పెళ్ళిచేశాడు. ఆయన సోదరి శాంతిశ్రీ పుగియ కుటుంబానికి చెందిన మహాసేనాపతి, మహాతలవర స్కందశ్రీ భార్య. ఆమె కూతురు శాంతమూలుని కొడుకు వీరపురుషదత్తుని భార్య. ఈ మహాతలవరులూ మహాసేనాపతులూ పెద్దపెద్ద రాజోద్యోగులలో,



రాష్ట్రపాలకులలో, రాజవంశకులలో విష్ణుకుండినరాజు ఒకటవ మాధవ వర్మ భార్య వాకాటకరాజుల ఆడపడుచు. వారి సంతానమయిన ఒకటవ విక్రమేంద్రుడు విష్ణుకుండిన, వాకాటక కుటుంబాలకు చెందినవాడని చదువుతాము. వాకాటకులు దక్షిణభారతంలోని స్వతంత్ర రాజకుటుంబాలలో ఒకరు.

వేర్వేరు అంతరువులలోని ఉద్యోగులను గురించి శాసనాలలో చదువుతాము. వారి ఉద్యోగ ధర్మాలేమిటో వానిలో వ్రాసివుండలేదు. కాని, ఉద్యోగం పేర్లను బట్టి మనం వూహించగలము. వారిలో చాల మంది కొన్ని గ్రామాలకో, చిన్న-పెద్ద మండలాలకో అధిపతులుగా, పన్నుల వసూలు అధికారులుగా వున్నవారే. సాంఘిక హెూదానుబట్టీ, రాజాదరణ, సైన్యబలమూబట్టీ సామంతులు ఈ అధికారులెవరికన్న అధిక శక్తి వంతులు.

ఇక్ష్వాకులక్రింద మహాదండనాయకులంటే ప్రభుత్వసైన్యాధ్యక్షవర్గ నాయకులు. మహాసేనాధిపతులంటే సైన్యాధినాధులు. తరవాత వారే స్వతంత్రులయి, రాష్ట్రాల వంశపారంపర్య పాలకులయారు. ఈ మహాతలవరులూ, మహాదండనాయకులూ, మహాసేనాధిపతులూ రాజ్యానికి స్తంభాలనదగినవారు. నాగార్జున కొండ శాసనాలనుబట్టి వారు రాజకుటుంబాలతో సంబంధ బాంధవ్యాలు కలిగి వుండేవారు.

రాష్ట్రపాలకుడిని రిధికుడనేవారు. రాజు ప్రత్యేక కార్యదర్శిని పల్లవరాజులు "రహస్యాధికృత" అనేవారు. హిరహడగల్లి శాసనం అటువంటి వుద్యోగి భట్టిశర్మ 'అనేవానిని పేర్కొంటూంది. ఆయన "కొలివల" భోజకుడు. అంటే కొలివల గ్రామాదాయాన్ని అనుభవిస్తాడు. రాజకుమార శబ్దం యువరాజుకి వర్తిస్తుంది. సేనాపతి కొంత సైన్యానికి నాయకుడు. రాష్ట్రికుడు రాష్ట్ర గవర్నరు. "మదబినమండప" —సుంకాలు వసూలుచేసే అధికారి. "దేశాధికృత" "మండలాధికారి" "గ్రామ గ్రామభోజకుడు" ఒక్కొక్క గ్రామం ఆదాయాన్ని అనుభవించేవాడు. 'వల్లభులు' రాజు యొక్క విశ్వాసం పొందిన వుద్యోగులు. ఇటువంటివారు రాజ్యంలో చాలచోట్లనే వుంటారు. వారు రాజుకు స్నేహితులో, ఆప్తులో అయి వుంటారు. ఆ విధంగా రాజ్యానికి పట్టుగొమ్మల్లా పనిచేస్తారు. "గోవల్లభులు" పశుసంపదల పర్యవేక్షకులు. "అరణ్యాధికృతులు" అటవీ శాఖాధికారులు. "అమాత్యులు" మంత్రులు. "గుల్మికులు" సైన్యాలలో వుద్యోగులు (కెప్టెన్‌లు). "దూతికులు" దౌత్యోద్యోగులు. "నాయకొలు - సైన్యాలలో చిన్నవుద్యోగులు (సార్జంట్లు). "సమాచారంతకులు" -వేగులు. రాజులు ప్రత్యేకకార్య నిర్వహణకు పంపేవారు - "బడామనుష్యులు".

ఈ పేర్లనుబట్టీ ఆనాటి ప్రభుత్వ వ్యవస్థ ఎల్లావుండేదో తెలుసుకోవచ్చు. ఇవన్నీ కూడ వంశ పారంపర్యమైన వుద్యోగాలే.

పల్లవుల "పకిరి" దానశాసనం బట్టి "గామ్యకులు" (గ్రామస్థులు), "అధికృతులు", "సర్వాధ్యక్షులు", "వల్లభులు", "శాసనసమాచరణులు" (బడామనుష్యులు) క్రమోత్తరంగా ఉచ్చాధికారులుగా తెలుస్తున్నారు. ఒంగోడు-1 శాసనం "అధికృతు" లనూ, "ఆయక్తకుల"నూ (ప్రత్యేకబాధ్యతలిచ్చి పంపబడినవారు) పేర్కొంటూంది.

ప్రభుత్వోద్యోగాలింతటితో సరికాదు. కాని, కొంచెం ఇంచుమించు వ్యవస్థ ఇదే మాదిరిగా వుండేది. "కసకుడి" రేకులలో "వాయిల్‌కెల్పార్" అనే వుద్యోగులు కనిపిస్తూన్నారు, దానంగా ఇచ్చిన భూముల్నీ, గ్రామాల్నీ పరీక్షించేందుకు అప్పుడప్పుడు రాజు పంపే వుద్యోగులు వీరు. "నైయోగికులు", "వల్లభులు", - వీరు ప్రభువు ఆదేశాలను నిర్వహించేవారుగా

విస్తృతార్థంలో చెప్పబడుతున్నారు.

పల్లవుల ప్రారంభకాలపు దానశాసనాలలో కనబడని "ఆజ్ఞాపతి" వుద్యోగి తరవాత తరవాత కనిపిస్తాడు. కొంత భూమినో, గ్రామాన్నో అగ్రహారంగా ఇవ్వడానికై సిఫార్సుచేస్తాడీ వుద్యోగి. ఆర్థిక వ్యవస్థ దృఢపడినకొద్దీ రాజుల వద్ద మంచి పలుకుబడి కలిగివుండేవ్యక్తులు గ్రామాలలో తలెత్తుతూండడాన్ని ఈ వుద్యోగం సూచిస్తూంది. శాలంకాయనుల పాలనలో కూడా ఈ సంప్రదాయం విస్తృతంగా వుంది. "ములుకూర గ్రామభోజకుడి"ని పెదవేగి శాసనపురేకులు "ఆజ్ఞాపతి"నిగా పేర్కొంటున్నాయి. కళింగదేశపు "తూర్పుగంగులు" కూడా ఈ సంప్రదాయాన్ని పాటించినట్లు హస్తివర్మ నర్సింగపల్లి శాసనంవల్ల తెలుస్తూంది. ఆ దానం సిఫారసు చేసిన ఆజ్ఞాపతి 'బుద్ధమంచి' అనే భోజకుడు.

శాలంకాయనుల పాలనలో రాష్ట్రాధిపతులను "దేశాధిపతు"లనీ, మండల అధికారుల్ని "విషయపతు"లనీ అనేవారు. ఇంక "ఆయుక్తకులు", "అధ్యాకసులు", "నైయోగికులు", "అమాత్యులు" వుండేవారు. వీరికి కేంద్ర, స్థానిక పరిపాలన రెంటితో సంబంధం వుంటుంది. బృహత్పలాయనుల కింద అహారలుండేవి. వాని అధికారులను "వ్యాపృతు"లనేవారు. విష్ణుకుండినుల క్రింద "విషయపతులు", "వల్లభులు", "రాజపురుషులు" అనే పేర్లతో అధికారులుండేవారు.

పొలమూరు దానశాసనంలో "హస్తికోశ", "వీరకోశ" అనే వుద్యోగుల పేర్లు కనిపిస్తున్నాయి. వీరు గజసైన్యంలోనూ, కాల్బలంలోనూ అధికారులు.

ప్రభుత్వోద్యోగులకు భూముల నిచ్చే ఆచారాన్ని హ్యుయాన్-త్సాంగ్ పేర్కొన్నాడు. రాజమాన్యాలు నాలుగు విధాలుగా విభజించబడేవి. ఒక భాగం మీద ఆదాయం ప్రభుత్వ నిర్వహణకూ, దైవారాధనకూ, వేరొక భాగం పెద్ద ప్రభుత్వోద్యోగుల కిచ్చేందుకూ, మరొకటి మహామేధావంతుల కిచ్చేందుకూ, నాలుగోది వివిధ మతాలకు బహుమతులుగా ఇచ్చేందుకూ అంటాడాయన. "మనుస్మృతి" అదే వివరిస్తుంది. 10 గ్రామాల అధికారికి ఒక "కులం" భూమి, 20 గ్రామాల అధికారికి 5 "కులాలు", నూరు గ్రామాల అధికారికి ఒక గ్రామం, వేయి గ్రామాల అధికారికి ఒక పట్టణం ఇవ్వాలంటుంది, ఆ ధర్మ శాస్త్రం.

దానాలిచ్చేది ఎప్పుడూ రాజులే. కాని దానిని అమలు జరిపేది ఉన్నతాధికారులయిన రహస్యాధికృతులూ, మహాదండనాయకులూ, మహామాత్రులు లేక మహాసేనాపతులూ మొదలైనవారే.

కొందరు గ్రహీతలు ప్రత్యేక రాజాభిమానపాత్రులుంటారు. శాలంకాయనరాజు విజయదేవవర్మ గానశర్మ అనే ఆయనకు నదరయిన ప్రదేశంలో 20 నివర్తనల భూమీ, ఇళ్ళస్థలమూ ఇవ్వడమేగాక ఆయన మనుష్యులకీ, ద్వారపాలకులకూ కూడా ఇళ్ళస్థలాలూ, పొలుభూములూ ఇచ్చేడు.

ఈ గ్రహీతలలో కొందరు బ్రాహ్మణులైన అధికారులూ ఉన్నారు. వాశిష్ఠ రాజు అనంతవర్మకు సంబంధించిన శృంగవరపుకోట శాసనం "కిందెప్ప గ్రామ గ్రహీత మాతృశర్మను అంచటపురభోగికుడి"గా పేర్కొంటూంది. "భోగం" అనేది కొంత పరిమితి భూమికి పేరు. "భుక్తి" "బుగత" అనే మాటలకూ "భోగం" అనే మాటకూ మూలధాతువొకటే. అగ్రహారానికి దీనికి తేడా వుంది. అగ్రహారీకుడు కొంతభూమికి పన్ను ఇవ్వనక్కర్లేనివాడు. భోగికుడు కొంతభూభాగానికి అధికారిగా దానిని అనుభవించేవాడు. అతడే గ్రామాధికారి కూడాను. ఈ



భోగికలోంచే భూమిని అనుభవించేవాడనే అర్థంతో "బోయ" శబ్దం వచ్చింది.

శాలంకాయనుల దానాలలో "మూతాద", "మూతుద", "ముత్యాద" అనే పేర్లు కనిపిస్తున్నాయి. వంశ పారంపర్యపు గ్రామతలవరి అనే అర్థంలో దీని నుపయోగించేరు. సాధారణంగా ధనికులైతే ఒకరే వుద్యోగం చేసేవారు. ప్రతిఫలంగా పన్నుల్నివ్వనక్కర్లేకుండా కొంతభూమి వీరికి ఇచ్చేవారు. వస్తురూపంలో మామూళ్ళు వుండేవి. గుంటూరు, నెల్లూరు జిల్లాలలో "మోతాదు" అనే ఉద్యోగి కనిపిస్తాడు. చెరువులకింద భూములకు నీరు సరఫరా విషయం చూసే గ్రామోద్యోగి లేక గ్రామ సేవకుడు ఈతడు.

ఈ కాలంలో రెండు సంస్థల పేర్లు కనిపించేయి. "శ్రేష్ఠి" (పముకనిగము) నాయకత్వంక్రింద "పౌరసమితి" వానిలో ఒకటి. "మతసంస్థల నిర్మాణబాధ్యత గల వ్యక్తియే దానికి అలంకారాలూ చెయ్యాలి. అతడు చేయలేనప్పుడు శ్రేష్ఠి నాయకత్వాన 'పౌరసమితి' ఆ పనిచెయ్యాలి" అని నాగార్జున కొండ శాసనభాగం చెప్తూంది. రెండోది రెండుగ్రామాల సంయుక్త సమావేశం. పల్లవరాజు నందివర్మ కంచివాయిల్, గ్రామస్థుడైన ఒక బ్రాహ్మణునికి భూదానం చేయడం సందర్భంలో కంచివాయిల్, ఉదయచంద్రమండల గ్రామాల ప్రజలు సమావేశమయి "ఈ రెండు గ్రామాల ప్రజలమయిన మేము నేటినుంచి ఒకటిగా కలిసిపోయి ఒకేగ్రామంగా వృద్ధిపొందుతాము" అని తీర్మానించేరు.

చాలసందర్భాలలో ఇటువంటి సంస్థలను ప్రభుత్వ యంత్రాంగంలో భాగంగా గుర్తించడం జరగదు. ప్రభుత్వంతో సంబంధం లేకుండానే ఇవి వ్యవహరిస్తాయి. తగవులు పరిష్కరిస్తాయి. సాంఘిక వ్యవహారాలు చూస్తాయి. పన్నుల వసూళ్ళు పన్నుల అస్సెస్మెంటు చేస్తాయి. వీని కార్యనిర్వాహకుల్ని పైతరగతులనుంచే ఎన్నుకుంటారు. వీనిలో వివిధ ప్రయోజనాలను సమన్వయించి, ఏకాభిప్రాయంద్వారానే నిర్ణయిలు చేస్తారు.

సామంతరాజుల్ని పన్నువసూలు యంత్రాంగంలో భాగంగా చూడడం మొట్టమొదట విష్ణుకుండినులకాలంలో కనబడుతుంది. క్రీ.శ. 530-40లలో పాలించిన రెండవ విక్రమేంద్రవర్మ ఇంద్రపాలనగర శాసనంలో "భూపాలమౌళి మణిమండితపాద పీఠుడు"గా వర్ణించబడతాడు. మౌర్యులకాలంలో సామంతులంటే ఇరుగుపొరుగు రాజులు. ఇప్పుడు వారి హోదా దిగిపోయింది.

సంక్షోభ సమయాలలో ఈ సామంతుల రాజభక్తి బయటపడుతుంది. చాళుక్యరాజు రెండవ పులకేశి (క్రీ.శ. 610-42) విష్ణుకుండినుల రాజ్యంమీద దండయాత్ర చేసినప్పుడు సామంతులు విష్ణుకుండినులకు సహాయం నిలబడలేదు. పులకేశి తమ్ముడు విష్ణువర్ధనుడు ఆంధ్రదేశాన్ని జయించినప్పుడు తాను దక్షిణాపథ మధ్యభాగం నుంచి జీతాలిచ్చి తెచ్చిన నాయకులు చూపిన పరాక్రమానికి బహుమతిగా వారిని మండలాధిపతులనుగా నియమించేడు. గుంటూరుజిల్లాలోని కొండ పడమటిసీమ నేలిన దుర్జయరాజుల మూలపురుషుడు బుద్ధవర్మ అలా వచ్చినవాడే. "ఒంగేరు మార్గ", "నటవాడి", "వెలనాడు", "కొనకండ్రవాడి" మొదలయిన ప్రాంతాలనేలిన దక్షిణాంధ్ర దుర్జయ రాజకుటుంబాల పూర్వులుకూడా కుబ్జవిష్ణువర్ధనునితో వచ్చిన సైన్యనాయకులే అయివుంటారని శ్రీ బి.వి. కృష్ణారావు తమ "హిస్టరీ ఆఫ్ ది ఎర్లీ డైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్"లో వ్రాస్తున్నారు. చాళుక్య సేనాపతి పృథ్వీదువరాజు క్రీ.శ. 612లో సామంత రాజుల బలాన్ని ఓడించేడుగాని ధాన్యకటకంవద్ద ఆనందుకుటుంబానికి చెందిన కందరరాజాచేతిలో క్రీ.శ. 617లో ఓడిపోయేడు. ఈ ధువరాజు పైనుంచి తెచ్చి అధికారంలో

నిలుపబడినవాడే. ఈ సేనాధిపతి రెండవపులకేశి సమక్షంలో కర్మరాష్ట్రంలోని "ఇర్పులి" గ్రామభూమి 800 నివర్తనలను ఒక బ్రాహ్మణుడికి దానం ఇచ్చినట్లు కొప్పారం దానశాసనం తెలుపుతూంది. తాడివాడ దానశాసనంలోని ప్రతి గ్రహీత అయిన పృధ్వీశర్మ "స్వయంగా ఎన్నో క్రతువులుచేసి ఎన్నెన్నో దానాలుచేసిన" వాడు "దానినిబట్టే అతని సంపన్నతను ఊహించవచ్చు" నంటుంది ఆ శాసనం. ఈవిధంగా, అతిబలవంతులూ, ధనవంతులూ అయిన భూస్వామివర్గం సృష్టించబడిందనవచ్చు.

ఆనాడు పరిపాలన వ్యవహారాలు ఎల్లా సాగించబడేవో ఏ శాసనాలూ చెప్పవు. అయితే కొన్ని కొన్ని సంగతులు బయటపడుతుంటాయి. విష్ణుకుండినరాజు మూడవ మాధవవర్మ పొలమూరు శాసనంలో తన్ను అనేక "దివ్య" పరీక్షలు నిర్ణయించిన వాడినిగా వర్ణించుకుంటాడు. ధర్మాధర్మాలూ, దోషా దోషాలు నిర్ణయించడానికై అగ్న్యాది పరీక్షలు పెట్టడం ఆచారంగా వుండేది. కౌటిల్యుని కాలానికివి లేవు. మనువు, యాజ్ఞవల్క్య స్మృతుల నాటికి ప్రారంభమయి, బృహస్పతి కాలంనాటికి తొమ్మిది తరహాల పరీక్షలు అమలులోకి వచ్చేయి. ఈ పరీక్షలను "దివ్య"లంటారు.

1. తులాదివ్య : నేరస్తుడిని ముందు తూచాక న్యాయాధికారి కొన్ని మంత్రాలు చదువుతాడు తరవాత మళ్ళీ తూస్తాడు. రెండోమారు ఎక్కువ తూకం వుంటే అతడు దోషి.
2. అగ్నిదివ్య : దోషిని రావికర్రనిప్పులమీద నడవమంటారు. అతని కాళ్ళు కాలకుంటే నిర్దోషి
3. జలదివ్య : ఒక సైనికుడు ప్రయోగించిన బాణాలను వెతికితెచ్చే వ్యవధి వరకు నీళ్లలో మునిగి వుండగలిగితే నిర్దోషి
4. విషదివ్య : తాచుపామువున్న కుండలోంచి కాటు పడకుండా వుంగరం తియ్యగలుగుతే నిర్దోషి
5. కోశ దివ్య : దేవతావిగ్రహాలను కడిగిన నీరు తాగి 14 రోజులు బతికితే నిర్దోషి
6. తండుల దివ్య : మంత్రించిన బియ్యం నమిలి రావి ఆకుమీద ఉమ్మెయ్యాలి. ఈ బియ్యానికి తడి లేకపోయినా, రక్తం కనిపించినా అతడు దోషి
7. తప్తమస్కదివ్య : మరుగుతున్న నూనెలోంచి నాణెం తియ్యాలి. చెయ్యి కాలకపోతే నిర్దోషి
8. ఫలదివ్య : కాలుతున్న బల్లెపు ఆరును చేతబట్టుకొని కొన్ని అడుగులు వెయ్యాలి. తర్వాత ఆ చేతితో ధాన్యం నలపాలి. చేతులు కందకపోతే నిర్దోషి
9 ధర్మాధర్మదివ్య : వెండితోచేసిన ధర్మమూర్తినీ, సీసంతోచేసిన అధర్మ మూర్తినీ జాడీలో వేస్తారు, అతడు తీసే విగ్రహాన్ని బట్టి దోషాదోషమును నిర్ణయం చేస్తారు.

ఒకటవ మహేంద్రవర్మ గొప్ప పండితుడు. ఆయన వ్రాసిన "మత్తవిలాస" ప్రహసనం ఆనాటిపరిపాలనపై విమర్శ. ఆనాడు న్యాయస్థానాలలో ఎంత లంచగొండితనం పేరుకొనివుందో ఒక ఘట్టంలో విమర్శిస్తాడు. ఒక బౌద్ధ భిక్షువుకి ఒక కాపాలికుడికీ తగవు వచ్చింది. అధికరణ (కోర్టు)కు వెళ్ళి తేల్చుకోమని పాశుపతుడొకడు వారికి సలహా యిస్తాడు. "విహారాలధనం బోలెడుంది గనక భిక్షువు న్యాయాధికారుల నోరు మూయించగలడు. పాముచర్మం, విభూతి తప్ప ఏమీలేని నేను న్యాయస్థానానికెళ్ళి ఏంచెయ్యగల" నంటాడు కాపాలికుడు, ఆ నాటకంలో ఈ దుస్థితిని విమర్శద్వారా చక్కదిద్దగలమని బహుశా మహేంద్రవర్మ భావించి వుంటాడు.

ఆరవ ప్రకరణము

# ఫ్యూడల్ వ్యవస్థ పునాదులు

## భూదానాలు

వ్యావసాయాభివృద్ధికై శాతవాహనుల అనంతరపురాజులుకూడా దోహదం ఇచ్చేరు. ఉత్తరదిశనుంచీ, పశ్చిమోత్తరదిశనుంచీ ఇక్ష్వాకురాజు శాంత మూలుడు ఎందరో బ్రాహ్మణులను రప్పించి తెలుగుదేశంలో స్థిరపడేట్లుచేశాడు. శాంతమూలుడే మరల అశ్వమేధం, వాజపేయంవంటి క్రతువులుచేసి బ్రాహ్మణ కుటుంబాలకు భూములూ అగ్రహారాలూ దండిగా ఇచ్చేడు. ఇదివరకే సాగులోవున్న భూములుగాక కొత్త ప్రదేశాలెన్నో అడవులుకొట్టి సాగులోకి వచ్చేయి. మహారాజ శాంతమూలుడు "కోట్ల కొద్ది హిరణ్యాలనూ, లక్షలాది ఆవులూ, హలాలనూ దానం చేశా"డని నాగార్జునకొండ శాసనాలు చెప్తున్నాయి. హిరణ్యం బంగారునాణేలు కావచ్చు. హలం అన్నదానికి నాగలి, ఒక్కనాగలికింద సాగుకాగల ప్రమాణం భూమి అని రెండు అర్థాలూ వున్నాయి. హిరణ్యకోటి గోదాన దృశ్యాన్నీ చూపుతున్న శిల్పాలు నాగార్జునకొండ వద్ద దొరికేయి.

అంతవరకూ సేవకులుగా బతికే శూద్రులు ఈ దశలో రైతులుగా మారేరు. వారిని వ్యవసాయదారులతరగతిగా హ్యుయెన్-త్సాంగ్ వర్ణించేడు. సాక్షులుగా విచారించకూడని వారిని పేర్కొంటూ, నారదుడు, శూద్రులలో భాగంగా రైతుల్ని పేర్కొన్నాడు. శాసనాలవలన సంఖ్యల వివరాలు తెలియకపోయినా స్వతంత్ర రైతులు, పాలు రైతులు, అర్ధ బానిస వంటివారూ కూడ గ్రామాలలో వున్నట్లు తెలుస్తూంది.

చండాలురనే హీనజాతి ప్రజ గ్రామాలకు వెలుపలనే జీవిస్తారనీ, సంతలకూ, బజార్లకూ వస్తే తమరిని చెప్పుకొనేందుకు వారు ఒక కర్రచెక్క మీద చప్పుడు చేస్తూ వస్తారనీ, ఆ చప్పుడువిని ప్రజలు వారికి దూరం తొలుగుతుంటారనీ ఫాహియాన్ వ్రాశాడు. వీరు వ్యవసాయోపయోగకరములైన గూనలు మొదలైన వస్తువులు తోలుతో కుట్టి తయారుచేస్తారు. ఆ విధంగా వారు సమాజానికి సహాయకారంగా వున్నా, వారిని తక్కువగా చూడడం నేడుకూడాసాగుతూనే వుంది.

ఇక్ష్వాకురాజులు నీటిపారుదల కోసం అనేక చెరువులూ, కాలువలూ తవ్వించారు. పెరంగిమోటుమిట్ట దిగువన 9.14 మీటర్ల వెడల్పూ, 1.82 మీటర్ల లోతూవున్న కాలవ ఒక

కిలోమీటరు దూరం గలది తవ్వకాలలో బయటపడింది. ఆ కాలవ లోతట్టుగట్లు రాతిరివెట్‌మెంట్ చేసి వున్నాయి. నాగార్జున కొండవద్ద కృష్ణానది కుడి గట్టున ప్రాచీనం నాటి మేటదిబ్బ (వార్ఫ్) బయటపడింది. అదీ, అవనిగడ్డ, ఘంటసాలల వద్ద బయట పడిన వస్తువిక్రయశాలలూ ఆనాడు సింహళం, దూరప్రాచ్య, పశ్చిమదేశాలతో ఆంధ్ర దేశానికిగల వాణిజ్య సంబంధాలకు గుర్తులుగా మిగిలి వున్నాయి. వాణిజ్యం పెద్ద ఎత్తున సాగిందిగనకనే రాజులు వలసవచ్చిన బ్రాహ్మణులకు కోట్లాది బంగారమూ, లక్షలాది హలములూ (భూమి) ఇవ్వడం సాధ్యమయింది. పల్లవరాజు ఒకటవ కుమారవిష్ణువు, విష్ణుకుండినరాజు ఇంద్రభట్టారక వర్మ ఇటువంటి దానాలు చేశారు. ఇవిగాక వారు తటాకాలు, దిగుడుబావులు (వాపి), బావులు తవ్వించేరు. ఇక్ష్వాకుల, పల్లవుల, తూర్పు గంగరాజుల, కదంబరాజుల, విష్ణుకుండినులశాసనాలు ఎన్నో వాపీ, కూప, తటాక నిర్మాణాన్ని విశదపరుస్తున్నాయి. ఇవన్నీ శాతవాహనుల అనంతరపురాజులు నీటి పారుదల గురించి తీసుకున్న ఆసక్తికీ, శ్రద్ధకూ నిదర్శనాలు.

ఆర్కోణం-ఆర్కాటు రైల్వేలైనుమీద వున్న షోలింగూరు స్టేషనుకు మూడు మైళ్ళలో మహేంద్రవాడి అనే గ్రామం వద్ద పల్లవ రాజు ఒకటవ మహేంద్రవర్మ పెద్ద చెరువు తవ్వించేడు. ఇప్పుడది శిథిలమై వుంది. దీనిని గురించి ఉత్తరార్కాటు "జిల్లా మాన్యుయలు"లో ఇల్లా వ్రాసేరు: "మహేంద్రవాడిలో మంచి చెరువుంది. ఎప్పుడు తవ్వినదో తెలియదు. ఇది మొదట్లో కావేరి పాక్కం చెరువు కన్న పెద్దదయి వుంటుంది. ఏడెనిమిది మైళ్ళవరకూ భూములకు నీరునిచ్చి వుంటుంది. చెరువుకట్ట చాల ఎత్తు. దానిని మరల మొదటి ఎత్తుకు లేపితే భూమిని సాగులోకి తేవచ్చు."

రాజులు బ్రాహ్మణులకు భూములిచ్చి ఆదరించడం, వారు తలపెట్టిన వ్యవసాయాభివృద్ధి విధానానికి బాగా సాయపడింది.

బ్రాహ్మణులకు పంచాంగంలో పాండిత్యం వుంటుంది. రుతువులగురించిన, రుతుపవనాల గురించిన, విత్తనాలు, భూములుగురించిన జ్ఞానమూ, మతకర్మల నిర్వహణలో అనుభవమూ వారు వ్యవసాయానికి ఎగబడి నిలిచేటట్లు చేశాయి. నూతన మండలాలలో వ్యవసాయాన్ని ప్రాకించేందుకు వారు కారకులయ్యేరు. దిగువ వర్ణాలలో అసంతృప్తి పెరగకుండా వారిబోధలు శాంతపరుస్తూ వచ్చేయి.

శాతవాహనులకులాగానే తదనంతరపు రాజులకు కూడా స్వంత భూములుండేవి. వాటి నుంచి కొంతకొంత దానాలు చేసేవారు. పల్లవరాజు రెండవ కుమారవిష్ణువు తన భూమి 800 పట్టికలలో 432 పట్టికలను బ్రాహ్మణునికి ఇచ్చేడని చందలూరు శాసనాలు తెలుపుతున్నాయి.

అయితే దేశంలోని భూమి అంతా రాజుది కాదు ప్రభుత్వానిది. ప్రభుత్వాధికారిగా దానిని ఇతరులకు ఇస్తాడు. అంటే, ఆ భూమినుంచేవచ్చే పన్నును వదులు కుంటున్నాడన్నమాట. పెండెవాక అగ్రహార వాసులనుంచి రెండున్నర హలాల భూమిని తూర్పుగంగరాజు హస్తివర్మ కొని దానిని దానం ఇచ్చినట్లు ఉర్లాం శాసనం చెప్తూంది. గ్రామస్థులు ఏ ఒకరివద్దనో గాక అందరినుంచీ కొనడంలో ఒక విశేషం వుంది. గ్రామంలో భూమిని రైతులు వేర్వేరుగానే చేసుకుంటారు. దానిమీద వంశపారంపర్యపు హక్కు వుంటుంది. గోభూముల నందరూ వుపయోగించుకుంటారు. కాని ఏఒక్కరికీ తమరు చేసుకుంటున్న భూమిని అమ్మేందుకు అధికారం వుండదు. అమ్మాలంటే, రాజు కైనా సరే, గ్రామం మొత్తంగా నిర్ణయించవలసిందే



రెండు గ్రామాలను ఒకే బ్రహ్మదేయంగా ఏర్పరచాలంటే, రెండు గ్రామాల వారూ సమావేశమయి, అల్లా కలిసి ఒకే గ్రామం కావడానికి అంగీకరించాలి. ఒక్కొక్కప్పుడు ఒక గ్రామంలోంచి కొంతభాగాన్ని విడదీసి దానిని ఇంకో వూరుతో కలిపి, అగ్రహారంగా ఇవ్వడం వుంది. మాధర వంశానికి చెందిన ఉమావర్మ ఇచ్చిన 'బృహత్ ప్రోష్ఠ' దానం ఇటువంటిదే.

శ్రీపురం అగ్రహారం రాజుకు పన్నులిస్తూనే కొన్ని పరిమిత సౌలభ్యాలు కలిగి వుండేది. ఆ పన్నులను కూడా తొలగిస్తున్నట్లు వాశిష్ఠుల శ్రీపుర శాసనం చెప్తూంది.

శాలంకాయనులు తగులబడి పాడుపడిపోయిన ఒక గ్రామాన్ని 157 గురు బ్రాహ్మణులకు ఇస్తున్నట్లు కొల్లేరు దానశాసనం తెలుపుతూంది.

24 వాటాల భూమిని ఎనిమిది మందికి బ్రహ్మదేయంగా ఇచ్చినట్లు బృహత్పలాయనుల కొండముడి దాన శాసనం తెలుపుతూంది. అయితే ఆ 24 వాటాలలో $3\frac{1}{2}$ వాటాలను ఏ 3 ఒక్కరికీ అని నిర్దేశించకుండా వదిలేసేరు. దానిని గోభూమిగానో, దేవాలయం కోసమో వదిలినట్లు వూహించాలి.

కానుకొల్లులో దొరికిన రెండు శాలంకాయన శాసనాలు, రథిక కులానికి (వడ్రంగులు) చెందిన ఇద్దరికి రెండు గ్రామాలను దానం ఇచ్చినట్లు తెలుపుతున్నాయి. ఒక దేవాలయాన్ని పోషించేందుకై అరుటోరుకు చెందిన గొల్లలకు నాలుగు చెక్కల భూమిని దానం ఇచ్చినట్లు శాలంకాయన రాజు రెండవ నందివర్మ పెదవేగిశాసనపు రాగిరేకులు తెలుపుతున్నాయి. ఇటువంటివి చాల అరుదు. శాసనాలన్నీ బ్రాహ్మణులకిచ్చిన దానాలనే తెలుపుతున్నాయి.

ఆనందరాజు దామోదర వర్మ కాంగుర బుద్ధుని ప్రీత్యర్థం 14 మంది బ్రాహ్మణుల కిచ్చేడు! విష్ణుకుండినరాజు గోవిందవర్మ పెంకపార గ్రామాన్ని బౌద్ధవిహార పోషణకోసమని ఒక బ్రాహ్మణుడికి దానం చేసేడు! బౌద్ధానికి, వైదిక మతానికీ మధ్య అంతరం ఎలా సమసిపోతూందో వీనినిబట్టి తెలుసుకోవచ్చు.

సంస్కృత, ప్రాకృత శాసనాలలో భూమి కొలతలకు నివర్తన, పట్టిక అనే మాటలు వాడేరు. కసకుడి శాసనాలను బట్టి ఈ రెండు పర్యాయపదాలని అర్థం అవుతూంది. శాసనాలలో ఆ భూమి పరిమితి ఎంతో చెప్పకపోయినా, 200 మూరల చతురం భూమిని నివర్తనము అంటారు. ఒక నిర్ణీతకాలంలో ఒక మనిషి తాను బయలుదేరిన చోటుని చేరుకొనేటట్లు చుట్టివచ్చిన భూమిని నివర్తనం అంటారు.

బ్రాహ్మణులకిచ్చే భూమిదానాలలో రాజులు 18 తరహాల పన్నులు, మామూళ్ళు, సేవలు మొదలయినవి మినహాయిస్తారు. సాధారణంగా ఏ కొన్నిటినో తప్ప మాపు చేసేవన్నీ చెప్పరు. సంప్రదాయికమైనవిగా అర్థం చేసుకోవలసి వుంటుంది. పల్లవ రాజు శివస్కందవర్మ హిరహడగల్లి శాసనం పన్నుల మినహాయింపుతో పాటు పెరుగు, మజ్జిగ, కూరలు, పువ్వులు ఇవ్వనక్కర్లేదనీ, ఉప్పుకీ, పంచదారకీ ఇబ్బందిపెట్టరాదనీ పేర్కొంటూంది.

ఉప్పుకోసం నేల తవ్వరాదని, బళ్ళు, ఎడ్లు, సరఫరా చెయ్యనక్కర్లేదని, సైనికులు ప్రవేశించరాదని, ఉప్పుడు బియ్యం, వంటకుండలు, మంచాలు, మకాములు ఇవ్వనక్కర్లేదని పల్లవరాజు శివస్కందవర్మ మైదవోలు (గుంటూరు) శాసనం పేర్కొంటూంది.

సాధారణంగా, శాసనాలలో మినహాయింపులను ఖచ్చితంగా పాటించాలని ఉద్బోధించడమే వుంటుంది. కాని, కొన్నింటిలో స్పష్టంగా నిర్దేశిస్తుంటారు. శాలంకాయనుల కానుకొల్లు

(గుడివాడ) శాసనం "ఇతరులు ప్రవేశించరాదు (రాజోద్యోగులు), జోక్యం చేసుకోరాదు. ఉప్పు కోసం నేల తవ్వరాదు. నీళ్ళ కుండలు, అన్నం, మంచాల కోసం నిర్బంధించరాదు. గడ్డి ఆకులు, కూరలు, పప్పులు, పళ్ళు, పెరుగు, పాలు, నెయ్యి, మజ్జిగ సరఫరా చెయ్యమనరాదు" అంటూంది. "చెరువు తూము తెరవడానికి" ప్రతిగ్రహీతను గ్రామస్థులెవ్వరూ అడ్డగించరాదని తూర్పు గంగుల అచ్యుతాపురం (శ్రీకాకుళం) శాసనం విధిస్తూంది.

ఈ మినహాయింపుల్ని జాగ్రత్తగా పరిశీలిస్తే, రాజ్యంలోని కొంత కొంత ప్రదేశంమీద పరిపాలనాధికారాన్ని రాజు వదులుకొంటున్నట్లుగా కనిపిస్తుంది. ప్రతి గ్రహీతలయిన బ్రాహ్మణులు వ్యవసాయదారులచేత వెట్టి చేయించుకొనే హక్కుకలిగి వున్నారని తెలుస్తూంది. పైగా ఈ హక్కులు వారికి వంశపారంపర్యంగా కొనసాగుతాయని కొన్ని శాసనాలు నిర్దేశిస్తున్నాయి. భూములతోపాటు వానిని చేస్తున్న రైతుల్ని కూడా ప్రతిగ్రహీతకు వప్పచెప్పున్నారు. అంటే ఒక విధమయిన దాసప్రథ వచ్చిందన్న మాట. "దాసీ దాస సహస్రానాం దాతా" - అని ఒక శాసనంలో విష్ణుకుండిన రాజు పొగడ్త వుంది. "వేలాదిమంది దాసుల్నీ, దాసీల్ని ఇచ్చే"దని దాని అర్థం.

పల్లవరాజు రెండవ సింహవర్మ బుచ్చిరెడ్డిపాలెం శాసనమువల్ల ప్రభుత్వం వేరు వేరు ప్రజల నుంచి వసూలుచేసే పన్నుల వివరం తెలుస్తూంది. నెల్లూరుజిల్లా కోవూరు తాలూకా విడవలూరు గ్రామం నుంచి "అన్నిరకాల వృత్తుల వారినుంచీ నాకు రావలసిన పన్నులన్నీ బ్రాహ్మదేయంగా మీకు స్వాధీనం చేస్తున్నా" నంటాడు. లోహకారులు, చర్మకారులు, ఆపానపట్టకారులు (దుకాణాలకు పట్టాలిచ్చువారు), రజ్జు ప్రతీహారులు, ప్రావారాంచరులు (దుప్పట్లు అమ్మేవారు), ఆపాన జీవకులు (దుకాణాల మీద బతికేవారు), నాహలాముఖధారులు (దున్నేవారు), కూపదర్శకులు, తంతు వాయులు, ద్యూతకరులు, నాపితులు, ఇంకా ఇతర అన్ని వృత్తులవారూ పన్నులిచ్చేవారుగా చెప్పబడింది. వివాహంమీద కూడా పన్ను ఉండేది.

ఈ శాసనం క్రీ.శ. 5వ శతాబ్దానిది. హిరహడగల్లి, మైదవోలు మొదలయిన శాసనాలలో కనిపించే మాఫీల ప్రసక్తి ఈ శాసనంలో లేదు. కనక దానంతోపాటు 18 రకాల మాఫీలు సంప్రదాయం అయిపోయాయనుకోవాలి.

విడవలూరు శాసనంవల్ల వివిధ తరగతులవారి నుంచి చేసే పన్ను వసూళ్ళ వివరం తెలుస్తూంది. దానిలో "ఆపానపట్టకారు"లని ఒక తరగతి వుంది. అంతకు పూర్వం రాజులు సంక్షోభ సమయాల్లో వర్తక శ్రేణుల నుంచి ధనం తీసుకొని, వర్తకులనుంచి పన్ను వసూలు చేసుకొనే అధికారం వారికిచ్చేవారు. శ్రేణులు దుకాణం పెట్టుకొనేందుకు ధనం తీసుకుని లైసెన్సు ఇచ్చేవి. అయితే ఈ శాసనకాలం నాటికి గ్రామాలు స్వయంపూర్ణాలయాయి. అక్కడ శ్రేణులు వుండే అవకాశం లేదు. బహుశా అక్కడా అక్కడా ఉండేవేమో.

దాన శాసనాలన్నీ రాజుయొక్క ఆయురారోగ్యాభివృద్ధి ధర్మ, విజయాకాంక్షలతో భూమినిస్తున్నట్లు పేర్కొంటాయి. "భూదానంకన్న ఉత్తమ దానం లేదు. దత్తాపహారం కన్న మహాపాపం లేదు" - అనే అర్థం ఇచ్చే వ్యాస "మహాభారత" శ్లోకాన్ని శాసనాలు ఇంచుమించు అన్నీ వుదహరిస్తాయి.



## పరిశ్రమలు - వాణిజ్యం : నగర నిర్మాణ వాస్తువు

కమ్మరులు, చర్మకారులు, నేత పనివారు మొదలైన వృత్తిపనివారంతా గ్రామ స్వయంపూర్ణతకు తోడ్పడుతున్నారని బుచ్చిరెడ్డిపాలెం (శాసనపు) రేకులు చెప్తున్నాయి. కానుకొల్లు (శాలంకాయనుల) రేకులు ప్రతిగ్రహీత వర్ధంగి అని చెప్తున్నాయి. కవచకార భోగం అంటూ ఒక మండలమే వృత్తికారుల పేర పిలవబడుతున్నట్లు పల్లవుల చలదలూరు రేకులు చెప్తున్నాయి.

చిన్న చిన్న కప్పులనుంచి నిలువెత్తు జాడీల వరకూ సారెలమీద తయారు చేసినవి నాగార్జునకొండ వద్ద దొరికేయి. మట్టి వున్న దాకలు, గల్లపిడివున్న మూతలు, మేకులు, టెర్రకోటా అచ్చులు, సీళ్ళు, మైకా ముక్కలు, ఇంకా ఎన్నెన్నో వస్తువులు ఇక్ష్వాకులు నాటివి దొరికేయి.

ఇక్ష్వాకుల రాజధానిలో వృత్తినిపుణుల ఇళ్ళు ఎన్నో కనిపించాయి. ఒక ఇంట్లో స్వర్ణకారుల వృత్తి సామగ్రి యావత్తూ, ఆఖరికి అనేక అచ్చులు, మూసలతోసహా దొరికేయి. మరో ఇంట్లో చెవిరింగులు, రోమనునాణేన్ని పతకంగా అమర్చిన కంఠహారాం మొదలైన నగలున్న నిక్షేపం కనిపించింది. ఫాస్టినా చక్రవర్తి రోమనునాణెం, కొన్ని నగలూ వున్న పాత్ర మరొకటి దొరికింది. ఇవన్నీ చాల పనితనం గలవి. సర్వదేవ దేవాలయంలో దొరికిన వెండి, బంగారు పూజా పాత్రలు చాల అందమైనవి. $8\frac{1}{2}$ సెంటిమీటర్లు ఎత్తువున్న ఒక కంచుబొమ్మ ఆనాటికే తెలుగుదేశంలో లోహశిల్పం ఎంత ఉచ్చస్థాయిలో వుందో చూపుతూంది. నాగార్జున కొండమీది స్తూపాలలో వెండి, బంగారు, రాగితో చేసిన పెట్టెలు, భరిణెలు, మెరుగు కుండలు, బౌద్ధావశేషాలతో, వెండి బంగారు పూవులతో దొరికేయి.

నాగార్జునకొండశిల్పాలలోని స్త్రీ, పురుషులు ధరించిన అనేక తరహాల ఆభరణాలు ఆనాటి ఆభరణ కారుల నేర్పరితనాన్ని చాటుతున్నాయి. ఆరు రకాల బాసికాలను (లలాటపట్టాలు) - ఒకటి రెండువరసల ముత్యాలు, పూసలు వున్నవీ, పతకం వున్నవీ లేనివీ ఆ శిల్పాలలో చూస్తాం. ఆరు రకాల కర్ణాభరణాలు, 10 రకాల కేయూరాలు (దండకడియాలు), 10 రకాల కంఠహారాలు, 5 రకాల మురుగులు, 7 తరహాల రత్నాల వడ్డాణాలు, 4 రకాల అందెలు, ముక్కుపుడకలు, కంకణాలు, కమర్‌బంద్‌లు ఆ శిల్పాలలో కనిపిస్తాయి. ఆ శిల్పాలలో కనిపించే అనేక తరహాల ఆయుధాలు ఆనాటి లోహకారశిల్పనైపుణ్యాన్ని చూపుతున్నాయి. శంఖుకంకణాల ముక్కలు అక్కడ అపారంగా దొరకడంబట్టి ఆ పరిశ్రమ పెద్దగా సాగుతూండిందనవచ్చు.

ఒక్క ఇక్ష్వాకులశాసనాలలోతప్ప మనకు వృత్తిశ్రేణుల ప్రసక్తి కనబడదు. ఒక ఇక్ష్వాకు శాసనంలో పర్ణిక శ్రేణి (తమలపాకులవారి శ్రేణి), పూసిక శ్రేణి (మిఠాయిలు చేసేవారిసంఘం) పేర్లు, మరొకదాంట్లో "కులికప్రముఖుడు" (శ్రేణి నాయకుడు) అనే మాట కనిపిస్తుంది. కొంతమంది ఒక దేవాలయాన్నీ, మంటపాన్నీ కట్టించి, దాని నిర్వహణకై అక్షయనిధిని ఏర్పాటు చేసినట్లు ఒక శాసనం తెలుపుతుంది. అందుకై ఒక శ్రేణిలో 70 దీనారాలూ, మరో మూడు శ్రేణులలో చెరి పది దీనారాలు వుంచేరు. దానిమీద వడ్డీతో చేయించవలసిన పనులేమిటో నిర్దేశించబడలేదు. నాగార్జునకొండ శాసనాలలో బాంకర్లు, వర్తకుల ప్రసక్తి కనిపిస్తుంది కాని, ఎక్కడా వర్తకశ్రేణిమాటే కనబడదు.

ఇక్ష్వాకుల కాలంలోకూడా రోముతో వాణిజ్యం కొనసాగుతూనే వుంది. శాతవాహనులకాలంనాటి తరహాపాత్రలే కనిపిస్తాయి. టెర్రాకోటా బొమ్మలూ, పూసలూలో రోమను ప్రభావం బలంగా కనిపిస్తాయి. ఇక్ష్వాకులకాలపు మట్టిపొరలో దొరికిన మూడు రోమనునాణేలు దీనిని ధృవపరుస్తున్నాయి. నాగార్జునకొండ మహా చైత్యశాసనంలో పుకియకుటుంబానికి చెందిన మహాతలవరి శాంతశ్రీ విహారం పూర్తిచేయడానికై ఒక స్తంభం కట్టించడానికి 170 దీనారమాషకాలు ఖర్చుచేశాడనీ, దేవాలయనిర్వహణకై కొందరు నూరు దీనారాలను నాలుగు శ్రేణులలో డిపాజిటు చేశారనీ (పైన దీనిని చెప్పేము) చదువుతాము.

రోమను చక్రవర్తి అగస్టసు వేసిన బంగారు దీనారాన్ని ఇక్ష్వాకులు తమ నాణెంగా చలామణీ చేసేరు. దక్షిణభారతంలో రోమనునాణేల నిక్షేపాలు చాలా చోట్ల దొరికేయి. పశ్చిమతీరపు గుహాశాసనాలుగాని అమరావతీ శాసనాలుగానీ దీనారం పేరే ఎత్తవు. కనక ఈ శబ్దాన్ని దక్షిణభారతం ముఖ్యంగా తమిళదేశం నుంచి తెచ్చుకొని వుండాలి. అక్కడ రోమను పేటలు కొన్ని దొరికాయి. దీనారం 121 గ్రైన్‌ల బరువు వుంటుంది. దీనారమాషకం దానిలో భాగం అయివుంటుంది. రోమనునాణెం 'జౌరీ' నమూనాలో కుషానులు నాణేలు వేశారు. దీనార మాషకానికీ ఇక్ష్వాకుల సీసం నాణేనికీ మారకప్రమాణం ఏమిటో తెలియదు. శాతవాహనానంతరపు శాసనాలలో 'హిరణ్య'శబ్దం కనిపిస్తుంది. కాని ఏ రాజకుటుంబానిదీ వెండి బంగారునాణెం ఒక్కటేనా ఇంతవరకు దొరకలేదు.

సిహళాన్నిచుట్టి పశ్చిమదేశాలతోనూ, దూరప్రాచ్యదేశాలు, దీవులతోనూ శాతవాహనుల కాలంలో ఏర్పడిన వాణిజ్యమార్గాలు ఇక్ష్వాకులకాలంలోనూ సాగేయి. ఇంకా కొత్తకొత్తదేశాలతో మార్గాలు పెంచబడ్డాయి. ఆంధ్రదేశపు బౌద్ధులు చైనాకంటా తమ సంస్కృతిని వ్యాపింపచేశారని బోధిశ్రీ శాసనం తెలుపుతూంది. కళింగపట్నంనుంచి దక్షిణాన పులికాట్ సరస్సు వరకూ తీరవాణిజ్యం సాగేది. రుషికుల్య, వంశధార, నాగావళి, శారద, తాండవ, గుండ్లకమ్మ, పినాకినీ, స్వర్ణముఖి మొదలయిన నదీముఖద్వారాల రేవులనుంచి తూర్పుదేశాలకు నౌకలు ప్రయాణించేవి. కృష్ణా, గోదావరీనదులలో చాల లోపలవరకూ నౌకలు ప్రయాణించగలిగేవి. ఇంత అనుకూల్యం వుండడంచేత విదేశీ వాణిజ్యం చాలా లాభకరంగా వుండేది. లేకుంటే కొందరు రాజులు క్రతువులుచేసి బ్రాహ్మణులకు అంతంత బంగారం, పశువులు మొదలైనవి ఎల్లా ఇవ్వగలిగారో చెప్పలేము.

దేశీయములయిన వెండి బంగారునాణేలు ఎక్కడా దొరకలేదు. శాతవాహనానంతరపు రాజులు వేసిన సీసం, రాగి నాణేలు దొరికేయి. ఒంగోలులో ఇక్ష్వాకుల సీసపు నాణేలున్న [illegible] దొరికింది. ఈ నాణేలు వస్తువులు కొనడానికి అమ్మడానికి వుపయోగించేరనలేము. బహుశా పన్నుల వసూలుకై వీనిని వేశారనిపిస్తుంది. చిన్నగా, తేలికగా వుండే ఈ నాణేలు అందుకు బాగా ఉపకరిస్తాయి. ఇక్ష్వాకులు తలసరిలెక్కన పన్నులు వసూలుచేసివుంటారు. అందుకోసమే చౌకలోహాలతో నాణేలు ముద్రించి వుంటారు.

పల్లవుల నాణేలంటూలేవు. అయితే విష్ణుకుండినులవి మూడు నాణేల పాతరలు దొరికేయి. అందులో ఒకటి యేలేశ్వరం (నాగార్జునకొండ సమీపంలోది) వద్ద దొరికింది. ఇందులోని నాణేలన్నీ రాగి, సత్తుల మిశ్రమం. కుంభం, సింహం దానిమీది సంకేతాలు. వానిలో కొన్నింటిమీద "వి-క-ర-మ" అక్షరాల పొల్లి కనిపిస్తూంది. అవి క్రీ.శ. 530-440ల నాటి



రెండవ విక్రమేంద్రవర్మ వేసినవిగా భావించబడుతూంది. పల్లవులమీద పొందిన విజయాన్ని సూచిస్తూ ఈ నాణెం వేసివుంటాడు. ఆయన తరువాతి రాజులుకూడా అదే సంకేతంతో నాణేలు వేశారు. కాని వానికుపయోగించిన లోహం శ్రేష్ఠంగా వుంది. పైనచెప్పిన విష్ణుకుండినుల నాణేలపాతులు మూడింటిలో మిగిలిన రెండూ తెలంగాణంలో - ఒకటి భువనగిరి తాలూకాలో, మరొకటి సుల్తానాబాద్ తాలూకాలో దొరికేయి. వీనిలోనివన్నీ రాగి నాణేలు.

స్వయంపూర్ణ గ్రామవ్యవస్థ ఏర్పడినా నాణేల మారక వ్యవస్థ అంతరించలేదని ఈ నిధినిక్షేపాలు రుజువుపరుస్తున్నాయి. ఈ దశలో గవ్వలు మారకద్రవ్యంగా వుండినట్లు ఫాహియాన్ వ్రాసేడు. నాణేల మారకంతో, వాణిజ్య వ్యాపారాలు ఆంధ్ర కోస్తా ప్రాంతానికే పరిమితమయి వుంటాయి. లోతట్టు ప్రాంతాలలో వాణిజ్యం చాలా తక్కువ.

ఈ దశారంభంనాటికే నగర నిర్మాణ వాస్తుశిల్పం ఉన్నత ప్రమాణాల నందుకుంది. ఇక్ష్వాకు రాజధాని విజయపురి చుట్టూ గోడ, బురుజులూ వుండేవి. వానిలో తూర్పువేపు ఒకటీ, పశ్చిమాన కృష్ణవేపు ఒకటీ ద్వారాలుండేవి. కోటగోడల వెలుపల కందకం వుండినట్లు చిహ్నాలు కనిపిస్తాయి. కోటలోపల నివాసగృహాలు, సైన్యాగారాలు, అశ్వశాలలు, నీటితొట్టెలు, స్నానాగారాలు, మూత్రశాలలు, దిగుడుబావుల శిథిలాలు కనిపిస్తాయి. ఇండ్లలోనూ, బయటా బాగా మూసివేసిన మురుగుకాలవలు, శౌచగదులు, సెప్టిక్ గోతులు వున్నాయి. ఇక్ష్వాకు రాజమందిరం జాడ తెలియలేదు. కాని, అశ్వమేధయాగస్థలమూ, స్నానఘట్టమూ రాజమందిరాలకు అనుబంధించే వున్నాయి.

కోట వెలుపల సామాన్యప్రజల నివాసం. వారి ఇళ్ళు వరసలు తీర్చి, రాతితో కట్టి వున్నాయి. విశాలమైన రోడ్లు, చౌరస్తాలు, సందులు వున్నాయి. ఇటుకతో కట్టిన యిళ్ళూ వున్నాయి. కాని కొద్ది. అటువంటి యిల్లొకటి, కడపరాతి మిద్దె, చౌడుమన్ను కప్పు కలిగి వుంది. రాతితో కట్టిన యిళ్ళు పెంకు కప్పి వున్నాయి. మధ్యనున్న మండపం చుట్టూ గదులూ, సావిళ్ళూ కట్టిన యిళ్ళున్నాయి. బహుశా ధనవంతులవయి వుంటాయి.

నగర ప్రధాన కేంద్రాలలో రోడ్డుప్రక్కన విశ్రాంతి మందిరాలు కట్టడం ఇక్ష్వాకుల నగర నిర్మాణ వాస్తువు ప్రత్యేకత. స్తంభాలుగల చావడులూ, మిద్దెలూ వున్న ఒక డజను యిళ్ళవరకూ కనిపించేయి. మూడు జన స్నానశాలలు కనిపించేయి. ఒక నుయ్యి, దీర్ఘచతురస్రపు నీటితొట్టెలు, మురికినీటి నూతులు వున్నాయి. ఒక్కోచోట అవి మురికికాలువలలోకి కలిపివున్నాయి. విశాలమైన హాలు ఒకటి నలుగురూ చేరి తీరికగా గడిపేందుకు వుంది. ధనవంతుల క్లబ్బు కాబోలు- గోడలమీద పానదృశ్యాలు నృత్యదృశ్యాలుగల ఒక భవంతి స్తంభాల మీద లేపినది వుంది.

## బౌద్ధ మతం – వైదిక మతం

విశేషంగా ధనం, పశువులూ, భూములూ ఇచ్చి బ్రాహ్మణులను తీసుకొచ్చి ప్రభువులు ఆదరిస్తున్నా ఇక్ష్వాకుల పాలనలో బౌద్ధమతం పెంపొందుతూనే వచ్చింది.

క్రతువులు యజ్ఞయాగాల్లకై హోమాలు సాగించిన పూర్వపు బ్రాహ్మణులు కారు వీరు, ఉత్పత్తిని పెంచేందుకై పూనుకొన్న బ్రాహ్మణులుగాని, క్రతువులను ఇప్పుడందరూ చెయ్యడంలేదు. చేస్తున్నవానిలో వందలాది పశువుల్ని చంపెయ్యకుండా దానాలుగా ఇచ్చి, వ్యవసాయానికి సాయం చేస్తున్నారు. పైగా బుద్ధుడిని విష్ణువు అవతారాలలో ఒకడినిచేసి రాజీ పడడం కూడా

జరిగింది. బౌద్ధమతం కూడా మహాయానంతో చాల మార్పు పొందింది. నాగార్జునకొండ శాసనాలలో బుద్ధుణ్ణి దేవ పూజితుడుగా, సర్వజ్ఞుడు మొదలయిన విశేషణాలతో పేర్కొడం కనబడుతుంది. మహాయాన బౌద్ధపూజా పద్ధతుల్ని బ్రాహ్మణులు, వైదికపూజా పద్ధతుల్ని మహాయానులు స్వీకరించేరు. బుద్ధుడు దేవదేవుడన్నారు. "దీఘ నికాయ", "మజ్జిమ నికాయ"లను కంఠస్థంచేసిన (వేదాల్నిలాగ) ఆచార్య ఆనందుడు మహాచైత్య పునర్నిర్మాణాన్ని జరిపించినట్లు నాగార్జునకొండ శాసనం ఒకటి చెప్తాంది. మహావిహారవాసి తెగకు చెందిన విహారంలోని పరివ్రాజకులు జ్యోతిష, సాముద్రికాలంలో నిష్ణాతులయ్యారట. బుద్ధవిహారానికి చేసిన దానాల ఫలితమూ, బుద్ధుని ప్రస్తుతించిన ఫలితమూ తరతరాలకు అందుతుందన్న ఫలశ్రుతి విస్తరించింది.

ఒక్క నూరు సంవత్సరాల కాలంలో నాగార్జునకొండ వద్ద 30కి పైగా బౌద్ధ నిర్మాణాలు తలఎత్తేయి. అవి ప్రధానంగా చైత్యాలు (బుద్ధపూజా మందిరాలు), విహారాలు (పరివ్రాజకులు, పరివ్రాజితల నివాస స్థలాలు), చైత్యగృహాలూనే (దేవాలయంలో లాగ దేవతా విగ్రహాన్ని పెట్టి పూజలు జరిపే మందిరాలు).

ఇక్ష్వాకు రాజులూ, రాణులూ, సామాన్యపౌరులూ నాగార్జున కొండవద్ద నిలిపిన అనేక శాసనాలను బట్టి మనకానాటి బౌద్ధమతం యొక్క పరిస్థితి అర్థం అవుతుంది.

ఆనాడక్కడ అపరమహావినశలియ, బహుశ్రుతీయ, మహాశాసక, మహావిహార వాసి అనే నాలుగు బౌద్ధశాఖలున్నట్లు శాసనాలనుబట్టి తెలుస్తాంది. దీనిలో మొదటి రెండూ మహాయాన పంథాకు చెందిన మహాసాంఘికుల నుంచి వచ్చిన ఉపశాఖలు. అయితే అక్కడ నున్న బౌద్ధ నిర్మాణాలు చాలవానిలో ఏవి ఎవరివో చెప్పేందుకు కావలసిన ఆధారాలు లేవు.

నాగార్జునకొండ వద్ద దొరికిన శాసనాలనుబట్టి 5వ శతాబ్దికి చెందిన ఫాహియానూ, 7వ శతాబ్దానికి చెందిన హుయాన్ - త్సాంగూ వర్ణించిన పర్వతం శ్రీ పర్వతం లేక నాగార్జున కొండయేనని గుర్తించవచ్చు. ఫాహియాన్ అక్కడున్న విహారం 5 అంతస్తులు కలిగి వుండేదనీ, దిగువ అంతస్తులో 500, రెండవదాంట్లో 400, మూడవదాంట్లో 300, నాలుగవదానిలో 200, ఐదులో నూరూ రాతితో కట్టిన గదులుండేవనీ, పై అంతస్తుపైన వున్న బుగ్గనుంచి నీరు గదులముందుగా ప్రతి అంతస్తునూ చుట్టి ప్రవహిస్తూ దిగువ అంతస్తులోంచి బయటకు పోతుందని వ్రాసేడు.

ఆయా బౌద్ధపంథాల, శాఖల సిద్ధాంతభేదాల్ని బట్టి విహార నిర్మాణ పద్ధతి వుంటుంది. బుద్ధుని పూజ యెడ నమ్మకంలేనివారు బుద్ధప్రతిమను పెట్టేందుకై చైత్య గృహం కట్టరు. నాగార్జునకొండ వద్దనున్న విహారాల నిర్మాణ వాస్తువు పరిశీలిస్తే బౌద్ధుల తాత్వికాలోచనలలో వచ్చిన పరిణామం అర్థం అవుతుంది. అపర మహా వినశలీయులు మొదట బుద్ధవిగ్రహపూజ నంగీకరించలేదు. తరువాతనే చైత్యగృహ నిర్మాణం ప్రారంభించేరు. వారిలో ఒక శాఖ చైత్యగృహ నిర్మాణమే కాదు, రెండు మూడు దశాబ్దాల కాలంలో బుద్ధవిగ్రహ ప్రతిష్ఠాపనకూడా ప్రారంభించేరు. బహుశ్రుతీయులు ప్రారంభంనుంచీ చైత్యగృహనిర్మాణానికి పూనుకున్నారు. కాని బుద్ధపూజ చెయ్యలేదు. అయితే కొద్ది ఏళ్ళలో వారూ అపర మహావినశలీయుల పంథాకే మారేరు. సింహళీయశాఖ మహావిహారవాసులు ముడుపు స్తూపాల నిర్మాణాన్నీ, బుద్ధపూజనూ కూడ అనుసరించేరు. పూజా పద్ధతి వచ్చేక స్తూప నిర్మాణం వెనకబట్టి పూజాగృహాలు పెద్ద దేవాలయాలుగా మారేయి. వీరపురుషదత్తుని (క్రీ.శ. 240 - 260) పాలన చివరిభాగంలో



థేరవాదులూ, అపరమహావినశలీయులు కూడ చైత్యగృహ నిర్మాణానికి అంగీకరించేరు. అయితే, ప్రధానమైనది స్తూపమా, చైత్యగృహమా అన్న మీమాంస తరువాత తరవాత బయలుదేరింది. చైత్యాలను విహారాలలోనే కట్టడం ప్రారంభించేరు. అంటే ప్రాధాన్యం చైత్యానిదే అయింది క్రమంగా.

బుద్ధుని పూజించడంద్వారా నిర్వాణం సాధించవచ్చుననే భావం బౌద్ధమతం వ్యాప్తికి బాగా తోడ్పడింది. అంతకంతకు ఎక్కువమందిని తమ పంథాకు ఆకర్షించుకోవాలనే పోటీ వేర్వేరు శాఖల, తాత్వికభావాలలోనూ ప్రతిబింబిస్తూంది.

నాగార్జునకొండవద్దనున్న బౌద్ధస్మారకాలను నాలుగు తరగతులుగా విభజించవచ్చు 1) స్తూపము, విహారము కలిసివున్నవి, 2) స్తూపము, విహారము, స్తూప చైత్యముగలవి (చైత్యములో పూజాస్థానంలో స్తూపం వుంటుంది), 3) స్తూపము, విహారము, బుద్ధచైత్యము గలవి (చైత్యములో పూజాస్థానంలో పీఠము, దానిపైన బుద్ధవిగ్రహము గలది), 4) విహారము, చైత్యగృహము వున్నవి.

స్తూపములు మూడుతరహాలవి, నాగార్జున కొండవద్ద వున్నాయి. 1) శారీరక స్తూపం (బుద్ధునివో, ఆయన శిష్యులవో శరీరావశేషాలను వుంచి కట్టిన సమాధి) 2) పారి భౌగిక స్తూపం (పరివ్రాజకుల నీళ్ళకుండలు, భోజనపాత్రలు, భిక్షాపాత్రలు నిక్షేపించి కట్టిన సమాధి) 3) ఉద్దేశికస్తూపం: దీనిలో అస్థికలూ, ఇతర వస్తువులూ వుండవు. బుద్ధునిదో ఆయన శిష్యులదో స్మృతిచిహ్నంగా కట్టినవి. పెద్దస్తూపాల సమీపంలో కట్టిన చిన్న చిన్న ముడుపు స్తూపాలుకూడా అక్కడ చాలా వున్నాయి.

రుద్రపురుషదత్తుడు (క్రీ.శ. 284 - 295) తనతల్లి జ్ఞాపకార్థం ఒక స్తంభాన్ని స్తూపచైత్యం ముందు నిర్మించడం అసాధారణ విషయం. బౌద్ధ దేవాలయాలు రాజకుటుంబ ప్రాముఖ్యతకు పూర్తిగా తలవొగ్గడాన్ని ఇది సూచిస్తుంది.

కృష్ణా, గుంటూరు జిల్లాలలో ఎక్కువగానూ, ఇతర జిల్లాల్లో కొద్ది సంఖ్యలోనూ బుద్ధ విగ్రహాలు లభించేయి. నాగార్జున కొండవద్ద దొరికినవి చాల పెద్దవి. నాగార్జునకొండ, అమరావతి, విజయవాడ, పెద్దగంజాంల వద్ద చలవరాతి విగ్రహాలు దొరికేయి. ఇవన్నీ విరిగిపోయివున్నవే. విజయవాడ విద్యాధరపురంలో దొరికిన బుద్ధ విగ్రహాల తలలూ మొండెమూ రోమను విగ్రహ లక్షణాలు కలిగివున్నాయి. శాలి హుండాం (శ్రీకాకుళం), గుంటుపల్లి (కృష్ణాజిల్లా), అల్లూరు (కృష్ణాజిల్లా, యెర్రపాలెంవద్ద)లలో బుద్ధుని రాతి విగ్రహాలు దొరికేయి. అమరావతిశిల్ప పద్ధతిలో వస్త్రాలు జీరాడుతున్నట్లున్న రాతివిగ్రహం విశాఖపట్నం జిల్లా రామతీర్థం వద్ద దొరికింది.

ఒక్క నాగార్జునకొండ వద్దనే గాక, అనేక ఇతర ప్రదేశాలలో కూడా బౌద్ధస్మారక నిర్మాణాలు కనిపిస్తున్నాయి. ఎత్తయిన గోడలు, అందమైన బాల్కనీలు గల, పలు అంతుస్తులు గల సంఘారామభవనాన్ని హుయాన్-త్సాంగ్ వర్ణించేడు. బహుశా ఇది గుంటపల్లిది అయివుంటుంది. ప. గోదావరిజిల్లా అరుగొలను వద్ద పెద్ద విహారం శిథిలాలు కనిపించేయి. జగ్గయ్యపేట వద్ద విశాలప్రదేశంలో బృహద్విగ్రహాలూ, ఇతర శిథిలాలూ కనిపించేయి. అమరావతిలో కనిపించిన విగ్రహాలంత అందమైనవి చినగంజాం, పెదగంజాం, కనపర్తి, గోలి, రామిరెడ్డి పల్లిలలో దొరికేయి. రామతీర్థంవద్ద పెద్దపెద్ద రాతిస్తంభాలుగల పెద్దచావడి, దానిప్రక్కన వరసగా గదులు,

గదులలో దీపపుగూళ్ళు వున్న విహారం వుంది.

ఇక్ష్వాకులకాలపు వైదిక దేవాలయాలు చాలవరకు కోటచుట్టూనూ, కృష్ణానది వొడ్డున వున్నాయి. ఏ దేవుని ఆలయాలివి, ఎప్పుడు కట్టించేరనేది చాలవాటి విషయంలో చెప్పడం కష్టం. పదకొండింటిని విగ్రహాలనుబట్టో, శాసనాలనుబట్టో చెప్పవచ్చు. వానిలో ఒకటి అష్టభుజస్వామి(వైష్ణవ) దేవాలయం. నాలుగు కుమారస్వామి పుష్పభద్రస్వామి, సర్వదేవస్వామి, నోదగిరిస్వామి, భోజేశ్వరస్వామివి చెరి ఒకటి. ఒకటి శివాలయం, మరొకటి నవగ్రహాలయమూను.

కోటలోపల రెండు తీర్థకుండాలు, స్థంభాలమీద కట్టిన రెండుసొవడులు గుర్తు దొరికేయి. వానిలో ఒక స్తంభంమీద పండుకోబెట్టిన స్త్రీ శవం చెక్కివుంది. మరొకదాని మీద నిచ్చెనమీది నుంచి ఉరుకుతున్న స్త్రీ రూపం చెక్కివుంది. ఇక్కడొక పెద్దరాతి విగ్రహం దొరికింది. ఇది నగ్నస్త్రీ విగ్రహం. తొడలు తెరచి, కాళ్ళు ఎత్తి కూర్చున్నట్లు చెక్కబడింది. మాతృదేవత విగ్రహంగా దీనిని భావిస్తున్నారు. రాణి ఎహువల శాంతమూల దీనిని వేయించింది. దీనిని బట్టి ఇక్ష్వాకుల కాలంనాడుకూడ మాతృదేవతారాధన జరుగుతున్నట్లే భావించాలి.

సైన్యనాయకులు, ప్రముఖకళాకారులు, రాజులు, రాణులు, రాజోద్యోగులు మరణించినప్పుడు వారి జ్ఞాపకార్థం స్తంభాలను నాటడం ఇక్ష్వాకుల కాలంలో ప్రాచుర్యంగా వుంది. వీనిని ఛాయాస్తంభాలంటారు. స్తంభంమీద ఆ వ్యక్తి జీవితంలోని ఒక ముఖ్యఘట్టాన్ని చెక్కుతారు. ఇటువంటివి 22 వరకు తవ్వకాలలో దొరికేయి.

రుద్రభట్టారన్; విష్ణుశ్రీ, స్కందశ్రీ, కుమారమండిక మొదలైన పేర్లనుబట్టి అనేక బ్రాహ్మణదేవతల ఆరాధన సాగుతుండినట్లు గ్రహించవచ్చు. ఇదిగాక నాగపూజలు ఉండనే ఉన్నవి.

బౌద్ధ, వైదికమతాల వ్యాప్తికి రాజాదరణ బాగా తోడ్పడింది. ఇక్ష్వాకు మూల పురుషుడు వాశిష్టీపుత్ర శ్రీశాంతమూలుడు మహాసేన(కుమారస్వామి) భక్తుడు. అగ్నిష్టోమం, అశ్వమేధం, వాజపేయం మొదలైన క్రతువులు చేసేడు. నాగార్జునకొండ వద్ద దొరికిన ఒక స్తంభంమీద హిరణ్యకోటి దానశిల్పం, మరొక దానిమీద గోదాన శిల్పమూ వున్నాయి. మరొక శిల్పంలో ఏడుతలల పాము పడగ పడుతున్న శివలింగాన్ని అడ్డంగాపడేసి కాలికింద తొక్కుతూ ధ్యానముద్రతో కూర్చున్న ఒక గంభీరమూర్తి చెక్కబడివుంది.

శాంతమూలుని కొడుకు వీరపురుషదత్తుడు బౌద్ధమతాభిమాని ఆయన భార్యలు మహాదేవి శాంతిశ్రీ, మహాదేవి బాపిశ్రీనిక, మహాదేవి భాతిదేవలు మహాచైత్య నిర్మాణానికి ధనం ఇచ్చేరు. ఆయన చెల్లెలు శ్రీశాంతమూల శ్రమణులకు, బ్రాహ్మణులకు, బీదలకు అపార దానాలు చేసింది. మరో చెల్లెలు శాంతిశ్రీ పదేళ్ళపాటు మహాచైత్య నిర్మాణానికి విరాళాలిచ్చింది. ఆయన చెల్లెళ్ళు, తల్లులు, ఉపభార్యలు మొత్తం 30 మంది వరకూ కలిసి రెండు స్తంభాలు వేయించేరు. ఈ రాజవంశంలోని ఆఖరు ఇద్దరూ - ఎహువల శాంతమూలుడు, రుద్రపురుషదత్తుడూ వైదికమత పోషకులు. ఆ కాలంనాటి వైదిక దేవాలయాలన్నీ వీరు కట్టించినవే. అయితే ఎహువల శాంతశ్రీ సోదరి కొడబలిశ్రీ విహార నిర్మాణానికి ధనం ఇచ్చింది. రాజులూ, రాజబంధువులేగాక ఒక మహాతలవరి, పుగియకుటుంబానికి చెందిన ఒక మహాసేనాపతిభార్య, మహాసేనాపతిని చూలశ్రీ, ఒక మహాసేనాపతి భార్య-వీరంతా మహాచైత్యంలో ఒక్కొక్క స్తంభం వేయించేరు. మహాతలవర ఎలిశ్రీ సర్వదేవ దేవాలయం కట్టించేడు. ఆ విధంగా బౌద్ధ, వైదిక మతాలవ్యాప్తికి



సామంతులుకూడా తోడ్పడ్డారు.

ధనిక కుటుంబాలకు చెందిన భక్తులు ఈ రెండు మతాలకూ ధారాళంగా విరాళాలిచ్చేరు. బోధిశ్రీ అనే భక్తురాలు సింహళం నుంచి వచ్చిన పరివ్రాజకుల కోసం ఒక చైత్యసావడిని నిర్మించింది. అదిగాక ఒక దేవమందిరం, మండపస్తంభం, సభాస్థలం, ఘంటసాల మహాస్తూపం వద్ద ఒక రాతిమంటపం కట్టించింది. ఒక వర్తకుని కూతురు రతవశ్య, అంతఃపురాధికారిణీ, మరికొందరూ నోదగిరిస్వామి దేవాలయం కట్టించేరు. దాని పోషణకు శాశ్వత ఏర్పాట్లు చేశారు.

కార్మికరాష్ట్రవాసియైన సిద్ధార్థుడనే వృత్తికుశలుడు సకుటుంబంగా జగ్గయ్యపేటవచ్చి మహాచైత్యంవద్ద బుద్ధుని గౌరవార్థం అయిదు ఆయక స్తంభాలను నిర్మించేడు.

ఎహువల శాంతమూలుని కాలంనాటి రెండు శాసనాలలో ఒకటి శాంతశ్రీ అనే ఉపాసకుడు బుద్ధుని గౌరవార్థం పండుగలలో అనేకచోట్ల చేసిన దానాలను పేర్కొంటే వేరొకటి కుమారనంది అనే శ్రేష్ఠిచైత్యంలో బుద్ధ విగ్రహాన్ని ప్రతిష్ఠించినట్లు పేర్కొంటూంది. యోగులు (బ్రాహ్మణ సన్యాసులు), శ్రమణులు కూడ ఎంతో గౌరవించే కోడారక అనే ఆయన స్మారకస్తంభం వేయించేడు. ఇవన్నీ ఆనాటి ఆలోచనా ధోరణులను తెలుపుతున్నాయి.

జాతకచక్రం వేస్తున్నట్లు ఒక శిల్పం, థేరవాద బౌద్ధులు ఒక మహా విహారంలో పరివ్రాజక ప్రతిజ్ఞామంత్రాలను వేదప్రవచనంలాగ చదువుతున్నట్లు ఒక శాసనం. మహాదేవి భాటిదేవి ఇచ్చిన బహుమానాన్ని దేవీవిహారంగా వర్ణిస్తూంది మరో శాసనం. రెండు మతాల మధ్యా పోలికలు పెరుగుతున్నా యనడానికి ఇవి నిదర్శనాలు.

ఇక్ష్వాకుల కాలంలో బౌద్ధ, వైదిక మతాల మధ్య సహజీవనం యాదృచ్ఛిక సంఘటన కాదు. బౌద్ధవిహారాలలో పోగుపడిన సంపదలు దేశం లోతట్టు వణిజుల బిడారులకు పెట్టుబడుల్ని సమకూరుస్తున్నాయి. ఆదేవిధంగా వలస వచ్చిన బ్రాహ్మణులు అడవులు కొట్టి, వ్యవసాయం అభివృద్ధి చేస్తున్నారు. ఈ సహజీవనం ఇక్ష్వాకుల తరవాతకూడా కొనసాగింది. అయితే క్రమంగా బౌద్ధమతం క్షీణించింది. వైదికమతం దాని స్థానాన్ని ఆక్రమించింది.

బృహత్పలాయనుల కాలంలో మతం పరిస్థితి ఏమిటో మనకి తెలియదు. జయవర్మరాజును పరమ మహేశ్వరునిగా పేర్కొన్న ఒకే ఒక శాసనం దొరికింది.

శాలంకాయనరాజవంశ మూలపురుషుడు విజయదేవవర్మ అశ్వమేధయాజీ, పరమ మహేశ్వరుడున్నూ. ఆయన తరవాత రాజు నందివర్మ పరమ భాగవతుడు. దేవుడు విష్ణుగృహస్వామికి దానాలిచ్చేడు. అయితే తన్ను వివిధ ధర్మ ప్రధానుణ్ణిగా చెప్పుకుంటాడు(మతసహనం వున్నవాడు). ఈ కుటుంబంవారు వేసిన శాసనాలు కొన్నిటిలో వారు సూర్యోపాసకులని చెప్పేమాట "భాగవత-చిత్రరథస్వామి-పాదానుదాసు" అని వుంది. ప్రకృత్యు పాసనలలో బ్రాహ్మణులు ఆమోదించి ప్రాచుర్యంలో వున్నదీ సూర్యోపాసన అనాలి. పరమభాగవతులయిన శాలంకాయనులు బౌద్ధాన్నీ ఆదరించారు. బర్మాలో బౌద్ధమతవ్యాప్తికి వారు కారణమని చెప్తారు. శాలంకాయన కుటుంబానికిచెందిన బర్మారాజు శాన్‌లాన్ క్రోమ్, బుద్ధఘోషుడు, సింహళీయుడైన బుద్ధదత్తుడు సమకాలీనులని "శాసనాలంకార" అనే బౌద్ధగ్రంథం చెబుతూంది.

ఆనంద గోత్రీకుడైన రాజు దామోదరవర్మ బుద్ధభక్తుడూ, ఉపాసకుడూను. రెండోవేపున కంగూర గ్రామాన్ని 14 మంది బ్రాహ్మణులకి బ్రాహ్మదేవంగా ఇచ్చేడు. గోసహస్రహిరణ్యగర్భ క్రతువులు చేశాడు. ఆనందరాజులలో ఒకరు చేజెర్లలో కట్టించిన కపోతేశ్వరాలయం ఒకప్పుడు

బౌద్ధచైత్యంగా వుండేది.

పిఠాపురం, సింహపురం, కందలి పాలించిన రాజులు తమ్ము పరమ బ్రహ్మణ్యులు, పరమ మాహేశ్వరులు, పరమభాగవతులుగా చెప్పుకొన్నారు. కాని వారు ఏ ఆలయాలు కట్టించి నట్లు గుర్తులు లేవు, శాసనదాఖలాలూ లేవు. వారే క్రతువులూ చేసినట్లు లేదు.

ఇక్ష్వాకులు అనంతరం తూర్పు, దక్షిణాంధ్రాలను పాలించిన పల్లవులు వైదికమతానుయాయులు. ఆద్యపల్లవరాజులలో ఒకడైన శివస్కందవర్మ అగ్నిష్టోమ, వాజపేయ, అశ్వమేధయాగాలు చేశాడు. "ఎన్నో కోట్ల బంగారమూ, లక్ష హలాలూ" బ్రాహ్మణుల కిచ్చేడు. ఆయనవంశీకుడు కుమారవిష్ణువు అశ్వమేధయాజి. పల్లవుల దానాలన్నీ బ్రాహ్మణులకో, శివ, విష్ణుదేవాలయాలకో ఇచ్చినవే. వానిలో బుద్ధుని గురించిగాని, బౌద్ధమతంగురించిగాని ప్రసక్తిలేదు. అనంతర కాలపు పల్లవ రాజులలో ఒకడైన మూడవ సింహవర్మ ధాన్య కటకంలో బౌద్ధ దేవాలయాన్ని దర్శించి, కొంత కాలం బోధనలు విని, బంగారు, వెండి తాపిన బుద్ధ విగ్రహాన్ని ప్రతిష్టించినట్లు ఒక శాసనం చెప్తూంది. అంతే. ఆ రాజకుటుంబీకులు శివ, విష్ణుదేవాలయాలను కట్టించినట్లు అనేక శాసనాలున్నాయి. ధాలూరులో కుల మహాతారక( నారాయణ) దేవాలయం, కందుకూరు విష్ణుహారదేవాలయం, వెంకటేశ్వరంలోని శంభుదేవాలయం వారు కట్టించినవే. చేజెర్ల కపోతేశ్వరాలయానికి ఒకటవ మహేంద్రవర్మ పోషకుడు.

ఆద్య పల్లవరాజా కట్టించిన శివాలయాలు ప్రసిద్ధికెక్కిన బౌద్ధధర్మ కేంద్రాలవద్దనే వున్నట్లు హుయాన్‌త్సాంగ్ వ్రాతలుబట్టి తెలుస్తూంది. మహాబలిపురంలో ఆదివరాహదేవాలయాన్ని కట్టించినది ఒకటవ మహేంద్రవర్మ. అచ్చటి గుహాలయాలను కట్టించిన ప్రథముడు ఆయనే. ఆ గుహా శిల్పాలలో ఇద్దరు పల్లవరాజులు-సింహవిష్ణువు, ఆయన కొడుకు మహేంద్రవర్మ-తమ భార్యలతో కనిపిస్తారు.

మహేంద్రవర్మ వ్రాసిన "మత్తవిలాస" నాటకంలో శైవమతశాఖలయిన కాపాలికుల పాశుపతుల ప్రసక్తి వస్తుంది. వీరు భైరవునికీ, కాళికీ మద్యం, మానవరక్తం నైవేద్యం పెట్టే తాంత్రికులు. మహాబలిపురంలో వరాహమండపంలో పద్మం మీద నిలబడివున్న దుర్గామాత విగ్రహం వుంది. ఆమెముందు మోకరిలబడివున్న భక్తులలో ఒకడు దేవికి కానుకగా యిచ్చేందుకై తన తల నరుక్కోడానికి సిద్ధంగా వున్నట్లు చూపబడింది. భైరవుని రూపంలో శివునిగాని, కాళీ, దుర్గల రూపంలో పార్వతినిగాని పల్లవరాజులు ఎవ్వరూ పూజించిన దాఖలాలు లేవు.

పల్లవుల కాలంనాటి బౌద్ధమతం రాజాదరణ లేకపోయినా ఇంకా చాల బలంగానే వుంది. "మత్తవిలాస" నాటకంలో కంచిలో బౌద్ధశ్రమణుల విషయం వస్తుంది. ఒక శ్రమణపాత్ర కంచిలోని విహారాన్ని ధర్మదాసనే వర్తకుడు పోషిస్తున్నట్లు చెప్తాడు. ఇతర విహారాలనుంచి దానికే ఎంతో ఆదాయం వస్తుందట. దానిని బట్టి కంచిలోని విహారం ఆ చుట్టుపక్కలనున్న అనేక విహారాలమీద ఆధిపత్యం కలిగివున్నదనుకోవాలి.

అయిదో శతాబ్దిలో కంచీనగరంలో దిజ్నాగుడు, ధర్మపాలుడు, బోధి ధర్ముడు వంటి బౌద్ధధర్మదార్శనికులు ఎందరో పుట్టి పెరిగి ప్రబోధాలు చేశారు. వీరిలో దిజ్నాగుడు యోగదర్శన ప్రబోధకుడు. హుయాన్‌త్సాంగ్ కంచిని దర్శించినప్పుడు అక్కడ సింహళం నుంచి వచ్చిన 300 మంది భిక్షువులు యోగదర్శనం అభ్యసిస్తున్నారంటాడు. వారిలో కొందరితో ఆయన మాట్లాడేడట. బోధిధర్ముడు ఒక పల్లవరాజా కొడుకు. 6వ శతాబ్ది ప్రారంభంనాటి వాడు.



ఈయనది ధ్యానపంథా. ధర్మపాలుడు దిజ్నాగుని శిష్యుడు. సంస్కృతంలో ఎన్నో వ్యాఖ్యలు వ్రాసేడు. ఆనాడు వచ్చిన చైనాయాత్రికు లెవరూ పల్లవరాజుల పోషణ బౌద్ధమతానికున్నదని చెప్పకపోవడం చేత ఆనాడు బౌద్ధసంస్థలన్నీ ప్రజల ఆదరణలోనే వర్ధిల్లాయని చెప్పుకోవలసివుంది.

విష్ణుకుండినులు అటు వైదికమతాన్నీ ఇటు బౌద్ధమతాన్నీ కూడా ఆదరించేరు. విక్రమేంద్ర, గోవింద, మాధవ, ఇంద్రభట్టారక మొదలైన పేర్లే వారు వైదిక మతానుయాయులని చెప్తున్నాయి. వారిలో చాలమందికి పరమ మాహేశ్వర, పరమ భాగవత అనే బిరుదులున్నాయి. రెండోవేపున వారు బౌద్ధవిహారాలకు ఎంతెంతో ధనం దానమూ చేశారు. ఇంద్రపాలనగర దానశాసనం, రాజా గోవిందవర్మ వర్ణాశ్రమ ధర్మాలయందు భక్తివిశ్వాసాలు కలవాడంటుంది. 18 బౌద్ధమతశాఖల తాత్వికపంథాలను క్షుణ్ణంగా తెలిసి, మానవజాతిని జీవన్, మరణ, దుఃఖాలనుంచి సముద్ధరించేందుకై యజ్ఞాది కర్మలు చేసే దశబలబలి అనే ఆయనకు పెంకపర గ్రామాన్ని దానం ఇచ్చినట్లు చెప్తూంది. ఆయన పట్టపురాణి పరమ మహాదేవి నిర్మించిన విహారంలో ఏ లోటూ రాకుండా నిరంతరాయంగా ధూప దీపాలు సాగడానికీ, పాన, భోజనాదులకీ, పశుగ్రాసానికీ, వైద్యసహాయానికీ, మరమ్మత్తులకీ దానం చేశాడు. ఆ విహార నిర్మాణానికై ధనం రాజకోశం నుంచే వెళ్ళింది. ఈ దాన శాసనం సుదీర్ఘమయిన బుద్ధప్రశస్తితో ప్రారంభమవుతుంది.

ఆదేకుటుంబానికి చెందిన విక్రమేంద్ర భట్టారకవర్మ ఆదే విహారానికై ఇరున్నెరు అనే గ్రామాన్ని దానం చేసినట్లు మరో ఇంద్రపాలనగర శాసనం చెప్తూంది. తాను "కట్టించిన అనేక విహారాలు కారణంగా బ్రాహ్మణుల దయకు పాత్రుడై ఎంతో ప్రశస్తి పొందా"ననీ, "బౌద్ధమతాన్ని ఎంతో గౌరవిస్తాన"నీ చెప్పుకుంటాడు. ఈ ఉదాహరణలనుబట్టి 5, 6, శతాబ్దాలనాటికి బౌద్ధ వైదికమతాల మధ్య అంతరం ఎంత తగ్గిపోయిందో గ్రహించవచ్చు. ఇంద్రపాలనగరం నల్లగొండ జిల్లా రామన్నపేట తాలూకాలోని ప్రాచీన నగరం. ఇక్కడ ఇప్పుడు అనేక దేవాలయాల శిధిలాలు కనిపిస్తున్నాయి.

బంగారంతో చేసిన నిలువెత్తు బుద్ధవిగ్రహాలు శ్రీపర్వతం మీద వున్నాయని హుయాన్‌త్సాంగ్ వ్రాసేడు. కాని అవి ఇప్పుడు కనిపించవు. 1 నుంచి 5 అంగుళాల వరకూ వున్న రాగి బుద్ధవిగ్రహాలు క్రీ.శ. 4, 5 శతాబ్దాల నాటివి రేపల్లె సమీపంలోని బుద్ధనిలో, అమరావతిలో దొరికేయి.

బ్రాహ్మణులూ, వారి దేవాలయాలూ అంతకంతకు ప్రజలకు దగ్గరవుతూవుంటే శ్రమణులూ, వారి విహారాలూ ఉత్పత్తిరంగానికి దూరం అవుతూ, అనుభవైకపరులుగా, సమాజం మీద ఉద్దరిగా బతికేసే బదనికలయ్యారు. రాజభవనాలవంటి వసతులలో, భోగమయ జీవితం సాగిస్తూ నియమ నిబద్ధ జీవితానికీ, నైతిక విధులకూ తిలాంజలు లిచ్చేసేరు. మాధ్యమిక శూన్యవాదం ఈ భౌతిక ప్రపంచం అబద్ధం అంది. సర్వం భ్రమ అంది. ఇది, ఆంతరిక ప్రపంచమే నిత్యమనే యోగాచారానికి దారితీసింది. దానిలోంచి అనేక తాంత్రికాచారాలు, శక్తి పూజలు వచ్చేయి. బౌద్ధ నిర్మాణ చిహ్నాలుగా ఆంధ్రదేశంలో కనిపించే మట్టిదిబ్బలను "లంజదిబ్బ"లనీ, "భోగందానిదిబ్బ"లనీ పిలవడం మామూలయిందంటే, వాని పతనాన్ని ఊహించుకోవచ్చు. శాలిహుండాం, ముఖలింగం మొదలైనచోట్ల శక్తి పూజా చిహ్నాలు కనిపించేయి. శాలిహుండాంలో మూడు తలలు, ఆరు చేతులు వున్న నిలువెత్తు మరీచి విగ్రహం (రాతిది) దొరికింది. ఇది జపితాభశక్తి. దాని ఊర్ధ్వశరీరం మీద ఆచ్ఛాదనం లేదు. దిగువభాగానికి సన్నని వలిపెం

కట్టుకొనివుంది. దాని కాళ్ళవద్ద ఇద్దరు ధ్యానబుద్ధులున్నారు. ఇటువంటి విగ్రహాలు తాంత్రిక శక్తి పూజాపద్ధతుల పెరుగుదలను సూచిస్తాయి. బౌద్ధశాక్తేయులు శ్రీకాంకలియే శ్రీకాకుళం అయివుంటుందనీ, వజ్రయానపంథాను అనుసరించాకనే ధాన్యకటకం 'ధరణికోట' అయివుంటుందనీ శ్రీ బి.వి. కృష్ణారావుగారు వూహిస్తున్నారు.

పర్లాకిమిడి రాజా సత్రంలోనూ, దేవాలయంలోనూ వున్న శిల్పాలూ, విగ్రహాలూ చూస్తే ముఖలింగంలో వజ్రయానంవంటి పిదపకాలపు బౌద్ధమత రూపాలూ, రక్తపిపాసిదేవతారాధనలూ, భగపూజాదులూ ప్రచలితంగా వున్నట్లు 1919నాటి ఎపిగ్రాఫిస్టుల రిపోర్టు తెలుపుతూంది.

ఆ విధంగా, కర్మకాండను వ్యతిరేకించడంతో ప్రారంభమైన బౌద్ధం వైదిక మతంలాగే కర్మకాండను స్వీకరించింది. దేవుడి అస్తిత్వాన్ని నిర్లక్ష్యం చేసిన మతం బహుళ దేవతారాధనకు పూనుకొంది. నైతిక నియమాలు పోయి, విహారాలు వ్యభిచారగృహాలయాయి. ప్రారంభదినాలనాటి సామాజిక నిబంధనలు సర్వామోదయోగ్యం అయినవి. దేశాన్ని పురోగమింపచేసేవిగా ప్రజామోదం పొందేయి. నిర్దుష్టమైన సామాజిక ఆలోచనలతో వ్యక్తి తన మనస్సును పరిపక్వం చేసుకోవాలన్న సత్యం మరుగున పడింది.

నాగార్జున కొండవద్ద దొరికిన 5వ శతాబ్దపు ఒక శాసనంలో "ధర్మకథకుడు" అనే పేరు కనిపిస్తుంది. వేద, వేదాంగాలు చదివి, నిరర్గళంగా మాట్లాడగల నేర్పుగలిగి ధర్మబోధలు చేసేవాడని ఆ శాసనం వర్ణిస్తూంది. నాగార్జునాచార్యుని శిష్యుడూ, జయప్రభాచార్యుని శిష్యుడూ అయిన చంద్రప్రభ బుద్ధవిగ్రహాన్ని ప్రతిష్ఠించినట్లు 6వ శతాబ్దపు జగ్గయ్యపేట శాసనం తెలుపుతూంది. ఈ నాగార్జునుడు 24 మంది సిద్ధులలో ఒకడైన సిద్ధ నాగార్జునుడు. భావవివేకుడనే ఆయన 3 ఏళ్ళపాటు ధాన్యకటకంలో వజ్రపాణిధరణి సూత్రాన్ని జపించగా, వజ్రపాణిదేవుడు ఆయనకు రహస్యమంత్రాన్ని ఉపదేశించేడనీ, అది ఆయన నిర్వాణం పొందడానికి తోడ్పడిందని హుయాన్‌త్సాంగ్ వ్రాసేడు.

అమరావతి విహారంలో వున్న భిక్షువులకూ, బ్రాహ్మణులకూ ఒకమారు వాగ్వాదం వచ్చిందనీ, తీర్పుకోసం భిక్షువులు రాజుదగ్గరకు వెళ్ళగా చూసి బ్రాహ్మణులు విహారాన్ని ఆక్రమించుకొన్నారనీ హుయాన్‌త్సాంగ్ వ్రాస్తున్నాడు. 5వ శతాబ్దిలో పాలించిన విష్ణుకుండినరాజు ఒకటవ మాధవవర్మ కాలంలో ఇది జరిగివుండవచ్చునని భావించబడుతూంది.

ధాన్యకటకంలోని విహారాలెన్నో పాడుపడి వున్నాయనీ, మొత్తం నూరుమందికి మించని భిక్షువులు ఓ 20 విహారాలను వుపయోగిస్తున్నారనీ, వారంతా మహాసాంఘిక పంథాకు చెందినవారేననీ హుయాన్ త్సాంగ్ వ్రాసేడు. నూరువరకూ దేవాలయాలక్కడున్నాయనీ, వివిధ మత ధోరణుల ననుసరించేవారు అసంఖ్యాకంగా వున్నారనీ ఆయనే వ్రాస్తున్నాడు. ఆంధ్రదేశంలో రమారమి 3 వేలమంది భిక్షువులుగల 20 చిల్లర విహారాలున్నాయనీ, కళింగంలో బౌద్ధులు కొద్దిమందీ, ఇతరమతాల వారు అసంఖ్యాకంగా వున్నారనీ వ్రాసేడు.

బౌద్ధమతం వైదికమతంలో చేరిపోతున్నకొద్దీ శివుడూ, తాంత్రికవాదుల దేవత తారా దుర్గగా ఆయన భార్య అయి పూజలందుకోసాగేరు. నాగార్జునకొండ దేవాలయంలో శివుడు శ్రీ పర్వతస్వామిగా, దుర్గ ఆయన భార్యగా పూజలందుకున్నారు. అక్కడ దుర్గాలయం కూడా వుంది. రామతీర్థం, బెజవాడ మొదలైనచోట్ల దుర్గాలయాలు వెలిశాయి. వీలయినచోట్లనల్లా



వైదిక దేవీదేవులు చైత్యాలను ఆక్రమించేరు.

ఆంధ్రదేశంలోని కొన్ని దేవాలయాలు వాస్తుశిల్పం చూస్తే అవి బౌద్ధవిహారాలను మార్చికట్టినవేనని తెలుస్తుంది. అమరావతిలోని అమరేశ్వరాలయాన్ని స్తూపం దిబ్బమీద కట్టేరు. రామతీర్థం, సింహాచలములోని విహారాలను బ్రాహ్మణులు పట్టుకున్నారు. అనకాపల్లి, గుంటుపల్లిలలోని సంఘారామాలను లింగక్షేత్రాలుగా మార్చేరు. శ్రీశైలంలోని బౌద్ధదేవాలయాన్ని మల్లికార్జునుడు ఆక్రమించేడు. వినుకొండ తాలూకా పెదకంచెర్లలోని బౌద్ధక్షేత్రంలో లింగాలూ, పానవట్టాలూ దొరికేయి. బెజవాడ, మొగల్రాజపురం, ఉండవల్లి గుహాలయాలు చూస్తే, బ్రాహ్మణ, బౌద్ధనిర్మాణవాస్తువులకు చాల దగ్గర పోలికలు కనిపిస్తాయి. ఉండవల్లి గుహాలయం విహారంలాగే వుంటుంది. బెజవాడ-ఉండవల్లి గుహాలయాలలో కన్న మహాబలిపురంలో వాస్తువు మరింత పరిపక్వ స్థితికి వచ్చింది. అక్కడి ద్రౌపదిపథం అన్నది ఒక మండపం. దాని కప్పు అమరావతి శిల్పాలలో దానికి ఎంతో భిన్నం కాదు.

కంచిలో ఆదిశంకరుడు వాదంలో అనేకమంది బౌద్ధులను ఓడించేడన్న జనశ్రుతి ఆనాటి పరిస్థితులకు అనుగుణంగానే వుంది.

ఆంధ్రలో జైనమత ప్రాభవం అంత చెప్పదగింది కాదు. దేశంలోని నాలుగు జైన విద్యా కేంద్రాలలో పశ్చిమగోదావరిజిల్లా పెనుగొండ ఒకటి. పిఠాపురం, నేదునూరు, తాటిపాక, ఆర్యవటం, ద్రాక్షారామ (ఇవన్నీ తూర్పు గోదావరి జిల్లాలోనివే.) ఒకప్పుడు జైనక్షేత్రాలుగా ప్రసిద్ధి. కొలనుపాక సుప్రసిద్ధ జైనక్షేత్రం. గుంటుపల్లిలో దొరికిన శాసనాన్ని బట్టి అక్కడున్న బౌద్ధక్షేత్రాలు అసలు జైనమందిరాలేననీ, కాల క్రమంలో అవి బౌద్ధాలయాలయి ప్రసిద్ధి పొందేయని తెలుస్తూంది.

## భాష - సాహిత్యం

ఈ చారిత్రకదశలో రాజశాసనాల భాష క్రమంగా ప్రాకృతం నుంచి సంస్కృతంలోకి పరివర్తన పొందింది. శాతవాహనుల శాసనాలన్నీ ప్రాకృతంలోనే వున్నాయి. వారి తరవాతకూడా కొద్దికాలం అదే కొనసాగింది. క్రమంగా సంస్కృతం వచ్చేసింది. సాహిత్యంలోను ఇదే జరిగింది. నిజానికి మార్పు దేశిభాషలలోకి రావలసింది. కాని అది జరగలేదు. వెనుకకు మలుపు వచ్చింది. ఈ అసహజ పరిణామానికి కారణం బ్రాహ్మణ వర్గానికి ఈ దశలో వచ్చిన ప్రత్యేకపాత్రా, హోదాను. గ్రామ ఆర్థికవ్యవస్థ పెరుగుదలకు బ్రాహ్మణులను పని కట్టుకొని ప్రవేశపెట్టడం వలన, వారి కర్మకాండను సుస్థిరంచేయడం జరిగింది. ఈ కర్మకాండలలో వుపయోగించే మంత్రాలకు ప్రాచీనతరమైన సంస్కృత భాష ప్రత్యేకతనిస్తుంది. అందుచేత రాజుల వత్తాసుతో బ్రాహ్మణవర్గం కర్మకాండలనూ, సంస్కృత భాషనూ బ్రతికించి వుంచింది.

ఆంధ్రప్రాంతంలో రాజభాష సంస్కృతం ఎప్పుడయిందో చెప్పే అవకాశాలున్నాయి. మూడవ ఇక్ష్వాకురాజు ఎహువల శాంతమూలుని పరిపాలన (క్రీ.శ. 260-284) పదకొండవ సంవత్సరానికి పూర్వం వేసిన ఆయన శాసనాలన్నీ (మొత్తం-5) ప్రాకృతంలోనూ, తరువాతివన్నీ (మొత్తం-పది) సంస్కృతంలోనూ వున్నాయి. అలాగని పూర్తి ప్రాకృతం, పూర్తి సంస్కృతం వాడేరని కాదు. శాసన భాషలో ప్రాధాన్యం ప్రాకృతానిదో, సంస్కృతానిదో అనేంతవరకే. ఆయన పూర్వపు రాజు వీరపురుషదత్తు (క్రీ.శ. 240-260) వేసిన శాసనాలన్నీ ప్రాకృతంలోనే

వున్నాయి. ఆయన తరువాతి రాజు రుద్ర పురుషదత్తుని (క్రీ. శ. 284-95) శాసనాలు సంస్కృతంలోనే వున్నాయి. ఏహువలుని పాలన 11వ సంవత్సరంలో ఎలిశ్రీ వేసిన సర్వదేవశాసనం నిర్దుష్టమయిన సంస్కృతభాషలో వుంది.

ఇక్ష్వాకుల అనంతరపాలకులు దానాలు మొదలయినవి నమోదుచేయడానికి సంస్కృతాన్నే వుపయోగించేరు. అయితే అన్నిచోట్లా, అందరూ ఒకేవిధంగా వ్యవహరించలేదు. ముందువెనక లున్నాయి. దానికితోడు ప్రజలభాష అయిన తెలుగు సంస్కృతపదాలమధ్యన చోటుచేసుకోడానికి ప్రయత్నమూ కనిపిస్తుంది. మరొకటికూడా గమనించాలి: ఇక్ష్వాకుల శాసనాలన్నీ రాతిమీద చెక్కినవి. తరవాత రాయిస్థానంలో రాగి రేకులు అతివేగంగా వచ్చేసేయి.

బృహత్పలాయన రాజు జయవర్మ కొండముడి శాసనం ప్రాకృతంలోనే వుంది. దానిలో మహేశ్వర, బృహత్పలాయన శబ్దాలు రెండే సంస్కృతపదాలు. కోడూరు (కుదర), పాతూరు (పంటూర) గ్రామనామాలు తెలుగువీను.

150 ఏళ్ళు పాలన చేసిన శాలంకాయనుల శాసనాలలో రెండు భాషలూ వున్నాయి. ఒకటవ నందివర్మ కానుకొల్లు శాసనమూ, విజయదేవవర్మ ఏలూరు శాసనమూ ఆద్యంతాలలో సాంప్రదాయికంగా వేసే రెండు వ్యాసశ్లోకాలు తప్ప శాసనభాగం ప్రాకృతంలో వుంది. హస్తివర్మ పెనుకొండ శాసనాలలో రెండు భాషలూ కలబోసివున్నాయి. రెండవ స్కందవర్మ కానుకొల్లు శాసనాలూ, రెండవ నందివర్మ కొల్లేరు, పెదవేగి శాసనాలూ శుద్ధసంస్కృతంలో వున్నాయి. అయితే వీరి శాసనాలలో తెలుగుపదం ముతూద (గ్రామాధికారి-మోతాదు) చాలవానిలో వచ్చింది. ఎలూర (ఏలూరు), కురవాడ (కూరాడ), ముండూర (ముండూరు), వేంగి (వేగి) కుంబరంచెరువు, (కుమ్మర చెరువు, కొమ్మర చెరువు), చిన్నపుర (చిన్నాపురం), లేకుమూరి (లోకమూడి) మొదలైన తెలుగు స్థల నామాలు వానినిండా వున్నాయి.

ఆనందగోత్రీకరాజుల శాసనాలలో సంస్కృత ప్రాకృతాలు మిశ్రమంగా వున్నాయి. మట్టెపాడు శాసనంలో ప్రతిగ్రహీత పేర్లు ప్రాకృతీకరించిన తెలుగు పేర్లు: రుద్దజ్జ (రుద్రయ్య), బావజ్జ (భావయ్య), వీరజ్జ (వీరయ్య),కుమారజ్జ (కుమారయ్య), దేవజ్జ (దేవయ్య).

ఈ చరిత్రకాలంలో కళింగంలో పరిపాలనచేసిన మాఠర, వాశిష్ఠ, తూర్పు గంగరాజులు సంస్కృతంలో శాసనాలు వేశారు. దక్షిణంలోకన్నా వేగంగా ప్రాకృతం బదులు సంస్కృతం వాడుకలోకి వచ్చిన ఉత్తర భారతానికి సన్నిహితంగా వుండడం దీనికి కారణం కావచ్చు. ఈ శాసనాలలోని స్థలనామాలు తెలుగువి. రాకలువ (రాగోలు), పీటపుర (పిఠాపురం), సీపుర (శ్రీపురం), కొరాసొడక (కొరశండ), సింహపుర (సింగుపురం), సిద్ధాంతక (సిద్ధాంతం), తామరచెరువు, కళింగనగర (కళింగపట్నం), రోహనకి (రోణంకి,) తోటవాటక (తోటవాడ), అంధోరక (అంధవరం).

300 ఏళ్ళు పరిపాలన కాలంలో పల్లవులు 17 దాన శాసనాలు వేయించేరు. ప్రారంభకాలపువి ప్రాకృతంలోనూ, తరువాత కాలపువి సంస్కృతంలోనూ వున్నాయి. ప్రాకృత శాసనాల మీది ముద్రలోని పదాలు సంస్కృతమే. వానిలో సంస్కృత శ్లోకాలున్నవి వున్నాయి. సరిహద్దు ప్రాంతాల దాన శాసనాలలో తెలుగు తమిళాలో లేక రెండు ప్రక్కలో సంస్కృతమో, వుపయోగించారు. ఒకటవ మహేంద్రవర్మ పల్లవరం శాసనంలో ఆయన బిరుదులు తెలుగు, తమిళ, సంస్కృత భాషలలో వున్నాయి. చెంగల్పట్టు జిల్లాలోని



ఉదయేందిరం శాసనం సంస్కృతంలో వుండి, దానికి తమిళ ధృవీకరణ ఇవ్వబడింది. వారి దలవనూరు శాసనంలో సంస్కృత శ్లోకాలూ, తమిళ వచనమూ, పద్యాలూ వున్నాయి.

విష్ణుకుండినుల శాసనాలన్నీ సంస్కృతంలో వున్నాయి. వారి చిక్కుళ్ళ శాసనంలో "సంవత్సరాః" బదులు "సంవత్సరంబుల్" అని వాడడంవలన ఆ వ్రాసింది తెలుగువాడని తెలిసిపోతూంది. పల్లవ, విష్ణుకుండిన శాసనాలలో వాడిన స్థలనామాలు ప్రస్తుతం వాడుకలోవున్న ఊరిపేర్లకు దగ్గరగానే వున్నాయి. విరిపర (విప్పర్ల) చిల్లరెక (చిల్లరిగి), దాలూర (దావులూరు), కెందుకూర (కందుకూరు) మొదలైనవి.

క్రీ.శ. 500-600 మధ్య కడప, కర్నూలు జిల్లా భాగాలను పాలించిన రేనాటి చోళులు తమ శాసనాలలో ప్రాచీన తెలుగు నుపయోగించేరు. ఈనాడు దానిని అర్థం చేసుకోవడం కూడా కష్టం. వానిలోని పద్యాలు నేటి ద్విపద, రగడ, సీసము, తేటగీతి, ఆటవెలది, కందము మొదలైన తెలుగు పద్యాలకు దగ్గరలో వున్నాయని గుర్తించేరు. ఇంకా గుర్తింపబడనివి కొన్ని వున్నాయి. అంటే, 6 వ శతాబ్దినుంచీ తెలుగువచనమూ, పద్యమూ శాసనాలలో కనిపిస్తూంది. మరొకటి, రేనాటిచోళులు తెలుగు పద్యానికి రాజాదరణ నిచ్చేరు. క్రీ.శ. 600 ప్రాంతంనాటి కోసినపల్లి శాసనంలోని తెలుగుమాటలు చాలానే గుర్తుతెలిశాయి. కాజు (కాసు), అర్రి (అరి లేక పన్ను), మాన్యము, మారు మాన్న (మూరుమాన్యం), సాక్షి, వల్లవ (వల్లభ), కట్టిశర్మ (కర్తశర్మ), చామన (శ్యామన్న) మొదలైనవి.

ఇక్ష్వాకుల కాలంనాటి బౌద్ధ శాసనాలు కొన్ని ఆనాడు తెలుగు, తమిళ దేశాల మధ్య నున్న సాంస్కృతిక సంబంధాలను తెలుపుతున్నాయి. మూడవ ఇక్ష్వాకురాజు పేరు ఏహువల లోని "ఏహు" తమిళపదం. దాని అర్థం "ఉక్కు". అలాగే ఒక శాసనంలో దాతబంధువుల పేరు కరుంబుధిన దీనిలో "కరుం"తమిళపదం. దాని అర్థం "నలుపు".

భాషలాగే లిపికూడా మార్పులకు లోనయింది. దక్షిణాది అశోకశాసనాలు, అమరావతి, నాగార్జునకొండ, జగ్గయ్యపేట శాసనాలన్నీ బ్రాహ్మీలిపిలో వున్నాయి. 4వ శతాబ్దంనాటి పల్లవ శాసనాల లిపి ఇంచుమించు దుర్గ్రాహ్యంగా వుంది. దానిని "పల్లవగ్రంథ" పేరుతో పిలిచేరు. శాలంకాయనుల శాసనాలలో అతిప్రాచీనమైన తెలుగు కన్నడలిపి కనిపిస్తుంది. విష్ణుకుండినులు ఇంద్రపాలనగర శాసనాలలో లిపికూడ అదే. దాని పరిష్కృతరూపం తరవాతికాలపు తూర్పు చాళుక్యుల శాసనాలలో కనిపిస్తుంది.

కొన్ని శాసనాలు ఆనాటి కళలూ, శాస్త్రాలను పేర్కొంటున్నాయి. శాలంకాయన రాజు హస్తివర్మ పెనుకొండశాసనం ప్రతిగ్రహీతలయిన 60 మంది బ్రాహ్మణులు వైద్య, ఛందశ్శాస్త్రాలలో అతి సమర్థులని చెప్తూంది.

రాగి రేకుల వరసక్రమాన్ని సూచిస్తూ ఉపయోగించిన అంకెలు (3,33,333, L = 1,2,3,4) చూస్తే ఆశ్చర్యం కలిగించేటంత వెనుకబాటుతనం కనిపిస్తుంది.

ఇక్ష్వాకురాజుల, శాసనాలన్నీ ఆ రాజు పాలన సంవత్సరాన్నే పేర్కొంటాయి. వానిలో రెండుమాత్రమే ప్రభవ, విభవాది సంవత్సరాల పేర్లు చెప్తున్నాయి. దానిలో ఒకటి "విజయనామ సంవత్సరం, వర్షర్తు, ప్రథమపక్ష, ద్వితీయ" మనీ పేర్కొన్నాయి. దీనిలో ఋతువులేగాని నెలల పేర్లులేవు. భారతదేశపు శాసనాలలో సంవత్సరనామాలను ప్రయోగించడం ఇదే ప్రథమం. మరో నూరు సంవత్సరాలకి ఆనందగోత్రరాజు దామోదరవర్మ కాలంనాటి మట్టెపాడు దానశాసనంలో

ప్రప్రథమంగా కార్తీకం నెలను పేర్కొన్నారు.

రాజ శాసనాలలోనే గాక, సాహిత్యంలోకూడా ప్రాకృతం స్థానాన్ని సంస్కృతం ఆక్రమించింది. దీర్ఘసమాసాలు, అనేక పర్యాయపదాలు, అతిశయోక్తులు, సంక్లిష్టవాక్యనిర్మాణం, పదాలగారడీతో సంస్కృతం తీరికగలవారి భాష అయింది. దానికి రాజాదరం లభించింది. రాజులే కొందరు సంస్కృతంలో గ్రంథాలు వ్రాసేరు. ఆంధ్రదేశాన్ని పాలించిన ఆఖరు పల్లవరాజు ఒకటవ మహేంద్రవర్మ "మత్తవిలాస" ప్రహసనాన్ని యిదివరకే ప్రస్తావించేను.

విష్ణుకుండినరాజు మూడో మాధవ వర్మ "జనాశ్రయ ఛందోవిచ్ఛితి" అనే గ్రంథం వ్రాసేడు. ఇదొక ఛందోగ్రంథానికి వ్యాఖ్య. మూడో మాధవ వర్మకే జనాశ్రయుడనే మారుపేరుంది దీని 5వ అధ్యాయంలో వివిధజాతి ఛందస్సులు వివరించేడు. వానిలో ఒకటి శీర్షిక. ఇది ఏడురూపాలలో వుంది. ప్రతి రూపంలోనూ చివర గీత పద్యం వుంది. ఇది తెనుగులో సీసపద్యంగా అవతరించింది. శీర్షకమే సీసం అయింది. ఈ గ్రంథంలో ద్విపద, త్రిపదలను కూడా పేర్కొన్నాడు. దీనిని బట్టి క్రీ.శ. 5,6 శతాబ్దాల నాడే తెలుగులో పద్యరచన ప్రారంభమయిందని తెలుస్తోంది.

ఆరవ శతాబ్దికిచెందిన తర్కపండితుడు దిఙ్నాగుడు కొంతకాలం వేంగిలో వున్నాడు. ఇక్కడ "సాంఖ్యకారికా" రచయిత ఈశ్వరకృష్ణునితో వాగ్వివాదాలు జరిపేడు. "ప్రమాణ సముచ్చయ" మనే గ్రంథం సంస్కృతంలో వ్రాసేడు. ఈయన నూరుకుపైగా రచనలు చేసేడు. "యోగాచార" పంథాను ప్రబోధించేడు. ఆంధ్రదేశానికి చెందిన బౌద్ధమహాపండితులలో ఆయనే ఆఖరు వాడు.

ఆర్యదేవుడనే మరో బౌద్ధపండితుడు కూడ ఈ కాలంవాడే. ఆయన చాలదేశాలు పర్యటించినవాడూ, సమర్థుడైన రచయితాను. చులియ (నెల్లూరు), కోసలి. పాటలీ పుత్ర మొదలైనచోట్ల తీర్థికులతో వాగ్వివాదాలు జరిపేడు. నలందా విశ్వవిద్యాలయంలో ప్రముఖస్థానం వహించినవాడు. కాని ఎవరో హంతకుని చేతిలో అకాలమరణం పొందేడు.

పల్లవరాజు సింహవిష్ణువు ఆహ్వానంమీద కాంచీపురం చేరిన భారవి అనే గొప్ప పండితకవి వుండేవాడు. వేంగి తూర్పుచాళుక్య ప్రభువు విష్ణువర్ధనుని ఆస్థానంలో వుండేవాడు. "కిరాతార్జునీయం" అనే ఈయన కావ్యం సుప్రసిద్ధం.

"దశకుమార చరిత్ర" మనే వచన కావ్యాన్ని వ్రాసిన దండి ఏడవ శతాబ్దంలో పల్లవుల ఆస్థానంలో కంచిలో వుండేవాడు. కళింగాన్నీ, ఆంధ్రదేశాన్నీ ఆయన వర్ణించిన తీరు చూస్తే కొంతకాలం వేంగిలో వుండి తెలుగుదేశం, ప్రజలూ, ప్రదేశాలూ, ఆచారాల సన్నిహిత పరిజ్ఞానం సంపాదించి వుండాలి.

## కళలు – శిల్పం

ఈ చారిత్రక దశలో ఆంధ్రలో కళలు–శిల్పం ఉచ్ఛస్థాయినందుకున్నాయి. వానిలో బౌద్ధంనుంచి వైదికమతంలోకి క్రమ పరిణామం కనబడుతుంది.

ఇక్ష్వాకుల కాలంనాటి నాగార్జున శిల్పం క్రీ.పూ. 2వ శతాబ్దంలో ప్రారంభమైన అమరావతీశిల్ప సంప్రదాయం యొక్క చివరిదశ అని చెప్పవచ్చు. ఈ శిల్పాలకు వస్తువు మహాయానపంథాకు చెందిన బౌద్ధసాహిత్యం నుంచి సంగ్రహించబడింది. బుద్ధుని జీవితంలోని ప్రధాన ఘట్టాలన్నీ వానిలో మలచబడినాయి. పది జాతక కథల వరకూ శిల్పాలకెక్కాయి.



ఇవన్నీ ఒక తరహావి.

రెండో తరహా శిల్పాలలో చారిత్రక పురుషులూ, ఘట్టాలూ మలచబడినాయి. తన రత్నసప్తకంలో (మంత్రి, కోశాధ్యక్షుడు, ఏనుగు, గుర్రం, రాణి, మణి, చక్రం) శ్రీశాంతమూల చక్రవర్తి; గజారూఢుడైన శ్రీశాంతమూలుడు; హిరణ్యదానం చేస్తూ, గోపూజచేస్తూ భార్యలతో శ్రీశాంతమూలుడు; వైదికమతాన్ని నిరసిస్తూ, తిరుగుబాటు నణచివేస్తూ, బౌద్ధమతాన్ని స్వీకరిస్తూ వీర పురుషదత్తుడు

సామాజిక జీవిత దృశ్యాలను చూపుతున్న మూడోతరహా శిల్పాలున్నాయి. ఒకదానిలో సతీసహగమనం, మరోదాంట్లో మరణించిన ఒక స్త్రీ శవమూ, దానిచుట్టూ అంతిమసంస్కార పాత్రలు మలచబడినాయి. స్మారక స్తంభాలమీద వేరు వేరు యుద్ధ దృశ్యాలు –ఒకదాంట్లో గుర్రం వెనకకాళ్ళమీద నిలబడివుంది. దానిపై నున్న యోధుడు ఇద్దరు పదాతులతో తలపడు తున్నాడు. చుట్టూ యుద్ధభూమిలో శవాలు; వేరొకదాంట్లో గజారూఢుడైన యోధుడు; మరొకదాంట్లో ఒక అశ్వికుడు సురక్షితమైన కోటవేపు వెడుతున్నాడు; మరొకదాంట్లో నలుగురు యోధులు కత్తులు, భల్లాలు, డాలులతో వున్నారు–ఇల్లాగే. పొట్టేలును పట్టుకొని గంతులేస్తున్న మరుగుజ్జు తొట్టిస్నానం చేస్తున్న స్త్రీ ఆనందోత్సాహాలతో నృత్యాలు చేస్తున్న దృశ్యాలు; కుస్తీ దృశ్యం మొదలైనవి వున్నాయి. ఒక దృశ్యంలో శకరాజకుమారి అలంకరించుకుంటూంది. ఈ శిల్పాలలో స్త్రీ పురుషులు ధరించే అనేక రకాల దుస్తులు, జుట్టుముడులు, రకరకాల ఆభరణాలు చూస్తాము.

ఎహువల శాంతమూలుని 24వ పాలనా సంవత్సరంలో (క్రీ.శ. 284) వేసిన ఒక పొడుగుపాటి ఫలకం మీద బుద్ధుని జీవితానికి సంబంధించిన అతిముఖ్య ఘటనలు. వానికి ప్రతిదానిపక్కన వివిధ శృంగారభంగిమలలోవున్న మిథునాలు మలచబడినాయి. ఇటువంటి మిథునదృశ్యాలు 40 వున్నాయి. వానిలోని స్త్రీ పురుషులు రూపసులు, చదువుసంస్కారాలున్న వాళ్ళూ, సరసులున్నూ. దీనిని కుమారనంది అనే వ్యాపారి ఆ విహారానికి బహూకరించేడు. బౌద్ధమతంతో పాటు శృంగారప్రధానమైన కళలను వ్యాపారస్థులు పోషించిన శాతవాహన సంప్రదాయం ఇక్ష్వాకుల కాలంలోనూ కొనసాగింది. కాని స్వయంపూర్ణ గ్రామ వ్యవస్థ బలపడిన కొద్దీ వర్తకం క్షీణించింది దానితో వర్తకుల ప్రాముఖ్యమూ పోయింది.

భారతదేశపు బౌద్ధవాస్తుశిల్ప చరిత్రలో నాగార్జునకొండ ఒక ప్రధాన ఘట్టం. ఇక్కడ అనేక తాత్త్వికధోరణులు ఏకత్రితమై నూతనవాస్తుశిల్ప రూపాలు వచ్చాయి. ఇవన్నీ విహార నిర్మాణంలో ఒక కొత్త పంథాను తీసుకొచ్చాయి. చతురస్రంగావున్న వేదికమీద స్తూపం; దానికి రెండుపక్కలా అర్ధచంద్రాకారంగా నిర్మించిన చైత్యాలు; స్తంభాలమీద వేసినహాలు; దానిచుట్టూ విహారం; కొద్ది ఎత్తుగల గుండ్రని వేదిక మీద చిప్పబోర్లించినట్లు నిర్మించారు స్తూపాలన్నిటినీ. చైత్యగృహంలోని స్తూపంక్రింది వేదిక ఎత్తు మాత్రం కొంచెం ఎక్కువ. ఇక స్తూపం అడుగున బుద్ధచిహ్నం అయిన చక్రాన్ని పునాది చేశారు. ఆ చక్రం మధ్యన వైదికమత సంకేతమయిన స్వస్తిక వుంటుంది.

బౌద్ధదేవ మందిరాలకులాగ వైదిక దేవాలయాల నిర్మాణానికి ఒక నిర్దిష్టమైన వాస్తువును అనుసరించలేదు. వీటిని ఏకదేవగర్భగృహం గలవీ, బహుళ దేవతాగృహాలు గలవిగా విభజించవచ్చు. రాజమందిరంలోని సర్వదేవ దేవాలయం తరహావేరు. దానిని దేవాలయంగా గాక దేవప్రాసాదంగా

శాసనాలలో పేర్కొన్నారు. ఈ దేవాలయాలు కొన్ని అర్ధచంద్రాకారంగా నిర్మించబడ్డాయి. దేవాలయ రూపానికీ, భక్తుల తాత్వికపంథాలకూ సంబంధం లేదు.

నాగార్జునకొండవద్ద 300'×259' గల సభాంగణం వుంది. చుట్టూ, నాలుగు వేపులా కడపరాళ్ళతో అంచులుకట్టిన మెట్లవరసల గేలరీవుంది. సభాంగణానికి మధ్యన వేదిక వుంది. ఒక మూలలో రాతితో కట్టిన బెంచీ వుంది. బహుశా అది ప్రముఖ వ్యక్తులు కూర్చోడానికి ఉద్దేశించబడింది. ఇక్కడ బహిరంగసభలు జరుగుతాయి. ఈ సభాంగణం మధ్యన వున్న వేదికమీదినుంచి మాట్లాడేది 200 అడుగులదూరాన కూడా అతిస్పష్టంగా వినిపిస్తుంది. గేలరీమెట్ల పై వరసలకు వెళ్ళినకొద్దీ ధ్వని పెద్దదవుతుంది. ఇదొక విచిత్రమైన విషయం. హారీతి దేవాలయం వున్న కొండ పల్లంలో వుండడంచేత భౌతిక పరిసరాల సహాయాన్ని ఈ సభాంగణశిల్పి బాగా వుపయోగించుకున్నాడు.

విశాఖపట్టణం జిల్లా శంకరం కొండమీద నాలుగోశతాబ్దినాటి స్థూపాలూ, వసతిగదులూ వున్నాయి. స్థూపాలు ఒక్కొక్కటీ ఒక్కొక్క శిలను చెక్కి నిర్మించినవి. ఈ ఏకశిలా స్థూపాల మొదలు 65 అడుగుల వ్యాసం వుండి చాల పెద్దవిగా వున్నాయి. వసతిగదులు రాయితో చెక్కినవి. ఇవిగాక విశాలమైన విహారం పునాదులు కూడా వున్నాయి.

ఆనంద గోత్రీక ప్రభువులు చేజెర్లలో నిర్మించిన కపోతేశ్వరాలయం ఆంధ్ర దేశంలోని పురాతన మందిరాలలోకెల్ల చిత్రమైనది. నాగార్జునకొండలోని బౌద్ధ చైత్యాలలాగా ఇది అర్ధచంద్రాకారంగా వుంది. విమానం ముందుభాగం చైత్యంయొక్క కమానులా వుంది.

పల్లవరాజు ఒకటవ మహేంద్రవర్మ దక్షిణదేశ దేవాలయ వాస్తువుకు ఆద్యుడు. ఇటికలు, కర్ర, లోహం, సున్నం అక్కరలేకుండా దేవాలయాలు కట్టించేడు. అశోకుని తర్వాత రాతిని అంత ఎక్కువగా వుపయోగంలోకి తెచ్చినది ఆయనే. పల్లవ వాస్తుశిల్పపు ప్రథమదశ కేవలం రాతిచెక్కడమే. ఇవి రెండురకాల నిర్మాణాలు. ఒకటి స్తంభాలమీద కట్టిన మంటపాలు. రెండోరకం రాతి రథాలనబడే ఏకశిలా దేవాలయాలు, విశాలమైన మండపాలున్నూ. ఇందులో మొదటిరకం కేవలం మహేంద్రవర్మ నిర్మించినవి. రెండోరకం ఒకటవ నరేంద్రవర్మా, ఆయన అనంతర రాజులూ నిర్మించినవి. మహేంద్రవర్మ నిర్మించిన మండపాలు-స్తంభాలతో వున్న చావడులూ - ప్రక్కన ఒకటి రెండు గదులు రాతిగోడలో దొలచినవీను. ఈ మండపాలలో ఒకదాని గోడమీద రాజు మహేంద్రవర్మా, ఆయన తండ్రి సింహ విష్ణువూ మలచబడ్డారు. మహిషాసురమర్దని దుర్గ, శేషశాయి విష్ణువు, వరాహావతారం, గోవర్ధనధారి కృష్ణుడు మొదలైన దృశ్యాలు ఈ మండపాల గోడలమీద చెక్కివున్నాయి. ఒక రాయిమీద గంగావతరణం మలచేరు. ఇంక రథాలన్నవి ఏకశిలా నిర్మితాలు. ధర్మరాజు రథం అనేక అంతస్తుల విహారం. ద్రౌపది రథం ఒక మండపం. అమరావతి శిల్పాలలోకన్న ఈషణ్మాత్రభేదం వుంది. దీని కప్పులో నకుల సహదేవ రథం చైత్యం సావడి బాహ్యాకృతి కలది. భీమరథం చేజెర్ల చైత్యంలాగా వుంది.

విజయవాడ, మొగల్రాజపురం, ఉండవల్లిలోని గుహాలయాలు విష్ణుకుండినుల నిర్మాణం. ద్వారపాలురు, పద్మంచెక్కిన స్తంభాలు, పూర్ణకుంభం, సింహంవంటి అలంకారాలు అమరావతిలోని బౌద్ధశిల్పాలను గుర్తుచేస్తాయి. విజయవాడలో అయిదు, మొగల్రాజపురంలో అయిదు గుహాలయాలున్నాయి. మొగల్రాజపురంలో ఒక గుహద్వారంమీద నటరాజవిగ్రహం, దానిక్రింద



ఏనుగుల, సింహాలబారు చెక్కబడి ఉన్నాయి. విజయవాడ, మొగల్రాజపురంలోని త్రిమూర్తి ఆలయాలు స్తంభాలమీద సావడి, ప్రక్కగోడలో గర్భగృహం కలిగి దీర్ఘచతురస్రంగా వున్నాయి. ఉండవల్లి లోనిది విష్ణు ఆలయం.

నెల్లూరు జిల్లా భైరవానికొండలో గుహాలయాలు ఎనిమిది వున్నాయి. అన్నీ శివాలయాలే.

సంగీతం కూడా ఈ కాలంలో రాజాదరణ పొందింది. పల్లవరాజు మహేంద్రవర్మ గొప్ప సంగీత విద్వాంసుడు. సంకీర్ణ జాతి అనే బిరుదు ఆయనకుంది. తాళజతులు అయిదింటిలో సంకీర్ణజాతి ఒకటి. అంతకు పూర్వం నందికేశ్వరుని, "తాళ లక్షణ" మొదలగు రచనలు నాలుగు తాళజతుల్నే - చతురస్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ- పేర్కొన్నాయి. సంకీర్ణజతి తరువాత చేరింది. దీనికర్త మహేంద్రవర్మ. మహేశ్వరుడైన రాజునానతి శాసనం చివర స్వరసాహిత్యం మలచబడిందని మహేంద్రవర్మ కాలపు కుడుమియమలై (పుదుక్కోట) శాసనం చివరన ఒక వాక్యం వుంది. ఈ రాజ శివభక్తుడైన మహేంద్రవర్మయేనని భావించబడుతూంది. ఈ మహేశ్వరుడు రుద్రాచార్యుని శిష్యుడని శాసనం చెప్తూంది. 7వ శతాబ్దంలో రుద్రటుడనే సంగీత విద్వాంసుడున్నాడని సి. మీనాక్షి తన "అడ్మినిస్ట్రేషన్ అండ్ సోషల్ లైఫ్ అండర్ ది పల్లవాస్"లో వ్రాస్తున్నారు.

## సాంస్కృతిక పరివ్యాప్తి

ఈ చారిత్రక దశలో ఆంధ్రసంస్కృతి దూరదూరాలకు వ్యాప్తి చెందింది. మైసోల్స్ (ఇప్పటి కృష్ణా, గోదావరి జిల్లాలు) నుంచి సాధారణ వస్త్రాలు, అనేక రకాల మస్లినులు పడవల్లోనూ, బండ్లమీదా ప్రతిష్టానం, తగర మొదలైన పశ్చిమతీర నగరాలకు రాసులకొద్దీ ఎగుమతి అవుతున్నాయని "పెరిప్లసు" చెబుతోంది. గోదావరి, కృష్ణ, గుండ్లకమ్మ, పినాకిని మొదలయిన నదుల ముఖద్వారాలనుంచీ, కొత్తపట్నం(కొట్టిస్), ఘంటసాల(కొంటకోస్సిల), కోడూరు(కోడూర), అవనిగడ్డ(అల్లోస్జినె) మొదలైన రేవులనుంచీ వర్తకపుటోడలు తూర్పు దేశాలకు వెడతాయని టాలమీ వ్రాసేడు. తమిళ, కేరళ దేశాల సుగంధ ద్రవ్యాలు, చందనం, ముత్యాలూ, మలయా, సుమత్రాల అఘిల్‌కర్ర, బంగారమూ, తూర్పుసముద్రాల పగడాలూ, చైనానుంచి హారతికర్పూరం, సిల్కులూ, ఆంధ్రదేశపు బజార్లలో దొరుకుతాయని ఆయన వ్రాసేడు. భారత దేశం వెలుపల ఆంధ్రదేశపు స్థలనామాలను టాలమీ "భూగోళం" నుంచి గుర్తించవచ్చు. ఉదా॥ త్రిలింగ (ఆరకాన్ ప్రాచీన రాజధాని), కాకుళ (సయాం సింధుశాఖలో), కంతార(కొత్తూరు), సింహపుర(సింగపూర్), భోగ(భోజ), పాండురంగ, అమరావతి విజయ, కళింగ మొదలైనవెన్నో. భారతదేశం వెలుపల తూర్పు దేశాల్లో వర్ధిల్లినసంస్కృతిఆంధ్ర కళింగ సంస్కృతి ప్రాతిపదికగా ఏర్పడింది.

శాతవాహనుల తరువాత వారి సంప్రదాయాలను ఇక్ష్వాకులు కొనసాగించారు. ఉత్తరాన కాశ్మీరువరకూ, తూర్పున చైనావరకూ ఆంధ్రదేశపు బౌద్ధులు తమ సంస్కృతిని వ్యాపింపచేశారని బోధిశ్రీ శాసనం తెలుపుతూంది. ఈ వలస విస్తృతి ఆ దేశాల ఆదిమప్రజలలో ఉత్సాహం కలిగించింది. అందుచేతనే విదేశీయులు భారతదేశాన్ని దర్శించి బుద్ధాస్థికలు నిక్షేపించిన శ్రీపర్వత మహాచైత్యాన్ని చూడడానికి యాత్రలు చేశారు. వారికోసం ఉపాసిక బోధిశ్రీ చైత్యాలు, చైత్యగృహాలు, విహారాలు, మండపాలు, చతుశ్శాలలు మొదలైనవి నిర్మించి సౌకర్యాలు ఏర్పాటు చేసింది.

ఇక్ష్వాకుల తరవాత శాలంకాయనులు, పల్లవులు, విష్ణుకుండినులు తమ సంస్కృతిని దూరవ్యాప్తం చేశారు. బర్మాలో పెగూ తూర్పు కోస్తాకూ, దానికి వాయువ్యంగా వున్న మండలానికి ప్రాచీనకాలంలో కళింగ, ఉత్కళ అనే పేర్లుండేవి. ఆ దేశంలోని తెలాంగులు తెలంగాణావారేనని ఫైరే "బర్మా చరిత్ర" తెలుపుతూంది. ప్రాచీన తైలాంగ్ భాషలో సంస్కృత పదాలు కనిపిస్తాయి. ప్రాచీన తైలాంగ్ లిపీ, నాలుగో శతాబ్దపు వేంగి లిపీ సమానంగా వుంటాయి. ప్రాచీన ప్రోమ్‌లో ఒక స్తూపము, దానిలో ధాతువులతో భరణిని పెట్టే ఖాళీ జాగాతో కనిపించింది. స్తూపగ్రాన చుట్టూ ప్యూ-పాళీ మిశ్రమ భాషలో కన్నడ-తెలుగు లిపిలో శాసనం కనిపించింది. బంగారు, వెండి బుద్ధవిగ్రహాలూ, అనేక వెండి, బంగారు ఆభరణాలూ, పూసలూ, నాణేలు బర్మాలో దొరికేయి. అవి బర్మా దేశస్థుల మతానికి, సంస్కృతికి పునాది ఏమిటో చూపుతున్నాయి. "శాసనాలంకార" అనే బౌద్ధమత గ్రంథం ఈనాటి పాగాన్ ప్రాంతాన్ని ఏలిన తెలాంగ్‌రాజు శస్ లాన్ క్రోమ్ శాలంకాయన రాజనీ, బుద్ధదత్త, బుద్ధఘోషులకు సమకాలీనుడనీ చెప్తోంది. బర్మాలో బౌద్ధమత వ్యాప్తికి బాధ్యుడు శాలంకాయనరాజా ఒకటవ నందివర్మ అయివుంటాడు.

మలయా, ఇండో చైనాలతో కూడా ఆంధ్రులకు సన్నిహిత సంబంధాలుండేవి. అక్కడ దొరుకుతున్న అతి ప్రాచీన శాసనాల లిపికీ శాలంకాయన లిపికీ చాల పోలికలున్నాయి. కౌండిన్యుడనే దాక్షిణాత్యబ్రాహ్మణుడు ఇండో చైనాలో వైదికమతాన్ని వ్యాపింపచేసి, ఫెనాన్‌లో ఒక రాజకుటుంబానికి మూల పురుషుడు అయ్యేడు. క్రీ.శ. 658 నాటి ఒక శాసనం పేర్కొంటున్న చంద్రవర్మ, దేవవర్మ, జయవర్మ, పేర్లున్న వారు శాలంకాయన రాజవంశంలో కనిపిస్తున్నారు. ఇండోచైనాలోని శాసనాలన్నీ సంస్కృతంలో వున్నాయి. అయితే, వాని లిపి వేంగీ చాళుక్యలిపి. గురువునుగా పేర్కొనే కంచుబుద్ధవిగ్రహం అమరావతిలోని విగ్రహాలను పోలివుంది. వాస్తుశిల్పంలో ఇండోచైనా చాలవరకు పల్లవుల కాంచీపుర శిల్పాలకు ఎంతో రుణపడివుంది.

ఇంక సింహళంలోని పురాతన బౌద్ధాలయాలు ఆంధ్రశైలిలో వున్నాయి. ఉండవల్లిగుహలను పోలిన నిర్మాణాలు సింహళంలో కనిపించేయి. నాగార్జున, ఆర్యదేవులకు ఆ దీవితో సంబంధం వుంది. బుద్ధఘోషుడూ, బుద్ధదత్తుడూ సింహళదేశపు విహారాలలో బోధలు చేసేరు.

సుగంధ ద్రవ్య దీవులుగా పిలవబడిన ఇండోనేషియాను ఆంధ్రసంస్కృతి ప్రభావితం చేసింది. జావాలోని సుందర, బృహత్తర బోరోబుదూర్ స్తూపశిల్పానికి నమూనా అమరావతి స్తూపం. ఆ రోజులలో జావాను కళింగం అనేవారు. అదే పేరుగల రెండు పట్టణాలు అక్కడున్నాయి. కళింగ మండలానికి తెలంగాణాప్రజలు వలసవచ్చిన సంప్రదాయాలు వున్నాయి. జావా, బోర్నియోలలో దొరికిన శాసనాలు వేంగీలిపిలోనో, పల్లవ లిపిలోనో వున్నాయి. జావా శాసనాలలోని పూర్ణవర్మా, బోర్నియో శాసనాలలోని మల్లవర్మలు పల్లవ కుటుంబంలోని వారయి వుంటారు. బోర్నియోలో మూలవర్మ యూపశాసనాలు 4వ శతాబ్దంలో వైదికమతవ్యాప్తిని చూపుతున్నాయి. ఆయన పేరూ, శాసనలిపి ఆయన పల్లవ వంశంవాడని తెలుపుతున్నాయి. ఆయన శాసనాల ప్రకారం, సుమత్రాకు చెందిన ఆదిరాజా ఆదిత్యధర్మ అనే బౌద్ధుడు ఏడంతస్తుల విహారాన్ని కట్టించేడు. అయితే ఫాహియాన్ ఈ దీవులలో బౌద్ధమతం క్షీణిస్తున్నట్లు వ్రాసేడు. వైదికమతం దాని స్థానంలో వ్యాపించింది.



## ముగింపు

ప్రభుత్వాధికారం వికేంద్రం కావడం, రాజుకూ పన్నుచెల్లింపుదార్లకూ మధ్య దళారీలు రావడం, స్వయంపూర్ణగ్రామాలు పెరగడం,. వృత్తి శ్రేణులు అదృశ్యం కావడం, దేశాంతర్గతవ్యాపారం శిథిలం కావడం - ఇవి ఆంధ్రదేశంలో ఫ్యూడల్ వ్యవస్థకు పునాదులు వేశాయి. వైదికమతం ప్రబలం కావడమూ, ప్రాకృతంస్థానే సంస్కృతం రాజభాష కావడమూ ఈ పరిణామక్రమాన్ని త్వరిత పరచింది.

యూరపులో క్రీ.శ. 5వ శతాబ్దిలో ఫ్యూడల్ వ్యవస్థ ఏర్పడింది. రోమను సామ్రాజ్యపు శిథిలాలమీద తలఎత్తి పది శతాబ్దాలపాటు సాగింది. బానిస వ్యవస్థ స్థానే అర్ధబానిస వ్యవస్థ ఏర్పడింది. స్వతంత్రరాజరికాలు తలఎత్తేయి. ఒక దానితో ఒకటి నిరంతరయుద్ధాలు సాగించేయి.

ఒకరకమైన పరాధీనత్వానుబంధంద్వారా భూమిహక్కునూ సైనికసేవనూ సమ్మిశ్రం చేయడం ఫ్యూడలిజం యొక్క నిగ్గు. దీనిలో ఉన్నతుడు దిగువవానికి రక్షణ యిచ్చేందుకు పూటపడతాడు. దిగువవాడు పైవానికి సేనాసహాయా లివ్వడానికి, భక్తి విశ్వాసాలు కలిగివుండడానికి, తన ఆదాయంలో వాటా ఇవ్వడానికి పూటపడతాడు. ఇందులో అధీనుడి అవసరం ఎక్కువయినకొద్దీ పరిస్థితి తల్లక్రిందులవుతుంది. ఈ మాదిరి అనుబంధాలు (1) భూమిమీదా, దానిని సాగుచేసేవారిమీదా యాజమాన్యం గల సామంతులుగానూ, కూలిపని చేస్తూ భూములుదున్నే శ్రమజీవులుగానూ, అర్ధబానిసలుగానూ సమాజాన్ని రెండు అంతరువులుగా మారుస్తాయి. సామంతులు మళ్లీ రెండు రకాలు. అధికార బిరుదులున్నవారూ, అవి లేనివారూ. రాజు డ్యూకు, మార్క్విసు, కౌంటులు మొదటిరకంలోకి వస్తారు. వీరిచేతిలో అనేక సొంత ఎస్టేటు గ్రామా (మెనోర్) లుంటాయి. వీరు రాజుకు సహాయంగా యుద్ధంలోకి చాలమంది అశ్వికుల్ని తీసుకొస్తారు. రెండోరకంలోకి బేరన్‌లూ, సినార్‌లు, నైట్‌లు, స్క్వైర్‌లు వస్తారు. హోదాలో వీరు అంతా ఒకరితర్వాత వొకరు వస్తారు. వీరిలో ప్రతిఒక్కరిచేతిలో కొన్ని ఎస్టేటులూ, కొంతమంది అశ్వికులూ వుంటారు. ఈ సామంత కుటుంబాల వారు ప్రతిఒక్కరూ ప్రభువూ, భృత్యుడూ కూడా. రాజు అందరికన్న పై ప్రభువు. మెనోర్‌దారులు ఆయనకు కప్పమూ, సంవత్సరంలో కొన్ని రోజుల సైనిక సేవా, రాజుకు కానుకల ఇవ్వాలి. ఇది వంశపారంపర్యం. రాజు తన ఆదాయం నుంచి పాలనావ్యయం భరిస్తాడు. రాజు తన దిగువసామంతుని ఆమోదం లేనిదే అతని ప్రాంతానికి వర్తించే చట్టం ఏదీ చేయడానికి వీలులేదు. అంటే దిగువన కౌంటీవరకు ప్రతిఒక్కరూ పాలనావ్యవహారాలలో, న్యాయనిర్వహణలో స్వతంత్రులు. పరస్పరం యుద్ధాలకు కూడా తలపడగల స్వతంత్రం వీరికి వుంది. వీరిప్రభుతా, భృత్యత్వమూ సంప్రదాయాల, ఒడంబడికపత్రాల, తంతులద్వారా నిర్ణయింపబడుతుంటాయి. ఒక్క మరణశిక్షలు వెయ్యగల అధికారం మాత్రమే రాజుకు వుంటుంది. సిద్ధాంతరీత్యా రాజుది ఆ భూమి. వరసక్రమంలో నైట్‌ల వరకూ ఒకరినుంచి వేరొకరికి పంపిణీ అవుతుంది. ఆ నైట్‌లు రైతులకు సాగుచేసుకొనేందుకు ఇస్తారు. వారికి భూమి హక్కు వుండదు. భూమి సాగుచేసుకొన్నందుకు రైతు తన ప్రభువు పొలాల్లో ఏటా కొన్నిరోజులు ఉద్దరిగా పనిచేయాలి. పన్నులూ, మామూళ్ళూ ధనరూపంలో చెల్లించాలి. అనేకమయిన పేర్లతో వస్తురూపంలో నజరానా లివ్వాలి. ప్రభువుగారి వుద్యోగులు వచ్చినా సేవకులు వచ్చినా విందులు చెయ్యాలి.

యుద్ధాలకు వెళ్ళాలి. ఇవన్నీ వంశపారంపర్యం. వూరు వదలి పోయేందుకు వారికి హక్కులేదు. ఇట్టి రైతులందరూ అర్ధబానిసలు.

ఫ్యూడల్ వ్యవస్థలో గ్రామం తనకు కావలసిన పంటలన్నీ తానే పండించుకొనేది. అయితే పనిముట్లు మోటువి. కనక పంట తక్కువగా వుండేది. పంటలో మిగులు ఏ మాత్రం వున్నా ప్రభువుది. కనక పంట పెంచే వుత్సాహం రైతుకి వుండదు. ప్రభువు దొరికింది వసూలు చేసుకు తినడమేగాని, పండించడు. భూములు వంశపారంపర్యంగా రైతులకుటుంబాలమధ్య వుంటాయి గాని అవి గ్రామ అధీనంలోనివి. వారివి కావు. అందుచేత ఉత్పత్తి తక్కువే. జీవన ప్రమాణమూ తక్కువే. గ్రామసమితి ఒకటుంటుంది. దాని అధికారం శాసనాలు, నిబంధనలు చేయడం. అయితే అందులో రైతు నోరువిప్పలేడు. ప్రభువులదర్బార్లే నేర విచారణ చేస్తాయి.

ఫ్యూడల్ ప్రభువర్గపు అంతరవులలో రాజకీయ సమన్వయం లేదు. వాని మధ్య సంబంధాలు చాల సామాన్యం. ఆర్థికంగా ఏ అంతస్తుకా అంతస్తు స్వయం పూర్ణం. పరిపాలన సామంత ప్రభువు అధీనం. ఈ ప్రభువులమీద కేంద్రానికి అధికారం చాల తక్కువ. ఏమంటే ఈ ప్రభువులు ఏ అంతరువులో వారైనా తమ భాగంలో తామే ప్రభువులూ, సర్వాధికారులూను.

మధ్యయుగాలలో యూరపులోవుండిన ఫ్యూడల్ వ్యవస్థ స్వరూపం సంగ్రహంగా ఇది.

ఈ మాదిరి ఫ్యూడల్ వ్యవస్థకూ, శాతవాహనాంతరపు వ్యవస్థకూ కొన్ని పోలికలువున్నా, యూరపుతరహా ఫ్యూడల్ వ్యవస్థ ఆంధ్రలో ఏర్పడ్డానికి అక్కడవుండిన పరిస్థితులు ఇక్కడలేవు. దక్షిణభారతంలో తెగలసంస్కృతి ఒక చిత్రమైనవిధానంలో నాగరిక సంస్కృతిగా మారింది. తెగలలో పరస్పర సాంస్కృతీకరణం జరిగింది. ఖండితరూపంలో వర్ణవ్యవస్థ బలపడింది. రాజులు రాజనీతి శాస్త్రంలో ప్రత్యేకశిక్షణ పొందడంచేత, యూరపు పక్కీలో అధికారం విభిన్న అంతరువులలో ఏర్పడడం జరగలేదు. కాని, క్రమంగా అంతరువులు ఏర్పడ్డాయి.

ఈ చారిత్రకదశలో ఆంధ్రలో ప్రభు సామంతరూప వ్యవస్థ వున్నమాట నిజమే. రాజ్యం అన్నదానికి కేంద్రపాలితమైన భూభాగం వుంటుంది. ఆ రాజుకి అధీనంలో సామంతులుంటారు. ఈ సామంతులందరికీ సమానాధికారాలులేవు. వీరిలో కొందరు బలవంతులయి తమకింద కొందరు చిన్నసామంతుల్ని కూడా కలిగివుండొచ్చు. వీరు రాజులుగానే పిలవబడతారు. అయితే, ఈ రాజులు, మహారాజులు, మహారాజాధి రాజులు మధ్య సంబంధాలను నిర్ణయించే సూత్రాలు ఆచరణరీత్యాగాని, సిద్ధాంత దృష్ట్యా గాని నిర్దిష్టమయి వుండవు. రాజుల యుద్ధంలో ఓడినప్పుడు జయించినవానికి కప్పంకట్టి తనరాజ్యం నిలుపుకుంటాడు. ఇక్కడ ఆయన భృత్యత్వానికి కారణం పరాజయం. యూరపులోలాగ కరారునామా కాదు. తరుచు ఈ సామంతుడు మహారాజుకి మంత్రి కావచ్చు, ఆంతరంగికుడవచ్చు, సైన్యాధ్యక్షుడూ కావచ్చు. అల్లాగే మహారాజు తనమంత్రినో, ఆంతరంగికుడినో, సైన్యాధ్యక్షుణ్ణో సామంతరాజునుగా చేయొచ్చు.

జీతం ఇవ్వడానికి బదులు ప్రభుత్వోద్యోగులకు ఒక గ్రామంనుంచో, కొన్ని గ్రామాలనుంచో పన్ను వసూలుచేసుకొనే అధికారం ఇవ్వాలని "మనుస్మృతి" చెప్పింది. ఆ విధంగా ఆ అధికారం పన్నులిచ్చేవారికీ ప్రభుత్వులకూ మధ్య దళారులను తయారుచేసింది.

శాసనాలనుబట్టి వేరువేరు పేర్లు, హోదాలు, బాధ్యతలుగల అనేకమంది రాజోద్యోగులుండినట్లు తెలుస్తూంది. రాష్ట్రికుడు (రాష్ట్రపాలకుడు), రహస్యాధ్యక్షుడు (ప్రత్యేక కార్యదర్శి), వల్లభుడు (ఆంతరంగిక కార్యదర్శి), సేనాపతి, సమాచారాంతకుడు (గూఢచారి),



బడామానుష, దేశాధికృత, అరణ్యాధికృత గోవల్లభ, గుల్మిక మొదలైనవి. ఇవన్నీ వంశపారంపర్యపు వుద్యోగాలు. అంతరంతరువులు గలవి. వారికి గల హక్కులు, అధికారాలు స్పష్టంగా నిర్దేశించబడ్డాయి. వీరిలో చాలమంది పన్నులు వసూలుచేసేవారు. ఆ హోదాలో ఎక్కువ పన్నులూ, మామూళ్ళూ వసూలుచేసి, అనేక రూపాలలో వెట్టిచేయించుకొనీ ప్రజలను పీడిస్తారు. నిజమే, కాని ఇంతమాత్రం చేత దీనిని ఫ్యూడల్ వ్యవస్థ అనలేము. ప్రభుత్వాదాయంలో నాలుగో వంతును పరిపాలనోద్యోగులకు ఇచ్చే ఆచారాన్ని హుయాన్‌త్సాంగ్ వర్ణించేడు. అక్కడేవుంది తేడా అంతా. యూరపులో ఫ్యూడల్‌బేరన్ రాజుకు కప్పంచెల్లించి తాను తన అధీనభాగం నుంచి మొత్తం పన్నులన్నీ తీసుకుంటాడు.

గ్రామంలోని పన్నంతా ప్రభుత్వానికే వెడుతుందని శాసనాలనుబట్టి గ్రహించగలం. అందుచేతనే, గ్రామాన్ని దానంచేసే అధికారం అంటే, గ్రామంలో వచ్చే పన్నును తీసుకొనే అధికారం – ప్రభువే ఇస్తాడు. తనకు రైతులు ఇస్తుండిన పన్నులూ, మామూళ్ళూ ప్రతిగ్రహీతకివ్వమని దాత శాసిస్తాడు. అంటే, గ్రామాలనుంచి పన్నులు రాజుకే వెడతాయి. అయితే, రాష్ట్రాధికారో, మరో అధికారో ఆ పన్నులు వసూలు చేస్తాడు. ఇది ప్రజలకూ రాజుకూ మధ్యనున్న అనుబంధాన్ని తెంపేసి క్రమంగా ఫ్యూడల్ వ్యవస్థకు దారితీసింది. వాస్తవానికి రాజు ఈ అధికారులను తొలగించవచ్చు. కాని స్థానికంగా వున్న బలాన్ని బట్టి వారావుద్యోగాలలో కొనసాగుతుంటారు.

దండయాత్రలు, అంతర్యుద్ధాలు, అధిక సంఖ్యలో జనం వలసపోతుండడం కారణంగా చిక్కుల్లోపడే గ్రామాల ఆదాయాన్ని స్థిరంగా వుంచుకొనేందుకై ప్రభువులు స్థానికాధికారులకు కొన్నికొన్ని సౌలభ్యాలు కలిగిస్తుంటారు. అవి ఆ అధికార్లు ఆ ప్రాంతాలలో బాగా పాతుకుపోవడానికి అవకాశం ఇస్తాయి.

సామంతులనేవారు ఓడిపోయిన ప్రభువులు. వారు కప్పం చెల్లిస్తారు. విజేతయెడ విశ్వాసం కలిగివుంటారు. అయితే తమ రాజ్యంలో పన్ను వసూలు చేసేది వీరే. రాజదర్బారులకు హాజరవుతారు. తమ సైన్యాలతో రాజుకు తోడవుతారు. వీరు ఉద్యోగులస్థానే పరిపాలనావ్యవస్థలో కీలకస్థానంలో వుంటారు. ఆ విధంగా పరిపాలన వికేంద్రం కావడాన్ని త్వరిత పరుస్తారు. కేంద్ర ప్రభుత్వానికి దూరప్రాంతాలలో, విస్తృతప్రాంతాలతో సరాసరి సంబంధాలు లేకుండా పోతాయి.

సామంతుల దిగువవారు భోగికులు. వీరు ఒక ప్రదేశపు పన్నులను అనుభవిస్తారు. వీరికి కేంద్రప్రభుత్వంతో సంబంధాలు తక్కువ. వీరిక్రిందివారు భోజకులు, ముతుదలు అని పిలువబడే గ్రామాధికారులు. వీరు గ్రామనాయకులు. భూములు వీరి చేతులలో వుంటాయి. వీరికి పౌర, సైనిక, శిక్షాధికారాలుంటాయి. అయితే, యూరపులోలాగ, ఏ కరారునామాలూ, వీరి అధికారాలను నిర్ధారణచేయవు.

7వ శతాబ్ది ప్రథమ పాదంలో పులకేశి ఆంధ్రదేశాన్ని జయించి, తనతో తెచ్చిన సైన్యాధికారులను ఇక్కడ మండలాధిపతులనుగా నియమించడంతో ఆంధ్రలో ఫ్యూడల్ వ్యవస్థకు అంకురార్పణ జరిగింది. ఈ సేనాధిపతులు బ్రాహ్మణులకు తాముగా భూదానాలివ్వసాగేరు. అంటే, అంతకుపూర్వం సామంతులకు లేని అధికారం ఈ సైన్యాధికారులకు వచ్చిందన్నమాట.

రకరకాల మామూళ్ళు రద్దుపరుస్తూ చేసిన భూదానాలు ఫ్యూడల్ వ్యవస్థ వ్యాప్తికి

సాయపడ్డాయి. వీనిలో ప్రభువులకున్న పాలనాధికారాలు కూడా ప్రతిగ్రహీతకు వదలివేయబడినాయి.

1. ఆ ప్రదేశంలోకి రాజభటులు ప్రవేశించరాదు. రాజోద్యోగులు సేవా సహాయాలు కోరరాదు. చివరకు నేరస్థులకు శిక్షవేసే అధికారం కూడా వదిలేశారు. ఇవన్నీ ప్రతిగ్రహీత అధికారాన్ని పెంచడానికి తోడ్పడ్డాయి.

2. ఈ భూములలోని నిధినిక్షేపాల ననుభవించే హక్కుకూడా ఈ బ్రాహ్మణులకే వదిలివేయబడింది. అంటే, గనులపై యాజమాన్యం కూడా ప్రభువుకు లేదు.

3. రైతుల్ని ప్రతిగ్రహీతకు నచ్చజెప్పి తనకు అందవలసిన సేవలన్నీ వారాయనకే చేయాలని విధించడం ఫ్యూడలిజమే. అయితే, ఇది యూరపులోని అర్ధబానిసత్వంకాదు. రైతు ఉండడం, గ్రామం వదిలిపోవడం అతని ఇచ్ఛాధీనం.

4. విష్టి(వెట్టి) ఫ్యూడల్ వ్యవస్థకు ఒక ప్రధానాంగం. ప్రతిగ్రహీత తనకిచ్చిన భూమిని "చేసుకోవచ్చు. చేయించుకోవచ్చు". నిబంధన అంటూలేదు కనక ఆయన రైతుల చేత నిర్బంధంగా ఎంత పనేనా చేయించుకోగలడు.

5. బ్రాహ్మణులకు భూదానం ఇవ్వడం ప్రభుత్వ విధానంలో ప్రధాన భాగం. వారు ప్రభుత్వ దౌర్జన్యకాండ విస్తరించకుండా అదుపుచేయడానికి సాయపడతారు. ఆవిధంగా పరిపాలనవ్యయం తగ్గిస్తారు.

చివరిది: ఈ భూదానాలు గ్రామస్వయంపూర్ణతకు తోడ్పడ్డాయి. ప్రతిగ్రహీతలనుభవించే కొన్ని సౌకర్యాలు పట్టణంతో పల్లెకుగల సంబంధాలను తెంచివేశాయి. వారు గ్రామ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికై బయటి సంబంధాలను పెంచడానికి బదులు స్థానిక వృత్తి పనివారితోనే సంతృప్తి పడసాగేరు.

గ్రామాధికారుల చేతిలో వుండి ప్రభుత్వానికి సరాసరి సంబంధం గల మిగతా గ్రామాలు కూడా అదే మార్గం పట్టేయి. ఈ గ్రామాధికారులు బలవంతంగా రైతులచే వెట్టి చేయిస్తూ దురంతకులుగా తయారయారు.

సామాన్యోపయోగంలోవుండే నాణేల సంఖ్య తక్కువలో వుండడమే స్వయంపూర్ణ గ్రామాల సంఖ్య పెరిగిందనడానికి సాక్ష్యం. ఫాహియాన్ గవ్వలు నాణాలుగా చెలామణిలో వున్నాయన్నాడు. వర్తకం తగ్గిందనీ, ధనం వాడకం తగ్గిందనీ అది చూపుతూంది. వాణిజ్యం కోస్తా ప్రాంతంలోనూ, దేశ మధ్యంలోని, కొన్ని నగర బజార్లకూ మాత్రమే పరిమితమయింది. అది మొత్తం ఆర్థిక వ్యవస్థను ప్రభావితం చేయడంలేదు.

పై లక్షణాలన్నీ ఫ్యూడల్ వ్యవస్థకు సూచన లవునుగాని అవే ఫ్యూడలిజం కాదు. రాజ్యాధికార వికిరణం మత సంస్థలకూ, దేవాలయాలకూ, వానికి సంబంధించిన వారికీ గ్రామాలివ్వడం వలన వచ్చిందేగాని సైన్యాధికారులకు జాగీరులివ్వడం వలన రాలేదు. ప్రభుత్వానికి వారిచ్చే సహాయం ముఖ్యమైనదేగాని, ప్రత్యక్షం కాదు. పైగా వారు భూమిని వుపయోగించుకోగలరే గాని, అమ్మలేరు. మరొకరి కివ్వలేరు. ప్రభుత్వం వారికి దండప్రయోగాధికారం అప్పచెప్పలేదు. పన్ను వసూలు మాత్రాధికారంగల రాజులు ప్రభుత్వానికి చేయగల సాయం అల్పం.

శాసనాలలో పేర్కొన్న వుద్యోగాల ఎక్కువ తక్కువ హెూదాలనుగాని, వాని బాధ్యతలను గాని నిర్ధారణగా చెప్పేందుకు వానిలో వుపయోగించిన పేర్లు పూర్తిగా సాయపడవు. పైగా ఆ ఉద్యోగనామాలుకూడా అన్నిటిలో ఒక్కలాగాలేవు. సామంతుల నుంచి ముతుదవరకూ గల పెద్ద చిన్న వుద్యోగులమధ్య సంబంధాలను చెప్పడమూ కష్టమే.



అగ్రహారీకుడు రైతులనుంచి వెట్టి చేయించుకోగలడు గనక అగ్రహారాన్ని 'మేనోర్'తో పోల్చవచ్చుగాని, గ్రామాధికారీ వెట్టి చేయించుకుంటాడు. రైతులు తమ శ్రమనూ, కాలాన్నీ, అధికంగా సొంత వ్యవసాయాలలోనే ఖర్చుచేస్తారు. తమ పంటలో కొంతభాగం అగ్రహారందారుకో, ప్రభుత్వానికో చెల్లిస్తారు.

ఇదిగాక కులాలు, వర్ణాల సభ్యులమధ్య వుండే మనవాడుతనమూ, గ్రామంలో వుండేందుకూ విడచి పోయేందుకూ వారికిగల స్వాతంత్ర్యమూ శ్రమజీవులకు గొప్ప బలం.

భూదానాలు దేవాలయాలకూ బ్రాహ్మణులకే ఇవ్వడాన్నిబట్టి వైదికమతం రాజాదరణలో గట్టిగా కాలూనుకున్న దనాలి. బౌద్ధం క్షీణదశకు వచ్చింది. "అధికవ్యయకరములయిన వైదికకర్మకాండను బ్రాహ్మణులు వదిలేసి, కొత్తగా ఏర్పడిన జనావాసాలమీదా, అక్కడి ఆదిమ ప్రజలమీదా పలుకుబడి సంపాదించేరు. ఏవిధమైన ఉత్పాదనకూ సాయపడని విశాల విహారసంపదలుగల బౌద్ధమతం, వాణిజ్యం సన్నగిలి స్వయంపూర్ణ గ్రామాలు బలపడ్డాక తన ఉపయోగితను కోల్పోయింది" అంటారు. శ్రీడి.డి. కొశాంబి.

పరిశ్రమలు, వర్తకవాణిజ్యాలు ఉచ్ఛస్థాయిలో వున్న శాతవాహనకాలంలో ఖరీదయిన వస్త్రాలు, సుగంధద్రవ్యాలు, లోహపు బొమ్మలు, దీపస్తంభాలు మొదలైనవి వర్తకులవద్దకొనీ, వారికి అప్పులిచ్చీ, వారి బిడారులకు ముఖ్యమైన మజిలీలుగా సహాయపడీ బౌద్ధవిహారాలు ఎంతో ఉపయోగపడ్డాయి. క్రీ.శ. 3వ శతాబ్దిలో రోమ్ సామ్రాజ్యం పడిపోయింది. ఇంక భూమార్గాలు వాడకంలోంచి పోయాయి. స్వయంపూర్ణ గ్రామవ్యవస్థ పరిశ్రమలకు ముడిసరుకు లేకుండా చేసింది. వర్తకుల సరుకులకు మార్కెట్లులేవు. బలమైన వృత్తిశ్రేణులు శిథిలమై, వాని సభ్యులు అల్పంగా వుత్పత్తి చేసే చిన్న చిన్న కులాల సభ్యులుగా మారేరు. తలసరి వుత్పత్తి తగ్గింది. దూర ప్రదేశాలతో డబ్బు ఇచ్చి పుచ్చుకోవడం తగ్గిపోయింది. తమను సర్వవిధాలా పెంచి పోషించిన ప్రజల విషయం పట్టించుకోకుండా భిక్షువులూ, భిక్షుణిలూ అవినీతి జీవితాలు గడుపుతూ, పెద్ద పెద్ద పేర్లు తగిలించి అసహ్యకరమైన కర్మకాండలు సాగించడం బౌద్ధమత పతనాన్ని త్వరితపరచింది.

ఈ విశీర్ణత స్వకృతం. బౌద్ధమతం ఆర్థికంగా నిరుపయోగం, వ్యర్థం, అసహ్యకరం అయింది. నాగరికతను తెచ్చేదిగా దాని పాత్ర ముగిసింది. ఇప్పుడు శ్రమజీవులను వినయవంతుల్నిగా వుంచాలి. బలప్రయోగం అట్టే పనిలేకుండా, తన ఉత్పత్తి బాధ్యతను తాను చేసుకుపోతూ, అస్థిరకాల పూజా పునస్కారాలనూ జీర్ణంచేసుకోగల వారినిగా ప్రజలను తయారుచెయ్యడం ఇప్పుడవసరం. వైదిక మతం అందుకు సరిగ్గా సరిపోయింది.

ఇటువంటి మార్పే భాషా విషయంలోనూ వచ్చింది. ప్రాకృతంనుంచి ప్రజల భాష అయిన తెలుగులోకి పరిణామం రావడానికి బదులు వెనక్కితిరిగి సంస్కృతంలోకి మార్పు వచ్చింది. స్వయంపూర్ణగ్రామ ఆర్థిక వ్యవస్థలో బ్రాహ్మణుని స్థానమూ, సంస్కృతం తీరికగల వర్గం యొక్క భాష కావడమూ దీనికి కారణం. ఒకప్పుడు బుద్ధుని బోధలూ, అశోకుని శాసనాలూ పాళీ భాషలో వుండడమూ నాటకాలలో స్త్రీలూ, సాధారణ ప్రజలూచేత ప్రాకృతం మాట్లాడించడమూ చూస్తే ప్రామాణిక సంస్కృత భాష ప్రజలలో అంతరించిందనడానికి

సందేహం అవసరంలేదు. కాని, తర్వాత దక్షిణాన కర్మకాండనూ, సంస్కృతాన్నీ సజీవంగా వుంచినది బ్రాహ్మణులు. ప్రభువర్గం దానికి సాయపడింది. సంస్కృతం రాజభాష అయింది. తమ దేశ్య భాషలను వృద్ధిపరచుకొన్న వివిధ మండలాలమధ్య సంబంధం నిలిపింది. రెండోవేపున గొప్ప తనపు ప్రతిష్టను కాపాడుకొనేందుకు, ఈవేళ ఇంగ్లీషులాగ ఆనాడు సంస్కృతం ఒక సాధనం అయి ంది కూడా.

భాష అనేది ప్రజలమధ్య భావవ్యక్తీకరణ సాధనం. అదెప్పుడూ హద్దుల మధ్య గిరిగీసి నడచినట్లు సాగదు. బయటిప్రభావం రాకుండా ప్రతిభాషా తానుగా నిలుదొక్కుకొనేందుకు ప్రయత్నిస్తూంటుంది. తెలుగుచోళుల శాసనాలలో తెలుగు పద్యాల ఛాయలున్నాయి. విష్ణుకుండినులకాలంలో పద్యరచన అలవాటులో వుండే వుటుంది. కాని వానికి సాహిత్యంలో స్థానం చిక్కలేదు. చాళుక్యాక్రమణల ప్రధమదశలో కొత్త కొత్త శబ్దజాలం భాషలోకి వచ్చి చేరుతుండడమూ, కొత్త తెగలూ, జాతుల పలుకుబడుల తేడాలూ ఇందుకు కారణమై వుండొచ్చని శ్రీ బి.వి. కృష్ణారావుగారు ఊహిస్తున్నారు.

కళలూ కూడా ఆనాటి ప్రధానధోరణికి అనుగుణంగానే వున్నాయి. బౌద్ధశిల్పకళ ఉత్తమ సంప్రదాయా లు ఇక్ష్వాకుల కాలంలో ముగిశాయి. వైదిక సంప్రదాయం ప్రారంభమయింది. శిల్పంలో ఆ భావశబలత, రీతిమాధుర్యం వెనక బట్టింది. ఇప్పుడు భౌతికజీవితరంగచిత్రణ, మానసోల్లాస ప్రకంపనమూ పట్టడంలేదు. మతసంబంధమైన దృశ్యాలలో కూడ సౌకుమార్యం, సమ్మిశ్రత అదృశ్యమైనాయి. పరలోకదృష్టి కలిగించే దృశ్యాలూ, శిల్పమూ వచ్చేయి.

సాంప్రదాయక సంగీతమూ, నాట్యమూ ఉన్నతవర్గాలను కదలిస్తాయి. కాని జనసామాన్యానికి వారి జానపదగీతాలూ, నాట్యాలూ, అభినయాలూ మొదలైనవి కావాలి. అయితే అటువంటివేవన్నా ఇక్ష్వాకులతర్వాత వుండేవేమో మనకిప్పుడు సాక్ష్యంలేదు.

శాసనాలలో ఖగోళ విజ్ఞానం, వైద్యం, గణితం మొదలైన శాస్త్రాల ప్రసక్తి వున్నా ప్రజలకవి ఎంతవరకు తెలుసునో మనం చెప్పలేము. నాగార్జునకొండ హారీతి దేవాలయంలో సభాంగణనిర్మాణంలో కనబరచిన ధ్వని విజ్ఞానం అద్భుతం.

స్థూలంగా చెప్పాలంటే, ఆ చరిత్రదశలో ఆంధ్రుడు ఊబిలో దిగబడ్డాడనే చెప్పాలి. భౌతికంగానూ, ఆత్మికంగానూ పురోగమించడానికి అతని కెన్నో అవకాశాలెదుటవున్నాయి. కాని పురోహితవర్గం పెద్దరికంతో వున్న సమాజం అతని జీవితాన్ని స్వయంపూర్ణగ్రామంలో కట్టి పెట్టివుంచి, అనేకానేక మూఢవిశ్వాసాలమధ్య అతని మేధస్సును వికలపరచింది. ఇతరులకు వర్ణబంధాలు కొంత రక్షణనిచ్చినా అతడు తనకుతానే పరాయివాడయాడు. తాను చాకిరీదాసుడయాడు. అతడు సమాజానికి తిండి, బట్ట సంపదలు ఇస్తాడు. తాను సుదూర వేతనాల మీద బతుకుతాడు. అతని శ్రమ ఫలితం అతనిది కాదు. విజ్ఞానవీధుల కతడు సుదూరంగా వుంటాడు. తనతోడి వారితో కలిసి కష్టపడి పనిచేస్తాడు. తన్ను గురించీ, ప్రపంచం గురించీ ఆలోచిస్తాడు. పడుతూ, లేస్తూ, చికట్లో తడుముకుంటూ, దూరాన మినుకు మినుకుమనే కాంతిరేఖ కోసం అల్లా నడిచి పోతూనే వుంటాడు.

ఏడవ ప్రకరణము

# మధ్యయుగాల ఆరంభ వ్యవస్థ

## ఉపక్రమణిక

స్వయంపూర్ణ గ్రామవ్యవస్థ బలపడినకొద్దీ అమ్మకం సరుకుల తలసరి ఉత్పత్తి తగ్గింది. వ్యవసాయం, పరిశ్రమలూ ఇంచుమించు గ్రామావసరాలను తీర్చేవి. బజారుకోసం వుత్పత్తి చేసేది చాల తక్కువ. అయితే ఏవో కొన్ని గ్రామాలు తప్పనిసరిగా అవసరమయ్యే లోహాల్నీ, ఉప్పునూ తయారుచేసేవి. బంగారం, వెండి వంటి అపురూపమైన లోహాలూ, రత్నాలూ, మణులూ వంటి విలువయిన రాళ్ళూ నిజానికి నిత్యావసరాలేం కాదు. కాని రాజులు, రాణులు, సామంతులు, పూజారులు వాటిని ఎంతో కాంక్షిస్తారు. ఈ నిత్యావసరాలనూ, భోగవస్తువులనూ కొనుక్కోవాలంటే, మార్పిడే మార్గం. అందుకోసం సరుకుల ఉత్పత్తి బాగా పెరగాలి. కొబ్బరి, తమలపాకులు, పోకచెక్కలు వంటి ప్రత్యేకపంటలు రావాలి. సరుకు అమ్మేవాడుండాలి. వానిని చేరవేసేందుకు మార్గాలలో రక్షణ వుండాలి. లేకుంటే వర్తకుడు వుండి చేయగలదేమీ వుండదు. ఆ లోటును తీర్చగలది స్వంత భూమిదారయిన ఫ్యూడలు భూస్వామి మాత్రమే. అటువంటి వర్గం ఏర్పడడానికి తగు పరిస్థితులు దేశంలో వున్నాయి. గ్రామాలలో సాగులో వున్న భూమి అయితే ఉమ్మడి ఆస్తి, అదిగాక వూరు వెంబడిని ఖాళీ జాగాలున్నాయి. వాటిని వ్యక్తులకివ్వచ్చు. అల్లా ఇవ్వడం వలన రాజులకు వచ్చే నష్టం వుండదు. పాలకులుగా వారినుంచి భాగం తీసుకోవచ్చు. ఆ భూస్వామి బిడారులనుంచి రుసుము తీసుకొని వారికి రక్షణ యిస్తాడు. తన పంటనూ, గ్రామాలమిగులునూ సేకరించి వర్తకుడికి అమ్మడానికై ఏజెంటుగా వ్యవహరిస్తాడు. ఈ కొత్త ఏర్పాట్లకు గ్రామాలలోకి వలసవచ్చి స్థిరపడుతున్న బ్రాహ్మణులు బాగా సరిపడ్డారు. ఈ బ్రాహ్మణులు కొత్త పంటలు వెయ్యాలంటూ రాగి శాసనపు రేకులలో నిర్దేశించడం కనిపిస్తుంది. వీరుగాక ఊళ్ళవెంబడి ఖాళీ జాగాలను ఆక్రమించుకున్న భూస్వాములు ఉండనే వున్నారు.

ఆ విధంగా గ్రామాలలో ఒక కొత్త భూస్వామి వర్గం ఏర్పడింది. వారు క్రమంగా సాయుధ బలగాల్ని కూడా కూర్చుకుని స్థానిక ప్రజలమీద పెద్దరికం చేయగలిగేరు. రెండోవేపున వర్తకుడికి స్థానిక ఏజంటుగా వుపయోగపడసాగేరు. వర్తకుడుకూడా అనేక రూపాలలో ఈ నూతన భూస్వామి వర్గాన్ని బలపరిచేడు.

గ్రామసమితికి గాక, తనకన్న ఉన్నతుడైన పెద్ద ఫ్యూడల్ ప్రభువుకు మాత్రమే

బాధ్యతవహిస్తూ, గ్రామంలో న్యాయ, పరిపాలనా విధులను నిర్వహించే స్థానిక, సాయుధ, పన్ను వసూలుదార్లయిన భూస్వాముల చేతిలో భూమి చేరిన దశగా దీనిని కొశాంబి పేర్కొన్నారు. దీనినే "ఎగువ నుంచి ధృవపడిన ఫ్యూడలిజం" అని పిలిచేవారు.

మధ్యయుగాల ఆరంభకాలంనాటి ఫ్యూడల్ వ్యవస్థ ప్రభావం ఇది.

ఈ దశలో రైతులమీద పన్నులు, మామూళ్ళు బరువేగాక, భూస్వామికి వెట్టి చేయకపోతే హింసలకు గురికావలసిన పరిస్థితి కూడా ఏర్పడింది. సాధ్యమైనంత ఎక్కువ పన్ను వసూలుచేసి, పై వారికి సాధ్యమైనంత తక్కువ ఇవ్వడమే తెలిసివున్నవారి చేతుల్లోకి భూమి చేరిపోతుంది. గ్రామ సమితికి పెత్తనం లేకుండాపోయింది. భూస్వామే న్యాయవిచారణ విధులు కూడా నిర్వహించసాగేడు.

బ్రాహ్మణులకే గాక సైన్యాధినాధులకూ, సైన్య నాయకులకూ, రాజ బంధువులకూ భూములను ఇచ్చే అలవాటు క్రమంగా పెరిగింది. ఆ విధంగా పుచ్చుకొన్న వారు ప్రభువుకు నజరానాలు ఇవ్వడమేగాక, యుద్ధకాలంలో సైన్యంతో సాయపడాలి కూడా. ఈ బాధ్యత వారిని ప్రభువుకు భృత్యులనుగా చేశాయి. వారికిచ్చిన భూములు యూరపులో రాజులూ, బేరన్లు తమ క్రింది వారికిచ్చిన జాగీర్లవంటివే అవుతున్నాయి. వీరు తనను కూలదోయకుండా, దృఢంగా నిలబడడానికై ప్రభువు వీరినుంచి కప్పం తీసుకోవడమేగాక, దానిని వసూలు చేసుకునే శక్తికోసం తానూ కొన్ని భూముల్ని స్వంతానికి కలిగి వుండడం అవసరమయింది.

ఒక విధమైన ఫ్యూడలు ప్రభువర్గం అంతరంతరువులుగా ఏర్పడింది. గ్రామాంలో రైతులకన్న ఉన్నతస్థాయి వర్గం "రాతోడ్లు" ఏర్పడ్డారు. అక్కడి నుంచి "మహాసామంత", "మహా మండలేశ్వర" "మహా రాజాధిరాజు" వరకూ ఎన్నో మెట్లు, అంతరువులూను.

బ్రాహ్మణులలో చాలమంది ఉద్యోగులూ, భూస్వాములున్నూ. అనేక మంది ఆయుధాలు చేతపట్టి యుద్ధాలకు వెళ్ళేరు. ధనికులైతే, కులనిబంధనల నధిగమించినా ఎవ్వరూ ఏమీ అనరు. బ్రాహ్మణులకు దానధర్మాలిచ్చి తమ కులం తక్కువ దనాన్ని కప్పేసుకో గలుగుతారు. అయినా బ్రాహ్మణులు తమ విద్యావిభవాలతో మర్యాదలు నిలబెట్టు కొంటున్నారు. ప్రభువులు కూడా అనేక కులాలనుంచి వస్తున్నారు. వారు తాము శూద్రులమని బాహాటంగా చెప్పుకుంటున్నారు. బ్రాహ్మణులు వారినుంచి దానాలు పడుతున్నారు. మొత్తం మీద సమాజంలో చాల మార్పు వచ్చేసింది. మారనిదల్లా శ్రమ జీవుల పరిస్థితి. వారెప్పటిలాగే అర్థాకలితో పైవాళ్ళకోసం ఉత్పత్తిచేస్తూనే వున్నారు.

క్రమంగా రాష్ట్రంలో కొత్త మార్కెట్లు పుట్టుకొచ్చేయి. దేశభాషలలో సాహిత్యం ఉత్పత్తికావడమే దానికి సూచన. తెలుగులో వ్రాసిన శాసనాలసంఖ్య పెరిగింది. గ్రామాలమధ్య పరస్పర సంబంధాలు ఒక నూతన స్థాయికి విస్తరించి జాతులు, ఉపజాతులు ఏర్పడ్డాయి.

తాత్విక ఆలోచనాస్థాయి పెరగడంతోపాటు, మతంమాటున చిత్రమైన ఆచారాలే పెరిగేయి. ఉంపుడుకత్తెను కలిగివుండడం సంఘంలో ఘరానా అయింది. మతం ఏదకు దిగజారిందో దేవదాసీ పద్ధతి విస్తరించడమే తెలుపుతుంది. అతి సుందరమైన శిల్పాలకు బదులు జుగుప్సాకరమయిన నైతిక పతన దృశ్యాలు గుడిగోడల కెక్కడం పైవర్గాల పతనస్థితిని చూపుతుంది.

అయితే, మతం ప్రజల మనస్సుల్ని పట్టేసే వుంది. శ్రామికులకు మనశ్శాంతినిచ్చేది



ఇదొక్కటే. రాజులు, ఉద్యోగులు, వర్తకులు పోటాపోటీలుపడి మతాన్ని ఆదరిస్తున్నారు. అసంఖ్యాకంగా దేవాలయాలు కట్టేరు. స్వయంపూర్ణ స్వభావంవున్న ఉత్పత్తి విధానమూ, వైదికమతం సృష్టించిన మత మౌఢ్యమూ, అసంతృప్తులలో తిరుగుబాటుతత్వాన్ని తగ్గించాయి.

విదేశీవాణిజ్యం విస్తరించినా అది అరబ్బుల చేతులలోనూ, చైనీయుల చేతులలోనూ వుండిపోయింది. అందుచేత తెలుగువానికి బయటి ప్రపంచంతో సంబంధాలు లేకుండా పోయేయి. శాస్త్ర సాంకేతిక విజ్ఞానాలను అమలు చేయడం పోయింది. మనోదృష్టి పరిధి సంకోచించుకొన్నది. ఆలోచనలు విస్తరించడం పోయింది. ఈ చరిత్రదశాకాలంలో యుద్ధాలు, దోపిడులు, మారణ హింసాకాండల మధ్య సమాజ స్వరూపం మార్పు అనేది లేకుండా అల్లాగే వుండిపోయింది.

## ఆధిపత్యానికై కుమ్ములాటలు

ఏడవ శతాబ్దం సగపడినప్పటి నుంచి 500 సంవత్సరాలపాటు ప్రభువులు, సామంతులు, స్థానిక నాయకులు ఎవరికివారే స్వతంత్రత ప్రకటించడం, ఆధిపత్యం కోసం యుద్ధాలు, దోపిడులు, హింసా హత్యాకాండలు సాగించడం నిత్యకృత్యమై పోయింది.

బాదామిలో చాళుక్యులు, వేంగిలో తూర్పు చాళుక్యులు, తెలంగాణా, రాయలసీమలలో పశ్చిమ చాళుక్యులు, రాష్ట్ర కూటులు తరవాత కల్యాణీ చాళుక్యులు రాజ్యాలు చేస్తూ సర్వాధికారం కోసం ప్రయత్నాలు చేస్తూ వచ్చేరు.

చాళుక్యులు అసలుకు రాయలసీమవారేనని చరిత్రకారుల అభిప్రాయం. వారి శాసనాలు చాలవరకు రాయలసీమలోనే దొరకడం, వానిలో పేర్కొన్న గ్రామాలు రాయలసీమలో గుర్తించబడడం, కొన్ని శిలా శాసనాలు తెలుగులోనే వుండడం వినయాదిత్య (680-96), విక్రమాదిత్య (733-744)లవి బట్టి వారీ నిర్ణయానికి వచ్చారు. నాగార్జునకొండ శాసనాలలో చాళుక్యల పేరు "చలికులు"గా కనిపిస్తుంది. "చీలిక", "సలుకి", "సలికి", "చల్కి", "చాళుక్య" అనేవి పర్యాయపదాలని శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ వ్రాస్తున్నారు. బాదామి చాళుక్యులు రమారమి రెండువందలేళ్ళు పాలన చేశారు. వారిలో ప్రసిద్ధుడు రెండవ పులకేశి. ఇతడు రాష్ట్రకూటులను, కదంబులను, గంగులను, మౌర్యులను ఓడించేడు. ఉత్తరాపథ ప్రభువయిన హర్షుడు నర్మదాతీరంలో ఈయన చేతిలో ఓడిపోయాడు. కళింగాధిపతులైన తూర్పుగంగులను, పల్లవులను, విష్ణుకుండినులను ఓడించేడు. ఈ దండయాత్రలలో సాయపడిన ఆయన చిన్నతమ్ముడు విష్ణువర్ధనుడు రాష్ట్ర పాలకుడుగా వేంగిలో నియమించబడి తూర్పు చాళుక్య వంశానికి మూలపురుషుడయ్యాడు. ఈ రాజవంశం 500 సంవత్సరాలు కోస్తా ఆంధ్రను పాలించింది. నన్నయ "మహాభారత" రచనతో సువిఖ్యాతుడైన రాజరాజ నరేంద్రుడు (క్రీ.శ. 1019-61) ఈ వంశంలో చిట్టచివరివాడు.

బాదామి చాళుక్యరాజు రెండవ పులకేశి పర్షియా దేశపురాజు రెండవ ఖుస్రూ ఆస్థానంలో దౌత్య సంబంధాలు పెట్టుకోవడం, ఆయన కొడుకు విక్రమాదిత్యుడు దక్షిణాపథం మీద దండయాత్ర చేసిన అరబ్బు రాజులను (సింధు) ఓడించడమూ వీరి పాలనకాలంలో జరిగిన రెండు ముఖ్య ఘటనలు.

ఇంక బాదామి చాళుక్యులకూ - పల్లవులకూ, చాళుక్యులకూ - రాష్ట్రకూటులకూ,

రాష్ట్రకూటులకూ - వేంగీ చాళుక్యులకూ, రాష్ట్రకూటులకూ - కల్యాణి చాళుక్యులకూ, కల్యాణి చాళుక్యులకూ - చోళరాజులకూ నిరంతర యుద్ధాలు సాగేయి. అన్నదమ్ములు వారసత్వంకోసం చెరోరాజును ఆశ్రయించి యుద్ధాలతో దేశాన్ని నాశనం చేయడం, తాము నాశనం కావడం తరచుగా జరిగింది.

క్రీ.శ.1000 ప్రాంతంలో తూర్పు చాళుక్యవంశీయులూ, చోళవంశీయులూ బాంధవ్యాలు పెంచుకొని సన్నిహితులయ్యారు. చోళరాజుకు సంతానం లేకపోవటం వల్ల 1070లో తూర్పు చాళుక్యరాజు ఒకటవ కులోత్తుంగుడుగా చోళరాజ్యాధిపతి అయ్యాడు. తరవాత వేంగి రాజ్యాన్ని తన ప్రతినిధుల ద్వారా పాలించాడు.

11,12 శతాబ్దులలో వేంగీ మండలం మీద ఆధిపత్యం కోసం కంచిలోని చోళరాజులకూ, కల్యాణి చాళుక్య రాజులకూ యుద్ధాలు నడిచేయి. యుద్ధాలలో రెండు కుటుంబాలూ బలహీనపడ్డాయి. సామంతులు దృఢపడ్డారు. 13వ శతాబ్ది ప్రారంభంలో కాకతీయ రాజులు వరంగలు రాజధానిగా ఆంధ్రదేశ పరిపాలకులయ్యారు.

ఈ యుద్ధాలలో జరిగిన హత్యాకాండ విధ్వంసకాండ అనూహ్యం. తూర్పు చాళుక్యరాజు గుణక విజయాదిత్యుని (క్రీ.శ. 849-92) సేనాధిపతి పాండురంగ దాడిచేసి నెల్లూరునగరాన్ని రాష్ట్రకూటులకు చెందిన కిరణపుర, అచలపురాలను తగలపెట్టేశాడు. (నేటి) బస్తరు రాజధాని చక్రపురాన్ని భస్మం చేసేడు. చోళసైన్యాలకు అధిపతిగా ఒకటవ రాజరాజు (985-1016) కొడుకు రాజాధిరాజు పశ్చిమ చాళుక్యుల రాజ్యంలోని దోనూరును దోచుకుని స్త్రీ, శిశు సమేతంగా, "నగరవాసుల్నీ, బ్రాహ్మణులనూ" నరికించేశాడు. చాళుక్యరాజు 6వ విక్రమాదిత్యుడు కృష్ణానదీమండలంలో తన ఆధిపత్యాన్ని నిరుకుచేసుకొనేందుకు నదికి రెండువేపులా వున్న పూళ్ళూ, పల్లెల్లూ తగులబెట్టించేడు. చోళరాజు ఒకటవ కులోత్తుంగుని (క్రీ.శ. 1070-1122) సైన్యాధిపతి కరుణాకర కొండమానుడు కళింగ మీద దాడిచేసి "కళింగదేశం యావత్తూ భస్మం చేశాడు". "ఇటువంటి విధ్వంసాలను, వీరకృత్యాలనుగా శాసనాలు వర్ణిస్తున్నాయి. "కళింగాత్తుపరని" అనే తమిళ కావ్యం ఈ కళింగ దండయాత్రను స్వయంగా ఒకటవ కులోత్తుంగుడే నడిపాడనిచెప్తూ, సరిహద్దు గ్రామాలను తగులబెట్టి, దోచి, ధ్వంసం చేస్తూ తనరాక కబురు అందచేశాడంటుంది. వారిని కళింగరాజు అనంతవర్మ చోడదేవుని సైన్యాలు ఎదుర్కొని ఓడిపోయాయి. "ఎంతో యుద్ధసామాగ్రి ఏనుగులు, గుర్రాలు, ఒంటెలు, రథాలు, ధనపు పేట్టెలు ఎందరో పడుచులు విజేతలచేత చిక్కారు. జైనులు, బౌద్ధులు, బ్రాహ్మణ యాత్రికులు, సాధువుల వేషాలు వేసుకొని దయాభిక్ష కోరినవారిని కొద్దిమందిని తప్ప అందరినీ నరికి వేశారు."

## సైనిక జాగీర్లు

ఎంత బలవంతుడైన ప్రభువయినా తన చేతికిందవున్న వారికి బహూకరించనిదే తాను ఆక్రమించిన భూభాగాలను కాపాడుకోలేడు. ఈ విషయాన్ని బాదామి చాళుక్యులు గ్రహించేరు. రెండవ పులకేశీ, అయన సోదరుడు కుబ్జ విష్ణువర్ధనుడూ (తూర్పు చాళుక్య రాజవంశ స్థాపకుడు- వేంగి) తమ విజయాలను గట్టిపరుచుకొనేందుకై తమ కింద పనిచేసిన వారికి జాగీరులిచ్చి సత్కరించేరు. తరవాత ఆంధ్రదేశాన్ని పాలించిన బాదామి చాళుక్యులు, రాష్ట్రకూటులు,



వేంగీ- తూర్పు చాళుక్యులు, కల్యాణి చాళుక్యులు, కళింగకు చెందిన తూర్పు గంగులు, చాళుక్య-చోళులూ అందరూ అదే విధానాన్ని పాటించారు.

యుద్ధరంగంలో పరాక్రమం చూపి, ఇరుగు పొరుగు మండలాలను స్వాధీనపరచుకొన్న పృథ్వీధువరాజు అనే సైన్యనాయకుడికి రెండవ పులకేశి కొంత రాజ్యాన్ని వంశపారంపర్యంగా ఇవ్వడమేగాక రాజుపేర దానధర్మాలు చేసే గౌరవాన్ని కూడా ఇచ్చేడు.

అలాగే వేంగిరాజు కుబ్జవిష్ణువర్ధనుడు "రాముడికి అంజనేయుడిలా, విష్ణువుకు వైనతేయుడిలా, యుద్ధరంగంలో కవచంలాగ సాయపడిన" బుద్ధవర్మ అనే "చతుర్థకులాలంకారునికి" కొండవీడు పర్వతశ్రేణికి పశ్చిమంగా వున్న 73 గ్రామాలను రాజలాంఛనాలతో ఇచ్చేడు. ఈ బుద్ధవర్మ కొండపడమటి రాజవంశ మూలపురుషుడు. క్షత్రియరాజులు శూద్రులను సమాన రాజలాంఛనాలిచ్చి గౌరవించడం ఇక్కడ విశేషం. లలాటపట్టం, భేరీ, శంఖం, కాహళం (తూతూ బూర), ఆడపం (తమలపాకుల సంచి), అందలం, ఆతపత్రం, పడిగ (పీకిదాన), చామరం, హేమదండం-ఇవీ రాజలాంఛనాలు, ఆనాడు.

అందరికీ ఇంతపెద్ద జాగీర్లూ, రాజలాంఛనాలూ ఇవ్వలేదు. చిన్న జాగీర్లూ, జాగిరు లాంఛనమైన "ఆతపత్రము" ఇచ్చి గౌరవించిన వారు వున్నారు. "ఉజ్జేని పిశాచం"గా ప్రఖ్యాతుడైన సేనాపతిగా పశ్చిమ చాళుక్యరాజు ఒకటవ విక్రమాదిత్యుడు "ఏరువ విషయ"ను జాగీరుగా ఇచ్చేడు. ఉజ్జయినీ నగరాన్ని జయించడంలో తోడ్పడిన ఈ సేనాని ఎంత క్రూరంగా వ్యవహరించి వుంటాడో ఆయనకు వచ్చిన "పిశాచ" నామమే చెప్తుంది. కర్నూలు జిల్లా, కంభం తాలూకాలోని తురుమెల్లయే ఈ "ఏరువ విషయ". ఈ జాగీర్దార్లు ప్రభువు ఆజ్ఞలు పాలించాలి. దర్బార్లకు హాజరవాలి. అక్కడ తమ భక్తి విశ్వాసాలు ప్రకటించాలి. క్రమం తప్పకుండా కప్పం చెల్లించాలి. కొంత సైన్యాన్ని ప్రభువుకు ఇవ్వాలి. యుద్ధాలలో తాము కూడా సైన్యాలతో పాల్గొనాలి. ప్రభువు ప్రతినిధిని తమ ఆస్థానంలో వుంచుకోవాలి. ప్రభు దర్బారులో తమ ప్రతినిధిని వుంచాలి. ఈ విధి నియమాలన్నీ రాష్ట్రకూటుల నాటికి (క్రీ.శ. 735-973) ఒక స్పష్టమైన రూపం ధరించేయి.

రేనాటి చోడుల పాలనలో "నాయంకర" అనే పద్ధతి వినిపిస్తుంది. తనకు పైనున్న రాజుకు సైన్యసహాయం చేసే షరతుమీద బహుమతిగా ఇచ్చే సైనిక జాగీరును "నాయంకర" అన్నారని శ్రీ కె. ఈశ్వరదత్తు వ్రాస్తున్నారు. సైన్య నాయకులను మండలాధిపతులనుగా నియమించి ఆ విధంగా తమకు చేసిన సేవలకై వారిని రాజులు బహూకరించేవారు. మంత్రులు కూడా దండనాథులుగా పనిచేసేవారు.

తమ అధీనంలోని మండలాధిపతులను ఇరుగు పొరుగు రాజ్యాలమీదకు ఎగదోలి తమ కక్షలు తీర్చుకోవడం జరిగేది. పశ్చిమ గంగరాజులలోని ఒకటవ పృథ్వీపతి తన అధీన మండలాధిపతులయిన బాణుల్నీ, వైదుంబుల్నీ తన దాయాదియైన రెండవ రాచమల్లుని మీదికి పంపడమూ (క్రీ.శ. 825లో పెనుకొండ తాలూకా చోలమారి వద్ద యుద్ధం జరిగి ఓడిపోవడమూ చరిత్రకెక్కింది.

తన ప్రభువు యెడ తనకు గల భక్తివిశ్వాసాలు వెల్లడించడానికి జాగీర్దార్లు ఆత్మహత్య చేసుకున్న ఉదంతాలు తొమ్మిదవ శతాబ్దిలో పులినాడులో (నేటి చిత్తూరు జిల్లా) వున్నాయి. రాజులయెడ తనకున్న విశ్వాసాన్ని ప్రకటించడానికై జయమగన్ అనే అతడు మంటలలో

ఆత్మాహుతి చేసుకొన్నాడు. ఆయన జ్ఞాపకార్థం దేవాలయం ముందు వీరస్తంభం నాటబడింది.

వారివారి ఉపయోగాల్నిబట్టి ఈ సామంతుల హోదాలను పెంచడమన్నది ఫ్యూడల్ వ్యవస్థ లక్షణాలలో ఒకటి. అమాత్యుడూ, సామంతుడూ అయిన కుప్పనార్యుడిని ఆయన చూపిన భక్తివిశ్వాసాలకు మెచ్చి రెండవ అమ్మరాజు (947-70) ఆయనను మహాసామంతుడిని చేశాడు. సామంతునికన్న పైవాడు మహాసామంతుడు.

వేంగీరాజు ఒకటవ భీముడు (క్రీ.శ. 892-921) రనమర్ద కుటుంబానికి చెందిన కుసుమాయుధుడు చేసిన సహాయానికి మెచ్చి ఆయనకు సగం రాజ్యమే ఇచ్చేసేడు.

ఈ సామంతులు ఒక్కొక్కప్పుడు తమ రాజుల్ని తొలగించి, తమకు నచ్చిన వారిని గద్దెనెక్కించగలంత సమర్థులు. రాష్ట్రకూటరాజు నాలుగొవ గోవిందుడు (క్రీ.శ. 830-935) తూర్పు చాళుక్యుల్ని ఓడించగల సమర్థుడు కాడని, సామంతులు ఆయనను తొలగించి మూడవ ఆమోఘవర్షుడిని సింహాసనమెక్కించేరు.

పదవ శతాబ్దం ఆఖరున రాష్ట్రకూటుల ప్రాభవం నశించి రాయలసీమ, తెలంగాణాలు కల్యాణి చాళుక్యుల అధీనంలోకి వచ్చేయి. పదకొండవ శతాబ్ది మధ్యలో తూర్పు చాళుక్యుల ప్రాభవం చెడి వేంగి చోళరాజుల అధీనం అయింది. ఇంక వేంగి మండలం మీద పెత్తనం కోసం చోళులకూ, చాళుక్యులకూ మధ్య యుద్ధాలు ప్రారంభమయి రెండు వందల సంవత్సరాలు పైగాసాగేయి. ఈ పోరాట కాలంలో ఇరుపక్షాలూ దండ నాయకులకు జాగీర్లను విశేషంగా ఇచ్చేరు. ఈ యుద్ధాలలో నాలుగో వర్ణానికి చెందిన సామంతులు ప్రముఖ పాత్ర వహించేరు.

ధనదపురం (చందవోలు) రాజధానిగా నేటి రేపల్లె, తెనాలి తాలూకాలను (గుద్రవరమండలి) వెలనాటి చోళులు; కోనసీమను (రాజోలు, అమలాపురం) హైహయులు; గురజాడ రాజధానిగా పల్నాడును హైహయులు; కొణిదెన, పొట్టపి రాజధానులుగా నెల్లూరు, కడప, చిత్తూరు మండలాలను తెలుగు చోళులు, పిఠాపురం, యెలమంచిలి, శ్రీకూర్మం వగైరాలను చాళుక్యులు; కొవ్వూరు, నిడదవోలు, ఏలూరులను మలయులు; బెజవాడ రాజధానులుగా పరిచ్ఛేదులు పరిపాలించేరు. వీరంతా చాళుక్యచోళులను వశంవదులై వేంగిని కాపాడిన సామంతులు. వీరిలో చాలమంది చతుర్థకులంవారు. క్షత్రియుడైన చాళుక్య చోళచక్రవర్తి ఒకటవ కులోత్తుంగుడు (1070-1122) గుద్రవర మండల పాలకుడైన ఒకటవ గొంకచేసిన సహాయానికి మెచ్చి ఆయన కుమారుడైన ఒకటవ రాజేంద్రచోళుడిని దత్తు చేసుకొని తన కుమారుడుగా వేంగి రాజ్యం ఇచ్చేడు. ఈ గొంక చతుర్థ కులంవాడు.

ఈ చాళుక్య-చోళరాజు కులోత్తుంగుని చివరి దినాలలో పశ్చిమ చాళుక్య రాజుల సహాయంగా సామంతులు చాలమంది-తెలుగు చోడులు, హైహయులు, చాళుక్యవంశీకులయిన (వీరంత క్షత్రియులు) రాజులు-ఆయన కెదురుతిరిగేరు. కాని, కృష్ణకు దక్షిణ ప్రాంతాల నేలిన గొంక రాజు దుర్జయులూ, ఇతర స్వకులీన సామంతులా సహాయంతో చతుర్థ కులజుడైన గొంక రాజు వేంగిని తిరిగి జయించాడు. అంతవరకు కృష్ణానది దక్షిణ ప్రాంతాలకు రాజుగా వుండిన ఈ ఒకటవ గొంక రాజు ఆంధ్రదేశ పాలకుడయ్యాడు.

చాళుక్య-చోళరాజయిన రెండవ కులోత్తుంగుని కాలం (క్రీ.శ. 1133-50) నాటికి వెలనాటి చోళులు వేంగిని ఇంచుమించు సర్వస్వతంత్రులుగానే పాలిస్తున్నారు. ఇతర సామంతులూ అదే దారి తొక్కేరు. రాజ్యం విచ్ఛిన్నం కాకుండా చేసేందుకు వివిధ సామంత



కుటుంబాలను వివాహ బంధాలతో చేర్చివుంచే ప్రయత్నం ఈ కాలంలో జరిగింది. కాని అదీ ఫలించలేదు. రెండవ రాజాధిరాజు (క్రీ.శ. 1163-79)లో చోళ రాజుల పాలన ఆఖరయింది.

12వ శతాబ్ది చివరిలో జరిగిన పలనాటి యుద్ధంతో ఈ విచ్ఛిన్నత త్వరితమయింది. హైహయ కుటుంబానికి చెందిన సవతి అన్నదమ్ముల మధ్య కుటుంబ కలహంగా ప్రారంభమైన ఆ యుద్ధంలో ఆనాడు తెలుగుదేశంలో వున్న ప్రధాన సామంతులంతా పాల్గొన్నారు. అప్పటికి వేంగి పాలకుడుగా రెండవ గొంక రాజు వున్నాడు. ఈ పల్నాటియుద్ధ విధ్వంసం వేంగిలో వెలనాటి చోళుల ప్రాభవాన్ని నిర్మూలించింది. తరవాత కాకతీయులు ప్రాభవంలోకి వచ్చేరు.

తెలంగాణా, రాయలసీమలు 10వ శతాబ్ది మధ్యభాగం నుంచి 12వ శతాబ్ది నాలుగో పాదం వరకూ కల్యాణీ చాళుక్యుల రాజ్య భాగంగా వుండేవి. కప్పం చెల్లించడం, సైనిక సేవ చేయడం, తమ బిరుదావళికి ముందు ప్రభు బిరుదావళిని పేర్కోవడం తప్ప వీరి సామంతులు మిగతా అన్ని విధాలా తమ రాజరికపు హక్కులను అనుభవించేవారు. ఆనాడు శృంఘ, శంఖ, భేరీ, జయఘంట, ఢోలు శబ్దాలను-వెంట తెచ్చుకోవడం ఒక రాజమర్యాద. సామంతుల నుంచి మహారాజు వరకూ ఈ మర్యాదల ననుభవించేరు. చక్రవర్తి దర్బారుకు సంగ్రహరూపంలో వుండేవి వీరి దర్బారులు. చక్రవర్తి ప్రతినిధులుగా వచ్చినవారు గాక వీరికి వేరే మంత్రులు, పరిపాలనోద్యోగులు వుండేవారు. సుస్థిరతనూ, సంపన్నతనూ ప్రకటించే కొన్ని పదాల నుపయోగించ కూడదే తప్ప మిగిలిన విషయాలలో ప్రభు పదవికీ సామంతుల స్థితికీ పెద్ద తేడా వుండేది కాదు.

కల్యాణిలోని చాళుక్యరాజులేగాక చాళుక్యులమని చెప్పుకొనే చిన్న పెద్ద సామంతులు తెలుగుదేశంలో వివిధభాగాలలో పరిపాలనచేసేవారు. వారిలో 10వ శతాబ్దిలో వేములవాడ (నేటి వేములవాడ) ప్రాంతాన్ని ఏలిన రెండవ అరికేసరి ఒకడు. మహా మండలేశ్వర, మహాసామంతాధిపతి బిరుదులు కలిగి రాష్ట్రకూటుల సామంతుడుగా వుండేవాడు. ఏదో కారణాన రాష్ట్రకూటరాజు నాలుగొవ గోవిందుని (క్రీ.శ. 918-933) కోపానికి గురిఅయిన మరోచాళుక్య సామంతుడు విజయాదిత్యుడు అరికేసరి శరణుకోరేడు. ఆయన ఆశ్రమం ఇచ్చేడు. సామంతుల ఈ అవినయాన్ని సహించలేక రాష్ట్రకూటరాజు వారిపై దాడిచేసి, యుద్ధంలో మరణించేడు. ఇతర సామంతుల తోడ్పాటుతో అరికేసరి రాష్ట్రకూట సింహాసనంమీద బద్దెయదేవుని కూర్చొపెట్టేడు. ఈయనే మూడవ అమోఘవర్షుడుగా ప్రసిద్ధిపొందేడు. తరువాతి రాష్ట్రకూటరాజు నేక్కలుడు అరికేసరిమీద దండయాత్రకు వెళ్ళి యుద్ధంలో మరణించేడు. మాన్యఖేటం రాజధానిగా పాలించిన రాష్ట్రకూటవంశం ఈయనతో ముగిసిందనాలి.

ఉత్తరాన మహానది నుంచి దక్షిణాన గోదావరి వరకు గల కళింగరాజ్యాన్ని ఆ కాలంనాడు తూర్పుగంగరాజులు పాలించేవారు. యుద్ధరంగంలో తమకు సహాయం చేసిన వారికి జాగీర్లనిచ్చే సంప్రదాయాన్ని వీరూ అనుసరించేరు. రెండవ వజ్ర హస్తుడు. (క్రీ.శ. 973-1012) ఒక యుద్ధంలో ప్రాణంఇచ్చి తన్ను కాపాడిన బలినాయకుడనే యోధుని కొడుకుకూ మనుమనికీ శ్రీకాకుళం జిల్లాలోని 10 గ్రామాలు జాగీరుగా ఇచ్చి గౌరవించేడు.

గంగవంశరాజులకు సామంతులే అయిన కదంబులు రాష్ట్రపాలకులుగా, అధికమైన రాజకీయప్రాభవం కలిగివుండేవారు. నామమాత్రంగా గంగులయెడ తమవినయాన్ని ప్రకటిస్తూనే

వారు తామిచ్చిన దానాలతో తమ చేపముద్రనూ, తమ పాలనా సంవత్సరాన్నీ (గంగకదంబవంశ ప్రవర్ధమాన సంవత్సర - ) మాత్రమే పేర్కొనేంత బలవంతులయ్యారు.

గంగరాజుల సామంతులయిన సేనాధిపతులలో కొందరు వారి దగ్గర బంధువులుండేవారు. వారి శౌర్యప్రతాపాలను మెచ్చి గంగరాజులు గ్రామాలిచ్చేరు. మూడవ వజ్రహస్తుడు "గోరసత్త" విషయంలో 35 గ్రామాల జాగీరు నిచ్చిన "ఇరుగన మాండిత్య చొట్ట" ప్రభువుకు దగ్గర బంధువులలో ఒకడు. అలాగే ఆ ప్రభువునే శ్రీకాకుళం జిల్లాలో 12 గ్రామాలు జాగీరుగా ఇచ్చిన సోమన ఆయన అల్లుడూ, సేనాధిపతీ కూడ.

కులం ఎక్కువ తక్కువలూ కుటుంబాల గౌరవాగౌరవాలుగాక కేవలం యుద్ధ శక్తి, ప్రభుభక్తి, సహాయాలే ఈ గౌరవాలకు అర్హతలను కలిగించేయి. మూడవ వజ్రహస్తుడు వరాహవర్తనీ విషయలో నవగ్రామాన్ని "వేశ్యావంశోద్భవు"డైన గోకర్ణ నాయకునికి జాగీరుగా ఇవ్వడం ఇందుకు ఉదాహరణ.

సామంతులను అదుపులో వుంచుకోవడం ప్రభువులకు ఒక పెద్ద సమస్య. అందుకు నిరంతర యుద్ధపరిస్థితి వుండేదని కూడా భావించవచ్చు. దేవేంద్రవర్మ (క్రీ.శ. 1069-76) సలాంత్రి శాసనంతో విజయవంతంగా సామంతుల్ని అదుపులో వుంచానని (అనేకాహవ సంక్షోభజనిత జయశబ్ద ప్రతాపావనత సమస్త సామంత చక్ర) చెప్పుకుంటారు.

కొందరు సేనాధిపతులు మండలాధిపతులుగా కూడ వుండేవారు. దేవేంద్రవర్మ వద్ద ప్రముఖమాండలికుడైన వనపతి చోడ, ఉత్కల, వేంగిరాజుల నోడించిన ప్రముఖ సైన్యాధ్యక్షుడు కూడాను.

ప్రభువులిచ్చే జాగీర్లకు కులాలూ, కుటుంబాలతో ప్రమేయంలేనట్లే దేశ భేదాలూ, జాతిభేదాలూ కూడ లేవు. అనంతవర్మ చోడగంగుడు (క్రీ.శ. 1077-1150) తన కోసం అనేక యుద్ధాలలో పాల్గొని ప్రఖ్యాతి పొందిన ఉలగియగొండ పేర్మలుకు సాంబ విషయ (బొబ్బిలి)లోని ఒక గ్రామాన్ని జాగీరుగా ఇస్తాడు. ఈ ఉలగియగొండ చోళుడు రాజబంధువున్నూ. ఆయన తాత తమిళదేశంలోని ఉరిత్తూరు నివాసి. ఈ ఉలగియగొండను మరో శాసనం చోడ గంగదేవుని చిన్నతమ్ముడుగా పేర్కొంటుంది. చోళ-కళింగ రాజులు ఈ చరిత్ర కాలంలో చాల సన్నిహిత ప్రయోజనాలు కలిగివుండేవారని చెప్పవచ్చు.

సైన్యనాయకులకిచ్చే ఈ జాగీర్లను వారు వంశపారంపర్యంగా అనుభవిస్తారు. తమ జాగీర్లనుంచి గ్రామాలను, భూములనూ బ్రాహ్మణులకూ, దేవాలయాలకూ, మత సంస్థలకూ దానాలు చేయవచ్చు. తమ అధీనంలో వుండే విశ్వసనీయులైన భృత్యులకూ వుద్యోగులకూ, నాయకులకూ బహుమానాలుగా ఇవ్వవచ్చు. తమ అధీనంలోని నాయకులకిచ్చే గ్రామాలను తమ జాగీరుకు వున్న బాధ్యతలలోనే ఇస్తారు. అంటే నజరానా ఇవ్వడం, సైన్య సహాయం అవసరమైనప్పుడు ఇవ్వడం. ప్రారంభదినాలలో పేరున్న ఒక వుద్యోగో, ఒక సామంతుడో సిఫారసు చేసినమీద ప్రభువు భూములు దానం చేసినట్లు శాసనాలు చేప్పేవి. ఆ వుద్యోగులూ, సామంతులూ క్రమంగా బలపడినప్పుడు ప్రభువు అనుమతి లేకుండా తామే భూములు ఇవ్వడం ప్రారంభించేరు. తమ సామంత స్థితిని వారు నామమాత్రంగా చెప్పడమో, సూచించడమో చేసేవారు. ఇంకా బలపడినప్పుడు ఆ సూచనలూ వదిలేస్తారు. సంపూర్ణ స్వతంత్రపాలకులుగానే వ్యవహరిస్తారు.



## పరిపాలనా వ్యవస్థ

ఇంతకు పూర్వపు దశలో లాగనే ఈ చరిత్ర దశలో కూడ నిరంకుశ ప్రభుత్వ రూపమే కొనసాగింది. అయితే ఈ రెండు దశలలోని ప్రభుత్వ స్వభావం ఒకటి కాదు. వెనుకటి దశలో ప్రభువు స్వయంగా, ప్రత్యక్షంగా పాలన సాగించేడు. ఈ దశలో ప్రభువుకూ, పాలితులకూ మధ్య అనేక అంతరువుల సామంతులు వచ్చేరు. రాజభవనాలు, ఎంతో ఆర్భాటం, దుర్వ్యయం, యుద్ధాలు, అపార విధ్వంసమూ, అంతర్యుద్ధాలు ప్రత్యక్షమయ్యాయి.

యుద్ధాలూ, శాంతి గురించిన ప్రభుత్వ విధానాన్ని నిర్ణయించేది ప్రభువే. వర్తమాన వ్యవస్థను కాపాడడమూ, సమాజంలోని వివిధ తరగతుల మధ్య శాంతిని కాపాడడమూ ఆయన ప్రధాన బాధ్యతలు. ఈనాడు మనం భావించే విధంగా చట్టాలను చేసే అధికారం చక్రవర్తికి లేదు. అందుకు ధర్మశాస్త్రాలున్నాయి. ఆ విషయంలో ఆయనకు మంత్రిమండలి సహాయపడుతుంది. మంత్రులు చాలమంది సేనాధిపతులే అయివుంటారు. వారిలో కొందరు సామంతులూ వుంటారు.

సామ్రాజ్యం అనేక రాష్ట్రాలుగానూ, మండలాలుగాను విభజించబడుతుంది. అయితే వానిపేర్లు వివిధంగా వుండొచ్చు. ప్రభువు అధీనంలో ప్రత్యక్షంగా పాలించబడే ప్రదేశాలుగాక రాజవంశీకుల చేతులలో విశాలమైన భూభాగాలు వంశపారం పర్యంగా అనుభవంలో వుంటాయి. వీరిలో కొందరు ప్రభువంశం వారే కావచ్చు. కొందరు వివాహాల ద్వారా బంధుత్వం కలిసిన వారు కావచ్చు. మరికొందరు విశ్వాసంతో ప్రభువును సేవించినందుకు జాగీర్లు పొందినవారు కావచ్చు.

రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్ర ప్రభుత్వ ప్రతిరూపాలు. రాష్ట్రాధిపతి ఒక వుద్యోగి అయినా, సామంతుడయినా ఆయనకు కూడా మంత్రులూ, వుద్యోగులూ పరిపాలనలో సాయపడతారు. వారికి గౌరవబిరుదులుంటాయి. యుద్ధ దోపిడులలో వాటాలుంటాయి.

కుల పంచాయతులు, గ్రామ న్యాయస్థానాలతో పాటు ప్రభువూ, మండలాధిపతులూ, సామంతులూ, నియమించే న్యాయస్థానాలు న్యాయవిచారణ జరుపుతాయి. నేర నిర్ణయానికి సాక్ష్యం లభించకపోతే "దివ్య"ల ద్వారా నిర్ణయిస్తారు. రాజద్రోహానికి శిక్ష ఆస్తిని స్వాధీనపరచుకోవడమూ, మరణమూను. సామాన్య నేరాలకు జరిమానాలూ, జైలు శిక్షలూను.

ప్రభువు నుంచి సామంతుల, నాయకుల వరకూ వారి వారి హెూదాలను తెలుపుతూ రాజ లాంఛనాలుంటాయి. 11వ శతాబ్దిలో రాజరాజ నరేంద్రుడికి-శ్వేతపత్రం, శంఖం, పంచ మహా శబ్దాలు (భేరీ, బాకా, ఢోలు, శంఖ, జయ ఘంట). పంచమద్ధ (రామఢోలు), వరాహలాంఛన, పింఛ, కుంచ (ఈటె, బల్లెం), కనకదండ, మకరతోరణ, గంగ, యమునలు ప్రభు లాంఛనాలని నందంపూడి శాసనం తెలుపుతూంది.

ప్రభువులు ఎన్నో భోగవిలాసాలతో కూడిన జీవితం గడిపేవారు. రాజభవనంలో ఎందరో పరిచారకులూ, దాసదాసీలు వారిలో హెచ్చుమంది స్త్రీలే అయివుండేవారు. విదేశాల నుంచి రప్పించిన స్త్రీలూ, యుద్ధాలలో పట్టి తెచ్చిన వారూ ఎందరో సంగీత, నృత్య వినోదాలలో ఆరితేరిన వేశ్యలు ప్రభువుకూ, వారి బంధువులకూ, కుటుంబీకులకూ వుపయోగపడే ఆడపిల్లలూ వుండేవారు. రాజదర్బారులో సామంతులు, పౌర సైన్యాధికారులు, కవులు,

జ్యోతిష్కులు మొదలైనవారు పాల్గొనేవారు. ప్రజాపాలనా వ్యవహారాలు, ప్రజల కష్టాలు వినడం, విచారించడం ఈ దర్బార్లలోనే జరిగేవి. సామంతుల్నీ, మండలాధికారుల్నీ దర్బారుకు పిలిపించి వారి ప్రవర్తనపై ప్రభువులు సంజాయిషీ తీసుకొనేవారు. వారికి బహుమానాలిచ్చినా, వారి నుంచి కప్పం తీసుకున్నా దర్బారులోనే.

ప్రభువు స్వయంగానే తన సైన్యాలను యుద్ధానికి నడవవచ్చు. కాని సాధారణంగా సైన్యాధిపతులనో, సామంతులనో అందుకు నియమిస్తాడు. చతురంగబలాల్లో అశ్వికబలానిది ప్రాధాన్యం. మంచి గుర్రాలను పెంచడం ఏలాగో తెలియదు. అరబ్బులకు అపారధనం ఇచ్చికొనేవారు. దేశరక్షణ ఏర్పాట్లలో కోటలది ప్రాముఖ్యం. వానిని ముట్టడించే మెలుకవలు బాగానే తెలుసు. సైన్యాలకు అవసరమైన సామగ్రులను సమకూర్చే బాధ్యత మండలాధిపతులదీ, సామంతులదీను. అందుచేత ఏదన్నా దండయాత్ర తలపెట్టినప్పుడు వారందరినీ పిలిపించేవారు. యుద్ధంలో అన్ని కులాలకు చెందిన సైనికులూ వుండేవారు. క్షత్రియులు శౌర్యసాహసాలుగల సైనికులుగా ప్రసిద్ధివుంది. సేనాధిపతులకూ, సర్వసైన్యాధిపతులకూ స్వీయపోషణకూ, సైన్యపోషణకూ గాను జమీలు ఇచ్చేవారు.

వంశపారంపర్యంగా అనుభవించే జమీలూ, జాగీర్లూగాక ప్రభుత్వాధికారులూ, సామంతులూ స్వంత భూములు అపారంగా సంపాదించేరు. వ్యవసాయర్హమైన భూమి ఎంతో ఉండేది. జనమూ తక్కువ. వాణిజ్య పంటల అవసరమూ ఎక్కువవుతూంది. ఈ పరిస్థితుల నుపయోగించుకొని రాజులు, రాణులు, రాజ బంధువులు, పెద్ద చిన్న వుద్యోగులు ఎవరికివారే గ్రామ భూములను ముట్టుకోకుండానే అంచలాలలోని భూముల్ని పోటాపోటీగా ఆక్రమించుకొని వ్యవసాయంలోకి తేసాగేరు. వారు ప్రధానంగా వాణిజ్య పంటలను ప్రోత్సహించేరు. రైతుకూ వర్తకునికీ మధ్యదళారులుగా వ్యవహరించేరు. ఆ విధంగా ద్రవ్య మార్పిడి లక్షణాలు పూర్తి సమకూడేయి. వారు భూములనుంచి పంటనే కాదు, వ్యాపారం నుంచి లాభాలు కూడా సంపాదించేరు. రాజులూ, సామంతులూ, అధికార్లూ దేవమందిరాలకూ, బ్రాహ్మణులకూ ధర్మసంస్థలకూ భూములిస్తుండడమే ఆ భూములు వారి సంపాదనయని చెప్తాంది. ఈ పరిణామాన్ని కొశాంబీ "దిగువ నుంచి దృఢపడిన ఫ్యూడల్ వ్యవస్థ" అని వర్ణించేరు.

పన్నులనుంచి, కప్పాల నుంచి, స్వంత భూముల పంటనుంచి, ప్రభుత్వాస్తులనుంచి రాజుకు ఆదాయం వుంటుంది. భూమి పన్నులకు బదులు చాల గ్రామాలు ఏటా ఇంత మొత్తం అని చెల్లించేందుకు ఒప్పుకొనేవారు. ధనికుల నుంచి అప్పులరూపంలో తీసుకొనేవారు. విష్ణుమతస్తుల దేవాలయాస్తులు దోచుకొనేవారు. యుద్ధాలలో శత్రువుల వూళ్ళు, నగరాలు అన్నీ దోచి తెచ్చుకొనేవారు. ఈ మాదిరిగా పోగుచేసిన ధనం కొట్లలో మూలుగుతుండేది. ప్రమాద సమయంలో తప్ప దానిని ముట్టుకొనేవారు కాదు. ఆర్థికంగా ఆ సంపదంతా రాజ్యానికి ఏమీ వుపయోగం వుండేదికాదు. ఇరుగుపొరుగులకు మాత్రం ఆశ కలిగించేది. దానికోసమే దేశంమీద దండయాత్రలు జరిగేవి. చివరకు రాజ్యాలే ధ్వంసమయేవి. శుక్రాచార్యుడు "నీతిసారం"లో రాజు తన ఆదాయంలో ఆరోవంతు మాత్రమే కోశంలో వుంచాలన్నాడు. సగం సైన్యానికి, 12 వంతు స్వంతానికి, 12వ వంతు దానధర్మాలకి, 12వ వంతు జీతనాలకి మరో 12వ వంతు ప్రజా సౌకర్యాలకి ఖర్చుచేయాలన్నాడు.

8వ శతాబ్దిలో వేంగిరాజ్యం విశాఖపట్టణం నుంచి దక్షిణాన మానేరు వరకూ కోస్తాపొడుగునా



వ్యాపించివుండేది. ఇది అనేక "విషయ"లుగా విభజించబడింది. కొన్ని విషయలకు అంతకుమునుపు పేర్లే-కమ్మరాష్ట్ర, ప్రోలనాడు, బోయకొట్టం వంటివి కొనసాగినా, చాలభాగం కొత్త పేర్లతోనే-దిమిలి విషయ, గుడ్డివాడి విషయ, వెలనాడు విషయ మొIవి శాసనాలలో కనిపిస్తున్నాయి. అడవికొట్టి వేసుకొన్న 10-12 పాకల్ని కూడా వూరుగా లెక్కకట్టడంచేత ఆనాడు వేంగిరాష్ట్రంలో 12000 గ్రామాలుండేవి. ఈ విషయలలో పరిపాలన ఎల్లా ఉండేదో చెప్పడం కష్టం. ఒక నిర్ణీతపద్ధతి అంటూ లేదు. నిరంతరయుద్ధాలలో అల్లకల్లోలస్థితే వుంది. పిఠాపురం, ఎలమంచిలి, ముదిగొండ మొదలైన చోట్ల వున్నట్లు రాజకుటుంబపు శాఖలవారి చేతులలో కొన్ని మండలాలుండేవి. కొలనులో సారనాధులూ, కోనలో హైహయులూలాగ కొన్ని మండలాలలో రాజబంధువులు పాలించేవారు. సేవలు గుర్తించి రాజరికాలు కలిగించిన వెలనాడులు, కొండ పడమటులు, చాగి, పరిచ్ఛేది మొదలైనవారు కొన్నిమండలాలకు అధిపతులుగా వుండేవారు.

ప్రభువు లిచ్చిన భూదానాలకు హాజరైనవారుగా కొత మంది వుద్యోగులు, మండల నాయకులు వగైరా పేర్లు కనిపిస్తాయి. ఆ పేర్లను బట్టి ఆ వుద్యోగ స్వభావాన్ని అర్థం చేసుకోవచ్చు. తూర్పు చాళుక్యరాజులు తమ కోరికను స్థానికాధికారులకు తెలిపేందుకు "ఆజ్ఞాపతు"లను పంపేవారు. ఆ ఆదేశాల ప్రకారం స్థానికాధికార్లు శాసనాలు తయారుచేసి యిచ్చేవారు.

తూర్పు చాళుక్యులు ప్రారంభంలో గ్రామ సమితులలో తమ దానాలను ప్రకటించేవారు. స్థానికోద్యోగులు వానిని శాసనబద్ధంచేసి అమలు జరిపేవారు. శాసనాలలో వారి ప్రసక్తి వుండేదికాదు. మొట్టమొదటిమారు సర్వలోకాశ్రయ మంగి యువరాజు (క్రి. శ. 682-706) చందవోలు శాసనంలో నైయోగిక వల్లభులనే వుద్యోగుల పేరు కనబడుతుంది. ప్రభువు వద్ద అనేక తరహాల వుద్యోగులుండేవారు. వారిని "నియోగు"లనేవారు. వారిపై వుండే పర్యవేక్షకులు నైయోగికవల్లభులు, లేక నియోగాధికృతులు. గురు, పురోహిత, మహాప్రధాన, సామంత, సేనాపతి, గణక, అంగరక్షక, జ్యోతిష్క, కావ్యజ్ఞ, ద్వారపాలక, నర్తక, గాయక, భేరీవాదక, వేశ్యాజన, ధాన్యాధికారి, వ్యావహారిక-మొదలైన వుద్యోగులు డెబ్బయిరెండు తరహాల వారుండేవారు. రాజదర్బారులో మొత్తంగా వారిని బహత్తరు లనేవారు.

దానశాసనం స్థిరపరచడానికి వేశ్యలతో సహా 72 మంది వుద్యోగులు సమక్షంలో ఎందుకు వుండాలో తెలియదు. బహుశా గ్రామస్థులకూ, ఇరుగు పొరుగులకూ దాన నియమాలయెడ శ్రద్ధ కలిగించడానికి అయివుంటుంది. అయితే ఇంతమందినీ ప్రత్యక్షంగా వుంచడం ఒక ఆచారంగా సాగలేదు.

విజయాదిత్యుడు (కీ.శ. 808-47) గ్రామస్థులలోనే ఒక అధికార వర్గాన్ని "కూటకు"లని తన "ఈడేరు" శాసనంలో పేర్కొంటాడు. ఆయన తరువాత రాజు గుణగ విజయాదిత్యుడు (క్రీ.శ. 849-92) వారినే "రాష్ట్రకూట" శబ్దంలో పేర్కొంటాడు. రాష్ట్రకూటులనే పేర ప్రసిద్ధులయిన కన్నడరాజ కుటుంబం వేరు. తెలుగుదేశం లోని ఈ రాష్ట్రకూటులు గ్రామస్థులే. అయితే కొంచెం పెద్ద హోదా వున్నవారు మళ్లీ గ్రామాధికారి వేరు. వారిని "గ్రామీణు"లనేవారు.

గ్రామస్థులలోనే గ్రామస్థాయి సామంతులుగా, ప్రభుసేవలో ఆయుధధారులై పాల్గొనవలసిన బాధ్యతగల వుద్యోగులుగా రాష్ట్రకూటులను చెప్పవచ్చు. రాజ్యాధిపత్యంలో రాజుది పై మెట్టు. రాష్ట్రకూటునిది ఆఖరు, దిగువమెట్టు.

రాష్ట్రకూటులు చేసిన ప్రభు సేవదృష్టితోవారికి భూములు ఇవ్వడం, వారిని గ్రామాధికారిని చేయడం, లేక గ్రామంలో పండే ఏదో ఒక రకం పంటలో కొంత భాగాన్ని వసూలుచేసుకొనే హక్కు నివ్వడం వంటివి అలవాటుగా వుండినట్లు శాసనాల వలన గ్రహించగలం. ఒకటవ అమ్మరాజు (క్రీ.శ. 921-27) ఒక రాష్ట్రకూటునికి భూమినిచ్చినట్లు శాసనం వుంది. ఆ రాజే వేరొక రాష్ట్రకూటుని గ్రామణిగా చేశాడు. గ్రామంలోవేసే ఒక పంట (దానిపేరు తెలుగులోనే స్పష్టంగా చెప్పబడింది.) నుంచి 8 గద్యనకలు తీసుకొనే అధికారం అతనికి ఇవ్వబడింది.

ఈ రాష్ట్రకూటశబ్దం రత్తగుడు, రత్తడు అనే తెలుగుమాటకు సంస్కృతీ కరణం. దయావసంత పృథ్వీరత్తడు కొడుకైన ధాన్యవసంత పృథ్వీరత్తగుడి కొడుకు కల్యాణవసంతులు వేంగిరాజైన రెండో జయసింహ (క్రీ.శ. 706-18) కాలంలో కొంతభూమిని అర్హంత భట్టారునికి దానంచేసినట్లు శాసనం వుంది. రత్తగుడ్లు, రత్తడ్లు, రత్తోడ్లు అనేవి ఈ శబ్దంయొక్క బహువచన రూపాలు-దీనిని బట్టి 8వ శతాబ్దంలోనే "దిగువనుంచి దృఢపడిన ఫ్యూడల్ వ్యవస్థ"కు అంకురాలు ఏర్పడ్డాయనుకోవచ్చు. తరవాత అవి వేళ్ళూని విస్తరిస్తాయి.

తూర్పు చాళుక్యులు తమ రాజ్యాన్ని సుస్థిరం చేసుకొనేందుకు సృష్టించిన పదవులలో "యువరాజు"పదం ఒకటి. ఇది రాజ్యవారసుడనే అర్థంలోగాక రాజ ప్రతినిధి అనే అర్థం కలిగివుండినట్లు కనబడుతుంది. ఒకటవ జయసింహునికి (క్రీ.శ 614-73) పరిపాలనా వ్యవహారాలలో తోడ్పాటుగా వుండిన "మంగి యువరాజు" ఆయన తమ్ముని కొడుకు. ఆయన సింహాసనానికి వచ్చినా (క్రీ.శ. 682-706) జయసింహుని తర్వాత రాలేదు. బల్లాల దేవుడిని యువరాజుగా నియమించిన రెండవ అమ్మరాజుకు పిల్లలే లేరు.

గ్రామణి గ్రామంలోని ప్రభుత్వ ప్రతినిధి గ్రామం ఎన్నుకొన్నవాడు కాదు. గ్రామవ్యవహారాలను చూడడం, వ్యవసాయ కార్యకలాపాలను పర్యవేక్షించడం, గ్రామ యజమానికి రావలసిన రుసుములు వసూలుచేయడం వంటివి గ్రామణి బాధ్యతలు. ఇంకేమున్నాయో తెలియవు. ఈ గ్రామణుల్ని సరిగ్గా పనిచేయకపోతే ప్రభువు తొలగించవచ్చు. ఒకటవ అమ్మరాజు పాబుసర్రు దానశాసనంలో అటువంటి ఘటన వుదహరించబడింది. ఈ గ్రామణికి వేతనంగా కొంత భూమినో, గ్రామంనుంచి వసూలయ్యే కొంత పన్నో ఇచ్చేవారు. కుసుమాయుధుడనే అతనికి రెండవ అమ్మరాజు గ్రామకూటత్వాన్ని - ఆ వుద్యోగాన్ని- శాశ్వత వంశపారంపర్యంగా ఇచ్చినట్లు శాసనం వుంది. ఇచ్చినది భూమికాదు, వుద్యోగం. గ్రామ రివెన్యూలో భాగమన్నమట. ఈ వుద్యోగాన్ని గ్రామకూట గాముండి, గాముండ అని పిలిచేవారు.

రెండవ అమ్మరాజు (క్రీ.శ. 947-70) మంగల్లు శాసనం "అష్టాదశ తీర్థ"లంటూ మంత్రిమండలిని పేర్కొంది. ఒకటవ అమ్మరాజు (క్రీ.శ. 921-27) కాలపు 72 మంది నియోగాధికృతుల వుద్యోగాలకన్న ఈ 18 మంది మంత్రిమండలి కొంత వరకు నయం. వీరిపేర్లు : మంత్రి, పురోహిత, సేనాపతి, యువరాజ, దౌవారిక, అంతర్వంశిక, ప్రశాస్త్రి, సామహర్త్రి, సన్నిధాత్రి, ప్రాదేష్ట్రి, నాయక, పౌర, వ్యావహారిక, కర్మాంతిక, దండపాల, దుర్గపాల, అంతపాల. వీరి హోదాల క్రమం తెలియదు.

తరవాత రెండవ అమ్మరాజే మచిలీపట్నం శాసనాల నాటికి మంత్రి మండలిని ద్వాదశ స్థానాధిపతులనుగా పేర్కొన్నాడు. సామంత, అంతఃపుర, మహామాత్ర, పురోహిత, అమాత్య, శ్రేష్ఠి, సేనాపతి, శ్రీకరణ, ధర్మాధ్యక్ష, రాష్ట్రకూట ప్రముఖ మొదలైనవారు.



తర్వాత రాజరాజనరేంద్రుని నందంపూడి శాసనం నాటికి 5 గురి మంత్రుల మండలి అయింది. ఈ విధంగా పనిసాగిస్తూ దిద్దుకుంటూ తూర్పు చాళుక్యులు "పంచప్రధాను"లను స్థిరపరుచుకొన్నారు. అయితే వీరి పేర్లేమిటి - బాధ్యతలేమిటనేది తెలియదు.

రెండవ చాళుక్య భీముని (క్రీ.శ. 935-47) మచిలీపట్నం శాసనాన్ని బట్టి గ్రామంలోని బ్రాహ్మణ కుటుంబ యజమానులు ఎన్నుకొన్న కమిటీల ద్వారా గ్రామపాలన సాగుతుండినట్లు అర్థం అవుతుంది. ఆ కమిటీలు ఏమిటి? ఏ పని చేస్తాయనేది కంజీవరం సమీపంలో ఉక్కల్‌లోని విష్ణుదేవాలయంలో దొరికిన చోళరాజుల శాసనాలనుబట్టి వూహించాలి. ఏమంటే, తూర్పు చాళుక్య పాలన ఉత్తర భాగంలో వారి మీద చోళపరిపాలనా పద్ధతుల ప్రభావం అధికంగా వుండేది. ఆ శాసనాలనుబట్టి గ్రామపాలన 5 కమిటీల ద్వారా సాగేది. 1. సంవత్సర ఫలిత పరిశీలన సంఘం, 2. చెరువుల పరిశీలనకు, 3. తోటల పరిశీలనకు, 4. న్యాయ విచారణ పరిశీలనకు, 5. ధర్మాదాయాల పరిశీలనకు. ఇవిగాక, మచిలీపట్నం శాసనంబట్టి, 6వ కమిటీ (పంచవర)పై అయిదు కమిటీల పని పరిశీలించేందుకు ఏర్పడేదనీ, దీనిలో సభ్యత్వం ఎంతో ప్రతిష్ఠతో కూడుకున్నదనీ అర్థం అవుతూంది. ఉక్కల్ దేవాలయ శాసనంబట్టి ఈ కమిటీలు గ్రామసమితిలో భాగాలుగా వుంటాయని తెలుస్తూంది. ఇదే చరిత్ర దశలో పల్లవ, చోళరాజుల అధీనంలో వుండ చిత్తూరు మండలంలో గ్రామ పరిపాలనను సమితులు నిర్వహించేవనీ, దేవాలయాల నిర్వహణ కూడా వాటిదేననీ అనేక శాసనాలనుబట్టి తెలుస్తూంది.

ఇక రాయలసీమ, తెలంగాణాలలో :

ఈ ప్రాంతం ఆరవ శతాబ్ది సగపడినప్పటి నుంచి ఎనిమిదవ శతాబ్ది సగపడే వరకూ రెండు వందలేళ్ళు బాదామి చాళుక్యుల పాలనలో వుండేది. వారు రాజ్యాన్ని రాష్ట్రాలు, విషయలుగా విభజించేరు. అయితే వాని వైశాల్యం చాల హెచ్చుతగ్గులుగా వుండేది. రాష్ట్రాధికారిని రాష్ట్రపతి, విషయాధికారిని విషయపతి అనేవారు. వేరే మంత్రిమండలి అంటూ లేదు. రాజకుటుంబ సభ్యులే పాలనా వ్యవహారాలు చూసేవారు. వుద్యోగులు వారికి సాయపడేవారు. జయించిన భూభాగాలను కప్పం తీసుకొని వెనుకటి ప్రభువుల చేతులకే వదిలేశారు. వారు సామంతులుగా ప్రభువుకు సైన్యాలను సరఫరా చెయ్యాలి. వీరి పాలనలో గ్రామ్యక (గ్రామాధికారి), రాజపురుష (ప్రభువు ఏజెంటు), తలవర (తలారి), దండనాయక (మేజిస్ట్రేటు), రాష్ట్రిక (రాష్ట్రపాలకుడు), దూత (వార్తాహరుడు), భట (సైనికుడు), నట (నాట్యకారుడు), చేటక (బంట్రోతు), పరిచారక (రాజదర్బారు వుద్యోగి) నియుక్త (రాష్ట్రకునికి సహాయకుడు), అధ్యక్ష (సూపరింటెండెంటు), ప్రశాస్త్రి (సమాలోచకుడు), నాయక (ముఖ్యుడు), సమాహర్త (రివెన్యూ అధికారి) అనే వుద్యోగులున్నట్లు రెండవవిష్ణువర్ధనుని కొనెకి శాసనంబట్టి తెలుస్తూంది. "గ్రామ సంభవ అధికృతులనే వుద్యోగులు (గ్రామంలో పండిన పంటల అధికారులు) వున్నట్లు తెలుస్తూంది.

పశ్చిమ చాళుక్యుల అనంతరం ఈ ప్రాంతాలను పాలించిన రాష్ట్రకూటుల పాలనావ్యవస్థ ఇంతకన్న కట్టుదిట్టంగా వుండింది. దేశాన్ని రాష్ట్రాలు, విషయలుగా విభజించేరు. ఈ రెండూ సరాసరి ప్రభువు పాలనక్రిందనే వుండేవి. విషయలను 50-70 గ్రామాల చొప్పున "భుక్తి"లుగా విభజించేరు. వీనిని గ్రామ కూటాలుగా విభజించేరు. కొద్ది గ్రామాలు కలిసి గ్రామకూటం ఏర్పడుతుంది. అన్నింటికి దిగువన గ్రామం. రాష్ట్రపతి రాష్ట్రంలోని పౌర, సైనిక పాలనను

నిర్వహిస్తాడు. అలాగే విషయపతి అక్కడి పౌర, సైనిక పాలనను చూస్తాడు. భుక్తి అధికారి భోగపతి ఈయన ప్రభుత్వాదాయ పాలనాధికారి. ఆయన కింద "నల్లవుండ" పేరులో రెవెన్యూ వుద్యోగులుంటారు. వీరివి వంశపారంపర్యోద్యోగాలు పన్ను లేకుండా భూములు వీరికి ప్రతిఫలంగా ఇస్తారు. గ్రామ పాలనకు ముఖ్యుడూ, ఎక్కౌంటెంటూ వుంటారు. ఈ వుద్యోగాలు కూడా వంశ పారంపర్యమే. వీరికీ ప్రతిఫలరూపంలో పన్నులు లేకుండా భూములిస్తారు. సామంత, మహాసామంత, మహాసామంతాధిపతి, మహామండలేశ్వర వంటి బిరుదులు వివిధ అంతరువులతో వుండేవి.

కొంతకాలం పల్లవులకింద, మరికొంతకాలం చాళుక్యుల క్రిందా సామంతులుగా వుండిన రేనాటి చోడులు తమ రాజ్యాన్ని రాష్ట్రాలు, మండలాలుగా విభజించేరు. మండలాలు గ్రామాలుగా విభజించేరు. గ్రామాధికారి రత్తోడు. అతడొక సామంతుడు. అతడు బ్రాహ్మణులకూ, దేవాలయాలకూ దానాలు ఇవ్వవచ్చు. గ్రామంనుంచి పన్నులు వసూలు చేసి, ప్రభుకోశానికి పంపేవాడు. స్థానికి సైన్యాధికారి కూడా అతడే. కార్య ఖడ్గధురంధర, చమూపతి, ధనాధ్యక్ష, మహామాత్య, దండనాయక, సంధివిగ్రహి అనే పేర్లతో అధికార్లుండేవారు. రాజు దానశాసనం ఇచ్చేటప్పుడు మంత్రి, పురోహిత, సేనాపతి, యువరాజు, దౌవారికులను రాష్ట్రకూటులు (రత్తోడు)డిని, గ్రామ కుటుంబ పెద్దలను సమావేశ పరచేవాడు. యుద్ధాలప్పుడు కోటల అధిపతులూ, రాష్ట్రపతులూ సైన్యాలను పంపుతారు. సైన్యాధిపతుల సేవలకు వారికి భూముల నిచ్చేవారు. వారి సేనలను బట్టి వారిని నిర్దిష్ట ప్రాంతాలకు సైన్యాధిపతులనుగా నియమించేవారు.

11, 12 శతాబ్దాలలో ఆంధ్రప్రదేశపాలనా వ్యవస్థ క్రమబద్ధమయింది. క్రింది నుంచి పైకంటా వుద్యోగాలలో తర, తమ భేదాలు స్పష్టమయాయి. కళింగదేశపు తూర్పుగంగరాజులు తమ రాజ్యాన్ని విషయలుగా విభజించేరు. క్రీ.శ. 1000 ప్రాంతాల నాటి జంగంపాడు శాసనం రాజన్, రాజనక, రాజపుత్ర, విషయపతి, మహాసామంత, సామంతులను వరసక్రమం ఇచ్చి పేర్కొంటూంది. వీరుగాక మహాకాయస్థ (పౌర సభాధ్యక్షుడు), సంధివిగ్రహి (యుద్ధ-శాంతి కార్యదర్శి), మహాక్షపాలి(పత్రిలేఖకుడు)అనే వుద్యోగులు కనిపిస్తున్నారు. దేవేంద్రవర్మ (క్రీ.శ. 1012-37) అనంతవర్మ వజ్రహస్తి (1037-69)ల నాడు - "ప్రభుత్వ నిర్మాణం పకడ్బందీగా వుంది. రాజ్యం మహామండలములు - (పెద్ద రాష్ట్రాలు), మండలములు (రాష్ట్రాలు), విషయలు (జిల్లాలు), భోగలు - (తాలూకాలు) గ్రామాలుగా విభజింపబడింది. ఈ విభాగాల మీద తరతమ స్థాయిలో అధికార్లు, వారి బాధ్యతలు అనేక శాసనాలలో ఇవ్వబడినాయి. వానిని బట్టి గంగ సామ్రాజ్యము చాలా పెద్దదీ, బలీయమూ కూడా నని కనబడుతూంది. మహామండలేశ్వరులు, పంచవిషయ మండలేశ్వరుల తరవాత అమాత్యులు - మంత్రులు, పంచపాత్రులు-(అయిదుగురు ప్రముఖనాయకులు), ప్రధానులు - (చిన్నమంత్రులు), జనపదములు (గ్రామసమితులు) అధికార్థం నిర్వహించేవి. వైదుంబులు, పల్లవులు, చోడులువంటి దగ్గర బంధువుల్ని గంగరాజులు సేనాధిపతులనుగాను, మండలేశ్వరులనుగా నియమించేవారు. మహాప్రతీహార (కోశాధ్యక్ష), రహస్యాధికారి (రాజు స్వంత కార్యదర్శి), ఆజ్ఞాపతి (దానపత్రనిర్వహణాధికారి), శాసనాధికారి (రాజశాసన అధికారి), మహాసంధి విగ్రహక (యుద్ధ-శాంతి విషయక సలహాదారు), పురోహిత తదితర దర్బారు వుద్యోగులూ, దేవాలయాధికారులూ పురవరులు వుండేవారు. పేర్లలో కొంచెం మార్పులు, కొద్దిపాటు అటుఇటులతో ఆనాటికి ఉద్యోగివర్గం హెచ్చు తగ్గులు,



నిర్ణీతమైన బాధ్యతలతో నిర్మాణరూపం ఏర్పడింది. ఉత్తరాన మహానది నుంచి దక్షిణాన గోదావరివరకు విస్తరించిన 11వ శతాబ్దంనాటి గంగసామ్రాజ్యంలో పరిపాలనాయంత్రం అతి సూక్ష్మంగా విభజించబడి, ఎంతో సమర్థతతో పనిచేయడం కనబడుతుంది- అంటారు శ్రీ ఆర్. సుబ్బారావుగారు తమ "హిస్టరీ ఆఫ్ ది ఈస్టరన్ గంగాస్ ఆఫ్ కళింగ"లో.

తూర్పు చాళుక్యుల తరవాత వేంగి రాజ్యాన్ని చాళుక్య-చోళులు తమ ప్రతినిధులద్వారా పాలించేరు. ఆ రాజ్యాన్ని అనేక చిన్నపెద్ద రాష్ట్రాలుగా విభజించి వెలనాడు చోడులకు లొంగివుండగల స్థానిక సామంతుల ద్వారా పాలించేరు. చాళుక్య చోళులలో గొప్ప ప్రఖ్యాతి పొందిన ఒకటవ కులోత్తుంగుడు(క్రీ.శ.. 1070-1122) సామంతులలో తర తమ స్థాయిలను పాటించేడు. విశ్వాసం గల వారిని సేనాధిపతులుగా నియమించేడు. వారు చేసిన సేవలకు గుర్తింపుగా సామంతులనుగా, మండలేశ్వరులనుగా చేసేడు. వారిపైన మహా మండలేశ్వరులు.

వెలనాటి చోడులపాలనలో వారసత్వపు తగవులు పరిష్కరించే ఆలోచనతో ప్రతి పాలకుడు చివరరోజులలో తన అనంతరనివాసునితో కలిసి జంటగా పరిపాలన చేసేవాడు. చోళ సామ్రాజ్యంలో ఈ అలవాటువుండేది. ప్రధానమంత్రి, ఇతర మంత్రులు, సేనాధిపతి, కోశాధ్యక్షుడు, పురోహితుడు, కేంద్రరాజ్య ప్రతినిధి పరిపాలనా మండలిగా వుండేవారు. రెండవ గొంకరాజు కాలంలో రాజ్యం బాగా విస్తరించడంచేత కేంద్రలోనూ రాష్ట్రాలలోనూ కూడ వుద్యోగుల్ని పెంచవలసి వచ్చింది. మంత్రిమండలి అధ్యక్షుడుగా రాజాధ్యక్షుడు, సంధివిగ్రహికి పైన సంధి విగ్రహిముఖ్యుడు, సేనానికి పైన సమస్త సేనాధిపతి వచ్చేరు. అమాత్యుడు ఉన్నతోద్యోగులపై అధికారిగాను, కొంత పౌర, సైనిక శాఖల అధికారిగా కార్యఖడ్గ ధురంధరుడూ ఏర్పడ్డారు. ధనాధ్యక్షుడు, కోశాధికారి, భండారి-వేర్వేరు అంతరువుల వుద్యోగులు. వీరి వుద్యోగ బాధ్యత ఒక్కటే. గ్రామాధికారిని గ్రామణి లేక రెడ్డి అనేవారు. గ్రామంలోని పెద్దమనుష్యులు "మహాజనులు". వారూ గ్రామోద్యోగులూ కలిసి గ్రామసమితి ఏర్పడేది.

11, 12 శతాబ్దాలలో రాయలసీమ తెలంగాణాలు కల్యాణి చాళుక్యులపాలనలో వుండేవి. వారి రాజ్యవిభజన ఇల్లా వుండేది: రాష్ట్రము లేక మండలము. తర్వాతది విషయ, నాడు, కంపన, ఠాణా అనేవి వరసక్రమంలో చిన్నవి. రాష్ట్రపతి, విషయపతి, అయక్తక, నియక్తక, అధికారక, రాష్ట్రకూటులు వాని వాని అధికారులు. గ్రామంలో రైతులు, మహత్తరులుగా ప్రజలు రెండు స్థాయిలలో గుర్తింపబడేవారు.

ఇంక ఫ్యూడల్ ప్రభువులలో అంతరాలుండేవి: మహామండలేశ్వరుడు లేక మహా సామంతాధిపతి, మహా సామంతుడు, సామంతుడు క్రమంగా ఒకరి దిగువనొకరు. ఆనాడు వుద్యోగాలూ, సామంతగిరీలూ కలిసిపోయే వుండేవి.

ప్రభుత్వోద్యోగులకూ, సామంతులకూ ఇచ్చిన జాగీరులపై, వారికి క్రయ విక్రయాలతో సహా సంపూర్ణ యాజమాన్యం హక్కు వుంది. ఆ విధంగా ఒకరివద్ద నింకొకరు భూములుకొని దానాలుచేసిన శాసనాలున్నాయి.

సంధివిగ్రహి వుద్యోగం చాల రాజకీయ ప్రాధాన్యం గలది. సామ్రాజ్యంలో వున్న సామంతులు కొందరు ఇంచు మించు స్వతంత్రులనదగి వుంటారు. పూర్వం పెద్ద రాజ్యాలు ఏలిన జ్ఞాపకాలతో, ప్రస్తుత పరాధీనస్థితికి ఉడికిపోతూ, మరల పూర్వవైభవం సంపాదించడానికి అనువు చూసుకొంటున్న వారుంటారు. ఇంకా పలువిధాలు. వారికీ కేంద్రప్రభుత్వానికి మధ్య

సంబంధాలను చాల తెలివీ, మెలుకువతో నిలపగలగాలి. అలాగే ఇరుగు పొరుగు రాజ్యాలతోనూ. అందుకే ఈ వుద్యోగానికి అత్యధిక ప్రాముఖ్యం వుంది.

ఇంక స్థానిక పరిపాలన స్వపరిపాలనరూపం తీసుకొంటూంది. పల్లెలు, పట్టణాలు, రాజధానివరకు ప్రతిచోట ప్రజాసమితులుండేవి. ప్రతిదానికీ దాని సంప్రదాయాలూ, ప్రత్యేకతలూ వుండేవి. ఆ ప్రాంతంలో నివసించే కుటుంబాల పెద్దలు (వీరు సర్వసామాన్యంగా అగ్ర వర్ణస్తులే ఉండేవారు) ఆ సమితి సభ్యులు, న్యాయంతో సహా అన్ని విషయాలూ సమితి అధికారంలో వుంటాయి. గ్రామోద్యోగులకు గ్రామ భూముల నుంచి భూమి కేటాయిస్తారు. ఈ సమితుల నియమ నిబంధనలను దృఢపరిచే అధికారం రాజుకూ, రాజోద్యోగులకూ సామంతులకూ వుంది.

ఎనిమిదవ ప్రకరణము

# ఫ్యూడల్ వ్యవస్థ పుట్టుక – పెరుగుదల

## భూమి సంబంధాలు

జనాభా పెరగడం, భూమిమీద ఒత్తిడి హెచ్చడంతో, క్రమంగా వ్యవసాయం విస్తరించింది. గ్రామకంతాలను అంతకంత కధికంగా సాగులో పెట్టేరు. పన్ను విధింపులకై వ్యవసాయ భూమి మూడురకాలుగా పరిగణించబడింది. తోటలు, తరిసాగు, మెట్టసాగు వీనిలో తరిసాగు భూములు చాలా సారవంతమైనవి. నీరువుంటే దానితో వరిపండించవచ్చు, లేదా వానిలో కూడ మెట్టపైరులు వేయవచ్చు. నీటి సౌకర్యాల్ని బట్టీ, భూసారాన్ని బట్టీ పంట దిగుబడిని బట్టీ తరి భూములను కూడ అనేక అంతరువులుగా విభజిస్తారు. మెట్టసాగు భూములు కేవలం వర్షాధారంతో పండుతాయి. కొబ్బరి, పోక, మామిడి, తమలపాకులు, చెరుకు, పత్తి మొదలైన వ్యాపార పంటలు, కాయధాన్యాలు, పప్పుధాన్యాలు విస్తారంగా పండించబడేవి.

కొబ్బరి, తమలపాకు, పోకతోటలు భూస్వామికి మంచి ఆదాయాన్ని ఇస్తాయి. వర్తకుడికి మంచి లాభమూ తెస్తాయి. రైతుకు పేరూ తెస్తాయి. ఇవి అందరూ వాడే వస్తువులు, చాలమందికి పనులు కల్పించేవీను. ఆనాటి శాసనాలలో ఈ పంటలు తరుచు పేర్కొబడ్డాయి. ఈ తోటలున్న భూముల్ని రాజులూ, వారి భృత్యులూ కూడ దేవాలయాలకు విశేషంగా దానాలు చేశారు.

తరివ్యవసాయానికి నీటిపారుదల ఏర్పాట్లు కావాలి. ఆనాడు నీటిని చెరువులలో నిలవచేసి చేలకు వుపయోగించేరు. నదులలోంచి ఏటి కాలువలు తీసి వుపయోగించేరు. చిన్న చిన్న నదులకీ, వాగులకీ, అడ్డంకట్టి పెద్ద పెద్ద చెరువులు నిర్మించేరు. తటాకాలు తవ్వించడం మహా పుణ్యకార్యంగా భావించేరు. రాజులు, సామంతులు, వర్తకులు, ధనిక రైతులు తటాక నిర్మాణానికి పాయపడ్డారు. వానిని సరియైన స్థితిలో వుంచడానికి ధర్మనిధులు ఏర్పాటు చేశారు. శాసనాధారాలనుబట్టి మెదక్‌జిల్లాలో "మదివోజనకెరే" తటాకం వుండినట్లు తెలుస్తూంది. మహబూబ్‌నగర్ జిల్లాలో భీమ సముద్రం పేరు మరో శాసనం వలన తెలుస్తూంది. నల్గొండ జిల్లాలో పెద్ద చెరువు కింద 12 నివర్తనల భూమిని ఇద్దరు బ్రాహ్మణుల కిచ్చినట్లు ఒక శాసనం గుంటూరు జిల్లా నార్నపాడులో దేవాలయనాకి ద్రోణసముద్రం చెరువు దానం చేశారు. గుంటూరు జిల్లా చేబ్రోలులో అనంత సరోవరమన్న పెద్ద చెరువు వుండినట్లు పశ్చిమ చాళుక్యుల శాసనం ఒకటుంది. కర్నూలు జిల్లా ఆదోని తాలూకాలో జోయియస్సముద్ర,

చిత్తూరు జిల్లా కుంగనూరులో రాజేంద్ర చోళప్పలియేరి, రెండూ పెద్ద చెరువులు. రెండవ అమ్మరాజు తాడికొండ శాసనంలో చెప్పిన చైత తటాకమూ, భీమసముద్రమూ నేటికీ వున్నాయి. భీమ సముద్రం పెద్ద చెరువు. దానిగట్టున శిథిలశివాలయం వుంది. దానిని భీమలింగము దిబ్బ అంటారు. చైత తటాకం 3-4 చదరపుమైళ్ళ వైశాల్యం గలిగి, చాలాదూరంవరకు భూములకు నీరునిస్తుంది. తటాక నిర్మాణం పుణ్యలోక ప్రాప్తి నిస్తుందనే విశ్వాసంతో సామాన్యులు కూడా నూతులూ, చెరువులూ తవ్వించేవారు. ఆదోని తాలూకా బెలగల్లులోని దేవాలయం తోటలో నలుగురు పెద్దలు ఒక నుయ్యి తవ్వించేరు. ఒక చెరువు నిర్మించిన ఇద్దరికి మడకశిర తాలూకాలో నాలుగు గ్రామాల వారు భూములిచ్చేరు. రేనాటి సామంతులు కలిసి ప్రోలినాయక చెరువు, కమ్మలవారి కొత్త చెరువు, పొట్టచెరువు, వెన్నపరెడ్డి చెరువులను తవ్వించారని రెండవ కులోత్తుంగ రాజేంద్రచోడుని శాసనం వలన తెలుస్తుంది. దేవుడికిచ్చిన భూముల సాగు ఏర్పాట్లకై చెరువులు తవ్వించడం, కాలువలు తీయించడం కోసమై ప్రజలు ధనం పోగుచేసి ఇవ్వడం జరిగేది.

నీరు పారించడానికి ఏతాలు, మోటలు సాయపడేవి.

కొత్తగా భూమిని సాగులోకి తెచ్చినవారికి ప్రారంభంలో కొన్ని ఏళ్ళు పన్ను లేకుండా చేసి రాజులూ, సామంతులూ వ్యవసాయాభివృద్ధికి ప్రోత్సాహం కలిగించేరు.

వ్యవసాయానికిలాగే అంత ప్రాధాన్యమూ పశువులమందల కిచ్చేవారు. ప్రతి గ్రామంలోనూ గ్రామ ఉమ్మడిమంద లుండేవి. వానిని మేపుకొనేందుకు గోభూములుండేవి. ఆవూ, గేదె, మేక, గొర్రె మొదలైనవి పాలు ఇవ్వడమేకాదు, భూములకు కావలసిన ఎరువు లిచ్చేవి. ఎద్దూ దున్నా బళ్ళులాగుతాయి. వ్యవసాయంపనులు చేస్తాయి. పాలనుంచి తీసే నెయ్యి పై వర్ణాలవారి ఆహారంలో ఒక ముఖ్యపదార్థం. దానిని దేవాలయాలలో జ్యోతులకూ వుపయోగిస్తారు. అందుచేత గ్రామస్థులు పశువుల మందలను సంపదలుగా భావించేరంటే ఆశ్చర్యంలేదు. రైతులవద్ద పశువు లుండడమే కాదు, పశువులమందలను వూరినుంచి వూరికి తిప్పుతూ, ఎరువుకట్టినందుకు రైతుల నుంచి ధాన్యం తీసుకుని బతికే జనమే కొందరుండేవారు. ఈ పశువులమందలు సంపదలు గ్రామాన్ని ఆదుకొంటున్నా యనుకొన్నప్పుడు ఇరుగుపొరుగులకి కన్నుకుట్టి తగవులకు కారణం కావడమూ జరిగేది. గ్రామాలమీద దాడులు చేయడం, పశువుల్ని తోలుకుపోవడం, కొట్లాటలు, మరణాలు – ఎంతోబీభత్సం జరిగేది. ఇటువంటి ఘట్టాలలో పశుసంపదలను రక్షించడంలో ప్రాణాలిచ్చిన వీరుల సంస్మరణార్థం నాడు నాటిన రాతి స్తంభాలు రాయలసీమ గ్రామాలలో నేటికీ అనేకం కనిపిస్తాయి. చిత్తూరు, అనంతపురం జిల్లాలలో ఎక్కువగానూ, గుంటూరు, కడప, కర్నూలు జిల్లాలలోను ఈ వీరస్తంభాలున్నాయి. పల్లవ, చోళ, బాణ, గంగరాజుల పాలనకాలంలో ఈ పశు దాడులు ఎక్కువగా జరిగేయి. చిత్తూరు జిల్లా, పుంగనూరుతాలూకా బోడినాయకనూరు గ్రామం ఒక్కదానిలో 11 వీరస్తంభాలున్నాయి. దోపిడి దారుల నెదుర్కొని ప్రాణాలు కోల్పోయిన వారిసంతానానికి భూముల నిచ్చినట్లు శాసనాలు తెలుపుతున్నాయి. అలాగ మరణించిన ఒక వీరుని దత్తపుత్రునికి ఆ వీరుడు మరణించి పడివున్న భూమినే ఇచ్చినట్లు ఒక శాసనం తెలుపుతుంది. అడవిపందిని చంపి పశువుల్ని కాపాడినందుకై అనంతపురం జిల్లాలో ఒక కుక్కను వీరస్తంభంవేశారు.

మంచి ఆదాయాన్నిచ్చే తోటభూములను దేవాలయాలకు దానం ఇస్తూ రాసిన



శాసనాలు చాలా వున్నాయి. ద్రాక్షారామ భీమేశ్వరాలయంలో అఖండ జ్యోతి ఖర్చుకై 2 వేల పోకచెట్లున్న తోటను ఒకవూళ్ళో దానం చేశారు. నిజామాబాదు పెంటగ్రామంలో దేవునికి నుయ్యివున్న మామిడితోట దానం చేశారు. అలాగే బాపట్లదేవాలయానికి ఒక ముఖ్యుడు మామిడితోట నిచ్చేడు. ఒక బళ్ళారి గ్రామంలో 120 మంది గ్రామస్థులు దేవపూజకై 220 కమ్మల తోటభూమి నిచ్చేరు. కర్నూలుజిల్లా కోయిలకుంట్లలో ఒక దండనాయకుడు కొంత తరి (మాగాణి) కొంత మెట్ట, కొంత తోటభూమి దేవాలయానికిచ్చేడు. అదే జిల్లా మందుడిలో దేవాలయానికి ఒక మహాప్రధానుడు, మరో యిద్దరూ కొంత తరి భూమి, తోటభూమి యిచ్చేరు. ఇల్లాగే ఎన్నో.

ఆనాడు భూమిస్వంతం ఏ విధంగా వుండేదో శాసనాలను బట్టి తెలుసుకోవచ్చు. గ్రామంలో అనేకకులాల రైతుకుటుంబాలు వుంటాయి. ప్రతి కుటుంబానికీ తాను చేసుకొనే భూమిమీద సంపూర్ణస్వత్వం వుంటుంది. అమ్ముకోవచ్చు. ఎవరికేనా ఇవ్వవచ్చు కాని, దానమో, అమ్మకమో గ్రామపెద్దలతో ఏర్పడిన సమితి ఆమోదం పొందాలి. చోళుల కాలంలో ఈ సమితులకు ఎన్నికలు జరిగేవి. దేవాలయాలకోసం జరిగే అమ్మకాలకూ, దానాలకూ సమితివారు అభ్యంతరం చెప్పరు.

గ్రామసమితి చేతిలో సమష్టిస్వత్వం క్రింద కొంతభూమి వుంటుంది. బహుశా గ్రామంపుట్టినప్పటి భూమి అయివుంటుంది. దానిని రైతులకు పంచుతారు. భూమి మంచి చెడ్డల ఫలితాలను అందరూ సమానంగా అనుభవించేటట్లు అప్పుడప్పుడు ఈ భూమిని మరలమరల పంపిణీ చేస్తుంటారు. దీనమీద ఏ ఒక్కరికీ స్వత్వం ఉండదు.

అగ్రహారాలు కూడా ఇతర గ్రామాల పద్ధతితోనే వుంటాయి. అయితే వీనికి పన్ను వుండదుగనక మిగులు వుత్పత్తి అంతా బ్రాహ్మణభూస్వాములకే పోతుంది. అగ్రహారం ఇచ్చినప్పుడు దానితోపాటు ఒక శివారు గ్రామన్ని కూడా కలపడం మామూలు ఏమంటే, అగ్రహారంలో బ్రాహ్మణులు తప్ప వుండరు. వారి భూములు చేసే జనంకోసం వూరు, లేక పల్లె వుంటుంది. అగ్రహారీకులకు రైతులిచ్చే పంటలో ఎవరివాటా ఎంతో ఈ సమితి నిర్ణయిస్తుంది.

దేవాలయాలు, మఠాలు, ధర్మసంస్థలకు సంబంధించిన భూములుంటాయి. ఇక్కడ కౌలుకదపాలను అసలుదాతయే నిర్ణయిస్తాడు. లేదా, సంప్రదింపులద్వారా నిర్ణయిస్తారు. సాధారణంగా, ఆభూముల్ని చేసుకొనేవారికి సగం స్వంత దారులదిలాగానే హక్కు వుంటుందంటారు శ్రీ కె. ఎ. నీలకంఠశాస్త్రి.

రాజులకూ సామంతులకూ స్వంతభూములు చాలావుంటాయి. సైన్య సేవ దృష్ట్యా ఇచ్చిన జాగీర్లు కావవి. గ్రామకంఠాలను ఆక్రమించి వ్యవసాయంలోకి తెచ్చిన భూములు. అవి స్వంతభూములయిపోయాయి. అమ్ముకోవచ్చు దానంచేసుకోవచ్చు.

ఈ విధంగా భూమిస్వత్వం నాలుగు తరహాలుగా వుండినట్లు తెలుస్తుంది. ఒకటి– గ్రామసమితి సమష్టి స్వాధీనంలో వున్నది. రెండు : గ్రామసమితి అంగీకారం అవసరమవుతూ, రైతుల స్వంతస్వత్వంలో వున్న భూమి మూడు: దేవాలయ, ధర్మ సంస్థల భూమి, నాలుగు: రాజుల సామంతుల స్వంత ఆస్తులు.

గ్రామసమితులు వున్నట్లు మనకు అనేక శాసనాల దాఖలా కనిపిస్తుంది.

దేవాలయాలకు వ్యక్తులిచ్చినా, గ్రామసమితులిచ్చినా ఆ భూములకు పన్నులుండవు.

ఏటా ఇంత ధనమో, ధాన్యమో దేవాలయకోశానికి వప్పచెప్పే షరతు మీద దాత వ్యవసాయదారు అయితే-తానే ఆ భూమి చేసుకుంటాడు. లేదా తనకు నమ్మకమున్న మరొకరి కిచ్చేలాగ విధించవచ్చు.దేవాలయలకు వచ్చిన ధనరూప బహుమతులను గ్రామసమితి స్వాధీనంలో వుంచుతారు. ఆ ధనాన్ని శాశ్వతంగా వడ్డీ నిర్ణయించి వ్యక్తులకూ ఇవ్వడం వుంది.

రాజులూ, సామంతులూ, ఇతరులు కూడా తమ స్వంత భూములను అమ్మిన వుదంతాలూ, దానం ఇచ్చిన వుదంతాలూ అనేక శాసనాలద్వారా తెలుస్తాయి.

వ్యక్తులనుంచి రాజుల భూములు కొనుక్కొనే ఆచారం చాలా పురాతనం. నందిగామ తాలూకాలో ఒక గ్రామదేవాలయానికి ఇచ్చేందుకై తూర్పుచాళుక్య రాజు కాళీవిష్ణువర్ధనుడు ఒక బ్రాహ్మణుడికి బంగారం ఇచ్చి భూమికొన్నాడు. మతకార్యాలకై రాజులు తమ భూముల్ని అమ్మడం వుంది. శ్రీకాకుళంజిల్లాలోని కుద్దమ్ గ్రామాన్ని రాజువద్దకొని దానంచేసినట్లు చిక్కులవలస దానశాసనం చెప్తూంది. 5 మాడలిచ్చి ఒక పట్టీ భూమికొని భీమునిపట్నం తాలూకాలో ఒక దేవాలయానికి దానం ఇచ్చినట్లు ఒక శాసనం. రెండు దేవాలయాలలో సేవలు జరిపించేందుకు రెండు గ్రామాల సమితులు భూమిని అమ్మినట్లు చిత్తూరు జిల్లాలో రెండు శాసనాలు చెబుతున్నాయి. ఒక భక్తునిపేర పోకతోట వేసేందుకై భూమి అమ్మినట్లు కాళహస్తి తాలూకాలో ఒక శిలాశాసనం వుంది. ఒక మఠం పోషణకై ఒక వూరి తలవరి మరోవూరి సమితినుంచి భూమి కొన్నట్లు ఒక శిలాశాసనం. ఇల్లాగే ఎన్నో.

దేవదానాలతో పాటు బ్రహ్మదేయాలు కూడ అసంఖ్యాకంగానే జరిగేయి. తూర్పు చాళుక్యరాజు ఒకటవ విష్ణువర్ధనుడు ఒక ప్లేకివిషయ గ్రామంలో 40 మంది బ్రాహ్మణులకు ఒక్కొక్కరికి నూరు నివర్తనల చొప్పున దానం చేశాడు. తూర్పుగంగరాజు మూడవ వజ్రహస్తుడు 500 మంది పండితులకు వరాహవర్తినీ విషయలోని తామర చెరువుగ్రామం దానంచేశాడు. వేంగిలోని రాజప్రతినిధి వీరచోడుడు పిఠాపురం సమీపంలోని చతుర్వేదిమంగళ గ్రామాన్ని 536 మంది బ్రాహ్మణులకిచ్చేడు. అధికారులూ, సామంతులూకూడా పోటీలుపడి బ్రాహ్మణులకు భూములిచ్చేరు. అగ్రహారాలనూ, దేవ భూములనూ విస్తరింపచేసేందుకై గ్రామసమితులు గట్టి కృషిచేశాయి.

దానం ఇచ్చిన భూములు కల్లోల సమయాలలో చెదిరిపోతే వానిని రాజులూ, వారి అనుచరులూ పునరుద్ధరించేందుకై చేసిన ప్రయత్నాలు చూస్తే భూదానాల విషయమై వారు కనబరిచిన శ్రద్ధ తెలుస్తుంది. మొదట దానం ఇచ్చిన భూములకు ప్రత్యామ్నాయంగా ఇతర భూములిచ్చిన ఘటనలున్నాయి.

దానంగా తీసుకొన్న భూమిమీద ప్రతి గ్రహీతకు సర్వాధికారాలూ వుంటాయి. కాలక్రమంలో ఆ భూములలో కొంత భాగం తాము వుంచుకొని మిగతాది యితరుల కివ్వడం కనిపిస్తుంది. బాదామి చాళుక్య రాజు రెండవ విష్ణువర్ధనుడు పల్నాడుతాలూకా కందూరు గ్రామం పెద్ద అయిన విదుశర్మకు కొణకి గ్రామాన్ని దానం చేశాడు. ఆ గ్రామభూమిని 120 వాటాలుచేసి తానూ మరో ముగ్గురూ చెరి 20 వాటాలు తీసుకొని మిగిలిన భూమిని 11 మందికి 1 నుంచి 6 వాటాల చొప్పున పంచేడు. తూర్పు గంగరాజు మూడవ వజ్రహస్తుడి నుంచి ఒక గ్రామం తీసుకొని అందులో కొద్ది భాగం తానుంచుకొని మిగతా అంతా అగ్రహారంగా 300 మంది బ్రాహ్మణులకు ఒక ప్రతి గ్రహీత యిచ్చినట్లు ఒక శాసనం చెప్తూంది. ఫ్యూడల్ వ్యవస్థ



వృద్ధిపొందినాక కనబడే లక్షణం ఇది.

భూములు ఆస్తులుగా మారినాక భూమి తగవులు వారివెంటబడతాయి. అనంతపురం జిల్లోని ఒక గ్రామంలో ముగ్గురు గొండలకు చెందిన అంబలి మాన్యాన్ని ఇద్దరు బ్రాహ్మణులు ఆక్రమించుకొన్నారు. దానిమీద కొట్లాట జరిగి ఒక గొండుడు చచ్చిపోయినట్లు ఒక శాసనాన్నిబట్టి తెలుస్తూంది. కడపజిల్లా పెరాంగండూరు గ్రామంలో 52 మంది బ్రాహ్మణులకూ రైతులకూ మధ్య భూమి తగవు వచ్చింది. ఆ బ్రాహ్మణులు ఆ భూమిని చాల ఏళ్లుగా అనుభవిస్తున్నారు. పొరుగునవున్న ఇనంబ్రోలులో అంటువ్యాధులు చెలరేగడంతో ఆ గ్రామస్థులు ఊరువదిలివచ్చి పెరుంగముదురులో స్థిరపడ్డారు. తాము ఆక్రమించుకొన్న భూమిలో పండుతున్న పంటనంతనూ పరిహారంగా ఇవ్వడానికి వారు అంగీకరించారు. తరువాత కరువు వచ్చి బ్రాహ్మణు అందరూ వూరు వదిలిపోయేరు. కరువు తగ్గేక తిరిగివచ్చేరు. ఈ లోపున ఇస్తామన్న ప్రతిఫలాన్ని ఇవ్వడానికి రైతులు నిరాకరించేరు. రెండోవేపున మొదటి దానపట్టాను విస్మరించి, ఆ భూములను రాజు స్వాధీనం చేసుకున్నాడు. అప్పుడా బ్రాహ్మణులు వెళ్ళి తెలుగుచోడరాజుకు మొరపెట్టుకున్నాడు. ఆయన ఇనంబ్రోలు రైతుల్ని పిలిపించేడు. విచారణచేసి బ్రాహ్మణులకు వారిభూమి నిప్పించేడు. తెలుగు చోడరాజుల శిలాశాసనం ఒకటి ఈ తగవునంతనూ వివరిస్తూంది. మరో శాసనం తూర్పుగంగరాజుల పాలనలో బొందలకోట-పొన్నాదియ గ్రామాల మధ్య వచ్చిన సరిహద్దు తగవును వివరిస్తూంది. దానపట్టాలో వ్రాసిన హద్దులను తేల్చడానికై శ్రీ కూర్మం పూజారులు, నరసింహదేవుని సన్నిధికి వచ్చిన తిరపతి వైష్ణవులు, దేశాధికారులు (ప్రభుత్వోద్యోగులు) కళింగమండల నాయకులందరూ సమావేశమయ్యారు. సభకు భోగపుర దేశి-రత్తోడ్లను, తాడిపత్రి మహజనులను, పొన్నాదియ నాయక్‌లను పిలిపించేరు. ఈ పెద్దలు విచారించేరు. తగవు పొన్నాదియ గ్రామస్థుల తరుపున పరిష్కారం అయింది.

అగ్రహారాలు విస్తరించినంతమేర రాజు అధికారం వుండదు. ఆదాయమూ తగ్గిపోతుంది. అందుచేత అగ్రహారాలకిచ్చిన సౌకర్యాలను క్రమంగా తగ్గించడం కనిపిస్తుంది. పైనచెప్పిన కుద్దం గ్రామాన్ని మల్లయ్యశ్రేష్ఠి అనే ఆయన అగ్రహారంగా యిచ్చేందుకై ఏటా 100 మురల ధాన్యం 8 మాడలు ప్రభువుకు చెల్లించేటట్లు ఒప్పుకొని కొన్నాడు. ఆ పన్నును శ్రేష్ఠి చెల్లించక తప్పదు. అయితే ఆ మొత్తాన్ని అగ్రహారీకులు ఆయనకు ఇచ్చినట్లు శాసనాన్నిబట్టి తెలియడంలేదు. అగ్రహారానికి పన్ను మినహాయింపు వుంటుందన్నప్పటికీ, ఏటా ప్రభువుకు కొంతపరిహారం చెల్లించవలసివుండడమే ఆంధ్ర, ఒరిస్సాలలో పాతకాలంనుంచీ ఉన్న ఆచారం. ఒక వూరు నుంచి ప్రభువుకువస్తున్నపన్ను, గ్రామవిస్తృతి దేవుని ప్రాముఖ్యం దృష్ట్యా ప్రభువు వదులుకోడానికి అంగీకరించగల పన్నూ, సత్కార్యం చెయ్యాలనే దృష్టితో అగ్రహారం ఇవ్వదలచిన వ్యక్తి ఆ గ్రామాన్ని కొనడానికై చెల్లించగల మొత్తం మొదలయిన వాటినిబట్టి వీరికి పన్నుల తగ్గింపు వుండొచ్చేగాని వేరుకాదు. ఈ మాదిరిగా ఇచ్చే గ్రామాలను అగ్రహారాలనడం మాని "గ్రామగ్రాసం" అనే పేరును శాసనాలలో వుపయోగించడం కనిపిస్తుంది. తూర్పు గంగరాజు కొంత భూమిని ఆరుభాగాలు చేసి దానిలో 4 భాగాలు ఒక బ్రాహ్మణునికీ, మిగతా రెండు భాగాలూ మరొకనికి "గ్రామగ్రాసం"గా ఇచ్చినట్లు ఒక శాసనం వుంది. దానిలో పన్ను మినహాయింపు ప్రసక్తేలేదు.

నామమాత్రపుపన్నుతో అగ్రహారాలివ్వడం అనేది క్రీ.శ. 6వ శతాబ్దినుంచీ కనబడుతూంది.

పర్లాకిమిడి తాలూకాలో ఒక గ్రామాన్ని ఏటా 200 పణాలు (1 పణం 80 గవ్వలు) చెల్లించునట్లు అగ్రహారంగా బ్రాహ్మణుల కిచ్చేరు. ఇటువంటి వానిని "కరశాసనాలు'అన్నారు. ఒక నిర్దిష్టమైన మొత్తాన్ని ప్రభువుకు ఏటా చెల్లించే పద్ధతి మీద భూదానాలిచ్చిన వుదాహరణలు ఒరిస్సాలో చాలా వున్నాయని శ్రీ డి.సి. సర్కార్ వ్రాస్తున్నారు.

ఒకేమారు కొంతమొత్తాన్ని ముందే చెల్లించేస్తే, తరువాత మరిపన్ను ఇవ్వనక్కర్లేకుండా అగ్రహారాలిచ్చినట్లు వుదాహరణలున్నాయి. కల్యాణిచాళుక్యుల కాలంలో 400 బంగారు నాణేలను పన్నుకోసం ఒకేమారు తీసుకొని బ్రాహ్మణులకు అగ్రహారాలను వ్రాసియిచ్చిన ఘటనలు చాలా వున్నాయి. అందుచేత, సర్వమాన్యం అంటే ఏ విధమైన పన్నులు, రుసుములు చెల్లించనవసరంలేని దనికాదు.

దేవదానగ్రామాలమీద కూడా పన్నులుంటాయి. చంద్రగిరి తాలూకాలోని ముండ్లపూడి అనే దేవదానగ్రామంనుంచి వసూలయ్యే పన్నులను దేవాలయంలో నాలుగు అఖండజ్యోతులను ఏర్పాటుచేసేందుకై వినియోగించాలని చాళుక్యచోళరాజు విక్రమ చోడదేవుడు వేసిన శాసనం చెబుతూంది.

శాసనాలనుబట్టి ప్రజలనుంచి వసూలుచేసే పన్నులకు అంతువున్నట్లు కనబడదు. సామాన్యంగా పంటనుబట్టి భూమిపన్ను వుండేది. ఇది వస్తురూపం. మిగిలిన రుసుములన్నీ ధనరూపంలో చెల్లించాలి. ప్రభుత్వపు చెరువునుంచీ కాలవలనుంచీ తీసుకొనే నీటికి పన్ను, పశువులమీద పన్ను అన్నిరకాల వ్యవసాయ పశూత్పత్తులమీద పన్ను, ఇంటి పన్ను, పెళ్ళిపన్ను, మొదలైనవెన్నో వుండేవి. రెండవపులకేశి (7వ శతాబ్దం) మకరప్పి గ్రామాన్ని "నిధులు ఉపనిధులు, క్లిప్త (నిర్ణీతమయిన భూమిపన్ను), ఉపరికర (అదనపు పన్నులు)లతో సహా" ఇచ్చినట్లు శాసనం వుంది. భూమికి సంబంధించి మరుంచ, ఆదిత్యుంచ, ఉంచమన్న, మరుమన్న అనేకపన్నులు (కర్నూలు జిల్లాలో) స్థానికంగా వసూలుచేసేవారు. వీని స్వభావం ఏమిటో తెలియలేదు. రెండవ పులకేశి బనరాజవిషయను జయించినప్పుడు ప్రతి గ్రామంనుంచీ 'తెర–పన్' (బంగారు రూపంలో చెల్లించవలసినది) వసూలు చేసేడు. 8వ శతాబ్దపు తూర్పు చాళుక్యశాసనం అరి, తగ్గు, తెరె సిద్ధాయం, దండు దశాపరాధము లేక దేశాపరాధము అన్న పన్నులను పేర్కొంది. పంటనూర్పిడి తరువాత చెల్లించేది–'అది' పండినా ఎండినా నిమిత్తం లేకుండా ఇంత అని నిశ్చయించిన పన్ను – 'సిద్ధాయం'. పన్ను కోరవలను భర్తీ చేసేందుకు వసూలుచేసేది– 'తగ్గు' పంట అమ్మేవానికీ, కొనేవానికి మధ్యవర్తిత్వం చేసినవానికిచ్చే కమీషను – 'తెరె'. సైన్యనిర్వహణకు వసూలు చేసేది– 'దండు'. దశాపరాధము పదినేరాలు చేసినందుకు విధించే పన్ను కావచ్చు. దేశాపరాధమయితే దేశద్రోహం చేసినందుకు కావచ్చు. 'దొగరాచపన్ను' – యువరాజును పోషించేటందుకు పన్నును పదవ శతాబ్దపు వైదుంబుల శాసనం పేర్కొంటూంది. సేనాపతిని, దౌవారికుడిని, సంధివిగ్రహిని భరించేటందుకై 'పదెవల్లపన్ను', పడియెరిపన్ను', 'సంధి విగ్రహిపన్ను' వసూలుచేసేవారని శ్రీ కె. ఈశ్వరదత్తు వ్రాసేరు. పదకొండవ శతాబ్దపు తూర్పు గంగుల శాసనం 'భాగభోగ', 'ప్రావనికర', 'క్షేత్రకర' అంటూ మూడు పన్నులను పేర్కొంది. భాగ భోగమంటే పంటలో భాగం, క్షేత్రకర అంటే భూమిపన్ను. ప్రావనికర ఏమిటో తెలియదు. భూములకు పెట్టుకొన్న నీటి పరిమితిని బట్టి రుసుము, వసూలు చేయడాన్ని వరంగలు శాసనం (12వ శతాబ్ది) పేర్కొంటూంది. ఇంకా ఇతర పన్నులకు కూడా



శాసనాలలో చూస్తాం. 'పుల్లల్వు' (పుల్లరి), 'అంతరాయ' (గ్రామంలో సదస్సు విధించే అటువంటివే.

రాజులూ, సామంతులూ పోక, కొబ్బరి తోటల్ని, మెట్ట–తరి భూముల్ని దానాలిస్తుంటార వీనిమీద అనేక రకాల పన్నులు, రుసుములు వసూలవుతాయి. అందుచేత నిర్దిష్టమైన పను కోసం కొన్ని పన్నులు, రుసుములు వదులుకోవడమే దానం ఇవ్వడంగా శాసనాలక ఎక్కుతూంటుంది.

పన్నులు వసూళ్లు 11-12 శతాబ్దాలలో మూడు పద్ధతులలో జరిగేవి. ప్రభుత్వోద్యోగుల వసూలు చేయడం ఒక పద్ధతి. రెండోది–వర్తక శ్రేణులు పన్నులను వసూలు చేసి వాని కొంత మొత్తాన్ని ప్రభుత్వానికిచ్చి, మిగతాది ధర్మకార్యాలకు వెచ్చించేవి. మూడోది పన్నుగుత్తలు. ప్రజల నుంచి ఎంత మొత్తం వసూలుచేసినా ప్రభుత్వానికి అచ్చుకొన మొత్తాన్నే చెల్లించడం. ఈ మూడో పద్ధతి బ్రహ్మనాయుడు గురుదేవర సీమను 12 వే నాణేలకు గుత్తతీసుకున్నట్లు పల్నాటి వీరచరిత్ర చెప్తుంది. అజ్ఞాతవాసకాలంలో మలిదేవరా తన పరివారాన్నంతనూ పోషించుకోగలిగింది ఈ ఏర్పాటుతోనే.

ఆనాడు చేలలో చల్లికల ద్వారా నాట్లు వేయడమే శాసనాలలో కనిపిస్తుంది. నారుపూడే పద్ధతిని వారెరగరు.

చల్లే విత్తనాల కొలతనుబట్టి భూమివిస్తీర్ణాన్ని చెప్పడం వుండేది. అతి ప్రాచీనమై భూమి కొలత నివర్తన, ఇదిగాక మరుత్తు, ఖండిక, పుట్టి, తూము, కుంచము మొదలైన కొలతల కూడా కనిపించేయి. మొదట ఇవి కొలమానాలు. క్రమంగా భూమి కొలతలు అయ్యాయి అంటే మొదట ధాన్యపు కొలమానాలు స్థిరపడ్డాయి. ఆ కొలత విత్తనాలు చల్లవలసిన భూవైశాల్యం క్రమంగా ఆ పేరును తీసుకొంది. భూమిని కొలిచేందుకు అనేక దీర్ఘమానాల వుపయోగించబడినాయి. రాజమాన, ముమ్మడి భీమకోల, జినకోల, శనివారి సిద్ధికోల సత్యరత్నాకర్‌కోల, రాజరాజకోల–ఇంకా ఎన్నో.

ఈ చరిత్రదశలో సాధారణరూపంలా రైతుల ఆదాయం కాలమాన పరిస్థితుల మీ ఆధారపడివుండినా ముఖ్యంగా భూమిమీద అతనికి గల హక్కు, పన్నువసూలు పద్ధతీ అతని స్థితిగతుల్ని నిర్ణయిస్తుండేవని చెప్పవచ్చు. దేవాదాయ, ధర్మాదాయ భూముల్ని చేసుకొనే కౌలుదార్ల పరిస్థితి కొంత మెరుగుగా వుండేది. పన్ను గుత్తలు, ప్రభుత్వోద్యోగుల వసూళ్ల కూడా రైతులకు ప్రాణాంతకమే. చాల సమర్థవంతంగా పాలించిన చోళరాజుల కాలంలో కూడ పన్ను వసూలుచేసేవారు పెట్టే బాధలు గురించి గగ్గోలు పుట్టింది. ఇంక భూమిలేని వ్యవసాయ కూలీల స్థితి దుర్భరమే. "అదొక దౌర్భాగ్యస్థితి అసహ్యకరమైన స్థితీను. రోగాలు కావచ్చు కరువులు కావచ్చు, సోమరి తనమే కావచ్చు. కారణం ఏదైనా రైతులు భూమి అమ్ముకోవచ్చు పన్నులివ్వకుంటే భూములు లాక్కోవచ్చు ఏది జరిగినా అవమానమే. కూలిచేసుకు బతుకుతూ దరిద్రం అనుభవించ వలసిందే." నంటారు, ఎ.ఎల్. బాషాం తమ "దవండర్ దట్ వజ్ ఇండియా"లో

## పరిశ్రమలు – వాణిజ్యం

ఈ చరిత్ర దశలో వ్యవసాయం అభివృద్ధి పొందింది. అయితే అది రాసి గతం మాత్రమే.

స్వయంపూర్ణ గ్రామపరిధుల్లో మాత్రమే దాని విస్తరణ. ఈ విస్తరణ ఫలితాలను చేతిలో పట్టుకొన్న భూస్వాములు యుద్ధాలకు, విలాసాలకు, ఆడంబరాలకూ ఖర్చుచేసేరేగాని ఉత్పత్తికి తోడ్పడే పనులకు ఖర్చుచేయలేదు. ఫలితంగా సరుకుల తలసరి ఉత్పత్తి పెరగలేదు. పరిశ్రమలూ, వాణిజ్యమూ స్వయంపూర్ణ గ్రామవ్యవస్థను కదిలించనూలేదు.

వృత్తిమాన్యాలు ఇచ్చీ, పన్నులు లేకుండా చేసీ చేతివృత్తులవారు గ్రామంలో వుండేటట్లు ఆశచూపేవారు. వూరివారు పప్పచెప్పిన పనుల్నివారు చేసేవారు. చేసే పనికి ఎంతకావాలో ముందే మాట్లాడుకొనేవారు. చర్మకారులకీ, నీరడులు మొదలైన వారికీ కూడ మాన్యాలుండేవి. వ్యవసాయనికీ, పరిశ్రమలకీ ఈ మాదిరి సమతూకాన్ని పాటించినట్లు అనేక శాసనాలున్నాయి. తూర్పుగోదావరి జిల్లా ద్రాక్షారామ సమీపంలోని ఎండపల్లి గ్రామంలో తెలికి, కుమ్మరి, కమ్మరి, కంసాలి, కంచర్లకి కొబ్బరి-పోక తోటలవారికి, మంగలి, చాకలి, మేదరి, చర్మకారు (చండాల)లకీ వేర్వేరుగా మాన్యాలిస్తూ తూర్పుచాళుక్యుల శాసనం వుంది. వీరందరికీ పన్నులు రద్దుచేసేరు. వాస్తుడికీ, నిపుణుతాపీపనివానికీ, రాళ్ళుచెక్కేవానికీ, మాన్యాలిస్తున్నట్లు కొన్ని శాసనాలు పేర్కొన్నాయి.

వీరు మంచి నిపుణులైన పనివారు పురమాయింపు ప్రకారం, మేలురకం వస్తువులు చేసేవారేగాని, మార్కెట్టుకోసం తయారుచెయ్యలేదు. వడుకు, నేత పనులుచేస్తూ గ్రామంలో ఎక్కువమందే వుండేవారు. అయితే వారు ఉత్పత్తి చేసేదికూడా చాలావరకు గ్రామంలోనే ఖర్చయేది.

రాజులు, రాణులు, సామంతులు, రైతులు, వృత్తిపనులవారు అందరూ దేవుళ్ళకి ఆభరణాలిచ్చేవారు. దేవాలయాలు స్వయంగా కంసాలులు మొదలైన వృత్తినిపుణులకు మాన్యాలిచ్చి పోషించినట్లు అనేకశాసనాలున్నాయి. స్వర్ణకారులు, వెండిపనివారు, తాపీపనివారు, వాస్తునిపుణులు ఇంకా ఎందరో దేవాలయాల పోషణలో వుండేవారు. మణులు తాపిన ఆభరణాలు దేవాలయాలలో వుండేవి. 13వ శతాబ్దిలో ఆంధ్రదేశంలో పర్యటించిన మార్కోపోలో ఇక్కడి రత్నఖచితములైన వెండి, బంగారునగల్ని గురించే ఎంతో ప్రశంసించేడు.

ఇనుము, రాగి, కంచుతో పనిముట్లూ పాత్రలు ఎంతో నైపుణ్యంతో చేసేవారు.

పంటలకు, స్నానాలకు, దీపాలకు, శిరోజాలంకరణలకు, దేవతారాధనకు నూనెలు చాల అవసరం కనక గ్రామంలో నూనెగానుగలు ప్రధానపరిశ్రమగా వుండేవి.

వడ్రంగి, తాపీపనివాడు, కమ్మరి, చర్మకారుడు లేనిదే గ్రామం ఒక్క రోజు నడవదు. కనక వీరికి గ్రామంలో మాన్యాలు తప్పక వుండేవి. తిండి తరవాత అంత ముఖ్యమైనదీ బట్ట కనక గ్రామాలలో అతిధనవంతులనుంచి బీదవారి వరకూ అన్ని రకాల వారికి సరిపడే బట్టలు ఎంతో నాజూకయినవి కూడా తయారయేవి. రాజులూ, రాణులూ కట్టుకొనేందుకు ముచ్చటపడే సన్నని వలిపాలు ఈ రాజ్యంలో దొరుకుతున్నాయని మార్కోపోలో గుంటూరుజిల్లా మోటుపల్లిని గురించి వ్రాసేడు.

ఈ విధంగా పరిశ్రమలు రాశిరీత్యానూ, వాసిరీత్యానూ కూడ వృద్ధి పొందేయి. అయితే సరుకుల వుత్పత్తి తలసరిలెక్కన పెరగలేదు. ఉత్పత్తి అంతా ప్రధానంగా గ్రామాల అవసరాలకేజరిగేది. పరిశ్రమలు పెరిగినా గ్రామ స్వయంపూర్ణత భగ్నంకాలేదు.

అలాగని వాణిజ్యం క్షీణించినదనీ, ద్రవ్య చలామణీవ్యవస్థ భగ్నం అయిందనీ కాదు.



నగరాలలో వర్తక శ్రేణులు బలంగా వుండేవి. వ్యాపారమూ జోరుగా సాగేది. అయితే ఆ వర్తకం కొన్ని వస్తువులకే పరిమితం. సైనికావసరాలయిన అనేకానేక తరహాల ఆయుధాలు, గుర్రాలు ఏనుగులు మొదలైనవీ. ధనికవర్గంవారి భోగవిలాస వస్తువులయిన వెండి, బంగారాలు, మణులు, అత్తరులు, సుగంధద్రవ్యాలు, అతి నాణ్యమైన వలిపాలు ఇంకెన్నో బజార్లకువచ్చేవి. ఉప్పు అమ్మకం గతంలోలాగనే ప్రభుత్వం గుత్తలో వుండేది.

ఆ రోజులలో ద్రవ్యచలామణీ విశేషంగానే వుండిందనేందుకు పన్నులు గురించి చెప్పే అనేక శాసనాలను వుదహరించవచ్చు. క్రీ.శ. 12వ శతాబ్దినాటి పావులూరి మల్లన తన "సారసంగ్రహగణిత"లో లెక్కలనిస్తూ ఆనాడు అమ్మబడుతుండిన అనేక వస్తువుల ధరలు వ్రాసేడు. దేవాలయాలకిచ్చిన దానాలను వివరించే అనేక శాసనాలు నాణెములను పేర్కొంటు న్నాయి. దీనినిబట్టి గ్రామాలలో వస్తుమార్పిడి ప్రధానరూపంగా సాగుతున్నా, పట్టణాలలో నాణెచలామణీ విజృంభణగానే వున్నట్లు భావించాలి.

సంపన్నులయిన వృత్తికళాకారులూ, వ్యాపారస్తులూ, బలమైనశ్రేణులుగా ఏర్పడి పనిచేసేవారు. కొన్ని గ్రామాలూ, నగరాలూ వున్న ప్రాంతానికో శ్రేణి. ఆ శ్రేణికో సమితి. ఆ సమితి ద్వారానే ఆ ప్రాంతంలో వ్యాపారం జరుగుతుంది. ఆ సమితిలో తీసుకున్న నిర్ణయాలకు సభ్యులందరూ బద్ధులయి వుండాలి. వర్తకుల శ్రేణులు సాంప్రదాయకంగా కొన్ని నియమాల్ని అనుసరిస్తాయి. దేనికిదానికి బిరుదావళులు వేరుగావున్నాయి. శాసనాలలో వాటిని పేర్కొన్నారు. ప్రతిశ్రేణీ ఒక్కొక్కనగరాన్ని తనదిగా చెప్పుకుంటుంది. తెలీలు తాము బెజవాడ ప్రభువుల మంటారు. వైశ్యులు పశ్చిమ గోదావరిజిల్లా పెనుగొండ ప్రభువుల మంటారు. వైశ్యులు పశ్చిమ గోదావరిజిల్లా పెనుగొండ ప్రభువుల మంటారు. అల్లాగే బలంజాలు బీజాపురంజిల్లా ఐహోలుప్రభువుల మంటారు. వీరిలో ఒక్కొక్కరికో దేవుడు. తెలీల దేవుడు మల్లేశ్వరుడు. వైశ్యులకి నగరేశ్వరుడు, బలంజాలకు గణేశ్వరుడూ దేవుళ్ళు. ఈ శ్రేణులు ప్రతిఒక్కదానికి రాజలాంఛనం వుంటుంది. తెలీలు వేయికుటుంబాలు, వైశ్యులు 714 కుటుంబాలు, బలంజాలు 500 కుటుంబాలు చెప్పుకుంటుండేవారు.

ఈ శ్రేణులకు రాజ్యంలో గొప్ప పలుకుబడి వుండేది. రాజుల ఆడంబరాలకూ, విలాసాలకూ కావలసిన అనేక రకాల వస్తువులు వీరు తెచ్చి ఇచ్చేవారు. పన్నులు, రుసుముల రూపంలో అపారధనం ఇచ్చేవారు. గ్రామాలలో పన్నుగుత్తలు తీసుకొని నిర్ణీతమైన మొత్తాలు ప్రభువులకు చెల్లిస్తూ అదనపువసూళ్ళు తాము మిగుల్చుకొనేవారు. వారిలో యుద్ధాలలో పాల్గొని, విశిష్టసేవకై ప్రభువుల నుంచి జాగీర్లు పొందిన వారున్నారు. తెలికి -1000 శ్రేణి చాళుక్యప్రభువులకు చేసిన సేవాసహాయాలను ప్రశంసిస్తూ రాజరాజ చోడగంగదేవుడు ఒకటవ కులోత్తుంగుని కుమారుడూ, వేంగీ మండలాధిపతి ఆ శ్రేణిసభ్యులకు కొన్ని మర్యాదలు కలిగించేడు. బెజవాడ మొదలైన చోట్ల వారి వివాహాలు జరిగినప్పుడు వధూవరులు గుర్రాలమీద వీధులలో వూరేగవచ్చు. వివాహానంతరం వారు ప్రభువు పాదపీఠివద్ద విలువైన వస్త్రాలు జోడు వుంచి, సాగిలబడి నమస్కరించి ప్రభువు బంగారుపళ్ళెంలో పెట్టి ఇచ్చిన తాంబూలాన్ని స్వీకరించాలని ఆ శాసనంలో వివరించబడింది.

ప్రభువులూ, సామంతులూలాగానే ఈ శ్రేణులు దేవాలయాలకు, మఠాలకు, అన్న సత్రాలకు దానధర్మాలుచేసేవి. ఈ ధనం అంతా శ్రేణులది కాదు. భక్తులూ, ధార్మికులూ ఈ

శ్రేణులవద్ద కొంతధనం దాచేవారు. దానిమీద వచ్చే 12 శాతంవడ్డీని ఫలానా ఫలానా పనులకు ఖర్చుచేయాలని శాసనం వ్రాసేవారు. వీరి దానాలలో కొన్ని అటువంటివీ వున్నాయి. క్రీ.శ 1153ది ఒకటి, 1154ది ఒకటి రెండు శాసనాలు తెలికిశ్రేణికి చెందిన ఇద్దరు వర్తకులవి బాపట్ల భావనారాయణస్వామి దేవాలయంలో వున్నాయి.

తేలీల సమితి నాదెండ్లలో ఒక తగువును పరిష్కరించడం గురించి ఒక శాసనం వుంది. ఒక శ్రేణీసభ్యుని భార్య మరణించింది. ఆమె నగలు తమకు రావాలని పుట్టింటివారు పేచీ పెట్టేరు. సదస్సు విచారణజరిపి వానిని భర్తకు ఇప్పించింది.

ఆంధ్రదేశంలో వాణిజ్యం ప్రధానంగా వైశ్యుల చేతిలో వుంది. వారి శ్రేణీసభ్యుల సంఖ్య 714. వీరు కుబేరసంతతివారని 12వ శతాబ్దపు నాదెండ్ల శాసనం చెప్తుంది. పెనుగొండ ప్రభువులమనుకొనేవారు కృష్ణా, గుంటూరు, గోదావరి మండలాలలోని 18 నగరాలు కేంద్రంగా వ్యాపారం చేసేవారు. పెనుగొండ ప్రధానకేంద్రం వేంగి, దెందులూరు, ఘంటసాల, ఆచంట, చందవోలు, నిడదవోలు, పాలకొల్లు, ద్రాక్షారామ, సామర్లకోట, భీమవరాలు వీరికేంద్రాలలో కొన్ని ప్రతి కేంద్రంలో అక్కడి వైశ్యులందరి సంస్థగా సమితి వుంటుంది. వారి వ్యవహారాలన్నీ ఆ సమితిద్వారా పరిష్కరించబడతాయి. దానిని నగరం అంటారు. దాని అధ్యక్షుడు నగరస్వామి. పెనుగొండ నగరం మొత్తం వైశ్యకుటుంబాల సాధారణసమస్యలను పరిష్కరిస్తుంది. అటువంటి సమస్య వచ్చినప్పుడు పెనుగొండ నగరస్వామి అధ్యక్షుడుగా వుంటాడు.

పెనుగొండ ప్రభువులు అనేక దేవస్థానాలకూ, ధర్మసంస్థలకూ చేసిన దానాలు శాసనాలకు ఎక్కివున్నాయి.

బలంజాలు వేరొక వర్తకకులం. వీరు తమ్ము వీరబలంజాలు అని పిలుచుకుంటారు. వీరివి 500 కుటుంబాలు వీరి ప్రధానకేంద్రం బిజాపూరు జిల్లాలోని అయ్యావోలు లేక ఐహోలు, వీరి వాణిజ్య వ్యాపారాలు కేవలం ఆంధ్రదేశానికే పరిమితం కాదు. కర్ణాటకలో వీరిని ఉభయనానాదేశీలు మొదలైన పేర్లతో పిలుస్తారు. తమిళ దేశంలో ఐదున్నూరువారు (అయిదు నూర్లవారు) అంటారు. ఆంధ్ర దేశంలో నానాదేశి పెక్కుండ్రు, వీరబలంజాలు అనిపిలుస్తారు. వీరికి ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క సుదీర్ఘమైన ప్రశస్తివుంది. కర్నూలుజిల్లా త్రిపురాంతకం శాసనం వీరిని బ్రాహ్మణ, గురు దైవ భక్తులనుగా, వర్ణాశ్రమధర్మ రక్షకులనుగా, హయ, గజ, వస్త్ర, స్వర్ణ, సమస్తధనధాన్య సంపన్నులనుగా, 500 వీరశాసనాలు సంపాదించిన వారుగా ప్రశంసిస్తుంది. (ఈ వీర శాసనాలు ఎక్కడ, ఎందుకు, ఎవరు ఇచ్చేరో తెలియదు) వారిది గరుడకేతనం. వీరు ఏనుగులు, మేలుజాతి గుర్రాలు, వివిధ రత్నమాణిక్యాలూ మాత్రమేగాక ఏలకి, లవంగం, ఎర్రచందనం, చందనంకస్తూరి, కర్పూరం, కుంకుమపువ్వు, యితర పరిమళ ద్రవ్యాలు తీసుకొని పలుదేశాలకు చొచ్చుకొనిపోయారని 12వ శతాబ్దపు బెల్గాం శాసనం వర్ణించింది. వారు అమ్మే వస్తువులమీద వారికి గుత్తవుంది. వాని ధరలను వారే నిర్ణయించేవారు. బిడారులుగా ఏర్పడి సాయుధబలగం రక్షణతో ప్రయాణాలు చేసేవారు. వీరు వ్యాపారం చెయ్యడమేగాక పన్ను సుంకాల – గుత్తలు తీసుకొనేవారు. ప్రభువుకు కొంత మొత్తం ఇచ్చేసి పన్నులు సుంకాలు వసూలు చేసుకొనే హక్కు తీసుకొనేవారు. "ఈవర్తకుల ఆమోదం పొందనిదే ప్రభువులూ, ప్రభుత్వోద్యోగులూ పన్నులు రద్దుచేయలేరు" – అని శ్రీ కె. సుందరం తమ "ది బలంజ మర్చంట్ కమ్యూనిటి ఆఫ్ మెడీవల్ ఆంధ్ర"లో వ్రాసేరు.



చిత్తూరు జిల్లా బసినికొండ శాసనం ఎరి–వీర, కొంగావలే కొంగావలేలనే శ్రేణి సైనికులను పేర్కొంటుంది. అందులోనే పేర్కొన్న మునైవీరులు అంటే బలంజా వర్తకులు పోషించే సైన్యాన్నిగా భావిస్తున్నారు. ఈ శ్రేణులకు ఆయుధాలు ధరించే అధికారం వుండంటే నిరంతర యుద్ధాలలో అల్లకల్లోలంగా వున్న ఆనాటి వీరికి ఎంత ప్రాభవముందో అంచనా కట్టవచ్చును.

ప్రభువులు అనేక సుంకాలను వసూలు చేస్తుండినట్లు ఎన్నో శాసనాలనుబట్టి తెలుస్తుంది. వీనిని విధించేది, వసూలుచేసేదీ విషయం అధికారులు. "వడ్డెరావుల" ఒక సుంకం ఇది మూడు భాగాలు ఒక భాగం రాజుకు, ఒకటి స్థానిక అధికారికి, మరొక భాగం పై అధికారికి వెడుతుంది. "కొల్పువీసాలు" పేరుగల కొలగారం పన్ను వుంది. ధాన్యం కొలిచేటప్పుడు కొలిచిన మొత్తంలో 16వ వంతు సుంకం తీసుకొనేవారు. బజారుకు తెచ్చిన బండిపూటు సరుకుకు వేసేది "పేరుసుంకం." స్థల సుంకం" నేటి ఆక్ట్రాయ్ పన్ను వంటిది. రేవు సుంకం వివాహాలకు, ఉప్పుమీద, ఇళ్ళూ, పశువులూ అమ్మినా, కొన్నా సుంకాలు వసూలుచేసేవారు.

వర్తకశ్రేణి సభ్యులు ఈ సుంకాల ఆదాయాన్ని దేవాలయాలకు దానంచేస్తూ అనేక శాసనాలున్నాయి. తంబులకు చెందిన "మహానగర"లు, కొందరు బలంజాలు, నానాదేశీలు, గవుండలతో కలిసి కొన్ని సుంకాలను ఆదోని తాలూకా బిడగికుంటలో దేవుడికి దానంచేసినట్లు ఓ శాసనం. అనంతపురం జిల్లా హేమవత పట్టణానికి చెందిన కుబేర వంశీకులయిన నలుగురు దేశీవైశ్యులూ, నగరలూ, గుర్రాలు, కస్తూరి, కుంకుమ పువ్వు, చమరీవాలాలు, పంచవనిగ మొదలైన వానిమీద వసూలయ్యే కొన్ని సుంకాలను దేవపూజకు మరో శాసనం. నెల్లూరు జిల్లా గ్రామంలో దేవాలయం కట్టించినందుకు ఒక సెట్టికి ఎద్లు, దున్నలు, గాడిదలమీదవేసి తెస్తున్న 50 పెట్టెల మీద సుంకాల్ని పంచశతస్వాములు రద్దుచేసినట్లు శాసనం. ఇల్లాగే ఎన్నింటినేనా చెప్తూ పోవచ్చు.

ఆనాడు చెలామణీలో వున్నట్లు తెలిసే వెండి, బంగారు, రాగి నాణేలపేర్లు చూస్తే ద్రవ్య చలామణీ చాల విస్తృత వ్యాప్తంగానే వున్నదనుకోచ్చు. ఇవి కేంద్రీయ ప్రభుత్వం వేసినవి కాదు. ఎక్కడికక్కడ స్థానిక ప్రభువులూ, సామంతనాయకులూ తమ నాణేలు ముద్రించుకోవచ్చు. 88 గ్రెన్‌లు తూగే బంగారు నాణేన్ని "గద్య" లేక "గద్యాణ" అనేవారు. వీనిలో అనేక పేర్లు. రాజనారాయణ గద్య, సురభిగద్య, త్యాగగద్య, బిరుదుగద్య మొదలైనవి. "మాడ" అనేది 73 గ్రెన్‌లు తూగే వెండిదీ, బంగారుదీ కూడ వుంది. కాసు రాగి నాణెం నూరు కాసులు ఒక పణం. ఇది బంగారు నాణెం. 60 గ్రెన్‌ల "కలంజు" నాణెం. వెండిదీ, బంగారుదీ కూడ వుంది. తూర్పు చాళుక్యరాజులు వేసిన బంగారు, వెండి రాగి, నాణేలు ఆంధ్రలో పలుచోట్లనే గాక బర్మా, సయాం కోస్తాలలో కూడ దొరికేయి. వీని మార్పిడి ప్రమాణాలేమిటో శాసనాలు బట్టి తెలియదు. పావులూరి మల్లన తన "సార సంగ్రహగణిత"లో అనాడు చెలా మణీలో వున్న వేర్వేరు నాణేల పరస్పర సంబంధాల్ని వివరించేడు. దాని ప్రకారం.

| | | |
|---|---|---|
| 4 గోకర కాసులు | = | 1 సార కాని |
| 4 సార కాసులు | = | 1 పీర |
| 4 పీరలు | = | 1 కాని |
| 4 కాసులు | = | 1 వీసము |

| | | |
|---|---|---|
| 4 పటికలు | = | 1 చిన్నము |
| 4 చిన్నములు | = | 1 మాడ |

ఈ నాణెములు గాక సోల, మానిక, అడ్డ, కుంచము పేర్లతో ద్రవమానాలూ, తులము, శేరు, వీశ, మణుగు, పుట్టి పేర్లతో తులామానాలూ ఆనాడు ఆంధ్రదేశంలో వాడుకలో వుండేవి.

ఒకటవ కులోత్తుంగచోడుడు చోళ రాజ్యానికీ, వేంగి రాజ్యానికీ కూడ అధిపతి కావడంచేత ఆయన వేంగీ రాజ్యపాలనకై పంపిన రాజప్రతినిధి వెంట ఎందరో తమిళ అధికారులు, తమిళ బ్రాహ్మణులు, తమిళ వర్తకులూ ఆంధ్రదేశానికి వచ్చేరు. "ఐనూర్‌వార్‌" వర్తకులు విశాఖ జిల్లాలో దేవాలయాలు కట్టించారు. రాజేంద్రచోళుని కూతురు రాజసుందరిని వివాహం చేసుకొన్న రాజారాజు కళింగమును జయించాక కళింగ–చోళ సంస్కృతులకు సాన్నిహిత్యం కలిసింది. తెలుగుదేశపు రేవుపట్టణాలకు తమిళం పేర్లు వచ్చింది. ఆ కాలంలోనే విశాఖపట్టణం కులోత్తుంగ చోళ పట్టణం అయింది. ఘంటసాల చోళపాండ్యపురమూ, మోటుపల్లి దేశ్యాయకొండ పట్టణమూ అయాయి.

విదేశీవ్యాపారం ఈ చరిత్రదశలో అంత అధికంగాలేదు. 11, 12 శతాబ్దాలలో చోళులు చైనాలో రాయబారులనుపెట్టి దానితో మంచి వాణిజ్య సంబంధాలను పెంచుకున్నారు. కాని దేశంలోపల పశ్చిమ చాళుక్యుల తూర్పు గంగరాజుల దాడులను నిగ్రహించేందుకు వారు నిరంతర యుద్ధాలలో మునిగి వున్నారు. యుద్ధాలు వర్తకాభివృద్ధికి చుక్కెదురు. దానికితోడు వైదికమతం సముద్రయానానికి అభ్యంతరం చెప్పింది. దానితో మధ్యధరా సముద్రతీరం నుంచి బోర్నియో వరకు వలసలు స్థాపించిన ఆంధ్రుడు ఓడ ఎక్కడం మానేసేడు. తన సరుకులు రేవులలో అరబ్బు చైనా వర్తకులకు అమ్మడంతో తృప్తిపడ్డాడు. అరబ్బులూ, చైనీయులూ నౌక నిర్మాణంలోనూ, సముద్రాంతర వాణిజ్యంలోనూ పై చేయి సంపాదించేరు.

దేశంలోపల వేంగి, మోటుపల్లి, గుంటూరు, ఘంటసాల, చందవోలు, రాజమండ్రి, విశాఖపట్టణం మొదలైనవీ, పంచారామలనబడే అమరావతి, గునుపూడి, ద్రాక్షరామ, పాలకొల్లు, భీమవరమూ, తెలంగాణా, రాయలసీమలలోని యాత్రాస్థలాలూ వాణిజ్య కేంద్రాలుగా వుండేవి.

ఆనాడు ప్రభువులకూ వర్తకులకూ మధ్య ఘనిష్ఠ సంబంధాలే వుండేవి. అయినా పాలకులు వర్తకుల్ని పీడించిన ఘటనలు కూడా శాసనాలకు ఎక్కక పోలేదు. క్రీ.శ. 991లో జరిగిన ఘటన యిది. రాష్ట్రకూటరాజు 3వ కృష్ణుడు తనకాలంలో నెత్తిబరువు తమలపాకుల కట్టమీద రెండున్నర పణాలు సుంకం విధించేడు. ఆయన యొక్క సామంతుడు ఆదిత్యవర్మరాస ఆ సుంకాన్ని ఎక్కువ చేసేడు. వేయిమంది తాంబూల వర్తకుల ప్రతినిధులు ముగ్గురూ, బెల్లులికి చెందిన 50 మందీ ఆనాడు ప్రభువుగా వున్న రెండవ తైలపరాజు వద్దకు రాయబారం నడిపారు. రాజు విచారణ జరిపి వెనుకటి సుంకాన్ని స్థిరపరిచాడు–అని ఒక శాసనం చెప్తోంది.

## మతము – సమాజము

గ్రామీణ ప్రాంతాలలో భూ యజమానివర్గమూ, నగరాలలో నిర్మాణం పొందిన (వర్తక) వాణిజ్యవర్గము–రెండు కొత్త వర్గాలు తలెత్తడం, తత్ఫలితంగా ప్రజానీకం పరమ దరిద్రస్థితికి లోనవడంతో కొత్త విశ్వాసాలు, కొత్త ఆరాధన పద్ధతులు, కొత్త మతోద్యమాలూ ప్రారంభమయాయి. శైవమతమూ, వైష్ణవమతమూ అల్లా వచ్చినవే. ఈ రెండూ కూడ భక్తి, నిష్ఠలమీద



ఏర్పడాయి. భక్తి దేవుడికి ఒక వ్యక్తి రూపం ఇస్తుంది. అవతారాలు అవే.

కొత్త ఆరాధనా పద్ధతి కాలూనుకొనేటప్పటికి కాలం పడుతుంది. అందుకు కొంతవరకు సమాజంలో స్థిరత్వమూ వుండాలి. శైవ, వైష్ణవాలు అవతారాల పూజా రూపాన్ని తీసుకొన్నాయి. ముఖాన పెట్టుకొనే బొట్లు, ప్రత్యేక కర్మకాండలు, పూజా నివేదనలు వానికి చిహ్నాలు అయాయి. వారిప్పుడు కోరేది నిర్వాణం కాదు. సమాధి స్థితీకాదు. వారు కోరుతున్నది తదైక్యం. వైదిక కర్మకాండతో పోలుస్తే వీనికి కర్మ కాండ చాల తక్కువ. ఇందులో జంతుబలులు లేవు. అంతంత ఖర్చులూ అవసరం లేదు. మూఢత్వం దీనిలో ప్రముఖ స్థానం వహిస్తుంది. నిజమే విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలు మరీ ప్రాథమిక దశలో వున్నప్పుడు మతంలో ప్రధానస్థానం మౌఢ్యానిదే అవుతుంది. హేతువాద దృక్పథంతో ఏర్పడిన సామాజిక సంప్రదాయాలు కూడా మూఢాచారాలుగానే మారుతాయి.

భక్తి వుద్యమం పురోహితవర్గం వారి ఆశల్నీ, ఆశయాల్నీ గాక ప్రజాసామాన్యం యొక్క అభిమానాల్నీ ఆలోచనల్నీ వ్యక్తం చేస్తుంది. ఈ దశలో ప్రజల భాషలో చక్కని పాటలు వచ్చేయి. దేవాలయాలు, గానాలు, ఉత్సవాలు యాత్రలు ఈ వుద్యమానికి ప్రాణం.

దేవుడిని మనుష్యరూపంలో చూస్తే ఆయనగారికి కష్టాలు విన్నవించుకోవచ్చు. ప్రసన్నుణ్ణి చేసుకొనేందుకు బ్రతిమాలుకోవచ్చు. మన పనులు చేసిపెట్టమని పురమాయిస్తుండ వచ్చు. వైష్ణవ మత ప్రవక్త రామానుజుడు చేసినదదే. ఆ దేవుడికో శరీరాన్ని వూహించేడు. ఆయనకో భార్యను సమకూర్చి పెట్టేడు. నగలు, నాణేలు, ఆయుధాలు, ఇచ్చేడు. ఇన్ని సమకూడినాక దేవుడు మనకంటికి కనిపిస్తాడనుకోవడంలో ఆశ్చర్యం లేదు. శంకరుడి నిరాకార, నిర్గుణ పరబ్రహ్మ స్వరూపాన్ని కంటిముందుకు తెచ్చుకోవడం సాధ్యంకాదు. మనకు ఊహాబలం వుంటే, నారాయణుని గురించిన వర్ణనలు విన్నాక, రామానుజుని దేవుడి ఆకారాన్ని కల్పించుగోలం. మతసంబంధమైన మనుష్యుడి వూహలు విశుద్ధ సత్యాన్నీ, నిర్విశేషచిన్మాత్రాన్నీ అందుకోలేవు. వానిని కంటితో చూడలేడు. కనక పూజలు, ప్రార్థనలు చేయలేడు. అందుకే రామానుజుడు అదంతా వట్టిదని తోసేసేడు. దానిస్థానే "నారాయణ హరిని"ని నిలబెట్టేడు. ఆయన స్వర్గంలో వుంటాడన్నాడు. ఆయనది "దివ్యమంగళ విగ్రహం" అన్నాడు. "సౌకుమార్య, లావణ్య, యౌవనాది అనంత గుణనిధి" అన్నాడు. ఆయన మనుష్యుడి ప్రార్థనలు వింటాడు. వాళ్ళని ఆదుకోవడానికి పరుగెత్తి వస్తుంటాడు. భక్తుల కోసం మానవ రూపంతో ప్రత్యక్షమవుతుంటాడు. ఇదివరకే ఎన్నోమాట్లు అలా చేసేడు కూడా అన్నాడు.

సుఖ జీవితం గడపడానికి కావలసిన సాంకేతిక అవకాశాలు లేని అంధకార యుగంలో ఏమాత్రం ఆశ, ఆనందం, తృప్తి నివ్వలేని పరిసరాల మధ్య మనుష్యుడు నిలదొక్కుకోవడానికి అటువంటి స్పష్టమైన లక్ష్యం, ఆదర్శం అవసరం, నమ్మకమూ కావాలి.

రెండో దేవుడైన శివుడిని ఒక మహాయోగిగా, వ్యాఘ్రచర్మాంబరధారిగా కల్పించుకున్నారు. ఆయనకుకూడ భార్యనిచ్చేరు. ఆమె భక్తులకు భౌతికసుఖాల నిస్తుందన్నారు. శివుడిని నాలుగు చేతులతో, నటరాజునుగా, మహోన్నత జీవశక్తిగా వూహించుకున్నారు. జీవన్మరణాలు ఆయన ఆధీనంలో వున్నట్లు భావించినా, ప్రధానంగా జీవోత్పాదకుడిగానే చిత్రించేరు. అందుకే ఆయనకు శిశ్న రూపమైన లింగాకారాన్ని కల్పించేరు శివుడు లయకారు డనడం సృష్టికి పూర్వరూపం లయంగా భావించడం చేత నయివుంటుంది.

ఆనాడు ఒక మహాకల్లోలస్థితి వుంది. శివ విష్ణు భక్తులు ఎందరో పుట్టకొచ్చేరు. జీవితరహస్యాన్ని వివరించగలమన్నారు. వారిలో శివభక్తుల్ని నయనార్లు అంటారు. విష్ణుభక్తుల్ని ఆళ్వార్లు అంటారు. ఈ ఇద్దరూకూడ భక్తిమార్గాన్నే బోధించేరు. సర్వాత్మను ఆదేవునికి తన్ను సమర్పించుకోవాలన్నారు. వీరు ప్రవేశపెట్టిన కర్మకాండలూ, పూజాపద్ధతులూ పూర్వం వానికి భిన్నం. బలులిచ్చి, నెయ్యి, పాలు, హోమంచేసి సోమరసం నివేదించి పారలౌకిక శక్తుల్ని ఆరాధించే వైదికకర్మకాండవేరు. నాడు, బ్రాహ్మణగృహస్థులు నిత్యాగ్నిహోత్రాన్ని నిలిపేవారు. కాని దేవాలయాలలో ఆరాధన అల్లాకాదు. రాజభవనాలలో అసంఖ్యాక భృత్యశ్రేణి ప్రభువుకు జరిపే సేవల ప్రతిరూపం ఇది. రాజులాగే దేవుడు ఇక్కడ నివసిస్తాడు. నయనార్ల సంఖ్య 72 కావడం, ఆళ్వార్ల సంఖ్య పన్నెండు కావడమూ 72 నైయోగికుల్నీ, (ఒకటవ అమ్మరాజు కాలంనాడు), రెండవ అమ్మరాజు కాలంనాటి ద్వాదశ స్థానాధి పతుల్నీ గుర్తుచేస్తూంది. వీరు దేవుని పరివేష్టించి వుంటారు. రాజుకు వలెనే దేవుడినీ పొద్దుట మంగళగీత వాద్యాలతో మేల్కొలుపుతారు. ముఖ ప్రక్షాళనాదికం చేయిస్తారు. స్నానం చేయిస్తారు. భోజనం పెడతారు. ఆయన వుండే స్థలాన్ని సుగంధ ధూపాలతో పరిమళింపజేస్తారు. పువ్వులు అలంకరిస్తారు. ధూపదీప నైవేద్యాలు సమర్పిస్తారు, సుందరులైన దేవదాసీయువతులు నృత్య గాన వినోదాలతో ఆనందింపజేస్తారు. ఇందుకోసం దేవదాసీ కుటుంబాల్ని దేవాలయాలు పోషించాయి. ఆయన విశ్రాంతి తీసుకుంటాడు. భక్తుల బాధలు వింటాడు. తీర్పులిస్తాడు. తన్ను కొలవడానికి వచ్చిన భక్తుల్ని తీర్థప్రాసాదాలిచ్చి సత్కరిస్తాడు. అచ్చం రాజులాగే రాజుకిచ్చినట్లే దేవాలయాలకు వచ్చి దేవుని దర్శించినప్పుడు భక్తులు బహుమతులు తెచ్చియిస్తారు. చివరకు రాత్రిపూట దేవుడికి కూడా రాజుకి మల్లేనే పవ్వళింపుసేవ చేస్తారు.

కొన్ని ప్రత్యేక సందర్భాలలో ప్రత్యేకసేవలు జరుగుతాయి. పంచామృతస్నానం, గందానులేపనం ఇటువంటివే. దేవునికిచ్చే నైవేద్యాలూ, చేసే సేవలూ చూస్తూ వేలాదిమంది అవన్నీ తాము అనుభవిస్తున్నట్లే మహదానందం పొందుతారు.

భక్తినిష్ట మనుష్యుని జీవితంలో ఒక ముఖ్యమైన పాత్ర నిర్వహిస్తుంది. అననుకూల వాతావరణం మధ్య, కష్టాలను అధిగమించలేని పరిస్థితులలో మనిషికి మిగిలేవి నిరాశ, నిస్పృహలే, అతని మానసిక స్థితిలో మార్పు ఆ ఘట్టంలో అవసరం. ఆ మార్పును అనేక మార్గాలలో సాధించవచ్చును. భక్తి వానిలో ఒకటి.

ఈ ఆరాధనపద్ధతే కొత్తది. దేవుళ్ళయితే పాతవాళ్ళే. అనార్యజాతుల సంపర్కం, సంయోజనాలవల్ల వైదికకాలపు దేవుళ్ళలో ఎంతో మార్పు వచ్చేసింది. రుగ్వేదంలో శివునికీ విష్ణువుకీ ప్రాముఖ్యంలేదు. శివుని పూర్వరూపం అయిన రుద్రుడు తుఫానుబీభత్సాల దేవుడుగా, గొప్ప బాధానివారకుడుగా భావించబడ్డాడు. తరవాతతరవాత పశుపతీ, మహాయోగీ, మహాకాలుడూ అయ్యాడు. ఇందులో మొదటి రెండురూపాలూ ఆర్యపూర్వ సంస్కృతి గల మొహెంజదారో ముద్రికలలో కనిపించాయి. వానిలో ఒకదాంట్లో మూడుతలల రుద్రుడు యోగాసనంతో పశుపరివేష్టితుడై కూర్చునివున్నట్లుంది. రుగ్వేదంలో కూడ రుద్రుడు పశుపతిగానే చెప్పబడ్డాడు. పాడి పశువుల్ని కాపాడవలసిందిగా ఆయనను ప్రార్థించేవారు. ఇందులో రెండు సంస్కృతుల సమ్మిశ్రణం కనిపిస్తుంది. తర్వాతతర్వాత శివుడు వ్యాఘ్రచర్మాంబర ధారియైన యోగిగా, భక్తులకు వరాలిస్తూ కనబడతాడు. శివుని సృష్టివిలాయాత్మక లక్షణాలు కంటికి ఇంపుగా



ప్రదర్శించబడతాయి, నటరాజరూపంలో. అదేవిధంగా రుగ్వేదంలో ఇంద్రమిత్రుడుగా కనిపించిన విష్ణువు పురాణకాలం నాటికి ఇంద్రునికి పరమశత్రువైన వాసుదేవ–కృష్ణుడుగా రూపొందేడు. తరువాత విష్ణుఅవతారమయిన కృష్ణుడుగా గొల్ల వాడుగా కనిపించేడు. ఆర్య పూర్వకాలపు అంశలున్న అనేక కథలూ, గాధలూ ఆ కృష్ణుని గురించినవి వాడుకలోకి వచ్చేయి. కృష్ణుని బోధగా చెప్పే "భగవగ్గీత" అవతార సిద్ధాంతాన్ని ప్రతిపాదించింది. ఈ అవతారాలకు మూలంలో ఆర్య, అనార్యలక్షణాలు రెండూ వున్నాయి.

ఈ కొత్త ధోరణిని రెండు మహాకావ్యాలు రామాయణ, మహాభారతాలు వ్యక్తం చేస్తున్నాయి. ఆదర్శపురుషుడైన ఒకరాజు కథ "రామాయణం" తరవాత ఈయన అవతారపురుషుడయ్యేడు. అల్లాగే "మహాభారతం" కృష్ణుని అవతార పురుషునిగా చూపుతుంది.

ఈ చరిత్రదశ యొక్క ప్రధాన లక్షణం జైన, బౌద్ధమతాల యెడ తీవ్రద్వేష భావం. శైవులూ, వైష్ణవులూ పాడే ప్రార్థనాగీతాలన్నింటా ఈ ద్వేషం కనబడుతుంది. ఆనాటికి జైన, బౌద్ధమతాలు క్షీణించిపోతున్నాయి. అందులో బౌద్ధానికి ప్రజలలో ఏ మాత్రం పట్టులేదు. జైనమతానికి ఆంధ్రకోస్తా ప్రాంతంలో కొద్దిచోట్ల మాత్రమే పలుకుబడి వుంది. రాయలసీమ, తెలంగాణాలలో దానికి కొంతబలం వుంది.

బౌద్ధమతంలో వచ్చినట్లు జైనమతంలో మూలగతమైన మార్పులేవీ రాలేదు. వారిలో వచ్చిన శ్వేతాంబర, దిగంబరపంథాల భేధం సిద్ధాంతాత్మకం కాదు. జైనులు ఏ దేవుడినో, దేవుళ్ళనో ఆరాధించరు. వారి ఆరాధ్యుడు మానవుడు. అర్హతుడు సర్వ విజేత జనుడు. గురువుయెడలా, ఇతర బోధకులయెడా వారికిగల గౌరవభావం ఆరాధన స్థాయికి చేరింది చివరకు ఈ మహావ్యక్తుల విగ్రహాలనుపెట్టి పూజించడమూ ప్రారంభించేరు. అనుష్ఠానికులు మాత్రమే ముక్తికి అర్హులని చెప్పినా, జైనులు అనుయాయుల విషయంలో విశేష శ్రద్ధ తీసుకొన్నారు. ఈ విషయంలో బౌద్ధపరివ్రాజకులు పూర్తిగా విఫలురయ్యారు. అదేగాక జైనసన్యాసులు నైతికవిధుల నెన్నడూ తప్పలేదు. సంపదలు పోగుచేసుకోలేదు. విలాస జీవితాలనలవరచుకోనూలేదు. బహుశా జైనమతం మరికొంత కాలం సజీవంగా వుండడానికిదే కారణం. అయితే వారెప్పుడు దేవుని ఆస్తిక్యాన్ని అంగీకరించలేదు. వారి పూజాపద్ధతులు హిందువుల పూజాపద్ధతులనే పోలివున్నా వారు ఖచ్చితమైన నిరీశ్వరవాదులు. ఏ పరమాత్ముడో ఈ విశ్వసృష్టిచేశాడని ఒప్పుకోరు. అనిర్వాచ్యమైన ఏదో నియమం దానిని నడుపుతున్నదంటారు. అందుచేతనే దానిమీద శైవులూ, వైష్ణవులూ కూడ కత్తికట్టేరు. శైవుడైనా; వైష్ణవుడైనా భక్తు పరమ లక్ష్యం పరమాత్ముడిలో లయం అయిపోవడం కదా.

ఆస్తికులకూ నాస్తికులకూ, భక్తి పంథాలవారికీ తదితరులకూ మధ్య పెరిగిన వైషమ్యాల పరిష్కారానికి వాదోపవాదాలు, మహిమా ప్రదర్శనలు, దివ్య పరీక్షలు మొదలైనవి సాగేయి. ఇందులో ఓడినవారు జయించినవారి మతాన్ని స్వీకరించాలనేది పందెం. ఏ సత్పురుషుని నాయకత్వానో భక్తులు జట్లుగా పాటలు పాడుతూ, భజనలు చేస్తూ, వాదోపవాదాలు సాగిస్తూ దేశంలో పర్యటిస్తూండడం అనాడు మామూలు అయింది.

ఈ వుద్యమాలు ప్రభువులా, సామంతులా, అధికార్లా, వర్తకులా దృష్టిని కూడ ఆకర్షించేయి. వారు దేవాలయాలు కట్టించి వానికి ధర్మాలు చేశారు. విభిన్న మతస్థుల వాదోపవాదాలలో నెగ్గినవారి మతవాదాన్ని తామూ స్వీకరించేవారు. దీని ప్రభావం ప్రజాసామాన్యం

మీద చాలా ఎక్కువగా వుండేది.

ఈ నూతన భక్తిపంథాల ప్రవర్తకులు ప్రజల భాషలో మనస్సును కదిలించే విధంగా పాటలు పాడేవారు. పల్లెటి ప్రజలు పాడుకొనేందుకు వీలైన రాగాలలో కీర్తనలు వ్రాసేరు. నృత్యాలకు, నాటకాలకు, శిల్పాలకు, చిత్రాలకు, బోధనలకు, వాదనలకు సాయపడే విధంగా అనేక ఇతివృత్తాలు కల్పించేరు.

ఈ భక్తిపంథాలతోపాటు పక్కపక్కనే పాశుపతులు, కాపాలికులు, కాలాముఖులు మొదలైన అనేక తాంత్రికపంథాలు కూడా వ్యాపించేయి. మానవ కపాలాన్ని భిక్షాపాత్రగా వుపయోగించడం, శ్మశాన భస్మాన్ని శరీరానికి పూసుకోవడం, పరమ అసహ్యకరమయిన విధులతో స్త్రీ ఉపాసన మొదలైన వానిని వీరు అనుసరించేవారు. రానురాను అవినీతి చర్యలూ, అసహ్యకర పద్ధతులూ, చివరకు దేవి తృప్తికోసం తన తలనే నరుక్కోవడం వరకూ వీరి చర్యలు సాగేయి. వీరికి రాజదర్బారులలో గొప్ప గౌరవ మర్యాదలు లభించేవి.

కాలం గడచినకొద్దీ భక్తిపంథా తీవ్రరూపం ధరించి వీరశైవం, వీర వైష్ణవం వచ్చేయి. 12వ శతాబ్దంలో కన్నడదేశీయుడైన బసవన్న వీరశైవ ప్రవక్త. ఆంధ్ర దేశంలో మల్లికార్జున పండితుడు, శ్రీపతి పండితుడు, మంచన పండితుడు అనే ముగ్గురు పండితులు దీనిని వ్యాపింప చేశారు. వీరిలో మల్లికార్జున పండితుడు పండితారాధ్యుడనే పేరున ప్రసిద్ధుడు. బసవేశ్వరుడు వర్ణధర్మ వ్యతిరేకి. జీవితాంతం ఆయన దానిని పాటించేడు. ఆయన బిజ్జలరాజువద్ద మంత్రిగా వుండేవాడు. రాజసహాయంతో ఆయన వీరశైవుల మధ్య పంక్తి భోజనాలు ప్రోత్సహించేడు. ఆయన సన్నిహిత అనుచరులలో ఒకడైన శివనాగుమయ్యతో చేయి చేయీ కలిపి కల్యాణ నగర వీధులలో నడిచేవాడు. ఆ శివనాగుమయ్య కులంచేత అస్పృశ్యుడు. దక్షిణాపథంలో వర్ణవ్యవస్థమీద ప్రజోద్యమాన్ని ప్రారంభించిన ప్రథముడు బసవేశ్వరుడు దిగువ, హీనతరగతుల ప్రజ ఆయన పంథాకు వేలసంఖ్యలో ఆకర్షితులయ్యారు. అయినా తన ప్రత్యర్థుల్ని తీవ్రపద్ధతుల ననుసరించి అణచివెయ్యాలని ఆయన అభిప్రాయం. వాదనలు విఫలమైన చోట కత్తి తీసుకున్నాడు. అనేక జైన దేవాలయాలను నేలమట్టం చేసేడు. మే సంఖ్యలో జైనుల్ని చంపించేడు. విజయోన్మాదంతో ఆయన అనుచరులు అవినీతికర, అమానుష చర్యలకు దిగి, ప్రజలకు దూరమయ్యారు. ఆ విధంగా బసవేశ్వరుని జీవితకాలంలోనే అది క్షీణోన్ముఖం అయింది. బసవేశ్వరుడు ఎంతో నియమనిష్ఠాపరుడైనా, అనుచరుల దుశ్చర్యల నాపలేకపోయాడు. ప్రత్యర్థుల్ని నిర్మూలించాలనే దృష్టితో తన అనుచరుల దుర్మార్గాలను తెలివిగా వాదనలతో బలపరిచేడు. కాని, ఆయన తలచిన దానికి భిన్నంగా జరిగింది. ప్రతిపక్షుల ప్రోత్సాహంతో రాజు బిజ్జలుడు ఆయన అనుచరులిద్దరి కళ్ళు పీకించేడు. తరవాత సన్యాసం తీసుకున్నాడు. ఆ వుద్యమం రూపుమారి చివరకు వైదికమతంలో భాగంగా కలిసిపోయింది. బౌద్ధమతానికి పట్టినగతే వీరశైవానికి పట్టింది.

బసవేశ్వరుడికీ, మల్లికార్జునపండితుడికీ కొన్ని ముఖ్య విషయాలమీద భేదాభిప్రాయాలు వుండడంచేత ఆంధ్ర దేశంలో వీరశైవం కొంచెం సౌమ్యపంథాను అవలంబించింది. ఆంధ్రలో వీరిని ఆరాధ్యులని పిలుస్తారు. కన్నడ దేశంలో వీరశైవుల్ని లింగాయతులంటారు. ఆ దేశంలో వీరశైవం వర్ణవ్యవస్థను నిరసించింది. ఆంధ్రలో అల్లాకాదు. "భక్తిపైన వలపు-బ్రాహ్మణ్యంబుతో పొత్తు వదలలేను నేను-బసవలింగ"- అన్న మల్లికార్జున పండితారాధ్యుడు ఆంధ్రదేశంలో వీరశైవ మత ప్రవక్త. ఆ తేడావుంది. అయినా బసవేశ్వరుని బోధలు ఆంధ్రదేశపు సమాజాన్ని



బాగానే ప్రభావితం చేశాయి. ఇక్కడి వీరశైవ నాయకులు ప్రజలను ఆకర్షించడానికై శివభక్తుల కథలను సులభశైలిలో దేశీయ చందస్సుతో వ్రాసి ప్రచారం చేశారు. పాల్కురికి సోమనాథుడు రచించిన 'పండితారాధ్య చరిత్ర', 'బసవ పురాణము" అటువంటి గ్రంథాలు.

మల్లికార్జున పండితారాధ్యులు వ్రాసిన "శివతత్వసారం" శివభక్తులు జీవితంలో అవలంబించవలసిన విధి నియమాల సంపుటి అని చెప్పాలి. వానిలో కొన్ని :

భర్త శివభక్తుడు కాకపోతే భార్య అతనిని దారిలోకి తేవాలి. అప్పటికీ వినకపోతే వదిలెయ్యాలి.

శైవుడు కాని వానికి నమస్కరించకు అతడు నమస్కరించినాసరే.

శివదూషకుల్ని నిర్ద్వంద్వంగా చంపెయ్యి. శివుని నిందించి, దూషించే గ్రంథాలను అంటించి బూడిద చెయ్యి. ఇల్లాగే వుంటాయి.

శివ పూజకై తల, నాలిక, కళ్ళు తీసివేసుకొన్నా అవి తిరిగి వస్తాయి; శివ భక్తుడి వర్ణం ఏమిటని అడగవద్దు. ఆపదలో వున్న శివభక్తునికి సాయం చెయ్యి-మల్లికార్జున పండితారాధ్యుని బోధలలో ఇవి కొన్ని.

వీరశైవానికి సమఉజ్జీగా దాని పక్కపక్కనే వీరవైష్ణవమూ వర్ధిల్లింది. ఒక చోట శివుడు ఆరాధ్య దైవమయితే రెండోదానిలో విష్ణువు ఆరాధ్య దైవం. చతుర్థ కులానికి చెందిన వేంగి రాజులు, వెలనాటి చోడులు, పలనాడునేలిన హైహయులు, మొదలైనవారు వీరవైష్ణవాన్ని అభిమానించేరు. అయితే కుటుంబ కలహాలలో ఇరుపక్షాలూ చెరొక మతాన్నీ అనుసరించడం కూడా జరిగింది. హైహయుల కుటుంబంలోనే నలగామరాజు వీరశైవాన్ని స్వీకరిస్తే బ్రహ్మనాయుడు వీరవైష్ణవాన్ని సమర్థించేడు. ఆయన వివిధ కులాల వారికి చాపకూళ్ళ పద్ధతి ప్రవేశపెట్టేడు. మాల కన్నమనాయుడు ఆయన అనుగు అనుచరుడు. విభిన్న కులాల సమ్మిశ్రణంతో బ్రహ్మనాయుడు పద్మనాయకులనే కొత్త కులాన్ని సృష్టించాడు.

ఈ చరిత్ర దశలో భక్తి పంథా బాగా వ్యాప్తిలోవున్నా గ్రామదేవతలు కొలుపులు కూడా రెండో వేపున విస్తృతంగానే వున్నాయి. అయితే ఈ కొలుపుల్లో భక్తి కన్న భయం ఎక్కువ. సిద్ధాంత చర్చలు అర్థంకాని పల్లెటూరి ప్రజలలో ఈ దేవతలది బలం.

ప్రజలలోని వివిధ తరగతుల వారి మతాభిమానాలను విశదంచేస్తూ మనకెన్నో శాసనాలు సాక్ష్యం ఇస్తున్నాయి. ప్రభువులు, సామంతులు, అధికార్లు, వర్తకులు, భూస్వాములు, సాధారణ ప్రజలు దేవాలయాలు కట్టించడంలో, వానికి ధర్మం ఇవ్వడంలో వుదారంగా వ్యవహరించేరు.

బాదామి చాళుక్యులు శిభక్తులు. రాయలసీమలోనూ, తెలంగాణంలోనూ వీరు ఆలయాలు కట్టించేరు, ధర్మాలు చేశారు. ఒకటవ విక్రమాదిత్యుడు శివమండల దీక్ష తీసుకొన్న సందర్భంగా, గురుదక్షిణా సుదర్శనాచార్యుల వారికి అలంపురం తాలూకాలో ఒక గ్రామాన్ని ఇచ్చేడు. ఒక గురువును ఏర్పరుచుకొని, ఆయనవద్ద బోధ పొందడాన్ని "దీక్ష తీసుకోవడం" అంటారు. ఈ విధానం వీరశైవానికి చాల ముందు నుంచీ సంఘంలో వుంది.

రాష్ట్రకూటుల హయాములో జైనమతం వైదికమతానికి గట్టి పోటీగా వుండేది. వారిల్లో ప్రముఖులైన రాజులు జైనులు. అయినా ఇతర మతాలయెడ వారు చాలా సహనం చూపేరు. పశ్చిమకోస్తాకు వర్తకులుగా వచ్చి అక్కడ అదివరకే స్థిరపడివున్న అరబ్బులకు మసీదులు

కట్టుకోడానికీ, తమ మతాచారాల ననుసరించడానికీ, అనుమతించేరు. వైష్ణవేతర దేవాలయాలలో పూజాపునస్కారాలు చేసేది బ్రాహ్మణులు కారు. గురవలనే బ్రాహ్మణేతరులు.

తూర్పుచాళుక్య రాజులలో ఒక్క విమలాదిత్యుడు తప్ప ప్రభువులెవ్వరూ జైన మతం తీసుకోలేదు. వారు శైవులు. అయితే జైనులయెడ అభిమానం చూపేరు. వీరి కాలంలో జైన దేవాలయాల నిర్మాణానికీ, నిర్వహణకూ, ధనం ఇచ్చినట్లు శాసనాలు చెప్తున్నాయి. ప్రజానీకం బౌద్ధాన్ని తోసేసి శైవ మతాన్ని అభిమానించేరు. ఇంతక్రితం బౌద్ధక్షేత్రాలుగా ప్రసిద్ధికెక్కిన అమరావతి, ద్రాక్షారామ, పాలకొల్లు, చామర్లకోట-భీమవరం, గనుపూడి శైవక్షేత్రాలుగా మారి పంచారామాలూగా ప్రసిద్ధిపొందేయి. విజయాదిత్యుడు 108 శివాలయాలుకట్టించి తన పేరు "నరేంద్రమృగరాజు"ను మార్చి "నరేంద్రేశ్వరుడు"గా పెట్టుకున్నాడు. రెండవ యుద్ధమల్లుడు, రెండవ భీముడూ, రాజరాజ నరేంద్రుడు దేవాలయ నిర్మాతలుగా ప్రసిద్ధిపొందేరు. కాలాముఖ పంథావారి శైవమఠాలూ, జైనమఠాలు చాల వుండేవి. ఈ మఠాలు సత్రాలను, ఆసుపత్రులను, విద్యాలయాలను (ఘటికలు) నిర్వహించేవి.

తెలుగుచోడుల కాలంలో శైవమతానికి చాల ప్రాచుర్యం వుంది. బహుశా ఆ కాలంలో భిన్నమతాలవారు ఒకరొకరి దేవాలయాలను దోచుకోడం ఎక్కువగా వుండేదో యేమో, అటువంటి దుర్మార్గానికి ఒడికట్టిన వారికి ఎటువంటి ఆపదలు చుట్టుకుంటాయో వర్ణిస్తూ ఒక శాసనం వారిదే వుంది.

కల్యాణి చాళుక్యులు వీరశైవాన్ని అభిమానించేరు. వారిలో లింగాయతులు పూర్తిగా తిరుగుబాటుదారులు. ప్రత్యర్థులమీద దౌర్జన్యకాండకు పూనుకున్నారు. కాని, ఆంధ్రలో ఆరాధ్యులు బ్రాహ్మణులు. వీరి దృక్పథం కొంత సౌమ్యమే కాని, క్రమంగా వీరూ లింగాయతుల పద్ధతులకే తిరిగేరు. కాలాముఖ పంథీయులు తెలంగాణా, రాయలసీముల రెండింటా ప్రబలంగానే వుండేవారు. వీరు శక్తిపూజకులూ, లింగపూజకులూను, కౌటుంబిక జీవితాన్ని పూర్తిగా ఖండించారు.

చాళుక్య చోళులు పూర్తిగా వీరశైవ మతాభిమానులు. అయితే వారు తమ సామంతులైన వెలనాటిచోడులు, హైహయులు, కొండపడమటులు, పరిచ్ఛేదులు మొదలైనవారికి మతవిషయక స్వేచ్ఛను అనుమతించేరు. వీరంతా వీరశైవాన్నీ, వీరవైష్ణవాన్నీకూడా అభిమానించేరు. గురజాల, మాచెర్ల, కారెంపూడి మొదలయినచోట్ల శివ, విష్ణ్వాలయాలు రెండూ నిర్మించబడినాయి.

పల్నాడులో, యుద్ధాలలో మరణించిన వీరపురుషులగు గుడులు (వీరుల గుడులు) కట్టించి దేవళ్ళనులాగే పూజించే అలవాటుంది. ఈ పూజలూ, ఉత్సవాలలో శైవులూ, వైష్ణవులేకాదు, ముస్లిములూ పాల్గొంటారు.

పదకొండు, పన్నెండు శతాబ్దాలలో ఆంధ్రకోస్తా, ప్రాంతాలు కొన్నింట దుర్గ, హుంకారదేవి, శాంకరి, పోలూరి శని మొదలైన పేర్లతో శక్తిపూజ వుండేది. ఈ పూజలలో మద్యం, మాంసం, మదిరల విషయంలో స్వేచ్ఛ వుంటుంది. దీనినే భైరవి పూజా, చక్రపూజా అనికూడా పిలుస్తారు. ఒంగోలు తాలూకా నన్నూరును హుంకారదేవికి దానంచేస్తూన్న శాసనం (క్రీ.శ. 1097) దొరికింది. ఆత్మహింస ముక్తికి దగ్గరమార్గంగా భావించిన వీరభద్రులు, వీరముష్టులు, వీరభక్తులు అనే తెగలుకూడా వుండేవి. ఆనందానుభవమే ప్రధానంగా భావించిన మిండజంగాలు వుండేవారు.



రాజులు, రాణులు, సామంతులు, వుద్యోగులు, భూస్వాములు, వర్తకులు తమ తమ మతాభినివేశాన్ని తెలపడానికై ఆంధ్రదేశంలో నలుమూలలా కట్టించిన శివాలయాలూ, విష్ణ్వాలయాలూ అసంఖ్యాకంగా వున్నాయి. వాటిలో సేవలకై ఆస్తులిచ్చేరు. ధనం ఇచ్చేరు ఆ విధంగా వచ్చిన ధనధాన్యాలతో దేవాలయాల స్థానాపతులు (ట్రస్టీలు), పూజారులు, వృత్తిపనుల వారు, గాయకులు మొదలైన దేవాలయోద్యోగులకు రోజువారీ భత్యాలో, మాసిక వేతనాలో , సాలువారీ ప్రతి ఫలాలో ఇచ్చేవారు. కొన్ని కొన్ని పనులకోసం నిర్దేశించి ఇచ్చిన మూలధనం నుంచి వడ్డీలు, పన్నులా, సుంకలా, ఆదాయాలు వస్తుంటాయి. వానిని ఆయా పనులకే ఖర్చు చెయ్యాలి. కొందరు అఖండజ్యోతుల నెయ్యికోసం దేవాలయానికి ఆవులనూ, మేకలనూ బహుమతి చేస్తారు. వాటిని దేవాలయపు గొల్లకు స్వాధీనపరుస్తారు. ఆ పశువులు సంతానంకంటూ వుంటాయి కనక ఆ దానం శాశ్వతంగా జరగవలసిందే. వాని పాలు, నెయ్యితో అభిషేకాలూ, అఖండ దీపాలూ శాశ్వతంగా సాగుతూనే వుంటాయి.

ఆంధ్రకోస్తాలోని సింహాచలం, ద్రాక్షారామ, చామర్లకోట-భీమవరం, గునుపూడి పాలకొల్లు, బెజవాడ, అమరావతి, చేబ్రోలు చేజెర్ల, నాదెండ్లలో; రాయలసీమలోని కాత్యదోన, త్రిపురాంతకం, తాడిపత్రి, శ్రీశైలం, అహోబిలం, కాళహస్తి, తిరుపతిలలో; తెలంగాణంలోని అలంపురం, కొల్లాపురం, కొలనుపాక, వేములవాడ; హనుమకొండలలో ఉన్న దేవాలయాలు నాటి నుంచి నేటివరకూ వేలాది భక్తుల్నీ, యాత్రీకుల్నీ ఆకర్షిస్తున్నాయి.

ఇవన్నీ ఆగమాలు, శాస్త్రాలు విధించిన నియమాలకు అనుగుణంగా నిర్మించబడినాయి. దేవాలయ గర్భగృహం చిరుచీకటిగా వుంటుంది. ఒక్కదేవ విగ్రహం తప్ప దానిలో ఇతర శిల్పాలు ఏమీ వుండవు. వినయం, భక్తి, ఆత్మార్పణలను ప్రోత్సహించే వాతావరణం సృష్టించబడుతుంది. ఇక-దేవాలయం చుట్టూ పురాణకథలూ, భారత రామాయణకథలూ చిత్రాలుగానో, శిల్పాలుగానో గోడల్ని అలంకరిస్తాయి. కొన్ని దేవాలయాల మీద నగ్న విగ్రహాలూ, బూతుబొమ్మలూ ప్రదర్శితం అవుతున్నాయి. వీటి ఆంతర్యమేమిటో చరిత్రకారులింతవరకు నిర్ణారణగా ఏమీ చెప్పలేకపోయారు.

మధ్యయుగాలవాడు దేవాలయాలు కేవలం పూజాస్థలాలుగానే వుపయోగించబడలేదు. అక్కడే పురాణశ్రవణం, హరికథాకాలక్షేపాలు, పంచాంగశ్రవణం జరుగుతుండేవి. వాటికి ఆధీనంగా సత్రాలు, పాఠశాలలు చికిత్సాశాలలు నిర్వహించబడేవి. సంవత్సరం పొడుగునా ఏవో ఉత్సవాలు, పసండుగలు, ప్రదర్శనలూ వుండేవి. వీనిలో భక్తులే కాదు, అనేక గ్రామాల జనం కూడా అధికసంఖ్యలో పాల్గొనేవారు. ఒక విధంగా దేవాలయం గ్రామ జీవితంలో సాంస్కృతిక కేంద్రంగా వుంటుంది.

దేవాలయాలయెడ రాజులు చూపే అభిమానం అనేక తరహాలుగా వుంటుంది. వానికి భూములు దానంచెయ్యడం సర్వసామాన్యం. ఆ విధంగా ఇచ్చినవానికి పన్నులుండవు. చాల విలువైన తోటలు కూడా ఇచ్చినట్లు శాసనాలున్నాయి. పన్నులు, సుంకాలరాబడి వానికివ్వడం వుంది. ఇందుకు ఉదాహరణలెన్నో ఇంతక్రితమే పైన చదివేము.

రాజులూ, ఉన్నతకుటుంబాలవారే గాక దేవాలయసేవకులు, పుష్పమాలాకారులు, ద్వారపాలురు, అస్పృశ్యులు, మావటీళ్ళు, వేశ్యలు, చిన్న వుద్యోగాలవారు, వృత్తి పనులవారు, వెత్తిమూటలవారు ఇతర సామాన్య ప్రజలు దేవాలయాలకు దానంచేసిన శాసనాలున్నాయి.

వానినికూడా పైన అనేక సందర్భాలలో వుదాహరించాము. వీనితో దేవాలయాలకు పెద్ద ఆస్తులు, మందలు, పంటభూములు ఏర్పడ్డాయి. వాని నిర్వహణకు 72 నియోగికులతో అధికార వర్గ ఏర్పరచడం కూడా అవసరమైన సందర్భాలు వున్నాయి.

దేవాలయ సేవకులు కొందరికి ఏ విధంగా జీతాలు వుండేవో కొన్ని శాసనాలను బట్టి తెలుస్తుంది. నర్సారావుపేట తాలూకా కొప్పారం దాన శాసనాన్ని (కీ.శ. 1115) బట్టి దేవాలయ స్థానాపతికి 10 ఖండికలు తరిభూమి, 20 ఖండికలు మెట్ట; పూజారికి 2 తరి, 5 మెట్ట; నాట్యాచార్యుడికి 4 తరి, 6 మెట్ట; నాట్యాచార్యురాలికి 6 తరి, 12 మెట్ట; నర్తకికి 2 తరి, 4 మెట్ట; గాయకుడికి 3 తరి, 5 మెట్ట; గాయనికి 3 తరి, 5 మెట్ట; వంశీవాదకునికి 3, 5; అతని ప్రతిగానికి 1, 3 ఖండికలు; మార్దంగికునికి 3,5 ఖండికలు; చామరగ్రాహి, వీవనధారి, ఢోలువారికి మొత్తం 24 ఖండికలు తరి, 48 మెట్ట; దేవాలయ సేవకుడికి 2-4; శంఖం వూదే వానికి 1-3; దేవాలయ వాస్తుశాస్త్రజ్ఞుడికి 2 తరి, 3 మెట్ట ఖండికలు ఇచ్చినట్లు తెలుస్తోంది.

ఒక్కొక్కప్పుడు దేవాలయ సేవకులకి భూములుగాక ధనరూపంలో వేతనాల నివ్వడం వుంది. ఆనాటి జీతాలు ఎలావుండేవో చామర్లకోట-భీమవరం దేవాలయానికి సంబంధించిన చాళుక్య-చోళ శాసనం తెలుపుతూంది. తిరువారాధనచేసే బ్రాహ్మణునికి 4 మాడలు, 3 కుంచాలు; దీపారాధనచేసే బ్రాహ్మణునికి 3 కుంచాలు; నిత్యనైవేద్యం తయారుచేసే బ్రాహ్మణునికి 1 మాడ, 3 కుంచములు; తిరుగారకార్చి బ్రాహ్మణుడికి 1 మాడ, 3 కుంచములు; ద్రవిడ వేద పాఠకుడైన బ్రాహ్మణుడికి 3 మాడలు, 4 కుంచాలు; స్వస్తివాచకుడైన బ్రాహ్మణునికి 1 మాడ, 4 కుంచాలు; శంఖం పూదేవానికి 1 మాడ, 4 కుంచాలు; కుమ్మరికి అర్ధమాడ, 3 కుంచాలు; గోపాలకుడికి అర్ధమాడ, 3 కుంచాలు; 6 గురు వైష్ణవ వంటవాళ్ళకి 3 మాడలు, 15 కుంచాలు; కంచరికి 3 మాడలు, 4 కుంచాలు.

దేవాలయానికి దానంచేసిన ఆవులు, మేకలు, గేదెలు మొదలైన వానిని దేవాలయం గొల్లకో, గోపాలుడికో వప్పచెప్తారు. అతడు నిర్ణీతమైన విధంగా పాలూ, నెయ్యీ మొదలైనవి దేవాలయానికి ఇవ్వాలి. ఆ విధంగా వచ్చిన పశువులు ముసిలివి కావడం, చచ్చిపోవడం జరిగినా వాని సంతతి పెరుగుతూనే వుంటుంది. గనక దానోద్దేశానికి భంగం కలగదు.

ముఖ్యమైన దేవాలయాలు ఒక కమిటీ ఆధ్వర్యంలో వుంటాయి. అటువంటి కమిటీలు లేనిచోట గ్రామసమితి దేవాలయ ధర్మసంస్థలకు ట్రస్టీగా పనిచేస్తుంది. దేవాలయ భూములూ ఇతర ధర్మాదాయాలు తప్పకుండా మేనేజర్ల ఆధీనంలో వుంటాయనే దేమీలేదు. ఒక్కొక్కప్పుడు కొన్ని సేవాకార్యాలకు ఉద్దేశించిన ధనం పూజారి వద్దనే వుంటుంది. దేవాలయంలో వసూలైన బహుమతుల ధనాన్ని శాశ్వత వడ్డీకై గ్రామ సమితి వద్దనో, ఏమోతుబరి వ్యక్తుల వద్దనో వుంచుతారు. దాత వుద్దేశించిన విధంగా ఆ వడ్డీని ఖర్చుచేస్తారు. దేవాలయ ఆస్తులను అమ్మేందుకూ, కొనేందుకూ అధికారం వున్న కమిటీల చేతిలో ఒక్కొక్కప్పుడు దేవాలయకోశం వుంటేంది. భూయజమానులలాగనే దేవాలయం భూములను కొంటుంది. అమ్ముతుంది. దాని అప్పులూ, ఆస్తులా లెక్క చాల జాగ్రత్తగా వుంచుతారు. 108 మంది సభ్యులుగల తిరుచానూరు గ్రామసమితి బహుమతులుగా వచ్చిన ధనాన్నీ, బంగారాన్నీ భూములను స్వీకరించి, వ్యవహరించడంలో దేవాలయపు ఏజంటుగా పనిచేస్తున్నదని ఒక శాసనం తెలుపుతూంది.



దేశాలయకోశాగార నిర్వహణకు భండారీలనే వుద్యోగులుంటారు. ప్రేంపల్లిలోని భావనారాయణస్వామి దేవాలయానికి ఇద్దరు భండారీలు వున్నారు. దేవాలయం యొక్క నిత్య పరిపాలనా వ్యవహారాలను వీరు చూస్తారు. దేవాలయోద్యోగులు జీతాలు, వారు చేయవలసిన విధులు, వారి హెూదాలు నిర్ణయించే పనిని మహాజనుల సమితి సలహా ప్రకారం బహుశా రాజ్యాధిపతే నిర్వహిస్తాడని శ్రీమతి వైదేహి కృష్ణమూర్తి తమ "సోషల్ అండ్ ఎకనమిక్ కండిషన్స్ ఇన్ ఈస్టరన్ దక్కన్"లో వ్రాస్తున్నారు. కులోత్తుంగ గొంకరాజు "ముడిసెలు॥ డయిన "ఈసనపెక్కడ"కు కొడమ గుండనుంచి రావలసిన "పేరుసుంకం", "వడ్డరవాలము" "కొలచువీసలు" మొదలైన పన్నులు, సుంకాలను దేవాలయంలో పూజాదికాలు కొనసాగించడానికీ, సన్యాసులు, విద్యార్థుల పోషణకూ వినియోగించునట్లుగా మహాజనులకు వప్పగించడానికి, క్రీ.శ. 1147 నాటి శాసనం తెలుపుతూంది.

దేవాలయాల ప్రధాన ఆస్తులు భూములే. పనివారిని పెట్టి వానిని సాగుచేయించడమో కౌలుకు ఇవ్వడమో, నిర్దిష్టసేవలు చేసేవారికి అందుకోసం ఇవ్వడమో జరుగుతుంది. కొన్ని చోట్ల ఈ భూములకు నీరుపారించేందుకై చెరువులున్నాయి. భూముల్ని కౌలుకిచ్చిన సందర్భాలలో కొన్ని పనులు చేయడానికై కౌలుదార్లకు కౌలుమొత్తంలో కొంత ఇవ్వడం వుంటుంది. ద్రాక్షారామ దేవాలయానికి అనుబంధించిన ఒక మఠం పోషణ కోసం కులోత్తుంగచోడుని కుమారుడు ఒక గ్రామాన్ని కొని యిచ్చేడు. ప్రతిదినం ఆ మఠంలోని బ్రాహ్మణులకు భోజనం పెట్టే షరతుతో ఆ భూములను ఆ వూరిలోని కొందరికి కౌలుకిచ్చేడు. ఈ భూముల వ్యవసాయం సక్రమంగా జరిగేటట్లూ, సేవలు సరిగ్గా జరిగేటట్లూ ఆజ్మాయిషీచేసేపని గ్రామమహాజనులకు వప్పగించబడింది.

పువ్వుల తోటలు, కొబ్బరి, పోక, తమలపాకు, పళ్ళతోటల పంటలు దేవాలయాలకు నిత్యావసరాలు. దేవాలయంలో ఖర్చుకు పోను అదనంగా వున్న ఈ పంటలను అమ్మి, దేవాలయ కోశానికి జమకడతారు.

శివరాత్రి మొదలైన పండుగలూ, వుత్సవాలకు ఎక్కడెక్కడినుంచో, అన్ని తరగతుల ప్రజలూ, దేవాలయాలకు వస్తారు. కొన్ని ప్రత్యేక కాలాలలో దేవుణ్ణి దర్శించడం మహాపుణ్యంగా భావించబడుతుంది. "పండితారాధ్య చరిత్ర"లో శ్రీశైలంవద్ద శివరాత్రి ఉత్సవాల గురించి వర్ణ వుంది. ఈ ఉత్సవ సమయాలలో ప్రజలు తమ కళలూ, విద్యలూ ప్రదర్శిస్తారు. ఈ ఉత్సవాలన చూస్తే తమ కష్టాలన్నీ పోతాయని కొందరి విశ్వాసం. కొందరింక ఆ క్షేత్రాలలోనే జీవితాలు గడపుదామనే నిర్ణయానికి వస్తారు. తమ కళ్ళనో, నాలికనో, చివరకు తలనో కూడ దేవునికి సమర్పించేవారు కొందరు.

దేవదాసీ వ్యవస్థ నాటి సమాజంలో భాగంగానే వర్ధిల్లింది. రాజులు ఉంపుడు కత్తెలు దేవాలయాలకు దానాలిచ్చిన నిదర్శనలెన్నో వున్నాయి. ద్రాక్షారామ, చామర్ల కోట-భీమవరం, పాలకొల్లు మొదలైన ముఖ్యమయిన దేవాలయాల సమీప వీధులలో మూడువందలేసి మంది వరకూ వేశ్యలు నివసించినట్లు శాసన సమాచారం వుంది. ఈ దేవాలయ వేశ్యలలో కొందరు సమాజంలో గొప్ప ప్రతిష్ఠ సంపాదించేరు. వెలనాటి చోడరాజులలో ప్రసిద్ధుడైన ఒకటవ గొంకరాజు ఒక దేవదాసిని పెళ్ళిచేసికున్నాడు. అయితన నాయకుని భార్య వుద్దాన ఒక వేశ్య. వారి పుత్రుడు నారాయణ మాతుర శాసనపు దాత. గంజాం శాసన దాత గోకర్ణ నాయకుడు

"వేశ్యా వంశోద్భవుడు". ఇల్లా ఎన్నో వుదాహరణ లివ్వవచ్చు.

ఈ దేవదాసీలు వ్యభిచారవృత్తి చేస్తూనే, లలితకళలను అభ్యసించేరు. తాము స్వర్గానికి పోవడానికి తమ వృత్తి ఆటంకం కాదని విశ్వసించేరు.

ఈ చారిత్రకదశలో వర్ణవ్యవస్థకు అంతకుక్రితం వున్న ప్రాముఖ్యం అంతరించింది. సంఘంలో బ్రాహ్మణులదే పైస్థానంగా వుంది. రాజులు, ఇతర ధర్మసంస్థలు దానాదికాలు నివ్వడంలో వారికే ప్రాధాన్యం ఇచ్చేరు. వారిలో హెచ్చుమంది బోధన, అధ్యయనాలలో వుండేవారు. అగ్రహారాలు, బ్రహ్మపురిలు, ఘటికలు, మఠాలు వైదిక విద్యాకేంద్రాలుగా వుండేవి. తమ పాలనా వ్యవహారాలలో రాజులు తరుచు బ్రాహ్మణుల సహాయం తీసుకునేవారు. వీరిలో కొందరు మత కర్మకాండలు వదిలేసి మంచి ఆదాయం వుండే రాజగురువులుగా, మంత్రులుగా, సలహాదార్లుగా ప్రభుత్వోద్యోగాలకు ఎగబడ్డారు. కొందరు సైనికవృత్తి చేపట్టారు. కొందరు వాణిజ్యం, కొందరు వ్యవసాయం చేపట్టేరు. వీనిని చూసి క్రమంగా రాజులు తమ ఉదారపద్ధతులను తగ్గించేరు. అగ్రహారాల నుంచి పన్నులు వసూలు చేయడం మొదలుపెట్టేరు. అయితే వీరి పన్ను రేట్లు కొంచెం తక్కువగా వుంటాయి.

క్షత్రియులు యోధుల వర్ణంగానే వున్నారు. అయితే వెనుకటిలాగ వారొక్కరే యుద్ధాలలో పాల్గొడంలేదు. అవసరం వచ్చినప్పుడు జనం అందరూ ఆయుధాలు చేపడతారు. కాని అదికాదు. యుద్ధాలే వృత్తిగా చేపట్టడం గురించి, బ్రాహ్మణులూ, వైశ్యులూ, శూద్రులు కూడ యోధవృత్తి చేపడుతున్నారు. క్షత్రియ కుటుంబాలు దిగువ వర్ణాలతో వివాహ సంబంధాలు పెట్టుకొంటున్నారు. చతుర్థకులానికి చెందినవారు రాజులవుతున్నారు. ఉన్నత వర్ణాలతో సమానహోదా అనుభవిస్తున్నారు. క్షత్రియులతో సమానత్వం కోసం సూర్య, చంద్రుల నుంచి వంశానుక్రమణికలు వెతుక్కోవడం ప్రారంభమయింది.

వైశ్యులు ప్రధానంగా వర్తక వ్యాపారాలు చేస్తారు. వారు మంచి కట్టుబాటుకలవారు. అప్పులిచ్చి, సరుకులిచ్చి వారు రాజులకు అనరాగా వుంటారు. గాని వ్యతిరేకంగా వుండరు. అయితే వ్యాపారం చేసే వర్ణం వారొక్కరిదేకాదు. వీర బలంజాలు కూడా వాణిజ్యం చేసేవారే. వారు చాల బలీయులు కూడా.

దేశ జనాభాలో అత్యధిక సంఖ్యగల శూద్రులు ప్రధానంగా వ్యవసాయదారులు. వారిలో చాలమంది యుద్ధాలలో పాల్గొన్నారు. కొందరు రాజ్యపాలకులయ్యేరు. వెలనాడుల, కొండపడమటులు, హైహయులు, చాగీ మొదలైన వారు పరాక్రమం, విశ్వసనీయత, రాజనీతి వైశారద్యంతో పాలకులయ్యేరు.

సమాజంలో అట్టడుగు మెట్టున వున్న అస్పృశ్యులు చర్మకారులుగా, మత్యకారులుగా పనులు చేపట్టేరు.

తూర్పు గంగరాజుల శాసనాలు కొన్ని ప్రతిగ్రహీతలను కాయస్థులుగా పేర్కొన్నాయి; వారిని కాశ్యప గోత్రీకులన్నారు. వీరిని "కాశ్యపగోత్రోత్పన్ను"లనడమూ, "నాయక", 'నాయకి' అనే పదాలు పేర్లకు చేర్చడమూ బట్టి కాశ్యపగోత్రీకుడైన ఒక బ్రాహ్మణునికి, ఆ బ్రాహ్మణ కులానికి చెందిన ఒక స్త్రీకే పుట్టిన సంతానంగా వారిని భావిస్తున్నారు. రాజకుటుంబాలలో వివాహ సంబంధాలు కలిసి ఈ కులం వారి హోదా పెరిగింది.



## సాహిత్యమూ–కళలు

నూతనవర్గాలు ఏర్పడడమూ, భక్తిపంథాలు విస్తరించడమూతో సాహిత్యానికి, కళలకూ ప్రోత్సాహం చిక్కింది. సంస్కృతాన్ని క్రమంగా పక్కకునెట్టి, తెలుగు గౌరవాన్నీ, రాజాదరాన్నీ పొందింది. సంగీతము, నృత్యము వంటి లలితకళలు ప్రజావాంఛల్ని ప్రతిబింబించేయి.

ఉపయోగించిన భాష చాలాప్రాచీనమే అయినా తెలుగు భాషలో మొట్టమొదట శాసనం వేసినది రేనాటిచోళులని పైనచూసేము. వానిలో కొన్నింట పద్యరచన చాల ప్రాథమికరూపంలో కనిపిస్తున్నదని చెప్పేము. రేనాటిచోళుల కాలంలో వేసినవిగా గుర్తించబడిన శాసనాలు 33 వచనంలో వున్నాయి.

తూర్పుచాళుక్య రాజుల శాసనాలలో తెలుగువచనం కనిపించిన మొదటిది జయ సింహుడిది (క్రీ.శ 641-673). రెండోది మంగి యువరాజుది. (క్రీ.శ. 682-706) తరవాత మూడవ విష్ణువర్ధనుడు, గుణగ విజయాదిత్యుడు, చాళుక్యభీముడు, యుద్ధ మల్లుడు, విమలాదిత్యుడు, రాజరాజ నరేంద్రులవి తెలుగు శాసనాలు దొరికేయి. వీనిలో ప్రారంభకాలపు వానిలో సంస్కృత పదాలూ, క్రమంగా ముందుకు వెళ్ళినకొద్దీ పాకృతపదాలూ అధికంగా కనిపించేయి. తరవాతికాలపు అద్దంకి, ధర్మవరం, బెజవాడ, సాతులూరు శాసనాలలో వచనమూ పద్యమూ మిశ్రితంగా వున్నాయి. వీనిలో భాష సులభంగా అర్థమవుతుంది. ప్రారంభకాలపు వానిలో సంస్కృత తత్సమాలూ, దీర్ఘ సమాసాలు అధికంగా వుంటే తరువాతికాలపువానిలో దేశీపదాలూ, మాండలికాలు అధికంగా వున్నాయి. ఇప్పటికి సంస్కృత, ప్రాకృతాల ప్రభావం బాగా తగ్గింది.

నన్నయకు పూర్వం సంస్కృతం ప్రభావంనుంచి బయటపడటానికై తెలుగు ప్రాకృతాన్ని ఆసరాగా తీసుకుని క్రమంగా తనకాళ్ళమీద తాను నిలబడడం కనిపిస్తుంది. తెలుగు పదాల క్రమపరిణతి కనిపిస్తుంది. తొమ్మిదవ శతాబ్ది మధ్యకాలంనాటి చాళుక్యభీముని కొరిశాసనంలో తెలుగు లిఖిత సాహిత్యస్థాయికి చేరుకొని వుండడం కనిపిస్తుంది.

గుణగ విజయాదిత్యుని అద్దంకి శాసనంలో ఒక తరుఓజ పద్యం కనిపించింది. పల్లెపాటలు, స్త్రీలపాటలు మొదలైనవి ఈ ఛందస్సులోనే వుంటాయి. దీని నుంచే ద్విపద పుట్టిందంటారు ఆరుద్ర. ఈ దేశీచ్ఛందం మహాకావ్యరచనకు సరిపడకపోవచ్చు. పాటలు వీరులపాటలు మొదలైనవానికి బాగా తగివుంటుంది. తరువోజ, ద్విపద, మధ్యాక్కర, సీసం మొదలైనవి దేశీచ్ఛందాలు.

గుణగ విజయాదిత్యుని కందుకూరు శాసనంలో సీసపద్యం, ధర్మవరం శాసనంలో ఆటవెలది, యుద్ధమల్లుని బెజవాడశాసనంలో మధ్యాక్కర (సంస్కృతేతర పద్యాలు) కనిపించేయి. ఈ చివరి దానిలో 5 పూర్తిపద్యాలు 6వది పద్యఖండమూ, ఒక చిన్న వాక్యమూ వున్నాయి. వీనిలోని వ్యాకరణం ప్రస్తుతపు దానికన్న విశేషం తేడాగా లేదు. నన్నయ తరువాతమధ్యాక్కర ప్రయోగం తగ్గింది. దీనికి కారణం కవులకు అక్షరబద్ధకవిత్వం మీద మోజుపెరగడమే నంటారు. ఆరుద్ర.

నన్నయకు పూర్వంనాటి రాజశాసనాలలో దేశీచ్ఛందస్సులో పద్యాలు చాలా కనిపిస్తున్నాయి. వాటిని బట్టి తెలుగుభాషలో లిఖితసాహిత్యం నన్నయకు చాలపూర్వమే వుండివుండాలి. కాని అవేవి నేడు దొరకడం లేదు. బహుశా వైదికమత దురభిమానులు తమసిద్ధాంతాల

ప్రచారావేశంలో ఆ సాహిత్యాన్నంతనూ ధ్వంసం చేసివుంటారనుకోవాలి. ప్రజలతెలుగులో సాహిత్యం రావడం వారికి మతద్రోహంగానే కనిపించి వుంటుంది.

జైన, వైదిక మతాల మధ్య ఘర్షణలలో వైదికమతం విజయం పొందిన వుత్సాహమూ, వీరావేశమూ మనకు నన్నయ "మహాభారత"రంభ పద్యాలలో కనిపిస్తుంది. తెలుగువాళ్ళ మనస్సులలో వైదికమతవిశ్వాసం కలిగించడం ఆ రచన లక్ష్యం. రెండోవేపున శైవ, వైష్ణవ మతానుయాయుల మధ్య అంతఃకలహాల నివారణకై హరిహర భక్తిని ప్రోత్సహించే ప్రయత్నమూ దాని ద్వారా జరిగింది. శివుడూ విష్ణువూ సమానులే. ఇద్దరూ పూజార్హులే ననే ప్రబోధం కోసం సాహిత్యాన్ని ఆశ్రయించేరు. (శైవ, వైష్ణవాలు తీవ్రస్పర్ధతో విక్రమించిన తరవాతి కాలంలో ఈ ఆలోచన ఉన్నతస్థాయిలలో వారి ఆమోదమూ పొందింది.

ఈ ఆలోచన ఫలితమే సంస్కృతం నుంచి తెలుగులోకి విశేషంగా అనువాదాలు రావడం. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారు ఈ విషయం గురించి చెప్తూ జైన, బౌద్ధ మతాలు మాగధి మొదలైన దేశభాషలలో సాగిస్తున్న ప్రచారానికి ప్రతిగానే "మహాభారతం" తెలుగు అనువాదం చేయబడింది-అన్నారు. విస్తృత ప్రచారంలో వున్న "తప్పుడు భావాల"ను సరిదిద్దడానికే నన్నయ తిక్కనలు "మహాభారత"నువాదానికి పూనుకొన్నారనీ ఎఱ్ఱాప్రగడ పద్యం అర్థమిదేనన్నారు. పంపడు వ్రాసిన "మహా భారతం" కన్నడ భాషలో ఆనాడే చాల ప్రాచుర్యంగా వుంది. పంపకవి తెలుగువాడు. రెండవ అరికేసరి ఆస్థానకవి. (1971 జనవరిలో ఈయన సమాధి నిజామాబాద్ జిల్లా బోధన్‌లో కనిపించింది. ఆ "మహాభారతం" జైనమత ప్రభావంతో వ్రాసింది. "అర్జునవిజయం"పేరున కేవల లౌకిక దృష్టితో వ్రాసినదిః దానిలో కృష్ణుడికి దైవత్వం ఆరోపించడం జరగలేదు. బహుశా ఎఱ్ఱాప్రగడ చెప్పిన "తప్పుడు భావాలు" ఇవే అయివుంటాయంటారు. శ్రీ రామలింగారెడ్డి గారు. ఆనాడు కన్నడం, తెలుగు చాల సన్నిహితమైనవిగా వుండేవి. కన్నడం, తెలుగు-ఉభయభాషలలో పాండిత్యం ఒక బిరుదుగా వుండేది. (నన్నెచోడుడు, నారాయణభటు, నాచనసోముడు మొదలైనవారు) ఎందరో తెలుగువాళ్ళు కన్నడ సాహిత్యాన్ని సుసంపన్నం చేసేరు. అందుచేత ఎర్రన కన్నడసాహిత్యాన్ని దృష్టిలో పెట్టుకుని తెలుగు "మహాభారత" రచనను సమర్థించేడంటే ఆశ్చర్యం అవసరం లేదు.

నన్నయ "మహాభారత" ఆంధ్రీకరణనాటికి తెలుగు సాహిత్యంలో దేశీ పద్ధతి మార్గపద్ధతి పక్కపక్కనే సాగుతున్నాయి. దేశీపద్ధతిలో పాటలు, పద్యాలు వస్తున్నాయి. దానికి సంస్కృతంతో ప్రమేయం తక్కువ. ప్రకృతితో సన్నిహిత సంబంధం, నిశితమైన వాస్తవికత, ఉజ్వలమైన భావతీవ్రత ఈ పద్ధతిలో కనిపిస్తాయి. రాజకీయాలు, యుద్ధాలు, రాజభవనాలు, నైతిక సమస్యలు మొదలైన వస్తువులతో విశాలమైన ఇతివృత్తాలు మార్గకవితలో ఉన్నాయి. దీనిని పండితులు, విద్వాంసులు, కవులు ఆదరించేరు. సామాన్యప్రజ దేశకవితను ఆదరించింది. మార్గకవితతో విజయం సాధించడానికై ఒక కృత్రిమ భాషనే రూపొందించవలసి వచ్చింది. దానికై ఒక వ్యాకరణం, ఛందః పద్ధతి, రచనాపద్ధతి, సంస్కృతం నమూనాలు రూపొందించేరు. అందుకే తెలుగు వ్యాకరణాలు సంస్కృతంలో వున్నది. అందుచేత, తెలుగుసాహిత్యం మార్గ పద్ధతిలో కృత్రిమ కల్పనగానే ప్రారంభమయింది.

ఈ పంథాను నన్నయ ప్రారంభించేడనలేము. ఆయన దానికి ప్రతినిధి మాత్రుడు అప్పటినుంచి తెలుగు-సంస్కృత సాహిత్యం విస్తరించింది. వివిధ రంగాలకు పాకింది చివరకు



తన పలుకుబడిలోనే దేశీ కవితను కూడా తెచ్చుకుంది.

దీనికి కారణం వుంది. నన్నయ తన "మహాభారత" ఆంధ్రీకరణలో వాడిన భాష ఒకవంతు తెలుగు. రెండువంతులు సంస్కృతమూ. ఇది తెలుగు పదజాలాన్ని ఎంతగానో విస్తృతపరిచింది. ఆయన తత్సమాలూ, సంస్కృత భాషా పద్ధతులు ప్రవేశపెట్టినా సామెతలు, పదబంధాలు, వాక్చిత్రాలు మొదలైనవి ప్రజల నుంచి తీసుకున్నాడు. భావాలు అంతే ఫలితం, ఈ కృత్రిమభాషను తెలుగువాడు ఆత్మీయంగా భావించగలిగేడు. ప్రజలకు సులభగ్రాహ్యంగా వుండేందుకూ, కథాగతికి ఆటంకం కలగకుండేందుకూ నన్నయ తన ఆంధ్రీకరణలో సుదీర్ఘమైన తాత్విక చర్చలు పక్కకు పెట్టేడు. అప్పటికే కన్నడ సాహిత్యంలో నిలదొక్కుకున్న గద్యపద్యాత్మక చంపూకావ్య రచనా విధానాన్ని చేపట్టేడు. తెలుగులో సాహిత్యానికి ఆయన రచన ఒరవడే అయింది.

నన్నయకు దగ్గరికాలంలో నన్నెచోడుడు పేర్కొనదగిన సాహిత్యకారుడు, కల్యాణి చాళుక్యుల సామంతుడుగా ఒక చిన్న మండలాన్ని ఏలిన ఈ తెలుగు చోడుడు కవీ, యోధుడున్నూ. ఆయన ఒక యుద్ధంలో మరణించేడు. ఈయన వ్రాసిన "కుమారసంభవం" వర్ణనాత్మక కావ్యం. కవిరాజ శిఖామణిగా పేరుపడ్డాడు. శివకవి. ఈయన తన "కుమార సంభవం"తో ప్రబంధ సాహిత్యానికి శ్రీకారం చుట్టేడని చెప్తారు. కవికి చక్కని భావాలుండాలి. సులభమైన భాషలో వ్రాయాలి. మధురమైన పదచిత్రాలు, వర్ణనలు, దేశపద ప్రయోగపద్ధతి వుండాలి. మంచికావ్యం గుండెల్ని చొచ్చుకుపోయి ఆనందింపచేస్తుందంటాడు నన్నెచోడుడు.

నన్నెచోడుడు విస్తర, మార్గ, దేశి, వస్తు కవితలనుగా పద్యాన్ని నాలుగు తరహాలుగా చెప్పేడు. తాను వస్తుకవితను అనుసరించేనన్నాడు. నిరాడంబరమైన భాషను మొట్టమొదట "జానుతెనుగు"గా పేర్కొన్నది నన్నెచోడుడే. తరవాత వీర శైవకవి పాల్కురికి సోమనాథుడు కూడ ఆ పదాన్ని వుపయోగించేడు. నన్నెచోడుడు తన నాటికి వాడుకలో వున్న దేశీ పదాలను, దేశీ ఛందస్సును అధికంగా వుపయోగించేడు.

నన్నయ కాలంవాడే పావులూరి మల్లన. ఈయన శైవుడు, మహావీరాచార్యులనే జైన పండితుడు వ్రాసిన గణితశాస్త్ర గ్రంథాన్ని అనువదించేడు. ప్రసిద్ధములైన శాస్త్ర గ్రంథాల ననువదించడానికి మతోన్మాదులు ఆటంకం కాకపోవడం గొప్ప విషయం. ఈ గణితగ్రంథం ఆనాడు వాడుకలోవున్న నాణేలు, తూకాలు, కొలతలను పేర్కొంటుంది.

నన్నయ అనంతర కాలంలో భక్తిపంథాలు తీవ్రరూపం ధరించేయి. శివుని మహాదేవుడినిగా ఆరాధించటంతోపాటు ప్రత్యర్థి మతాలను దౌర్జన్య పద్ధతులతో నిర్మూలించాలనే ఆలోచనలు వచ్చేయి. ఇదే వీరశైవం. ఆంధ్రదేశంలో ఈ మతాన్ని సాహిత్యబలంతో తీవ్రప్రచారం చేసినవారు మల్లికార్జున పండితారాధ్యులు (క్రీ.శ. 100-1170), పాల్కురికి సోమనాథుడు (క్రీ.శ. 1116-1240) వీరి గ్రంథాలను గురించి వెనుకటి ప్రకరణంలో చెప్పేను. నన్నయ వైదికమతమూ, బసవేశ్వరుని వీరశైవమూ రెండూ జైనంయెడ బద్ధవిరోధం ప్రకటించినా, ఒకటి వర్ణవ్యవస్థను బలపరుస్తూ, రెండోది వర్ణవ్యవస్థను నిరాకరిస్తూ భిన్నలక్షణాలు కలిగివున్నాయి.

పాల్కురికి సోమనాథుడూ దేశీఛందస్సు అయిన ద్విపదలో తన కావ్యాలను వ్రాశాడు. పండితారాధ్యుని "శివతత్వసారం" తెలుగులో శతక వాఙ్మయానికి ఒరవడి పెట్టింది. సామాన్య ప్రజలు పాడే భక్తిగీతాలు విని ద్విపదను బసవపురాణంలో ఛందస్సుగా తీసుకొన్నానని

సోమనాధుడన్నాడు. దానిని బియ్యం దంచుకొనేటప్పుడూ, పనులు చేసుకొనేటప్పుడూ ప్రజలు పాడుకుంటున్నారని ఆయన తన "పండితారాధ్య చరిత్ర"లో వ్రాసేరు. బసవేశ్వరుని జీవితాన్ని చిత్రిస్తున్న "బసవ పురాణా"న్ని వీరశైవ మతగ్రంథంగా గౌరవిస్తారు. పాల్కురికి సోమనాధుడుని ద్విపద సాహిత్య పితామహుడుగా వర్ణిస్తారు.

సాహిత్యంలాగే కళలుకూడా మతాన్నే అనుసరించేయి. దేవాలయాలు అనేక కళలను పోషించేవి. 72 తరహాలకు చెందిన దేవాలయ పరివారంలో నటీనటులు నాట్యాచార్యులు, గాయకులు, వేణువాదకులు, శంఖపూరకులు, మార్దంగికులు, ఢోలు వాద్యగాళ్ళు ఇంకా ఎందరో వుండేవారు. బెజవాడ, బిక్కవోలు, చామర్లకోట–భీమవరం మొదలైనచోట్ల దేవాలయాలలోని చాళుక్యశిల్పాలలో అనేక తరహాల సంగీతవాద్యాలతో పాడుతున్న గాయకులు కనిపిస్తారు. దాచేపల్లి శిల్పాలలో అనేక జంత్రవాద్యగాండ్రు కనిపిస్తున్నారు. ఒక శిల్పంలో గణేశ్వరుడు వాయిస్తూంటే శివుడు నాట్యంచేస్తున్నాడు.

రాచనగరులలోనూ, దేవాలయాలలోనూ ఎంతో ప్రఖ్యాతి పొందిన గాయకులూ, నటులూ వుండినట్లు శాసనాలనుబట్టి తెలుస్తూంది. చాళుక్యభీముని దర్బారులో "సమస్త గాంధర్వ విద్యావిశారద"గా పేరుపడ్డ 'చెల్లవ్వ' అనే గొప్ప నర్తకి వుండేదనీ అమెకు రాజు అత్తిలలో నూరు పోకచెట్లున్న తోటను దానం చేశాడనీ శాసనం తెలుపుతూంది. నూకమ్మ, బాణాంబిక, చొక్కమ్మ, కామిదేవి మొదలైన అందగత్తెలయిన సానుల పేర్లు శాసనాలనుంచి తెలుస్తున్నాయి. వీరిలో కామిదేవి రెండవ గొంక రాజుకు భార్య అయింది. నర్తకులూ, వాద్యగాండ్రూ నాట్యాచార్యుల పేర్లు అనేక దానశాసనాలలో వున్నాయి.

పన్నెండవ శతాబ్దిలో నృత్యగానాలు ఆంధ్రదేశంలో చాల ఉచ్చస్థాయికి పరిణతి పొందినట్లు ఆనాటి సాహిత్యంనుంచి గ్రహించగలం. నన్నెచోడుడు "కుమార సంభవం"లో అహిరి, ఫలమంజిరి, ఆందోళి, భైరవి, నాట అనే రాగాలను పేర్కొంటాడు. నృత్యం చేస్తున్న శివుడిని పార్వతి చిత్రించినట్లుగ ఆయన ఆ నృత్యాన్ని వర్ణిస్తాడు. శివపార్వతుల వివాహంలో స్త్రీలు పెళ్ళిపాటలు పాడేరంటారు. జోలపాటలు, దంపుళ్ళపాటలు, అంకమాలికలు (ఒక విధమైన గేయనాటిక) మొదలైన వానిని పేర్కొంటాడు.

సోమనాధుడు "పండితారాధ్య చరిత్ర"లో అనేకానేక తరహాల జానపద గేయాలను - తుమ్మెదపదములు, ప్రఖ్యాతపదములు, పర్వతపదములు, నివాళి పదములు, గొబ్బిపదములు, వెన్నెలపదములు, సంజవర్ణనపదములు, యక్షగానములు మొదలయినవి వానిని పేర్కొంటాడు.

ఆయన మొదటి 7 తాళములను, తరువాత 27 శుద్ధ తాళములను పేర్కొంటాడు. 40 వరకు వీణాభేదాలను చెప్తాడు.

సంగీతం, నృత్యం, నాటకం గురించిన గ్రంథాలు ప్రత్యేకించి తెలుగులో లేక పోయినా, వానికి ఆంధ్రదేశంలో చాల ఆదరం వుందని సోమనాధుని "పండితారాధ్య చరిత్రము" నుంచి అర్థం చేసుకోవచ్చు. దానిలో ఆయన అనేక నాటకాలు, పాటలు, నృత్యప్రదర్శనల గురించి వర్ణించాడు. అవన్నీ పల్లెటిపాటలూ, జానపదనృత్యాలూ దేశీనృత్యాలు అయివున్నాయి.

శివరాత్రినాడు శ్రీశైలంలో జరిగిన నృత్యాలను వర్ణిస్తూ కోలాటం, పత్రగొండ్లి, పేరణి, కలిక అనే నృత్యవిశేషాలను వివరించేడు. భరతుని "నాట్యశాస్త్రా"నికి ఖచ్చితంగా కట్టుబడి బృంద గానాలూ, బృందనృత్యాలూ జరగడాన్ని వర్ణించేడు.



శిల్పాలుకూడా ఆనాటి మనస్థితిని ప్రతిబింబిస్తున్నాయి. దేవుళ్ళు, దేవతలు, శివ విష్ణువులు, అవతారాలు, గురువులు, శక్తులవిగ్రహాలు గుడిగోడల మీద చాల నేర్పుతో మలచ బడినాయి. వీనిలో శిల్ప చాతుర్యమూ, శిల్పాభిజ్ఞతా కనిపిస్తుందేగాని, సౌందర్యం, సౌకుమార్యం, భావశబలత వుండవు. దీనికి కారణం శిల్పి మలచడంలో తన వూహల ప్రకారం భంగిమలనూ సౌందర్యాన్నీ సృష్టించలేడు. శరీరాంగాల కొలతలు ఏవిధంగా వుండాలో శాస్త్రాలు నిర్దేశిస్తున్నాయి. వానిని వెంట్రుకవాసి తప్పినా మహాపాపం. అతడు ఆనాటి చట్టవిధులకూ, మతవిశ్వాసాలకూ లోబడి తన కళాప్రతిభను ప్రదర్శించవలసి వుండేది.

## ముగింపు

క్రీ.శ. 7వ శతాబ్దంలో ప్రారంభమయి మధ్యయుగాల సామాజికవ్యవస్థ ప్రథమ దశ స్పష్టమయిన రూపంతీసుకోడానికి రమారమి 600 సంవత్సరాల కాలం పట్టింది. ఈ 600 సంత్సరాలలో ఆంధ్రదేశంలో ఫ్యూడల్‌వ్యవస్థ తలెత్తడం విస్తరించడం జరిగింది. తరువాతిదశలో అది దృఢపడింది. ఇది కొన్ని విషయాలలో యూరోపియన్ ఫ్యూడల్ వ్యవస్థతో కలుస్తుంది. కొన్ని విషయాలలో భేదిస్తుంది.

బానిసల శ్రమమీద ఆధారపడి జరుగుతూవచ్చిన ఉత్పాదక వ్యవస్థ భగ్నమై యూరపులో ఫ్యూడల్‌వ్యవస్థ ఏర్పడింది. ఆవిధంగా అది ప్రారంభదశలో అభ్యుదయాత్మక పాత్రను నిర్వహించింది. ఉత్పాదకశక్తులకు ప్రోత్సాహం ఇచ్చింది. శాస్త్ర సాంకేతిక విజ్ఞానాలను కొంతవరకు క్రియారూపంలో పెట్టింది. బానిసల బదులు వారి స్థానే అర్ధబానిసలను ఉత్పత్తి రంగంలోకి ప్రవేశపెట్టింది. ఈ వ్యవస్థకు మూలం భూమిమీద వ్యక్తి యాజమాన్యం, ప్రభువుల చేతిలో ఎస్టేట్లు వుండేవి. అర్ధబానిసలు కడుపునిండా తిండిపెట్టలేని చిన్నచిన్న చెలకలకు కట్టుబడి వుండేవారు. ఆంధ్రలో పరిస్థితివేరు. ఇక్కడ వుత్పత్తి ఏనాడూ బానిసల ద్వారా జరగలేదు. శూద్రులు బానిసలు కాదు, దాసులూ కాదు. స్వయంపూర్ణ గ్రామాలలో వారి స్వల్పావసరాలు గడిచిపోతుండేవి. వూళ్ళో వుండేటందుకూ విడిచిపోయేందుకూ కూడ వారికి స్వేచ్ఛవుంది.

మనవూళ్ళకి యూరపు గ్రామాలకీ పోలికే లేదు. మనవి వూహించలేనంత ఎక్కువగా స్వయంపూర్ణములయిన గ్రామాలు. మాన్యాలనివ్వడం ద్వారా యిక్కడ వ్యవసాయానికీ, పరిశ్రమకూ అవినాభావ సంబంధం కల్పించబడింది. గ్రామప్రజల జీవితాలమీద మహాజనసమితికి పూర్ణాధికారం వుండేది. ఈ పరిస్థితులలో మనగ్రామాలు మూఢాచారాలకు, ఆటవిక అలవాట్లకు క్షీణఘోరణులకు పట్టుకొమ్మలయాయంటే ఆశ్చర్యంలేదు. "ఈ చిన్ని చిన్ని గ్రామాలు వర్ణ భేదాలతో, బానిసత్వంతో చివికిపోయి మనిషిని పరిస్థితులకు అతీతుడిగా లేవనెత్తడానికి బదులు బాహ్యపరిస్థితులకు లొంగి వుండేటట్లు చేశాయి" అన్నారు కారల్ మార్క్స్. బ్రిటిష్‌పాలనకు పూర్వం నాటి ఇండియన్ గ్రామాల గురించి, వ్రాస్తూ "మహత్వ శూన్యము, జడాత్మకము, ప్రతిషేధమయము నైనజీవితమూ అనాసక్తతా తద్వ్యతిరేకమయిన లక్ష్యంలేని దుష్టవిధ్వంసక శక్తులకు దారి యిచ్చిందనీ, హత్యల్ని ఒక మతకర్మగా మార్చిందనీ మరవరాద"న్నారు. ఆయన.

ఆపరిస్థితులలో శాస్త్రవిజ్ఞానంగాని, సాంకేతిక విజ్ఞానంగాని పురోగమించలేదు. గణితంలో,

ఖగోళవిజ్ఞానంలో, రసాయన శాస్త్రంలో, వైద్య విజ్ఞానంలో పొందిన అభివృద్ధి అక్కడితో నిలిచిపోయింది. రెండు చక్రాల నాగలి, మూడు చెలకల ఆవర్తన పద్ధతి వ్యవసాయం, గాలిమిల్లులవంటివి మనను ఆకర్షించలేదు. చైనీయుల కాగితం తయారీగాని, ముద్రణ పద్ధతిగాని మన దృష్టికి రాలేదు.

యూరపులో వ్యవసాయంతో సంబంధం పరిశ్రమలు లేకుండా స్వతంత్రంగా వృద్ధిపొందేయి. మనదేశంలో వృత్తి మాన్యాలివ్వడంచేత అవి వ్యవసాయానికి అనుబంధంగా వుండిపోయాయి. మధ్య యుగాలనాడు యూరపు నగరాలు పరిశ్రమలకూ వాణిజ్యానికీ బలమైన కేంద్రాలుగా వృద్ధిపొందేయి. భూస్వామ్యవర్గాల ఆటంకాల నెదుర్కొంటూ దాసులకు రక్షణనిచ్చేయి. కాని మన పట్టణాలు కేవల పరిపాలనా కేంద్రాలుగానే వృద్ధిపొందేయి. అక్కడ వర్తకం పెంపొందినా దానికి ప్రధానపాత్ర లేదు. వర్తకులు శ్రేణులుగా ఏర్పడ్డా వారికి ప్రధాన రక్షణ ప్రభుత్వమే. యూరపులో మాదిరిగా కాకుండా ఇక్కడ వర్తకులు రాజుల్నీ, సామంతుల్నీ బలపరిచేరు. వారితో యుద్ధాలలో కూడ పాల్గొన్నారు.

ఈ విధంగా మనదేశపు ఫ్యూడల్ విధానం, యూరపులోని దానితో భేదించినా, రెండింటికీ కొన్ని విషయాలలో సామ్యం వుంది.

రాజులు జాగీర్లు ఇవ్వడంవలన పల్లెటి ప్రాంతాలలో రాజకీయాధికారం వున్న బలీయులైన మధ్యదళారులు ఏర్పడ్డారు. వీరిలో కాలక్రమేణా హోదానుబట్టీ, ప్రత్యేకాధికారాలను బట్టీ, జాగీర్ల విస్తృతినిబట్టీ అంతరాలు వృద్ధిపొందాయి. సరిగ్గా యూరపులో లాగనే. ఈ జాగీర్లేగాక ఈ ప్రభువులూ, సామంతులూ గ్రామంచలాలలోని భూముల్ని ఆక్రమించుకుని స్వతం చేసుకొన్నారు. వానిని అమ్మేందుకూ, కొనేందుకూ హక్కు సంపాదించేరు. కౌళ్ళకిచ్చే కూలీల్ని పెట్టిచేయించి వారాభూముల నుంచి అదనపు ఆదాయలు తీసేరు.

ఈ చరిత్రదశలో రాజకీయ వికేంద్రీకరణం ఆంధ్రదేశానికీ, యూరపుకూ వున్న ఒక సమాన లక్షణం. స్వతంత్ర ప్రభువులు, సామంతుల మధ్య, స్వతంత్ర రాజ్యాల మధ్య నిరంతరం అంతర్యుద్ధాలుసాగి అందరూ బలహీనపడ్డారు. విజేతలయిన వారు కూడా విదేశీ ఆక్రమణలను నిగ్రహించలేని దుర్బలులయ్యారు.

అసాధారణ సౌకర్యాల ననుభవించిన బ్రాహ్మణ అగ్రహారందార్లు భూస్వామి వర్గం అయ్యేరు. వారికి రాజ్యాధికారం లేకపోయినా, వారి విద్యుత్తూ, మతాచార నియమనమూ ప్రభుత్వాచారంకన్న బలమైన పలుకుబడినిచ్చింది వారికి.

యూరపులో చర్చి మాదిరిగానే, ఇక్కడా దేవాలయం కేవలం పూజాస్థానంగానే గాక బలమైన భూ యజమానిగా తయారయింది. దాని ఆధీనంలో ఎందరో కౌలుదార్లూ కూలీలూ పనిచేస్తుంటారు. ఎందరో వృత్తినిపుణుల్నీ, కళాకారుల్నీ, సేవకుల్నీ భరిస్తుంది. సారవంతమైన భూములేగాక ఎంతో బంగారం, మణులూ బహుమతులుగా పొందుతుంది. దానికి, పన్నులుండవు. భూములు కొంటుంది. అమ్ముతుంది. అదనపు పంటలూ, వుత్పత్తులూ అమ్ముతుంది. ధర్మసంస్థల్ని నిర్వహిస్తుంది.

గ్రామంలో పెద్దలతో ఏర్పడిన మహాజనసమితి చేతిలో భూములుంటాయి. ఫ్యూడల్ వ్యవస్థలో దీనికి ముఖ్యపాత్రవుంది. వ్యవసాయానికీ పరిశ్రమకూ మధ్య, ప్రభుత్వానికి ప్రజలకూ మధ్య వారధిలా వుంటుంది. చిన్న చిన్న వ్యవహారాలలో న్యాయాధికారిగా, వివిధ తరగతుల



ప్రజల మధ్య సమతూకం కాపాడే విధంగా వ్యవహరిస్తుంది.

ఈ చరిత్రదశలో సరుకుల వుత్పత్తి పెరిగిన మాట నిజమే. చలామణీ వర్తకమూ గతంలో కన్న ప్రముఖపాత్రనే నిర్వహించేయి కాని అమ్మకం సరుకుల తలసరి వుత్పత్తి తక్కువగా వుంది. వస్తుమార్పిడి అమ్మకాలే ప్రముఖంగా వున్నాయి. వర్తకం ఉన్నతవర్గాల అవసరాలలోనే ప్రధానంగా కొనసాగింది. విదేశీ వాణిజ్యం విస్తరించింది. కాని, సముద్ర యాత్రలను మతం నిషేధించడం చేత అదంతా చైనీయులూ, అరబ్బుల చేతులలోనే వుంది దీని వలన మనం ఎంత నష్టపడ్డామో మార్కోపోలో వ్రాతలు బట్టి తెలుసుకోవచ్చు. ఏటా ఎంతో ధనం యిచ్చి అరబ్బు గుర్రాలను దిగుమతి చేసుకోవడమే గాని వాటికేమి తిండిపెట్టాలో, ఎల్లాపెంచాలో, దాని సంవర్ధక పద్ధతులేమిటో మనం తెలుసుకోనేలేదు.

ప్రారంభదశలో వర్ణవ్యవస్థ, స్వయంపూర్ణత్వపు పరిధిలో సమాజావసరాలను కొంత కొంత తీర్చింది. ఈ చరిత్రకాలంలో దానిలోని కాఠిన్యం కొంతవరకు సడలింది. ఉన్నతతరగతుల వారు క్రింది తరగతుల వృత్తులను స్వీకరించడం, క్రింది తరగతులలో ఏ కొద్దిమందో పై తరగతుల చేతులలో వుండిన అధికార స్థానాలకు రావడం జరిగింది, అత్యధికులు మాత్రం అడుగుననే పడివున్నారు. ఇది భారతసమాజంలోని వర్గ వ్యవస్థలో వచ్చిన ఒక విధమయిన వర్గ విభజనగా చెప్పవచ్చును. ఇప్పుడు అగ్రహారాల ప్రత్యేకత పోతోంది. చతుర్వర్ణంవారికి పెద్ద పెద్ద జాగీర్లు ఇచ్చారు. అగ్రహారం ఎంత చిన్నది అయినా పన్నులు ఇవ్వవలసే వస్తూంది. ఇది వర్గవిభజననే చూపుతూంది. దీనితో, ఇక్కడి ఫ్యూడల్ వ్యవస్థ యూరపులోని దానిని సమీపించడం కనబడుతుంది.

మానవాకారంలో దేవుడిని ఆరాధించే భక్తిపంథా మానవుని మనస్సుమీద ఫ్యూడల్ సంబంధాల ప్రభావాన్ని చూపుతుంది. భగ్నాశులకది గొప్పతృప్తినిస్తూంది. సుఖసాధనకు సులభమార్గాన్ని చూపుతుంది. ఈ బాధామయ ప్రపంచంనుంచి నివేదన ద్వారానూ, ఆత్మహింసద్వారానూ విముక్తి పొందేందుకై ఆలోచిస్తూ అనేక విశ్వాసాలను పెంచుకోవడం మానసిక క్షైణ్యానికి చిహ్నం. ఆత్మహత్యకూడా భక్తికి పరామావధిగా భావించేస్థితి వచ్చింది.

దేశభాషా సాహిత్యం పెరుగుదలా, సంగీతం, నృత్యం వంటి లలితకళల అభివృద్ధి మానవుని వ్యక్తిత్వపరిణతి దృష్ట్యా ఈ చరిత్ర దశలో జరిగిన మంచిగా చెప్పవచ్చును.

ప్రజలభాషలో సాహిత్యరచన అంటే గ్రామాలమధ్య సంబంధాలు పెరిగాయని అర్థం. వస్తుమార్పిడిద్వారా రాష్ట్రబజార్లు ఏర్పడినప్పుడే ఇది జరుగుతుంది. తెలుగులో శాసనాలసంఖ్య పెరగడం బట్టి ఈ నూతనపరిస్థితి గ్రహించగలం. అంతవరకూ అసహ్యించుకోబడిన తెలుగుకు మర్యాదా, రాజమన్ననా లభించేయి. అది సంస్కృతపద భూయిష్ఠమయిన మార్గతెలుగే కావచ్చు. కాని దేశీతెలుగు అభివృద్ధికి బాటపడింది. నన్నయ "మహభారత" రచన అనంతరం రెండువందలేళ్ళకు వచ్చిన శైవసాహిత్యంలో అది రూపుదిద్దుకుంది.

జానపదరూపాలతో సంగీతం, నృత్యం అత్యున్నతస్థాయి నందుకొన్నాయంటే వీరశైవమే కారణం.

ఫ్యూడల్ సంబంధాలు పెరిగినకారణంగా మానవుడు ఈ చరిత్రదశలో క్రూరమైన దోపిడీకి గురిఅయ్యేడు. అతడు అజ్ఞానం మౌఢ్యంతో కూరుకుపోయేడు. గ్రామ స్వయంపూర్ణత్వపు ఇరుకుహద్దులు అతనిని అంధకారంలోనేవుంచేయి. తన శ్రమను తగ్గించేందుకు విజ్ఞాన,

సాంకేతికశాస్త్రాలను ఉపయోగించుకోలేకపోయాడు. ఇదివరకు ఎన్నడూ లేనంతగా మానసిక, శారీరక శ్రమలమధ్య అంతరం పెరిగిపోయింది. బయట పడేందుకుదారిలేక మతం పేరున భయానక ఆచారాలు అసహ్యకర అలావాట్ల్లా ద్వారా విముక్తి నాకాంక్షిస్తూ అతడు ప్రతీపశక్తుల బారిపడ్డాడు. విదేశీప్రభుత్వం ఆవిరి యంత్రాన్నీ, మరమగ్గాన్నీ ప్రవేశపెట్టి స్వయంపూర్ణ గ్రామ ఆర్థికవిధానాన్ని ఛిన్నా భిన్నంచేయడానికి మరో ఆరువందలేళ్ళు గడపవలసివచ్చింది. "ఆసియాలో ఎన్నడూ వినేనావుండని ఏకైక మహత్తర సాంఘికవిప్లవం ఆ విధంగా వచ్చింది." అన్నాడు మారల్‌మార్క్స తన "ఇండియన్ వార్ ఆఫ్ ఇండిపెండెన్స్"లో

# BIBLIOGRAPHY

## PUBLICATIONS


A catalogue of Iksvaku Coins in the Andhra Pradesh Government Museum R. Subrahmanyam and N. Ramesh Hyderabad 1962.

A Catalogue of Inscriptions of the Government of Andhra Pradesh, Archaeological Series No. 22, Hyderabad, 1965.

Administration and Social Life under the Pallavas-C. Minakshi, Madras, 1936.

A History of South India-K.A. Nilakanta Sastri, Madras, 1966.

A History of the Early Dynasties of Andhradesa- B.V. Krishna Rao, Madras, 1942.

A History of Telugu Literature-P. Chenchiah and M. Bhujanga Rao, Calcutta.

Amaravati Scriptures in the Madras Government Museum-C.Sivarama Murthy, Madras, 1942.

A Monograph of Yeleswaram Excavations-Md Abdul Waheed Khan, Hyderabad, 1963.

Ancient Andhra Inscriptions : Development of Prosody (Telugu) a dissertation for Ph.D. degree, Andhra University , Waltain, 1956.

Ancient India as described in Classical Literature-Mc Crindle, London, 1885.

Andhra Vachana Sangrahamu (Telugu) - N. Venkata Rao, Madras, 1954.

Andhra Vignana Sarwasvamu (Telugu) - Komarraju Lakshmana Rao, Vol. I, Madras, 1932.

A Survey of Indian History-K.M. Panikkar, Bombay, 1956.

Beginning of Civilisation in South India-a paper read at the Second International Conference of the Seminar of Tamil Studies H.D. Sankalia Madras, 1968.

Buddhist India-T. Rhys Davids.

Buddhist Remains in Andhra and the History of Andhra between A.D. 225 and 610 K.R. Subramanyam. Madras, 1932.

Castes and Tribes of South India-Edgar Thurston, Vols. II and III Madras, 1909.

Chinese Accounts of India-Samuel Beal, Calcutta, Vol, I, 1957; Vol. II, 1958.

Collected Works-R.G. Bhandarkar, Vol. III, Poona, 1927. Copper plate Inscriptions of Andhra Pradesh Government Museum, Vol. I. Hyderabad, 1962.

Cuddapah District Manual.

Culture and Civilisation of Ancient India-D.D. Kosambi, London, 1965.

Eastern Chalukyas of Vengi - Nelaturi Venkataramanayya, Madras, 1950.

Epigraphists' Report, Madras, 1919.

Evolution of Philosophy in India-K. Sachidananda Murthy, Waltair, 1952.

Five Thousand years of Arts and Crafts of India and Pakistan-Shanti Swarup, bombay, 1968.

Foreign Notices of South India-K.A. Nilakanta Sastri, Madras, 1935.

Gatha Saptasati-Hala.

Ganjam District Manual.

Godavari District Gazetteer.

Half-Way : a Commemoration volume published in honour of Narla Venkateswara Rao, an outstanding journalist, Vijayawada, 1958.

History of Deccan - G. Yazdani, Vol. I, part VIII, London, 1952.

Hindu Colonies of the Far East - R.C. Majumdar, Calcutta, 1963.

Hyderabad Archeaelogical Series, No. 13, Part 1, Hyderabad, 1942.

Iksvakus of Vijayapuri - M.Rama Rao, Tirupati, 1967.

Indian Thought - K. Damodaran, Bombay, 1966.

Indian Feudalism - R.S.Sarma, Calcutta, 1965.

Inscriptional Glossary of Andhra Pradesh - K. Eswar Dutt, Hyderabad, 1967.

Jataka - Fousboll, Vols I-VI, London, 1877-79.

Kamasutra of Vatsyayana - S.C. Upadhyaya, Bombay, 1961 :

Kanchipuram in Early Indian History - T.V. Mahalingam, Bombay, 1969.

Kannada Inscriptions of Andhra Pradesh, Hyderabad, 1961.

Kautilya's Arthasastra - R. Sharma Sastry, Mysore, 1956.

Kumarasambhavam (Telugu), - Nanne Choda.

Kalingadesa Charitra (Telugu), a special number published by the Andhra Historical Research Society, Rajahmundry, 1930.

Man Makes Himself - V. Gordon Childe, London, 1936.

Manusmriti : The Laws of Manu - G. Buhler, Delhi, 1970.

Manual of North Arcot District (II edn).

Nagarjunakonda - H. Sarkar and B.N. Mitra, New Delhi, 1966.

Neolithic Cattle keepers in South India - F.R. Allchin, Chmbridge, 1963.

On Yuan Chwang's Travels in India - Thomas Walters, London, 1905.

Periplus of the Erethrean Sea-schoff, New York, 1912.

Pre-Buddhist India-R.L.Mehta, Bombay 1939.





Pre-Historic South India- V.R. Rama Chandra Dikshitar, Madras, 1951.

Proceedings of the Deccan History Conference, Hyderabad, 1945.

Readings in Indian Economic History - B.N. Ganguli, Bombay 1964.

Report of the Archaeological Department, the Nizam's Dominions, for 1921-24, Hyderabad, 1926.

Report upon the Khonds of the Districts of Ganjam and Cuttack-Lieut. Macpherson, Madras, 1863.

Samagra Andhra Sahityam (Telugu) - Arudra, Vol. I, Secunderabad, 1965.

Satavahana Coins in the Andhra Pradesh Government Museum-M. RamaRao, Hyderabad, 1961.

Seminar on Inscriptions - R. Nagaswamy, Madras, 1969.

Social and economic Conditions of Eastern Deccan-Vaidehi Krishnamoorthy, Hyderabad, 1970.

Socialism, Utopian and Scientific - F. Engels, Moscow.

Social Thinking - H. Levy, Bombay, 1947.

Social Life in Ancient India -H.C. Chakradar, Calcutta, 1954.

Some Telugu words in Gatha Saptasati-a paper read in the International Orientalists' Congress by Tirumala Ramachandra, New Delhi, 1964.

Sora Songs and Poetry-g.V.Sitapati, Vizagapatnam, 1940.

Stone Age in India - P.T. Srinivasa Iyengar, Madras, 1926.

Studies in Tamil Literature and History - V.R. Ramachandra Dikshitar, Madras, 1936.

Studies in the Economic and social Conditions of Medieval Andhra - K. Sundaram, Madras, 1968.

Studies in Dravidian Philology-Korada Ramakrishnayya, Madras, 1935.

Telangana Sasanamulu (Telugu), Vol. I, Hyderabad.

Telugu, a link between the North and the South a paper read in the international Orientalists' Congress by Nidadavolu Venkata Rao - New Delhi, 1964.

The Chenchus - Furer Heimendorf, London, 1963.

The Classical Accounts of India- R.C. Majumdar, Calcutta, 1960.

The Early History of the Andhra Country-K. Gopalachari, Madras, 1941.

The Early History of the Deccan -G. Yazdani, Parts I-VI, London, 1960.

The Economic History of India-H.A.G. Hussaini, Vol. I, Calcutta, 1962.

The First Indian War of Independence - K. Marx and F. Engels, Moscow.

The Foote Collection of Indian Pre-Historic and Proto-historic Antiquities in the Indian Museum-Robert Bruce Foote, Madras, 1916.

The Gondwana and the Gonds-Indrajit Singh, Lucknow, 1944.

The Guntupally Brahmi Inscription of Karavela-R. Subrahmanyam, Hyderabad, 1968.

The Hindu Colonies in the Far East -R.C. Majumdar, Calcutta, 1963.

The History of Kallingadesa (Telugu), Rajahmundry, 1930.

The Manifesto of the Communist Party K.Marx and F. Engels, Moscow, 1967.

The Reddis of Bison Hills Furer Heimendorf, London, 1943.

The Religion of an Indian Tribe- verrier Elwin, Bombay, 1955.

The Religions of the World Made Simple. -John Lewis, New York, 1959.

The Silappadikaram-V.R. Ramachandra Dikshitar, Oxford University Press, 1939.

The Sukraniti-Major B.D. Basu, Allahabad, 1914.

The Tamils Eighteen Hundred Years Ago-V. Kanakasabai, Madras, 1956.

The Yanadis- V. Raghavaiah, New Delhi, 1962.

Trade and Commerce in Ancient India -B. Srivastava, Varanasi, 1968.

Trade and Commerce of Ancient India - Haripada Chakraborthy, Calcutta, 1966.

Vignana Sarvasvamu (Telugu), Vol. IV, Madras, 1961.

Vizagapatam District Gazetteer.

Vizagapatam District Manual.

Vyasa Sangramu-a miscellany of papers published on the occasion of the 75th birthday of Gidugu Rama Murthy, the founder of the Movement for the spread of Vyavaharika Telugu, Guntur, 1933.

## JOURNALS AND PERIODICALS

American Review : October, 1967.

Ancient India : XVI.

Annals of the Bhandarkar Oriental Research Institute : IV, VI, XXXVI.

Annual Reports of Epigraphy: 1893, 1897, 1899, 1906, 1912, 1913, 1914, 1915, 1916, 1917, 1918-19, 1921-22.

Annual Reports of South Indian Epigraphy: 1927, 1932, 1933, 1936, 1938, 1939-40, 1941-42, 1949-50.



Annual Reports of Indian Epigraphy : 1953-54, 1958-59, 1960-61, 1961-62, 1962-63.

Archaeological Survey of Western India : IV Bharati (Telugu), V (7); XXVII (10) XXXVI (2); 1965 June; 1965 July; 1968: January; 1968 January; 1968 December.

Bulletin of the Deccan College Research Institute : 1940 November, Dravidian Culture : II.

Enquiry : 4.

Epigraphia Indica : I, III, IV, V, VI, VIII, IX, X, XII, XI, V, XV, XVIII, XIX, XXII, XXIII, XXVII, XXIX, XXX, XXXI, XXXIII, XXXV.

Harvard Oriental Series : 42.

Indian Antiquary : V, VIII, XVI.

Iscus : 1954 January.

Journal of the American Oriental Society : 1955 January-March 1955 October-December.

Journal of the Andhra Historical Research Society : I, IV, VI, VII, IX, X, XII, XIX, XX, XXI, XXIV, xXV, XXVI.

Journal of the Asiatic Society fo Bombay : XX, XXX.

Journal of the Bombay Branch of the Royal Asiatic Society : XXII.

Journal of the Madras University : XII.

Journal of Oriental Research : X, XXX.

Journal of the Royal Anthropological Institute : LXXX.

Journal of the Royal Asiatic Society : 1898, 1901, 1904.

Modern Review : 1963 January.

Praci-Jyoti : III.

South Indian Inscriptions : IV, VI, IX(1), X.

The Hindu : 28 September 1968.

The Indian Express (Vijayawada) : 7 December 1970.

The Illustrated Weekly of India : 4 April, 1971.

Tirupati-Tirumalai Devasthanam Epigraphical Serices.

# హైదరాబాద్ బుక్ ట్రస్ట్ నూతన ప్రచురణలు

## జీవిత చరిత్రలు - పరిచయం

1. చక్రాల కుర్చీ - నసీమా ప్రయాణం - నసీమా హుర్‌జుక్ 60-00
2. అసుర సంధ్య - మాల్కం ఎక్స్ ఆత్మకథ - అలెక్స్ హేలీ 45-00
3. ఛత్రపతి సాహూ మహరాజ్ - కాత్యాయని 25-00
4. ప్రవహించే ఉత్తేజం చే గెవారా - కాత్యాయని 55-00
5. రేపటి కల - రిచర్డ్ రైట్ 50-00
6. పగిలిన అద్దం - ముక్తవరం పార్థసారధి 20-00
7. అయ్యంకాళీ - చెందరాశేరి 20-00
8. అయోతీదాస్ - జి. ఎలోసియస్, రాజదురై 15-00

## నవలలు - కథలు

1. సంగతి - భామ 25-00
2. తాండా - మల్లికార్జున హిరేమత్ 35-00
3. ఉపకథలు - ప్రళయన్ 10-00
4. స్పార్టకస్ - హోవర్డ్‌ఫాస్ట్ 50-00

## అభివృద్ధి అధ్యయనాలు

1. కల్లోల లోయ - 50 ఏళ్ళ కశ్మీర్ - కె.బాలగోపాల్ 50-00
2. ఆర్థిక సంస్కరణలు-వ్యవసాయ సంక్షోభం - డి.నరసింహారెడ్డి 15-00
3. ఆంధ్రప్రదేశ్ రాజకీయ వ్యవస్థ -తెలంగాణ రాజకీయాలు - దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే 60-00
4. ముల్కి-ముస్లిం సాహిత్య సంకలనం - వేముల ఎల్లయ్య, స్కైబాబ 65-00

## కులం - అధ్యయనం

1. ఆంధ్రప్రదేశ్ దళిత ఉద్యమ చరిత్ర - యాగాటి చిన్నారావు 60-00
2. దాస్యవిముక్తి కోసం మత మార్పిడి - అంబేద్కర్ 15-00
3. భారతదేశం-ప్రజాస్వామ్యం - అంబేద్కర్ 12-00
4. రాష్ట్రాలు-మైనారిటీలు - అంబేద్కర్ 25-00
5. ఆంగ్లేయ పాలకులు-అంటరానివాళ్ళు - అంబేద్కర్ 20-00
6. భారతదేశ చరిత్ర-నిన్న, నేడు, రేపు - అంబేద్కర్ 20-00
7. భారతదేశంలో కులాల పుట్టుక - అంబేద్కర్ 8-00
8. ఏది హీనం - అంబేద్కర్ 8-00
9. ఆధునిక భారతంలో అంటరానితనం - అంబేద్కర్ 25-00
10. బౌద్ధమతం - అంబేద్కర్ 30-00
11. హిందువుల ఇళ్లు - అంబేద్కర్ 25-00
12. దళిత బహుజనులకు తెలుగు -అగ్రకులాలకు ఇంగ్లీషు చదువా? - కంచ ఐలయ్య 5-00
13. మహాత్మా జ్యోతిరావు పూలే సంక్షిప్త రచనలు - పూలే 20-00
14. గులాంగిరీ - జ్యోతిరావు పూలే 30-00
15. పురాణాలు- కులవ్యవస్థ-I సత్యహరిశ్చంద్రుడు - బి. విజయభారతి 10-00
16. పురాణాలు- కులవ్యవస్థ-II దశావతారాలు - బి. విజయభారతి 18-00
17. పురాణాలు- కులవ్యవస్థ-III షట్చక్రవర్తులు - బి. విజయభారతి 20-00
18. పురాణాలు- కులవ్యవస్థ-IV వ్యవస్థను కాపాడిన రాముడు - బి.విజయభారతి 75-00
19. సేద్యగాని చర్నాకోల - జ్యోతిరావు పూలే 20-
20. మాకొద్దీ ఛండాలం - గీతా రామస్వామి, విమల 15-
21. దేవుడి రాజకీయతత్వం - కంచ ఐలయ్య 60-
22. దళిత రాజకీయాలు - రామ్‌పునియానీ 10-

## మతం-అధ్యయనాలు

1. పెరియార్ దృష్టిలో ఇస్లాం - జి. అలాయ్‌సియస్ 10-
2. మతతత్వ రాజకీయాలు - రామ్‌పునియానీ 10-
3. శాంతి దూతలు - హలీం సిద్ధికి, హర్షమందర్ 15-
4. చరిత్ర రచనలో మతతత్వం - రొమిల్లా థాపర్ 10-

## విద్య - విజ్ఞానం

1. చదువు-చర్చ - ప్రొ. కృష్ణకుమార్ 30-0
2. పిల్లల పాఠాలు - పెద్దలకు గుణపాఠాలు - ప్రొ. కృష్ణకుమార్ 14-0
3. అల్లరి పిల్లల్లో అద్భుత మార్పులు - ఎ.ఎస్. మకరెంకో 60-0
4. రైలుబడి - టెట్సుకో కురోయనాగి 25-0

## ఆరోగ్యం - అవగాహన

1. సవాలక్ష సందేహాలు - అన్వేషి 200-0
2. వైద్యుడు లేని చోట - డెవిడ్ వర్నర్ 180-0
3. హెల్త్ సెట్ (అల్సర్, గుండెనొప్పి, మధుమేహం, అస్తమా...వంటి 20 పుస్తకాలు) 84-0
4. ఆంధ్రప్రదేశ్ ఆరోగ్య రంగంలో సంస్కరణలు - యం. తిమ్మారెడ్డి 10-0
5. వ్యసనం - మైకెల్ హర్డిమన్ 20-0

## చరిత్ర - పరిణామం

1. ప్రపంచ చరిత్ర - క్రిస్ బ్రేజియర్ 30-0
2. ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమాలు - వి. రామకృష్ణ 30-0
3. మానవుడే చరిత్ర నిర్మాత - గార్డెన్ ఛైల్డ్ 50-0
4. విజ్ఞాన శాస్త్రం ఎలా ఎదిగింది - ఎగొన్ లార్‌సెన్ 45-0

## పిల్లల కోసం

1. అనగనగా - దేవరాజు మహారాజు, అనుపమ 25-0
2. బుడుంగు - దేవరాజు మహారాజు, అనుపమ 25-0
3. చిన్నోడి ప్రయాణం - దేవరాజు మహారాజు, అనుపమ 25-0
4. మాలపల్లి - ఉన్నవ లక్ష్మీనారాయణ 25-0
5. కొమురం భీం - భూపాల్ 30-0

## స్త్రీలోకం

1. నా(మన)కథ - ఫ్లైవియా ఆగ్నెస్ 20-0
2. అడవి తల్లి - భాస్కరన్ 20-0
3. నల్లపొద్దు - దళిత స్త్రీల సాహిత్యం - గోగు శ్యామల 65-0

## చట్టాలు - వివరాలు

1. పేదలకు సహాయ సాధనంగా చట్టం - సలహా 3-0
2. చట్టం ఏమంటోంది - సలహా 8-0
3. పోలీసులు అరెస్టు చేస్తే - బొజ్జా తారకం 18-0

---

పై పుస్తకాల కొరకు యం.ఓ. మరియు డి.డి. ద్వారా ముందుగా డబ్బులు మా అడ్రసుకు పంపగలరు.
పుస్తకాలు వి.పి.పిలో పంపుతాము.

## ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర 1

### కంభంపాటి సత్యనారాయణ (1909 - 83)

ఆంధ్రుల సంస్కృతి-చరిత్రను గురించిన యీ గ్రంథం ఒక స్పష్టమైన, నిర్దిష్టమైన సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొని వ్రాయబడింది. ఇంతవరకు ఎవరూ ఆంధ్రప్రదేశ్‌కి సంబంధించినంతవరకు ఇట్టి ప్రయత్నం చేసి వుండలేదు. అందువల్ల యిది విలువైనదీను, విజ్ఞులు పరిశీలించదగ్గది కూడా.

రచయిత స్వాతంత్య్ర సమరంలో పాల్గొని, 1930 నుంచి 1947 వరకు 4 సంవత్సరాలకు పైగా జైల్లో నిర్బంధింపబడ్డారు. స్వాతంత్ర్యానంతరం 1948-49 మధ్య కడలూరు జైల్లో డిటెన్షన్, 1949-51 మధ్య రహస్య జీవితం.

1931 నుంచీ కమ్యూనిస్టు కార్యకర్తగాను, "నవశక్తి" "ప్రజాశక్తి", "విశాలాంధ్ర", "సందేశం" పత్రిక సంపాదకవర్గ సభ్యుడుగాను, రాజకీయ అధ్యాపకుడుగాను ఉన్నారు.

1968 నుంచి చరిత్ర పరిశోధనలో నిమగ్నులైనారు. ఇండియన్ హిస్టరీ కాంగ్రెసులో సభ్యులు. ఆం.ప్ర. హిస్టరి కాంగ్రెసు కార్యనిర్వాహక సభ్యుడుగా పనిచేశారు.

రచనలు : "గత తార్కిక భౌతికవాదం", "లక్ష్యాలు-సాధనాలు", "నేటి రష్యా", "బంగ్లాదేశ్ స్వాతంత్య్ర సంగ్రామం", "అర్ధ శతాబ్దకాలంలో ఆంధ్రులపై అక్టోబరు విప్లవ ప్రభావం", "కమ్యూనిస్టు నీతి", అనే సంకలన గ్రంథం. ఆయన చివరి రచన "ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర". ఇవిగాక అనేక మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాలను అనువదించారు.